Islam The Misunderstood Religion
(Telugu)

# ఇస్లాం అపార్థాల మబ్బుల్లో

మూలం :

**ముహమ్మద్ కుత్బ్**

అనువాదం :

**ఎస్.ఎమ్. మలిక్**




తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
సందేశ భవనం, లక్కడ్‌కోట్,
ఛత్తాబజార్, హైదరాబాద్ - 2.
ఫోన్ : 521237

**Islam Apaardhala Mabbullo**
Islam The Misunderstood Religion (Telugu)
**Telugu Islamic Publications**
**Series No. 65**


| | | |
|---|---|---|
| Writer | : | Muhammad Qutb |
| Translator | : | S.M. Mallick |





| | | |
|---|---|---|
| First Edition | : | November, 1992 |
| Copies | : | 2000 |
| Price | : | Rs.40/- |
| Typeset by | : | Master Graphics<br>Lakdikapul, Hyderabad. |
| Cover Designed by | : | S.M. Asif Aliuddin |
| Printed by | : | Speed Print<br>Saidabad, Hyderabad. |
| Cover Printed by | : | Kala Jyothi Process (P) Ltd.<br>R.T.C. X Roads, Hyderabad. |
| Published by | : | Telugu Islamic Publications<br>'Sandesha Bhavanam'<br>Lakkadkot, Chatta Bazar,<br>Hyderabad - 500 002. India.<br>Phone: 521237,<br>Grams : 'Geeturai-500 002' |

# విషయసూచిక

**1. ఇక మతం అవసరం లేదా?...................... 12**

మూలకారణం -12 ; సరికొత్త దేముడు -13 ; సైన్సు ప్రపంచం -14 ; మతం లేకుండా -15 ; మానవునిలో ఆశాజ్యోతి -17 ; పునాదులు వేరయితే -19 ; అపార్థం -21 ; విమోచనం -22 ; జీవితాశయం -24 ; భావ స్వాతంత్ర్యం -25 ; కొత్త దేముడు -27 ; సామరస్యానికి ఒక్కటే మార్గం -29 ; దేవతలూ తప్పుకోండి -30 ; చిల్లర దేవుళ్ళు -32 ; వీరిది ఇస్లాం కాదు -33 ; పరిపాలన - ప్రజల హక్కు -34 ; సామ్రాజ్య వాదానికి తిరుగుబాటు -35 ; విశ్వజనీన సంస్కరణ -36 ; ఇవి ప్రగతి వికాసాలా? -38 ; సహజమయిన ప్రమాణాలు -39 ; లోతుగా పరిశీలిస్తే -40 ; ఇస్లాం పునరుజ్జీవనోద్యమం -42 ; ఆధునిక ఇస్లామీయ ఉద్యమం -44 ; మొదటి ప్రత్యేకత -45 ; రెండవ ప్రత్యేకత -45 ; మూడవ ప్రత్యేకత -47 ; దైవదత్తం ఈ జీవన విధానం -48 ; క్రియా శీల వ్యవస్థ -50 ;

**2. బానిసల సమస్య ................................ 53**

సందిగ్ధంలో యువతరం -53 ; శాస్త్రీయ వంచన -55 ; భయంకర చిత్రం అపార్థానికి మూలం -56 ; వారి కన్నా పశువులే నయం -57 ; ఉల్లాసానికి కాలక్షేపానికి -58 ; విప్లవాత్మకం ఈ పిలుపు -60 ; తొలిసారిగా అన్ని హక్కులు -63 ; సర్వత్రా సమానత -64 ; మానవ హక్కులు -66 ; సర్వ స్వతంత్రతత వైపుకు -66 ; అల్ ఇత్క్ -67 ; **ముకాతబత్** -70 ; సాలెగూడు పటాపంచలయింది-71 ; సమస్య - సమగ్ర పరిశీలన -72 ; పరిణామం, ప్రగతి, పరిణతి మార్గం - ఇస్లాం **75**;- మనిషిలో

మానవత -75; మానసికమయిన అవాంతరాలు -76; సంస్కరణ సహజరీతిలో -80; బానిసలు కాదు సోదరులు -81; చేదు ఫలాలు -84; మూఢ సంప్రదాయాలు -85; అపజయమే వారి అపరాధం -86; యుద్ధం కాదు 'జిహాద్' - **87** ముస్లిమేతరులు; ; ఇస్లాం - యుద్ధం - 89; ధర్మపథంలో అనివార్యమయి ........-91; విలక్షణమయిన పంథా - 92; ఆచరణలో ఆదర్శం -94; మహిళా బానిసలు -95; ఆధునిక యుగంలో బానిసత్వం -96; బానిసత్వం అంతమయిందా? -96;అందమయినతెరలచాటున -98; నాగరికతా సదనంలో బానిస వదనం -100; మహిళా విమోచనం -102; ఆధునిక వెలియాలి -104; ఇది మరో బానిస గాథ -107;

**3.భూస్వామ్య వ్యవస్థ.........................................108**

భూస్వామ్య వ్యవస్థ -109; పలాయనం పర్యవసానం -111; అపార్థానికి మూలం -113; వ్యావసాయిక కట్టు బానిసత్వం -114; దాస్యం ఆయనకే -115; బాధ్యతాయుత భూస్వామి స్వేచ్ఛాయుత రైతు -116; వ్యావసాయిక వ్యవస్థ -118; వాణిజ్య వ్యవహారం కాదు, సేవా తత్పరత -119; అధికారాలు ఏకపక్షం కావు -120; న్యాయం నిష్పాక్షికం -121; స్వేచ్ఛ, ప్రగతులు తోడునీడగా -123; విశ్వాసం బలహీనమయితే ...........పతనంః-125; చర్చ యొక్క సారాంశం -126;

**4.పెట్టుబడి దారీ వ్యవస్థ.................................128**

యంత్రం ప్రగతికి మూల మంత్రం -129; ప్రారంభంలోనే జరిగింది పొరబాటు -130; దుష్టద్వయం -131; ఆ విప్లవం ఇక్కడ వచ్చి ఉంటే -132; వలస రాజ్య వ్యవస్థ పరిణామ క్రమంలో భాగమా? -134; సమస్యకు మూలాంకురం -135; జీవితంలో సమతూకం, సామరస్యం -137; అంతర్యం కోరేదే బాహ్యంలో చట్టమయితే-139;

**5.వ్యక్తిగత ఆస్తి.........................................140**

అనుభవం ఇచ్చే సాక్ష్యం -140; ఏది సహజం? -141; అన్యాయానికి మూలం ఏమిటి? -144; ఇస్లామీయ సమాజంలో -145; సామాజిక

సిద్ధాంతాలు, ఆర్థిక వ్యవస్థ -148; ఇస్లాం:మధ్యే మార్గం -149; సంస్కరణే అసలు ధ్యేయం కావాలి -151;

**6. వర్గవ్యవస్థ........................................ 154**

వర్గవిభేదానికి మూలం -154; సామాన్యుల వారసత్వం -155; వర్గ వ్యవస్థకు మూల భావన -157; ఆస్తి వికేంద్రీకరణ-157; యదార్థాన్ని ప్రకటించిన ఖుర్‌ఆన్ -159; ఇస్లాంలో వర్గ విభజన -160;

**7.దాన ధర్మాలు..........................................161**

భిక్ష కాదు బాధ్యత -162; జకాత్ - ఇస్లామీయ వ్యవస్థలో -163; దాన ధర్మాలు -164; గౌరవ ప్రదమయిన సంపాదన -165;

**8.స్త్రీ స్థానం..............................................167**

పూర్వ రంగం -168; మనిషి కాదు, మెషీను -169; అరుదయిన ఆత్మీయత -170; నిరంతర వంచన -171; బాలల కన్నా హీనం స్త్రీలగతి -171; గోరు చుట్టుపై ..........173; కొండను త్రవ్వి తీసిన ఎలుక -175; మహిళ మానవాళిలో సగభాగం -176; హక్కుల్లో పరిపూర్ణత -179; స్వేచ్ఛ, సమానత -181; సహజమయిన తారతమ్యం -183; జీవిత పరమార్థం -189; వారసత్వం -190; సాక్ష్యానికి సంబంధించిన చట్టం -192; కుటుంబం పెద్ద -193; సహజమయిన ఎన్నిక -194; దాసి కాదు, జీవన సహచరిణి -195; సహజం, సమంజస మయిన మార్గం -196; ఇది అన్యాయమా? -198; కుటుంబంలో సౌమనస్యం కోసం-201; చట్టంతోనే సరిపోదు -203; ఉద్దేశ్యం సంస్కరణే **-205** ; భార్యకు అన్యాయం జరిగినా -208; విడాకులు: చట్టపరమయిన అంశాలు -210; విడాకులు అభిశాపమా? వరమా? -211; సయోధ్యకు సరయిన పద్ధతి -213; మానవ ప్రకృతికి, సామాజిక అవసరాలకు అతి సన్నిహితంగా -216; ప్రమాద భరితం -220; కావలసిందేమిటి? -222; అసలు కారణాలేవి? -225; ముందు నుయ్యి వెనుక గొయ్యి -227; ఇస్లాం కోరే వ్యవస్థలో -230; నీతి మాలిన వ్యక్తులు కాదు -231;

**9.నేరమూ శిక్ష......................................238**
భిన్న ధృవాలు -239; పాక్షిక దృష్టి -240; మధ్యే మార్గం -241; మూల నిర్మూలనం -244; అపోహలా భయాలా? -246;
**10.సంస్కృతీ నాగరికతలు..............................248**
ఆమూలాగ్ర సంస్కరణ -249; మానవ శ్రేయమే ధ్యేయం -250;
**11.తిరోగమన వాదం ......................................253**
ఇది అవసరం కాదు, అభిశాపం -253; సహేతుకమయిన ఏర్పాటు - 255; ఇది రోగం కాదు...... లక్షణం -257; పతనానికి పూబాట - 258; స్త్రీ తన సహజ రంగానికి దూరంగా -260;
**12.ఇస్లాం మరియు శృంగారం...........................264**
అణచివేత - తాత్కాలిక ఉపసంహరణ -265; నిషేధాలు కావు, పరిమితులు -266; కావలసింది మనోనిగ్రహం -267; ఆశయ సిద్ధికి త్యాగనిరతి అనివార్యం -269; కరుణాసాగరం - దైవం -270;
**13.భావ స్వాతంత్ర్యం......................................274;**
విలోమ ప్రతిక్రియ -275; ధార్మికంగా గుత్తాధిపత్యం? -276; నాస్తిక ధర్మం -278; నిరంకుశ రాజ్యం -279;
**14.ప్రజలకు మత్తుమందు....................................284**
విప్లవ మార్గంలో మహావరోధం -284; ముస్లిం విద్వాంసులు -285; అన్యాయంపై పోరాటం -286; వక్ర భాష్యాలు -287; అన్యాయాన్ని సహించడం మహాపాపం -290; ఆర్థిక దోపిడిపై ధ్వజమెత్తాలి -292; ధన సర్పాలు వినాశ కారకులు -294; సంతృప్తే సదా వాంఛనీయం - 297; సంతృప్తి:పోరాటం -298;
**15.ముస్లిమేతర అల్ప సంఖ్యాకులు..........................301**
సమాన హక్కులు -301; పాశ్చాత్య సాక్ష్యం -302; మత మౌఢ్యానికి నిజభావం -305; మత స్వేచ్ఛ -307; కపట నాటకం -309;
**16.ఇస్లాం మరియు కమ్యూనిజం..............................311**
సరికొత్త హేతువు -311; వంచనకు పరాకాష్ఠ -313; సిద్ధాంతాల్లో

వ్యతిరేకత -314 ; మౌలిక వైరుధ్యాలు -317 నైతిక, ఆర్థిక స్థితిగతులు -320 ; అపూర్వ మహత్కార్యాలు -322 ; ఆచరణాత్మకంగానూ ...... -323 ఇది బలమయిన సిద్ధాంతమా? -327 ;

**17.ఇస్లాం మరియు ఆదర్శవాదం..........................328**

ఆచరణీయ ఆదర్శం -329 ; క్రియా శీల ఆదర్శ వ్యవస్థ - దాని చరిత్ర -331 ; ధార్మిక పునరుజ్జీవనం -332 ; నాటి అద్భుతాలు నేటి అవసరాలు -333 ; ఆదర్శాన్ని అనుసరించే వారవసరం -335 ; వట్టి ఆదర్శవాదం? -338 ;

**18.కింకర్తవ్యం?.......................................340**

విశ్వాసం అభేద్యమయిన కోట -340 ; జరిగిన పరాభవం చాలదా? -342 ; ఇస్లామీయ ఉద్యమం -344 ;

# నా మాట

ముహమ్మద్ కుత్బ్ ఈజిప్ట్‌కి చెందిన గొప్ప ఇస్లామీయ తత్వవేత్త. ప్రాచ్య, పాశ్చాత్య శాస్త్రాలను ఆకళింపు చేసుకున్న మహామేధావి. ఆధునిక వైజ్ఞానిక ప్రగతి, దాని పర్యవసానాలు, పరిణామాలను సూక్ష్మ దృష్టితో తిలకించి విశ్లేషించిన ద్రష్ట. ఇస్లాం తత్వాన్ని ఆధునిక శైలిలో, నేటి యువతరానికి అర్థమయ్యే శాస్త్రీయ భాషలో బోధించిన విజ్ఞాని. ఆయన రచించిన ఈ పుస్తకాన్ని తెలుగు ప్రజలకు అందజేస్తూ నాలో సంతోషమూ దైవంపట్ల కృతజ్ఞతాభావమూ మేళవించిన భావాలు జనిస్తున్నాయి.

పాశ్చాత్య సామ్రాజ్యవాదుల ధాటికి గురయి నేటివరకూ దాన్నుండి తేరుకోలేకపోయిన ప్రాచ్యదేశాల్లో ఉద్భవించిన ఆధ్యాత్మిక, నైతిక, సైద్ధాంతిక సమస్యలు ఈ ప్రాంతాల్లో అంతటా ఒకే రూపంలో ప్రత్యక్షమవుతున్నాయి. రచయిత ఈ పుస్తకంలో ఈజిప్ట్ యువతరాన్ని ఉద్దేశించి మాట్లాడినా, ఇందులో ఈజిప్ట్‌లోని సమస్యలూ, అక్కడి ప్రాంతీయరంగు కొంతవరకు చోటు చేసుకున్నా ప్రస్తావించిన విషయాలు సార్వజనీనమయినవనడం సత్యదూరం కాదు. అందువల్ల ఈ పుస్తకం ఈజిప్ట్ యువతరానికి ఎంతవరకు వర్తిస్తుందో ఇతర ప్రాచ్యదేశాలకు కూడా దీని ప్రయోజనం అంతకంటే ఏ మాత్రం తగ్గదు.

ఈ పుస్తకం ప్రముఖ ప్రపంచభాషల్లో అనువాదమయి అనేక ఎడిషన్లుగా వెలువడింది. అరబీలో దాని ఆరవ ఎడిషన్‌కు పీఠిక వ్రాస్తూ ముహమ్మద్ కుత్బ్ వ్రాసిన ఓ విషయాన్ని ఇక్కడ ప్రస్తావించడం ఈ పుస్తకం ప్రాముఖ్యాన్ని చాటుతుందని నా అభిప్రాయం. ఆయన ఇలా వ్రాశారు:

"నేను ఈ పుస్తకం వ్రాస్తున్న రోజుల్లో దీన్ని ఎంతో ఉత్సాహంతో ప్రజలు స్వీకరిస్తారని నేను ఊహించనేలేదు. ఒకదాని తరువాత మరొకటి ఎన్నో ఎడిషన్లు ప్రచురణఅయి దాన్ని ప్రజలు ఆదరించినప్పుడు నా హృదయం కృతజ్ఞతా భావంతో దైవసన్నిధిలో మోకరిల్లింది. చదువరుల పట్ల ఆదరణ కృతజ్ఞతా భావాలు జనించాయి........................

"అయినప్పటికీ నేను దీన్ని ఇంకా ప్రచురించడంకన్నా ...........
ఇస్లామీయ దృక్పథాలను విభిన్న జీవనరంగాల్లో విశదపరచే కార్యక్రమం చేపట్టాలని తలంచాను. నేను వ్రాసిన ఇతర పుస్తకాల్లో ఈ కోణాన్నే ప్రత్యేకంగా దృష్టిలో ఉంచుకున్నాను............

"కాని ప్రఖ్యాత ప్రాచ్యశాస్త్రనిపుణుడు WILFRED CANTWILL SMITH తన గ్రంథం ISLAM IN MODERN HISTORY లో ఈ పుస్తకాన్ని మూడు చోట్ల ప్రస్తావించి తీవ్రమయిన పదజాలం – ఆ పదజాలాన్ని దూషణలు అని తప్ప మరేమీ అనలేము – లో అవమానపరచినప్పుడు నా అభిప్రాయాన్ని నేను మార్చుకున్నాను. ఈ క్రైస్తవ క్రూసేడర్‌లో ఇంతగా ఆగ్రహాన్ని తెప్పించిన ఈ పుస్తకం మరీ మరీ ప్రింటవ్వాలి, మరీ మరీ ప్రజలు చదవాలి అన్న నిర్ణయానికి వచ్చాను."

తెలుగు ప్రజలూ దీన్ని సరయిన రీతిలో ఆదరించి, పాశ్చాత్య ప్రభావంతో మన నాట కూడా ప్రబలుతున్న ఆలోచనా రీతిలోని ఆంతర్యాన్ని దాని మర్మహేతువును గ్రహించగలుగుతారని ఆశిస్తున్నాను.

*సదా సకల స్తోత్రాలు దైవానికే చెల్లుతాయి.*
*ఏ మనో మార్గమయినా ఆయన ద్వారానే ప్రాప్తమవుతుంది.*

– మలిక్

మనిషి –
సహజంగా సత్యాన్వేషి, సత్యాభిమాని
సత్యం –
వస్తుతః సర్వకాలికం, సర్వజనీనం
సత్యం –
సర్వార్థ సాధనం, సర్వార్థయోజనం

సత్యజ్యోతికి అపార్థాల తెరలు అడ్డుపడితే
సత్యం కానని మనిషి జీవితం
అర్థరహితం, మార్గవిహీనం, గమ్యశూన్యం

సత్యకాంతిలో
తమ జీవితాలను ధన్యం చేసుకోగోరే
సత్య ప్రియులకు
పరమసత్యం ముఖాన్నుండి
అడ్డుతెరలను తొలగించే ఈ ఆయుధం
ప్రేమతో –
సమర్పితం

– మలిక్

# భూమిక

ఆధునిక విద్యావంతులయినవారు అధికంగా తీవ్ర మతపరమయిన సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్నారు. మతం వాస్తవానికి మానవ జీవితానికి సంబంధించిన యదార్థమా? గతంలో ఇది యదార్థమే కావచ్చు. కాని నేడు, సైన్సు మానవ జీవన స్రవంతి దిశనే పూర్తిగా మార్చివేసిన ఈ రోజుల్లోనూ, జీవితంలో సైన్సు చెప్పే యదార్థాలకే తప్ప మరి దేనికీ తావులేని ఈ కాలంలోనూ ఆ వాదన సరయినదేనా? మతం మనిషి సహజమయిన ఆవశ్యకతా? ఒకడు దీన్ని స్వీకరిస్తాడు, మరొకతను దీన్ని తిరస్కరిస్తాడు. ఇది కేవలం విభిన్న వ్యక్తుల నైజాన్ని వ్యక్తపరుస్తుందా? మనిషి దీన్ని స్వీకరించినందువల్లనే, తిరస్కరించినందువల్లనే అతని పరిస్థితిలో ప్రత్యేకమయిన మార్పు ఏదీ వాటిల్లదని దీనివల్ల రుజువవటం లేదా? మనం ఏ స్థితినయితే దైవ తిరస్కారం లేక కుఫ్ర్ అని అంటామో, మరి దేన్నయితే దైవ విశ్వాసం లేక ఈమాన్ అని అంటామో వాటిలో వాస్తవికత దృష్ట్యా ఎలాంటి వ్యత్యాసం లేదని కూడా తేటతెల్లమవడం లేదా? అన్న ప్రశ్నలు సర్వసామాన్యంగా తలెత్తుతున్నాయి.

వీరు ఇస్లాంను గురించి మాట్లాడేటప్పుడు కూడా వీరిలో ఈ సంక్షోభ స్థితి నెలకొని ఉంటుంది. ఇస్లాం కేవలం ఓ విశ్వాసం కాదని, ఇంకా అది ఆధ్యాత్మిక పరిశుద్ధత, మానవీయ సద్గుణాల నిర్మాణం, వాటి సంస్కరణల వరకే పరిమితం కూడా కాదని, అది సర్వతోముఖ, సమన్విత ఏకాంకమని, అందులో న్యాయవంతమయిన ఆర్థిక విధానం, సమతూకం, సామరస్యం గల సామాజిక వ్యవస్థ, సివిల్, క్రిమినల్, అంతర్జాతీయ శాసనాలు, నియమ నిబంధనలు, ప్రత్యేక జీవనతత్వం, శారీరక శిక్షణకై విశేషమయిన ఏర్పాట్లు ఉన్నాయని, ఇవన్నీ దాని మౌలిక విశ్వాసానికి, నైతిక ఆధ్యాత్మిక స్వభావానికి ఉద్భవించిన కొమ్మలూ రెమ్మలే అని వారితో అంటే ఈ సోదరులకు విడదీయరాని చిక్కు ఎదురవుతుంది. ఎందుకంటే వారి ప్రకారం ఇస్లాం తన శక్తినీ ప్రయోజకత్వాన్ని శాశ్వతంగా కోల్పోయి చాలా కాలమయిపోయింది. అది ఇప్పుడు దాదాపు భూతలం నుండి చిరకాలానికి గాను కనుమరుగయిపోయింది. అందువల్ల వారితో, ఇస్లాం మృత ధర్మం

కాదు సజీవమయిన, శక్తి మాన్యమయిన, ఎదుగుతూ, పుష్పిస్తూ, ఫలిస్తూ ఉన్న జీవన వ్యవస్థ అని, ఇందులో ఉన్న ఆరోగ్యవంతమయిన అంశాలు, సోషలిజంలోగాని, కమ్యూనిజంలోగాని, మరే ఇజంలోగాని ప్రాప్తంకావని అన్నప్పుడు వారి సహనం కట్టలుతెంచుకుంటుంది. వారు విరుచుకు పడతారు: "నీవు ఇదంతా ఏ మతం గురించి చెబుతున్నావు? బానిసత్వాన్ని, భూస్వామ్య వ్యవస్థను, పెట్టుబడిదారీని ధర్మసమ్మతం చేసిన ధర్మం గురించేనా? స్త్రీని పురుషుడిలో సగం అని బోధించి ఆమెను ఇంటి నాలుగు గోడల మధ్య బంధించే మతం గురించేనా? రాళ్ళు రువ్వి చంపడం, చేతులు నరకడం, కొరడా దెబ్బలు - ఇలాంటి అమానుషమయిన శిక్షలు విధించే మతం గురించేనా? తన అనుయాయులకు దానధర్మాలపై ఆధారపడి జీవించమని బోధించే మతం, మనుషుల్ని విభిన్న వర్గాలుగా విభజించి కొందరు ఇతరుల్ని తమ దోపిడీకి గురిచేసేందుకు వీలు కల్పించే మతం - దీన్ని గురించేనా? కష్టజీవులకు సుఖశాంతుల జీవితం గడిపే హామీనివ్వలేని జీవన వ్యవస్థ - ఈ ఇస్లాం - గురించేనా నీవు ఇవన్నీ చెప్పేది? ఇది ప్రగతిని సాధించడం, భావిలో కొంగ్రొత్త విజయాలను పొందడం సుదూర విషయాలు. మాకయితే ఇప్పుడు దాని ఉనికికే తీవ్రమయిన ప్రమాదం గోచరిస్తోంది. నేటి ప్రపంచంలో, విభిన్న సామాజిక, ఆర్థిక వ్యవస్థల మధ్య సైద్ధాంతిక సంఘర్షణ జరుగుతున్న ఈ తరుణంలో, ఇస్లాంలాంటి బూజుపట్టిన మతం మనగలగటం, అది విజయవంతం అవడం అన్న ప్రశ్నే తలెత్తదు."

ముందుకు సాగేముందు, ఈ "విద్యావంతుల" యిన ఆశంకావాదుల్ని వారి వాస్తవ రూపురేఖల్ని కాస్త పరిశీలిద్దాం. వీరి ఈ ఆశంకలకు అనుమానాలకు మూలమేదో ఉద్భవస్థానమేదో చూద్దాము. వీరి ఉద్ఘోషణా తీరు వీరి స్వతంత్ర ఆలోచనల, పరిశీలనల ఫలితమా లేక ఇతరుల అంధానుసరణ వల్ల జనించిందా?

వాస్తవమేమంటే వీరు ఏ విధమయిన సందేహాలు, సంశయాలు ఇస్లాం గురించి వ్యక్తపరుస్తున్నారో అవి వీరి స్వతంత్ర అనుశీలనల ద్వారా, వీరి మస్తిష్కాల్లో ఉద్భవించినవి కావు. ఇవి ఇతరుల అరువు ప్రశ్నలు. వీటి అసలు మూల స్థానాన్ని చూడదలిస్తే ఆధునిక యుగ చరిత్రపై దృష్టి

సారించవలసి ఉంటుంది.

మధ్యయుగాల్లో యూరపు మరియు ఇస్లామీయ ప్రపంచం మధ్య భయంకరమయిన యుద్ధాలు (CRUSADES) జరిగాయి. ఆ తరువాత ఆసన్నమయిన కాలంలో బయటికి వీరిమధ్య సంధి కుదిరినట్లే కనిపించింది. కాని వాస్తవానికి వారి మధ్య స్థిరంగా సదవగాహన, సయోధ్యలాంటిది ఎన్నడూ కుదరలేదు. వారు ఒకరిపై మరొకరు శాశ్వతంగా కత్తులు దూస్తూనే ఉన్నారు. అందువల్లనే తొలి ప్రపంచ సంగ్రామంలో బ్రిటీషువారు ఎరుషలేమును స్వాధీనం చేసుకున్నప్పుడు బ్రిటీషు అధికారి లార్డ్ ఎలెన్ బై (ALLEN BY) బాహాటంగా ప్రకటించాడు: "ఇక దీనితో నేటికి క్రూసేడు యుద్ధాలు అంతమయిపొయ్యాయి" అని.

మనం మరో విషయం కూడా గుర్తుంచుకోవాలి. గత రెండు శతాబ్దాలుగా, ముఖ్యంగా యూరపు సామ్రాజ్యవాదుల్లోనూ ఇస్లామీయ ప్రపంచంలోనూ నిరంతర సంఘర్షణ జరుగుతూ వచ్చింది. తౌఫీక్ పాషా చేసిన ద్రోహం వల్ల బ్రిటీష్ వాళ్ళకు ఈజిప్ట్‌లో కాళ్ళూనే అవకాశం లభించింది. తద్వారా వారు పరాబిపాషా నాయకత్వాన వెలసిన క్రీ.శ. 1882 నాటి ప్రజావిప్లవాన్ని వమ్ము చేసివేశారు. ఆ తరువాత రూపొందిన బ్రిటీష్ పాలసీ యొక్క మూల సూత్రం ఏమిటంటే, ఏ విధంగా నయినా సరే ఇస్లామీయ ప్రపంచాన తమ పట్టును అత్యధికంగా పటిష్ఠం చేస్తూ పోవాలి. ఇంకా సాధ్యమయిన విధానాలన్నింటినీ వినియోగించి ఇస్లామీయ ఉద్యమాన్ని, ఆ స్ఫృహను అణచివెయ్యాలి. అప్పుడే తమ అధికారం భద్రంగా, బలంగా ఉండగలుగుతుంది అన్నది. అందువల్లనే విక్టోరియా కాలంనాటి ప్రధానమంత్రి మిస్టర్ గ్లాడ్‌స్టోన్ (Mr. Glad Stone) బ్రిటీష్ పార్లమెంటు (HOUSE OF COMMONS) లో దివ్యఖుర్‌ఆన్ ప్రతి నొకదాన్ని చేతుల్లో ఎత్తుకుని, సభ్యులనుద్దేశించి, "ఈజిప్ట్ ప్రజల్లో ఈ గ్రంథం ఉన్నంత కాలం ఈజిప్ట్‌లో ప్రశాంతంగా మన ఏలుబడి మనగలగడం సాధ్యంకాదు" అని అన్నాడు.

ఈ కారణంచేతనే ఇంగ్లీషువారు ముస్లిముల్ని ఇస్లాంకు దూరంగా, దానికి వ్యతిరేకంగా మలచడానికి ఇస్లామీయ ధార్మిక చిహ్నాలను, ప్రబోధాలను అపహసించడం మొదలెట్టారు. ముస్లిముల ముందు ఇస్లామీయ చరిత్రను వక్రీకరించి వీలయినంత అంధకారమయంగా

చిత్రించారు - తమ పట్టు ఈజిప్టుపై పటిష్ఠమవ్వాలని, తమ నీచమయిన ఆశయాలు నెరవేరాలని.

ఈజిప్ట్‌లో వారు అవలంబించిన విద్యావిధానం, ముస్లిం విద్యార్థులకు తమ ధర్మంపట్ల సరయిన అవగాహన పొందే అవకాశమే నివ్వలేదు. చివరికి బ్రిటీష్ సామ్రాజ్యం స్థాపించిన ధార్మిక పాఠశాలల్లో పట్టభద్రులయినప్పటికీ వారు ఇస్లాం నిజ సారాన్ని గ్రహించలేక పొయ్యారు. ఈ పాఠశాలల్లో విద్యార్థులకు ఇవ్వబడే ఇస్లాం బోధనల సంగ్రహ రూపం ఇది: ఖుర్‌ఆన్ దైవగ్రంథం. దాన్ని కేవలం పుణ్యఫలాపేక్షతో పారాయణం చేస్తారు. ఇస్లాం, ఇతర మతాల్లాగనే మనుషుల్ని మంచి మనుషు లుగా అయ్యేందుకు, తమలో నైతిక గుణగణాలు పెంపొందించుకునేందు కు ప్రేరణ కలుగజేస్తుంది. ఇది కూడా ఇతర మతాల్లానే ఆరాధనలు, జపాలు, సంస్మరణలు, ఆధ్యాత్మికసాధనలు, మహాత్యాలు, అద్భుతాల సమ్మిశ్రమం అంతే. పైగా, ఇస్లాం ప్రతిపాదించే సామాజిక ఆర్థికవ్యవస్థను, దాని పరిపాలనా రీతిని, దాని అంతర్జాతీయ విధానాన్ని దాని విద్యాశిక్షణల వ్యవస్థకు, అది అందజేసే జీవనప్రదమయిన, జీవనదాయకమయిన సందేశాన్ని విద్యార్థులకు తెలియపరచకపోవడమేకాక వాటిపట్ల, ప్రాచ్యశాస్త్ర నిపుణులు (ORIENTALISTS) వ్యాపింపజేసిన అపోహాలు, అపార్థాలు, సందేహాలు, కుశంకలు - అన్నింటినీ ఓ క్రమంలో చిన్నచిన్న మోతాదుల్లో వారి బుర్రల్లోకి ఎక్కించేవారు. తద్వారా విద్యార్థులకు ఇస్లాం పట్ల మొగ మొత్తి వారిలో ఏవగింపు కలిగేలా చేసి, వారిని తమ సామ్రాజ్యపు దుష్టసంక ల్పాల పరిపూర్తి కొరకు పావులుగా వాడుకోవాలన్నది వారి పథకం.

సామ్రాజ్యవాదులు నిర్మించిన ఆ విద్యాపథకం ప్రకారం విద్యార్థులకు బోధించిన విషయమేమిటంటే, ప్రపంచంలో ఏదయిన ఉత్తమ జీవన వ్యవస్థ ఉందంటే అది కేవలం యూరపులో మాత్రమే ఉంది. అత్యుత్తమ ఆర్థిక వ్యవస్థ ఏదయితే ఉందో అది యూరపు ఆర్థిక వేత్తల మేధాకృషి ఫలితంగా ఉద్భవించిందే. ఇంకా ఆధునిక కాలానికి అత్యంత సముచితమయిన రాజ్యాంగ బద్ధమయిన ప్రభుత్వ విధానం ఏదయినా ఉంటే అది, శతాబ్దాల తరబడి ప్రయోగాలు చేసి, గడించిన అనుభవాల ద్వారా యూరపు ప్రజలు సాధించిన వ్యవస్థ ఒక్కటే అన్నది. ఆ విద్యా

వ్యవస్థ విద్యార్థుల మస్తిష్కాల్లో ఎక్కించిన విషయాలు ఇంకా ఇవి: మానవునికి ప్రాథమిక హక్కులు ప్రప్రథమంగా ఇప్పించింది ఫ్రెంచి విప్లవం. ప్రజాస్వామ్యం, ప్రజాస్వామిక జీవితం నేడు బహుళ ప్రాచుర్యం పొందాయంటే, అవి దినదినాభివృద్ధి చెందుతున్నాయంటే ఇదంతా కేవలం బ్రిటీషు ప్రజల ప్రజాస్వామిక కృషి ఫలితాలే. అధునాతన సంస్కృతీ నాగరికతలకు అసలు పునాదులు రోమను సంస్కృతి, రోమను ప్రభుత్వం ప్రసాదించినవే. మొత్తానికి ఈ విద్యా వ్యవస్థ యూరపు మరియు యూరపు ప్రజలకు సంబంధించిన ఎంతో ఆకర్షణీయమయిన, ఎంతో ప్రభావవంతమయిన చిత్రాన్ని చూపెట్టింది. దాన్ని చూచిన తరువాత, యూరపు ఎవరికీ లొంగని ఓ ప్రచండశక్తి అని, దానిపై ఎవరికీ ఎలాంటి అధికారమో, ఆధిపత్యమోలేదని, దాని సంకల్పాల పరిపూర్తిని ఏ శక్తీ ఆపజాలదని, దాని మార్గంలో ఏ శక్తీ అడ్డు రాజాలదని మాత్రం భావించడమే సాధ్యం. దాని సదృశంగా ప్రాచ్య భూగోళాన్ని విద్యార్థులముందు నిత్యం, అత్యంత అల్పంగా నీచంగా చిత్రించటం జరిగింది.

అంటే ఇది ఓ మరుగుజ్జు; యూరపులాంటి ఆజానుబాహువు సమక్షంలో దీనికి అసలు ఎలాంటి విలువేలేదు. నిజానికి దీని ఉనికి, దీని మనుగడ పూర్తిగా యూరపు ప్రజల కటాక్ష వీక్షణాలపైనే ఆధారపడి ఉన్నాయి. దీనికి తనదంటూ ఓ సంస్కృతి, నాగరికత లేదు. ఉన్నది కాస్తా ఎంతో అల్పమయింది. ఇక ప్రాచ్యదేశాలకు, పాశ్చాత్య సామాజిక, సాంస్కృతిక భండారము నుండి విలువల్ని అరువు తెచ్చుకోవడం తప్ప గత్యంతరం లేదు.

సామ్రాజ్యవాదుల ఈ రాజకీయ పన్నాగాలు చివరికి మంచి ఫలితాలనిచ్చాయి. ఈజిప్ట్ ముస్లిముల నవతరం జాతీయాభిమానం, స్వతంత్ర ప్రతిపత్తి, సాంస్కృతిక ప్రత్యేకతా భావాల నుండి పూర్తిగా దూరమయిపోయింది. దాని మనో మస్తిష్కాలపై యూరపు, దాని నాగరికతల ముద్ర చిరస్థాయిగా పడిపోయింది. వారు తమ సొంత కళ్ళతో చూడనూ లేరు, స్వతంత్రంగా ఆలోచించనూ లేరు. వారి అవలోకన ఆలోచనల పరిధి పరిమితమయి, వారు తమ యూరపు ప్రభువుల ఇష్టాఇష్టాల కనుగుణంగా మెలగడం, వారి ప్రయోజనాలకు లోబడి నడుచుకోవడం తప్ప మరేమీ చెయ్యలేని స్థితికి దిగజారిపొయ్యారు.

ఈ చారిత్రక పూర్వరంగాన్ని దృష్టిలో ఉంచుకుని చూస్తే ముస్లిముల్లో ఆధునిక విద్యావంతులు సామ్రాజ్యవాదశక్తుల రాజకీయ ఎత్తుగడల ప్రతిభకు ప్రతీకలు. వీరి కుట్రల విజయానికి గొప్ప తార్కాణాలు. ముస్లిం సమాజంలో ఈ వర్గం భావాలు దృక్పథాలు సామ్రాజ్యవాదుల నిజమయిన సంకల్పాలకు సరయిన నిదర్శనాలనడంలో సందేహంలేదు.

ఇస్లాం గురించి వీరికి తెలిసిన విషయాలు అసంపూర్ణమయినవి, తమ పాశ్చాత్య గురువులనుండి నేర్చుకున్నవి మాత్రమే. అలాగే మతం గురించి వీరి అభిప్రాయాలు, నిజానికి యూరపు మేధావులు లేవదీసిన సంశయాలు సందేహాల ప్రతిధ్వనులు మాత్రమే. వీరు కూడా వారి అనుకరణలో ఇస్లాం పట్ల రకరకాల అర్థంలేని ఆక్షేపణలు లేవనెత్తుతారు. ఒక్కోసారి, ఇస్లాం, రాజకీయ వ్యవహారాల్లో జోక్యం చేసుకోనవసరం లేదని అంటారు. మరోసారి సైన్సుకు ఇస్లాంకు అసలు సయోధ్య కుదరదని ప్రచారం ప్రారంభిస్తారు.

అజ్ఞానం వాళ్ళ కళ్ళను కప్పివేసింది. ఏ మతానికి వ్యతిరేకంగా తిరుగుబాటును ప్రకటించడం తప్ప యూరపుకు మరో మార్గం లేకుండా పోయిందో అది ఇస్లాం కాదని బహుశా వారికి తెలీదు కాబోలు! అది ఇస్లాంకు పూర్తిగా భిన్నమయిన మతం. యూరపు ప్రజల్లో తమ మతం పట్ల విసుగు పుట్టించిన పరిస్థితులూ, సంఘటనలు కేవలం యూరపు వరకే పరిమితం అన్న విషయాన్ని కూడా వారు మరచిపోతారు. ప్రపంచంలో మరే భూభాగాన కూడా యూరపులాంటి ఉదంతాల ఉదాహరణ ఒక్కటి కూడా కానరాదు. కనీసం ఇస్లామీయ చరిత్ర అలాంటి పరిస్థితుల్ని, సంఘటనల్ని ఎరగనయినా ఎరుగదు. ముందు కూడా ఇస్లామీయజగత్తులో అలాంటి సంఘటనలు జరిగే ఏ అవకాశమూ అగుపించడంలేదు. కాని ఈ యూరపు గుడ్డి అనుయాయులు ముందూ వెనుక ఆలోచించకుండా ఇస్లాంను తమ సామాజిక, రాజకీయ, ఆర్థిక జీవితంనుండి వెలివెయ్యడానికి కంకణ బద్ధులయి ఉన్నట్లు తోస్తోంది. వీరి దృష్టిలో ఇస్లాం కాలంచెల్లినదిగా, రద్దు చెయ్యదగినదిగా, ఎందుకు రూపుదాల్చిందీ అంటే దానికి కారణం యూరపు ప్రజలు మతం అంటే మొగంమొత్తి విసుగు చెందారు. వారు తమ మతాన్ని పూర్తిగా దేశ బహిష్కరణ గావించారు కూడా. అందువల్ల వారి అడుగుజాడల్లో వీరుకూడా

తమ మతాన్ని రూపుమాపదలిచారు.

యూరపులో మతమూ సైన్సుల మధ్య వివాదం చెలరేగడానికి మూలం చర్చి చేసిన పొరపాటు మాత్రమే. దాని కారణంగా చర్చి అధినేతలు, తమకు వారసత్వంగా లభించిన కొన్ని గ్రీకు శాస్త్ర విషయాలను తమ మతంలోని అంశాలుగా చిత్రించి వాటికి మతం రంగు పులిమారు. వారి దృష్టిలో వాటిని తిరస్కరించడమంటే ధార్మిక యదార్థాలను సత్యాన్ని తిరస్కరించడమే. సైద్ధాంతికంగానూ, ప్రయోగాత్మకంగాను సైన్సువారి ఈ నమ్మకాల్లో గల లోపాలను ఎత్తి చూపినప్పుడయినా వారికి యదార్థం బోధపడలేదు. వారు అప్పటికీ తమ తప్పుడు భావాలపై మొండికేశారు. పరిస్థితుల ఈ స్వరూపం యూరపులో చర్చి, చర్చి అధిపతులు ఉభయుల గౌరవాన్ని మంటగలిపింది. కాని, ఎప్పుడయితే చర్చి తన 'దైవిక' అధికారాలను అత్యంత అన్యాయంగా, గుడ్డిగా వినియోగించసాగిందో అప్పుడు చర్చి సైన్సు మధ్య సంఘర్షణ పతాకస్థాయికి చేరుకుంది. ప్రజల్లో చర్చి కొనసాగించే మతపరమయిన దౌర్జన్యాన్ని ఎదిరించాలని తీవ్రమయిన ప్రతిస్పందన రగుల్కొన్నది. చర్చినుండి విముక్తిని పొందే కోరిక బలం పుంజుకుంది. తన ఈ వైఖరి ద్వారా చర్చి అధిపతులు యూరపు ప్రజల ముందుంచిన మతభావన అత్యంత విహ్యామయినది, అంధకార బంధురమయినదీ అనడంలో సందేహం లేదు. యూరపు ప్రజలకు మతం పరమ పిశాచంలా సాక్షాత్కరించింది. అది మనిషిని పగల్లోనూ ప్రశాంతంగా పనిచెయ్యనివ్వదు, రాత్రుల్లోనూ దాని బాధ తప్పదు అన్న అభిప్రాయం ధృడతరమయింది.

చర్చి, మతం పేరుతో ప్రజలనుండి వసూలుచేసే పెద్దమొత్తాల కారణంగా ప్రజలు క్రియాత్మకంగా చర్చికి బానిసలయ్యారు. చర్చి అధిపతులు తమ్ము తాము భువిలో దేవుని ప్రతినిధులుగా భావించేవారు. ప్రజలు, తాము నుడివే ప్రతి మాటను ఎదురు ప్రశ్న వెయ్యకుండా స్వీకరించాలని అభిలషించేవారు. తదనుగుణంగా ఏ శాస్త్రవేత్తలయితే వారి అభిప్రాయాలతో విభేదించారో వారిని వీరు అత్యంత ఘోరమయిన శారీరక హింసలకు గురిచేశారు. ఎంతో సాధారణ విషయాలపై వారిని సజీవంగా దహనం చేశారు. భూమి గుండ్రంగా గోళాకారంలో ఉందని

ప్రకటించిన సైన్టిస్టుల ఒక్క ఉదాహరణ ఈ సందర్భంలో చాలు.

ఇంతకు, చర్చిచేసిన ఈ జుగుప్సాకరమయిన జులుం, అపరాధాలు చూచి యూరపు మేధావులు, స్వతంత్ర ఆలోచనాపరులు, సజీవ మనస్సాక్షి గలవారు చలించిపొయ్యారు. కలత చెందారు. వారు, ఈ రాక్షసత్వాన్ని గట్టిగా ఎదుర్కోవాలని దృఢ సంకల్పం చేసుకున్నారు. తద్వారా అది పూర్తిగానయినా అంతమయిపోవాలి, లేదా భావిలో ప్రజల్ని ఎన్నడూ బాధించకుండా, కలవరపరచకుండా ఉండేలా నిర్వీర్యమయినా అవ్వాలి, ఇంకా ప్రపంచంలో తన తప్పుడు దృష్టాంతం వల్ల మతం అంటే అసత్యం, వంచన అన్న అపార్థాన్ని వ్యాపింప జెయ్యకుండానయినా ఉండాలి అన్న నిర్ణయానికి వచ్చారు.

కాని ముస్లిములు, ఇస్లాంల మధ్య ఉన్న సంబంధం కూడా, యూరపు ప్రజలకూ, చర్చికి మధ్య ఉన్న సంబంధంలాంటిదేనా? లేదంటే ఇస్లాం మరియు సైన్సుకు మధ్య శత్రుత్వం గురించి జరిగే ఈ గొడవంతా దేనికి? వాస్తవానికి ఇస్లాం మరియు సైన్సుకు మధ్య ఎలాంటి వివాదం లేదు. ఇంతవరకు, ఇస్లాంను తిరస్కరించడం తప్పనిసరి అవడానికి కారణభూతం కాగల ఏ సైంటిఫిక్ యదార్థమూ వెలికి రాలేదు. ఇస్లాం ఛాయల్లో సాగిన సుదీర్ఘ పరిపాలనాకాలంలో సైంటిస్టుల పట్ల జులుం జరిగిన సంఘటనగాని, వారికి పాశవిక శిక్షలు విధించిన ఉదంతాలు గాని ఎన్నడూ జరగలేదు. ఇస్లామీయ చరిత్ర అంతా మన ముందుంది. ఇందులో వైద్యశాస్త్రం, ఖగోళశాస్త్రం, గణితశాస్త్రం, భౌతికశాస్త్రం, రసాయనిక శాస్త్రాల్లో గొప్పగొప్ప నిపుణులు జన్మించారు. వీరిలో ఎవరినయినా కేవలం అతని దృక్పథాల కారణంగా దౌర్జన్యానికి హింసకు గురిచేసినట్లు ఒక్క దృష్టాంతమూ కానరాదు. ఈ ముస్లిం సైంటిస్టులు ఎన్నడయినా ఇస్లాం మరియు సైన్సు మధ్య ఎలాంటి దూరమో, వైరుధ్యమో ఉన్నట్లు భావించలేదు. అలాగే ముస్లిమ్ పరిపాలకులు చర్చి అధిపతుల్లా సైంటిస్టుల్ని తమకు విరోధులుగా భావించలేదు. అందుచేతనే ఇస్లామీయ చరిత్రలో సైంటిస్టుని ఏ అగ్నిగుండంలోనూ కాల్చలేదు, ఖైదులో వేసి యాతనలకూ గురి చెయ్యలేదు.

అయినప్పటికీ కొందరు ఇస్లాం మరియు సైన్సు పరస్పరం

విరుద్ధమయినవిగా రుజువు చెయ్యడానికే ప్రతిజ్ఞ బూనినట్లున్నారు. వీరు ఇస్లాం పరిజ్ఞానాన్ని గ్రహించకుండానే అందులో తప్పులెన్నుతారు. ఈ విషయాలన్నీ నిజానికి సామ్రాజ్యవాదులు వారి నరనరాల్లో ఎక్కించిన ఆ విషప్రభావానికి కేవలం బాహ్యాలక్షణాలే. కాని శోచనీయమయిన విషయమేమంటే వారికి దాని స్పృహ కూడా లేదు.

ఈ పుస్తకం వీరిని ఉద్దేశించి వ్రాసిందికాదు. ఎందుకంటే వీరితో ఏదయినా పలకడం కాస్త తొందరపాటు అనిపించుకుంటుందేమో అని నా అనుమానం. వీరు సన్మార్గానికి రావాలంటే, వీరి పోషక మహా ప్రభువులు తమ దైవరాహిత్య భౌతికతా ప్రధానమయిన సంస్కృతి పట్ల పూర్తిగా నిరాశచెంది, జీవితపు అన్ని రంగాలను ఆవరించి ఆత్మ, పదార్థం, మరియు విశ్వాసం ఆచరణ – అన్నింటి విషయంలో మార్గం చూపే జీవన వ్యవస్థకై పరితపించే శుభఘడియకై నిరీక్షించవలసి ఉంటుంది. అప్పుడు వారిని చూచి వీరు కూడా సన్మార్గానికి రావడానికి అవకాశం ఉంది.

ఈ పుస్తకాన్ని నేను, కాంతిమయమయిన అంతరాత్మతో, చిత్తశుద్ధితో అలరారే యువకుల్ని ఉద్దేశించి వ్రాశాను. వీరు ఎంతో సౌమ్యంగా, గాంభీర్యంతో సత్యాన్నీ యదార్థాన్నీ అన్వేషిస్తున్నారు. కాని వంచనా శిల్పంలో ఆరితేరిన సామ్రాజ్యవాద శక్తుల పన్నాగాలు, దుష్ప్రచారం వీరి మార్గంలో అంతరాయం సృష్టిస్తున్నాయి. తెల్ల సామ్రాజ్యవాదులు, ఎర్ర కమ్యూనిస్టు సామ్రాజ్యవాదులు – కల్లోల జనకులయిన వీరివురూ, ఈ యువతరం ఇస్లాం యొక్క నిజసారాన్ని సరిగ్గా గ్రహించరాదని కోరుతున్నారు. వీరు, ఈ యువకులు స్వాతంత్ర్యం, గౌరవం, ఔన్నత్యం లభ్యమయ్యే మార్గాన్ని పొందరాదని సకల ప్రయత్నాలూ చేస్తున్నారు. నేను ఈ యువ సోదరుల సమక్షంలో ఈ పుస్తకాన్ని సమర్పించుకుంటున్నాను. ఇస్లాం విషయంలో వీరి సందేహాలు సంశయాల నివృత్తి కొరకు ఇది వారికి దోహదపడగలగాలని దైవాన్ని వేడుకుంటున్నాను.

– ముహమ్మద్ కుత్బ్

అల్లాహ్ అపార కృపాశీలుడు పరమ దయామయుని పేరుతో

# 1. ఇక మతం అవసరం లేదా?

ఆధునిక వైజ్ఞానిక శాస్త్రం సాధించిన అద్భుతమయిన విజయాలు పాశ్చాత్యుల కళ్ళను చెదరగొట్టాయి. ఆ ప్రభావం వల్ల మతంలో ప్రయోజకత్వం అంతమయిపోయింది. సైన్సు మతాన్ని శాశ్వతంగా భూస్థాపితం చేసివేసింది అన్న అభిప్రాయం వారిలో సామాన్యంగా ప్రబలిపోయింది. ప్రముఖ మనస్తత్వ వేత్తలు, సాంఘిక శాస్త్రవేత్తలు దాదాపు అందరూ ఇలాంటి అభిప్రాయాన్నే వ్యక్తం చేశారు. ఉదాహరణకు ప్రఖ్యాత మనస్తత్వవేత్త ఫ్రాయిడ్‌నే తీసుకుందాం. మత ప్రబోధాలను సమర్ధించే ప్రయత్నాలను అపహసిస్తూ, 'మానవ జీవితం స్పష్టమయిన మూడు మానసిక దశలను దాటుకుంటూ పోతుంది: మూఢత్వం, మతం, సైన్సు. ఇది సైన్సు యుగం. మత విషయాలకు ఇప్పుడు కాలం చెల్లింది. మతానికి ఇక అర్థమే లేదు' అని అన్నాడు.

## మూల కారణం

మేము భూమికలో పేర్కొన్నట్లు మతంపట్ల, యూరోపు శాస్త్రవేత్తల వ్యతిరేకతకు అసలు కారణం క్రైస్తవ మతాధిపతులకూ విజ్ఞాన శాస్త్రవేత్తలకూ మధ్య తలెత్తిన సంఘర్షణే. ఈ సంఘర్షణలో మతాధిపతుల పాత్రను క్షుణ్ణంగా గమనించిన శాస్త్రవేత్తలు మతమంటే తిరోగమనమని, అమానుషత్వమని, మూఢత్వమని, వ్యర్థమయిన ఆలోచనలు ఆచరణల కలగూరగంప అని భావించారు. అందువల్ల దీన్ని శాశ్వతంగా అంతమొందించాలని, సైన్సును పురోగమింపచెయ్యాలని వారు తలచారు. ఈ విధంగా సైన్సు మార్గదర్శకత్వంలో మానవాళి, సంస్కృతీ నాగరికతల మార్గాన ప్రగతి సాధించగలదని అభిప్రాయ పడ్డారు.

ఇదీ మతంపట్ల యూరోపు శాస్త్రవేత్తల శత్రుత్వానికి అసలు కారణం. కాని ఈ మూలకారణాన్ని అర్థంచేసుకోకుండా కొందరు ప్రాచ్య

ప్రముఖులు మతాన్ని గుడ్డిగా వ్యతిరేకించడం ప్రారంభించారు. వీరు, పాశ్చాత్యదేశాల్లో పై సంఘర్షణాకాలం నాటి పరిస్థితుల్లోనూ తమ నాట ఉన్న పరిస్థితుల్లోనూ గల వ్యత్యాసాన్ని పరిగణనలోకి తీసుకోలేకపొయ్యారు. వీరి ఈ వ్యతిరేకత ఏదో పెద్ద అనుశీలన, పరిశీలన, పరిశోధనల ఫలితంగా ఏర్పడ్డది కాదు. ప్రాచ్య దేశాల్లో సర్వసాధారణమయిపోయిన యూరోపు అంధానుకరణకు ఫలితంగా ఏర్పడ్డది మాత్రమే. ప్రగతికీ, పరిపూర్ణతకూ ఏకైక మార్గం, ఆధిక్యతగల యూరోపు జాతులు అనుసరిస్తున్న మార్గమే అన్న నిర్ణయానికి వచ్చారు వారు. ఏ విధంగానయితే యూరోపు మతాన్ని త్రోసిపుచ్చిందో అలాగే తాము కూడా చెయ్యాలని, లేకపోతే తమను తిరోగమనవాదులుగా, వెనకబడ్డ వారుగా, మూర్ఖులుగా జమకట్టడం జరుగుతుందని భయపడ్డారు.

దురదృష్టకరమయిన విషయమేమంటే వీరు ఒక విషయాన్ని మరచి పోతారు. పాశ్చాత్య పండితులూ శాస్త్రవేత్తల్లో కూడా మత వ్యతిరేకత పట్ల మునుపెన్నడూ ఏకాభిప్రాయం కుదరలేదు, నేడూ వారిలో ఏకాభిప్రాయం లేదు. వాస్తవానికి కొందరు ప్రముఖ యూరోపు శాస్త్రవేత్తలు నాస్తికత ఆధారంగా ఏర్పడిన సభ్యతా సంస్కృతుల్ని నిరసిస్తున్నారు. మతం అన్నది మనిషియొక్క అనివార్యమయిన మానసిక, బుద్ధిపరమయిన అవసరమనే యదార్థాన్ని ఘంటాపథంగా ప్రకటించారు కూడా.

## సరికొత్త దేముడు

ఈ శాస్త్రవేత్తల్లో బాగాపేరు ప్రఖ్యాతులున్న ఖగోళశాస్త్రజ్ఞుడు జేమ్స్ జీన్స్ (JAMESJEANS) ఒకడు. ఇతను తన జీవితాన్ని నాస్తికుడుగా, ఆశంకవాదిగా ప్రారంభించాడు. కాని క్రమేణ, తన వైజ్ఞానిక పరిశోధనల పర్యవసానంగా, మతం మానవ జీవితానికి అనివార్యమయిన అవసరం అన్న నిర్ణయానికి వచ్చాడు. ఎందుకంటే దైవాన్ని విశ్వసించకుండా సైన్సుయొక్క మౌలిక సమస్యల్ని పరిష్కరించడమే సాధ్యపడదన్న

విషయాన్ని అతను తన పరిశోధనల ద్వారా తెలుసుకున్న యదార్థం. ప్రముఖ సామాజిక శాస్త్రవేత్త జీన్స్ బ్రిడ్జ్ (JEANS BRIDGE) మతాన్ని సమర్థించడంలో ఎంతవరకు పొయ్యాడంటే, భౌతిక, ఆధ్యాత్మిక తత్వాల సమ్మేళనం ద్వారా విశ్వాసం, ఆచరణల సామరస్యం గల ఓ వ్యవస్థను సంస్థాపించినందుకు ఇస్లాంను మనస్ఫూర్తిగా ప్రశంసించాడు. విఖ్యాత ఇంగ్లీషు సాహితీకారుడు సోమర్‌సెట్ మాహమ్ (SOMARSET MAUGHAM) అయితే, మతంపట్ల ఆధునిక యూరపు అనుసరించే విలోమ వైఖరి నంతటినీ ఈ విధంగా వ్యాఖ్యానించాడు: "యూరపు పాత దైవానికి తిలోదకాలిచ్చి తనకంటూ ఓ కొత్త దేవుణ్ణి - సైన్సును - కనిపెట్టుకుంది."

కాని యూరోపు సృష్టించుకున్న ఈ కొత్త దేవుడు చాలా చంచల హృదయుడయ్యాడు. ప్రతిక్షణం మార్పుకు గురవుతుంటాడు. అనునిత్యం స్థానభ్రంశం చెందుతూ ఉంటాడు. నేడు ఒక విషయాన్ని వాస్తవమని ధృవీకరిస్తాడు; రేపు దాన్ని అసత్యమని, భ్రమ అని, మిథ్య అని కొట్టిపారవేస్తాడు. ఈ పరివర్తనా చక్రం సాగుతూనే ఉంటుంది. అది ఒక్క నాటితో ఆగదు. ఆ దేవుని "ఆరాధకులు" కూడా శాశ్వతంగా అశాంతికి, అలజడికి లోనయి నిత్యం నిలకడలేని మనుగడను వెళ్ళదీస్తూ ఉంటారు. నిజం చెప్పాలంటే ఇలాంటి చంచల స్వభావంగల దేవుని ద్వారా ఇంతకంటే గొప్పవరం మరేది లభిస్తుంది? ఆధునిక పాశ్చాత్య జగత్తులో నేడు సర్వవ్యాప్తంగా కానవస్తున్న అశాంతి అలజడులు, ఇంకా అది ఏ మానసిక రుగ్మతలకు లోనయి బాధపడుతున్నదో అవన్నీ దాని అసలు వ్యాధి - ఆధ్యాత్మిక వ్యాధి - యొక్క బాహ్య లక్షణాలు మాత్రమే.

## సైన్సు ప్రపంచం

సైన్సును దేవునిస్థానంలో ప్రతిష్ఠించినందుకు కలిగిన మరో పర్యవసానం ఏమిటంటే మనం నివసించే ఈ ప్రపంచం తనదంటూ ఓ నిర్దిష్టమయిన, స్పష్టమయిన ఆశయాన్నీ, అర్థాన్నీ కోల్పోయింది. దీనికి

ఉన్నతమయిన ఉద్దేశం లేదు. ఓ వ్యవస్థ అంటూ, దానికి మార్గం చూపగల శక్తీ, వ్యక్తిత్వమంటూ ఏదీ లేకుండా పోయింది. ఇక్కడ పరస్పరం విరుద్ధమయిన శక్తుల మధ్య శాశ్వత సంఘర్షణ ఒకటి చెలరేగింది. పర్యవసానంగా ఇక్కడి ప్రతివస్తువు నిరంతరం మార్పుకు గురవుతూ వుంటుంది. ఆర్థిక, రాజకీయ వ్యవస్థలయినా, పాలకులూ, పాలితుల మధ్య సంబంధాలయినా, చివరికి వైజ్ఞానిక 'యదార్థాల' యినా – అన్నీ మార్పుకు లోనవుతుంటాయి. ఇలాంటి పరిస్థితిలో మార్గంచూపే ఏ వెలుగూ కానరాని అంధకారమయమయిన భయంకర జగత్తులో మనిషికి ప్రాప్తమయ్యేవి శాశ్వత అశాంతి, వ్యాకులతలు తప్ప మరేం కాగలవు? ముఖ్యంగా మనిషి జీవితపు కనికరంలేని సమస్యల వలయంలో చిక్కుకుని బిత్తరపోయినప్పుడు ఆశ్రయించడానికి, ఓదార్పును ధైర్యాన్ని పొందడానికి ఓ ఉన్నత అస్తిత్వపు భావన కూడా లేనటువంటి వాతావరణంలో ఈ విషయం ఎంత జటిలంగా రూపొందుతుందో ఆలోచించండి.

మతం, కేవలం మతం మాత్రమే ప్రపంచానికి అది కోల్పోయిన శాంతి సుఖాలను అందజెయ్యగలదు. అది మనిషి ఆంతర్యంలో మంచిపట్ల ప్రేమను సృజించి, చెడుకు, దౌర్జన్యానికి వ్యతిరేకంగా పర్వతంలా నిల్చునే ధైర్య సాహసాలను ప్రసాదిస్తుంది. మనిషి తన ప్రభువు, తన స్వామి తన ఎడల ప్రసన్నుడవ్వాలని కోరితే, చెడు ఆధిక్యతను, దాని అధికార విగ్రహాన్ని పిండి పిండి చేసి భువిలో కేవలం తన ప్రభువు అధికారాన్ని స్థాపించాలని అది అతనికి బోధిస్తుంది. ఆ మార్గంలో ఎదురయ్యే సకల కష్ట నష్టాలను సహనస్థయిర్యాలతో ఎదుర్కోవాలని, కేవలం పరలోక ప్రతిఫలం మాత్రమే దృష్టిలో పెట్టుకోవాలని అది అతన్ని ప్రేరేపిస్తుంది. అయితే నేడు ప్రపంచానికి భద్రత, తృప్తి, శాంతి, ప్రశాంతతలు – ఒక్క మాటలో చెప్పాలంటే మతం అవసరం లేదా?

## మతం లేకుండా

మతం లేకుండా జీవితానికి అసలు అర్థమేలేదు. మతం యొక్క

ప్రత్యేకత పరలోక భావన. ఈ విశ్వాసం ద్వారా భూలోకాన మానవ జీవితం కొత్త పరిధుల్ని ఆవిష్కరిస్తుంది, సరికొత్త అంచుల్ని అందుకుంటుంది. మానవుని ముందు అవకాశాలు కొంగ్రొత్త రూపుధరించి ప్రత్యక్షమవుతాయి. ఇవే లేకపోతే మనిషి, శూన్యభావం, న్యూనతాభావాల వ్యథాభరితమయిన అనుభూతివల్ల తానే క్రుంగి పోతాడు. మరణానంతర జీవితాన్ని తిరస్కరించడమంటే మనిషి మొత్తం జీవన వ్యవధిని తగ్గించి అతని వయసులోని పెద్దభాగాన్ని అతున్నుండి దూరం చెయ్యడమే. తద్వారా అతన్ని అతని గుడ్డి కోరికల చేతుల్లో, మూఢనమ్మకాల దయలేని కోరల్లో వదలడమే. ఆ తరువాత మానవుడు తన గొంతెమ్మ కోరికల పరిపూర్తిలో పడి తానే స్వయంగా గల్లంతయిపోతాడు. ఇక అతని కృషికి లక్ష్యం ఒక్కటే: ఏ మేరకు సుఖభోగాలను జుర్రుకోగలిగితే ఆ మేరకు అనుభవించాలి, మరెవరినీ ఆ భోగభాగ్యాల్లో భాగం పంచివ్వకూడదు అన్నది. అప్పుడే ఈర్ష్యాద్వేషాలు, మృగప్రాయమయిన పోరాటాలు, యుద్ధాలు జన్మ నెత్తుతాయి. ఎందుకంటే కోరికల దాసుల ఈ లోకంలో ప్రతిఒక్కడూ వడ్డించిన ఈ విస్తరిని చేతనయినంతవరకు తనకే సొంతం చేసుకోవాలని కోరుకుంటాడు. జీవితం పరిమితం గనుక వీలయినంత తక్కువ వ్యవధిలో వీలయినంత ఎక్కువ ప్రయోజనం తానే పొందాలని కాంక్షిస్తాడు. అతనికి మరే ఉన్నత శక్తి భయమూ ఉండదు. ఎందుకంటే ఈ లోకానికి దేవుడు ఎలాగూ లేడు, న్యాయబద్ధమయిన వ్యవస్థ, శిక్షించేనాధుడు అంతకన్నా లేడు.

పరలోక భావనలేని మనిషి ఆలోచనలు, అనుభూతులు అధఃపాతాళానికి దిగజారిపోతాయి. అతని ఆలోచనలకు ఔన్నత్యం ఉండదు; అతని లక్ష్యాలు ఆచరణా విధానాలు అన్నీ సంకుచిత దృష్టికీ, సాహసరాహిత్యానికీ తార్కాణాలయి నిల్చుంటాయి. మానవాళి శాశ్వతంగా పోరాట నిలయంగా మారిపోతుంది. ఆ తరువాత మనిషికి, ఉన్నత జీవన లక్ష్యాలకై కృషిచేసే అవకాశమే ప్రాప్తం కాదు. అలాంటి లోకంలో ప్రేమానురాగాలు, దయాసానుభూతులకే చోటు కొరవడుతుంది. భౌతిక రుచుల కాంక్ష, కోరికల ఆధిక్యత మనిషిని లోబరచుకుంటాయి. అతడు

జీవితపు ఉన్నత ప్రమాణాలకు, ఉత్తమ భావాలకు విలువనిచ్చే స్థితిలో ఉండడు.

## మానవునిలో ఆశాజ్యోతి

భౌతికవాదాన్ని ఆశ్రయించిన మనిషికి కొన్ని భౌతిక లాభాలు ఒనగూడుతాయనడంలో సందేహంలేదు. కాని నిజానికి భౌతికవాదం ఓ అభిశాపం లాంటిది. దాని కారణంగా, ప్రాప్తమయ్యే ఆ కొన్ని ప్రయోజనాలు సయితం నిరర్థక మయిపోతాయి. ఆ భౌతిక ప్రయోజనాల కొరకు మనిషి గుడ్డివాడయి పోతాడు; తోటి మానవ సోదరులతో నిరంతర ఘర్షణకు సమాయత్తమవుతాడు; ఆశామోహాలు, ఈర్ష్యాద్వేషాలు, సుఖభోగలాలసత్వాల తీవ్రమయిన భావాల తాకిడిని అతడు తట్టుకోలేడు. అతడు ఏనాటికీ వాటి బారినుండి తప్పించుకోలేడు.

ఏ జాతులయితే భౌతికవాదపు మార్గాన్ని అవలంబిస్తాయో అవి శాశ్వతంగా ఓ విధమయిన అంతర్ యుద్ధానికి గురయి ఉంటాయి. పర్యవసానంగా జీవన వ్యవస్థే ఛిన్నా భిన్నమయి పోతుంది. సైన్సు, అది సృష్టించిన భయంకర ఆయుధాలు మానవజాతి సేవకు బదులుగా దాని వినాశానికి ఉపయోగపడతాయి.

భౌతికవాదం మనిషియొక్క సంకుచిత దృష్టి మూలంగా ఉనికిలోకి వచ్చిందే. దాని చెడులనుండి తప్పించుకోడానికి మానవ మానసిక పరిధుల్ని విస్తృతపరచవలసి ఉంటుంది. ఇది కేవలం మతం మూలంగానే సాధ్యమవుతుంది. కేవలం మతం మాత్రమే మానవతకు కొత్త పరిధుల్ని, సరికొత్త ఔన్నత్యాలకు అందజెయ్యగలదు. ఎందుకంటే మతం దృష్టిలో జీవితమంటే ఈ ప్రపంచంలోనే పరిమితం కాదు; దీని తరువాత కూడా జీవితం అనంతకాలం వరకు కొనసాగుతుంది. ఈ విశ్వాసం మనిషి అంతర్యంలో ఆశాజ్యోతుల్ని వెలిగిస్తుంది. అతన్ని చెడుకు, అన్యాయానికి,

అత్యాచారానికి, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా దృఢంగా నిల్చోడానికి వాటిని ధైర్యంగా ఎదుర్కోడానికి సాహసాన్ని ప్రసాదిస్తుంది. మానవులంతా తనకు సోదరులే అన్న భావం అతనిలో సృజిస్తుంది. ప్రేమ, సానుభూతి, విశ్వజనీన సోదరభావాల ఈ బోధనలు మానవాళిని శాంతి, సౌభాగ్యాలకు, నిజమయిన సంక్షేమం, ప్రగతీ వికాసాలతో సుసంపన్నం చేస్తాయి. ఈ యదార్థాలు ముందుంచుకుని కూడా మతం మానవుల అనివార్యమయిన ఆవశ్యకత కాదని ఎవరనగలరు? లేక మనిషి శతాబ్దాలకు పూర్వంలా నేడు కూడా మతావశ్యకతను కలిగిలేడని ఎవరనగలరు? మనిషిని జీవనరంగంలోని ఎనలేని సమస్యల్ని ఎదుర్కునేందుకు మతం ఏ విధంగా నయితే సమాయత్తపరుస్తుందో ఆ విధంగా మరేశక్తీ మనిషిపై ప్రభావం చూపజాలదు.

మతం మనిషికి, తనకోసం కాకుండా ఇతరుల కోసం బ్రతకడాన్ని నేర్పుతుంది. అతనికి పవిత్రమయిన, ఉన్నతమయిన జీవనలక్ష్యాన్ని ఇస్తుంది. ఆ లక్ష్య సాధనలో కష్టనష్టాలను చిరునగువుతో ఎదుర్కోవడాన్ని నేర్పుతుంది. మనిషి మతం ప్రసాదించిన విశ్వాసం, నమ్మకాలను కోల్పోయ్యాడంటే అతడు తన సొంత విషయం తప్ప మరేదాన్నీ చూడలేడు. అతని జీవితమంతా స్వార్థం, స్వప్రయోజనం, స్వార్థప్రియత్వాలకు ప్రతీకగా రూపొందుతుంది. అతనిలోనూ అడవిమృగాల్లోనూ ఎలాంటి తేడా కానరాదు. అసంఖ్యాక మానవులు, సత్యంకొరకు, ఉన్నత ఆశయం కొరకు జీవితాంతం పోరాడుతూ గడిపారని, వారు తమ ప్రాణం సయితం ఆ ఆశయసిద్ధికై అర్పించారని చరిత్ర తెలుపుతుంది. ఆ వ్యక్తులకు, వారుచేసిన కృషికి ప్రతిఫలంగా ఎలాంటి భౌతిక ప్రయోజనం ఒనగూడలేదన్నది కూడా యదార్థమే. అయితే ఇప్పుడు ఒక ప్రశ్న. ఈ మహనీయులంతా ఈ పోరాటాన్ని కొనితెచ్చుకోడానికి, పర్యవసానంగా భౌతిక విజయం పొందకపోవడం అలా ఉంచి, తమ వద్ద ఉన్నది కాస్తా సంతోషంగా కోల్పోవడానికి వారిని ప్రేరేపించిన విషయం ఏమిటి? దీనికి సమాధానం ఒక్కటే - విశ్వాసం! ఆ పవిత్రజీవుల ఉనికి ఈ విశ్వాసం సాధించిన అద్భుతం. దీనికి భిన్నంగా దురాశ, వ్యామోహం, కాపట్యం, స్వార్థం,

విద్వేషం, వైషమ్యం - ఇవన్నీ ఎంతో క్షుద్రమయిన భావాలు. వీటిద్వారా నిజమయిన, సుస్థిరమయిన విజయం అన్నది ప్రాప్తం కాజాలదు. వీటి పై పై మెరుగులు తాత్కాలిక మయినవే. వీటి ప్రభావానికి లోనయి మనిషి సత్వరమే ప్రాప్తమయ్యే ప్రయోజనాలను కాంక్షిస్తాడు. దీని కారణంగా మనిషిలో ఆరోగ్యవంతమయిన శీల నిర్మాణం కాజాలదు. ఇంకా అతనిలో ఓ ఉన్నత ఆశయసిద్ధికై ప్రాపంచిక సుఖాలను త్యాగంచేసి సహన స్థయిర్యాలతో సుదీర్ఘ కాలంవరకు నిరంతర కృషి సలిపే ఉత్తేజమూ పెంపొందదు.

## పునాదులు వేరయితే.....

కొందరు "సంస్కర్త" లనబడే వారు ప్రేమకు బదులు ద్వేషం ద్వారా ప్రపంచాన్ని "సంస్కరించాల" ని ప్రయత్నిస్తున్న విషయం మనకు తెలుసు. ద్వేషమే వారి ఊపిరి. దాని ద్వారానే వారు శక్తినీ, భుక్తినీ పొందుతుంటారు. దీని ఆధారంగానే వారు కష్టనష్టాలు అలుముకున్నప్పుడు సాహసంతో, అచంచల ధైర్య స్థయిర్యాలతో తమ 'సంస్కరణాకార్యాన్ని' కొనసాగిస్తూ ఉంటారు. ఈ విద్వేష దేవతా పూజారుల ద్వేషానికి లక్ష్యం, గురి వీరి కళ్ళు తెరచిన మానవ జాతియొక్క ఒక ప్రత్యేక వర్గమూ కావచ్చు, ప్రత్యేక చారిత్రక యుగమూ కావచ్చు, లేదా మొత్తం మానవాళియే కావచ్చు! ఇంతకు, మానవత అంటే గిట్టని ఈ సంస్కర్తల వర్గం కొన్ని లక్ష్యాలను సాధించుకోవడం కూడా సాధ్యమే. ద్వేషంలోని ఉత్తేజం, దాని దహనగుణం, అందులోని సహజమయిన దౌర్జన్యం, అత్యాచారాలు - వీటి మూలంగా ఈ వర్గంలోని వ్యక్తులు తమ లక్ష్యసాధనలో స్థిర చిత్తాన్నీ ప్రదర్శించవచ్చు; అనేక విధాల నష్టాలనూ భరించవచ్చు. అయితే ఏ విశ్వాసం పునాదుల్లోనయితే ప్రేమకు బదులుగా ద్వేషం స్థానమేర్పరచు కుంటుందో దాని ద్వారా మానవతకు ఎన్నడూ మంచి అన్నది జరగజాలదు. దీనిద్వారా సమాజంలోని కొన్ని చెడులు, కొన్ని అన్యాయాలు కొంతవరకు దూరం కావచ్చు. కాని ఇది మానవుల్లోని ఈ రుగ్మతల్ని సమూలంగా,

శాశ్వతంగా నిర్మూలించజాలదు. ఈ కారణం చేతనే సమాజంలోని చెడుల నివారణకై తీసుకునే కొన్ని "సంస్కరణాత్మక" చర్యల మూలంగా అవి తగ్గడానికి, అదుపులోకి రావడానికి బదులుగా అవి ఎన్నో రెట్లు పెరుగుతూనే ఉన్నాయి.

దీనికి భిన్నంగా, ఏ విశ్వాసమయితే త్వరితంగా ప్రాప్తమయ్యే ప్రాపంచిక ప్రయోజనాలను లక్ష్యంగా పరిగణించదో, ద్వేష వైషమ్యాలు దేనికయితే పునాదులు కావో, మరేదయితే మనుషుల్లో ప్రేమ, సోదరత్వం, త్యాగం, తోటి సోదరుల కోసం ప్రాణమయినా సరే పణంగా పెట్టే ఉత్తమ భావాలను పెంపొందిస్తుందో వాస్తవానికి అలాంటి విశ్వాసమే మానవాళిని నిజమయిన, సుస్థిరమయిన సౌభాగ్యాలతో సుసంపన్నం చేస్తుంది. అదే సుఖవంతమయిన భవిష్యత్తుకు, ప్రగతికి సోపానాలు నిర్మిస్తుంది. ఈ విశ్వాసానికి మూలం దైవ విశ్వాసం, దైవప్రేమ. ఇది మనిషి యొక్క వైయక్తిక జీవితంలో పవిత్రతను సృజిస్తుంది. వ్యక్తులు తమ కర్తతో సామీప్యం పొందే మార్గం చూపుతుంది. కాని పరలోక విశ్వాసం లేనిదే దైవ విశ్వాసం, దైవ ప్రేమలకు అర్థమే లేదు. పరలోక భావన మనిషికి ఓ విధమయిన భద్రతా అనుభూతిని కలుగజేస్తుంది. అది మనిషికి అనంత జీవితపు శుభవార్తనిస్తుంది. తద్వారా మనిషికి, తాను తనువు చాలిస్తే అంతమయిపోతానన్న భీతి తొలిగిపోతుంది. జీవనరంగంలో తాను సలిపిన నిరంతరకృషి నిష్ఫలం కాదనీ, తన జీవన సమరానికి ప్రతిఫలం ఇహలోకంలో దొరక్కపోయినా రాబోయే జీవితంలోనయితే తప్పక ప్రాప్తమవుతుందని మనిషికి హామీ లభిస్తుంది.

ఇవి కేవలం దైవ విశ్వాసం, పరలోక విశ్వాసాల మూలంగా ఒనగూడే కొన్ని సుమధుర ఫలాలు. ఇస్లాం వీటితో ఆగదు. అది ఇంకా సుదూర తీరాలకు తీసుకు వెడుతుంది. ఇంకా ఎన్నో సుందరవనాలను సందర్శింప జేస్తుంది. ఇంపయిన గాథలను వినిపిస్తుంది.

## అపార్థం

ఎవరయితే ఇస్లాంను గతించిపోయిన గాథగా భావిస్తారో, ఇంకా నేటి కాలంలో దాని ప్రయోజకత్వాన్ని, ఆవశ్యకతను కాదనీ అంటారో వారు అసలు ఇస్లాం నిజ ఆశయం ఏమిటో ఎరుగరు. జీవితంలో దాని పాత్ర ఏమిటో వారికి తెలియదు. బాల్యంలో సామ్రాజ్యవాదుల ఏజెంట్లు పాఠ్యపుస్తకాల్లో దేన్నయితే నేర్పారో దాన్నే వారు నేటికీ చిలకలా అప్పచెబుతున్నారు. వారి అభిప్రాయంలో ఇస్లాం రాకకు ముఖ్యోద్దేశం: "మానవుల్ని విగ్రహారాధననుండి విముక్తి కలిగించడం. పరస్పరం సదా కలహించుకునే అరబ్బు తెగల్ని కలిపి, ఏకం చేయడం; మద్యపానం, జూదం, బాలికా సంహారం ఇత్యాది చెడుగుల నుండి వారి ప్రక్షాళన చెయ్యడం. ఇంకా ఇస్లాం అరబ్బుల అంతర్గత కలహాలను అంతం చేసి వారి శక్తి సామర్థ్యాలు వ్యర్థం కాకుండా కాపాడింది. తరువాత ఆ శక్తిని ప్రపంచంలో తన సందేశవ్యాప్తికై వినియోగించింది. ముస్లిములు ఈ ఆశయ సిద్ధికై ఇతర జాతులతో పోరాడటం కూడా తటస్థించింది. పర్యవసానంగా నేడు కనిపిస్తున్న సరిహద్దులతో ఇస్లామీయ జగత్తు ప్రపంచపటంలో వెలిసింది." ఇదీ వారి ప్రకారం ఇస్లాం ధ్యేయం. ఇంకావారు ఇలా అంటారు: "అదో చారిత్రక ధ్యేయం. అది పూర్తయిపోయింది. ప్రపంచంలో విగ్రహారాధన అంతమయిపోయింది. అరబ్బు తెగలు గొప్పగొప్ప జాతులుగా రూపొందాయి. అందువల్ల ఇప్పుడు ఇస్లాం ఆవశ్యకత ఏ మాత్రం లేదు. ఎందుకంటే, మద్యపానం జూదం విషయంలో, సంస్కృతీ సభ్యతలు అభివృద్ధిచెందిన ఈ రోజుల్లో ఎలాంటి ఆంక్షలు విధించడమూ సాధ్యం కాదు."

ఒక్కమాటలో చెప్పాలంటే వారి దృష్టిలో "ఇస్లాం ఓ ప్రత్యేక కాలానికి ఎంతో అనువయిన జీవనవ్యవస్థగా అలరారింది. కాని నేడు ప్రపంచం ఎంతో ప్రగతి సాధించింది. దాని మార్గదర్శకత్వపు ఆవశ్యకత ప్రపంచానికి ఏ మాత్రం లేదు. అందువల్ల మార్గదర్శకత్వం కొరకు దాన్ని

అర్థించే బదులు ఆధునిక దృక్పథాలు, సరికొత్త జీవన తత్వాలద్వారా మార్గం చూపే వెలుగును అరువు తెచ్చుకోవాలి. అందులోనే మన మోక్షం, సాఫల్యం ఇమిడి ఉన్నాయి."

పడమటిగాలి సోకిన తూర్పునాటి పెద్దమనుషులు, ఈ విధంగా తమ గురువులు బోధించిన వాక్యాలు చిలకల్లా అప్పజెప్పి అనాలోచితంగా తమ సంకుచిత దృష్టిని, అవివేకాన్నీ బట్ట బయలు చేసుకుంటున్నారు. పాపం, వీరు ఇస్లాం అంటే ఏమిటో ఎరుగరు, జీవితంలో దాని వాస్తవ పాత్ర ఏమిటో అంతకన్నా ఎరుగరు. అందువల్ల ముందుకు సాగడానికి పూర్వం ఇస్లాం అంటే ఏమిటో, అసలు దాని సందేశం ఏమిటో, ఏ ఆశయానికై అది పిలుపు నిస్తుందో చూడటం మంచిది.

## విమోచనం

ఒక్క వాక్యంలో చెప్పాలంటే, బానిసత్వపు ప్రతిభావన నుండి విముక్తిని పొందడమే ఇస్లాం అంటే. ఏ విధమయిన బానిసత్వమయినా మానవ ప్రగతికి ప్రతిబంధకంగానే పరిణమిస్తుంది, మానవాళికి రుజుమార్గాన్ని మంచిమార్గాన్ని అనుసరించ నివ్వదు. ఇస్లాం అంటే స్వాతంత్ర్య ప్రకటన. బలాత్కారం, దౌర్జన్యం, జులుం, నిరంకుశత్వాల నుండి స్వాతంత్ర్యం. ప్రజల ధన, మాన, ప్రాణాలు, ఆత్మాభిమానం, ఆత్మవిశ్వాసం – అన్నింటినీ దోచుకుపొయ్యే నియంతల బారినుండి విమోచనం. ఇస్లాం మానవులకు బోధించేదేమిటి? సర్వాధికారాలకు నిజస్వామి కేవలం దైవం మాత్రమే. ఆయనే మానవుల నిజమయిన పరిపాలకుడు; మానవులంతా జన్మతః ఆయన పాలితులు; ఆయనే మానవుల విధాత; ఆయన ఇష్టానికి వ్యతిరేకంగా ఎవరూ ఎవరికీ ఎలాంటి లాభమూ చేకూర్చలేరు లేక ఏ విపత్తునూ, కష్టాన్నీ దూరం చెయ్యలేరు. ప్రళయదినాన ఆదినుండి అంతంవరకు జన్మించిన మానవులందరూ ఆయన సమక్షంలో హాజరవుతారు. ఆయన వారిలోని ప్రతి ఒక్కరి జీవన కర్మపత్రాన్ని

పరిశీలిస్తాడు. ఇస్లాం నేర్పే ఈ బోధనలు మనిషిని భయభ్రాంతులు, అన్యాయం, జులుం, దోపిడీలనుండి విముక్తం చేస్తాయి.

అంతేకాదు ఇంకా ముందుకుపోయి, ఇస్లాం మనిషికి కోరికల దాస్యంనుండి, మనోవాంఛల బానిసత్వం నుండి స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. చివరికి, జీవించే ఉండాలన్న బలమయిన కోరికపట్ల కూడా నిరపేక్షతను జనింపజేస్తుంది. ఈ 'ప్రాణం తీపి' బలహీనతను వాడుకునే దౌర్జన్యపరులయిన పాలకులు నిత్యం, అక్రమంగా ఇతర మనుషుల్ని తమకు కట్టు బానిసలుగా చేసుకున్నారు. మనిషిలో బలహీనతే లేకపోతే అతడు ఎవరి దాస్యాన్నయినా సరే ఏనాడూ స్వీకరించే వాడూ కాడు, అన్యాయం చేసే పైశాచిక శక్తుల విలయతాండవాన్ని సహించే వాడూ కాడు. అన్యాయం, అక్రమాలముందు తలవంచి బ్రతికే బదులు వాటిని సాహసంగా ఎదిరించి చావడం మేలని బోధించి ఇస్లాం, మానవాళికి మహోపకారం చేసింది. దివ్యఖుర్ఆన్ ప్రబోధం :

> "ఓ ప్రవక్తా! వారితో చెప్పివెయ్యండి, ఒకవేళ మీ తండ్రులు, మీ కుమారులు మీ సోదరులు, మీ భార్యలు, మీ బంధుమిత్రులు, మీరు సంపాదించిన ధనరాసులు, మందగిస్తుందని మీరు భయపడుతున్న మీ వ్యాపారం, మీకు ఎంతో ఇష్టమయిన మీ గృహాలు, మీకు దైవం, ఆయన ప్రవక్త, ఆయన మార్గంలో కృషి సలపడం కన్నా ప్రియతమమయినవయితే – నిరీక్షించండి – అల్లాహ్ తన నిర్ణయాన్ని ప్రకటించే వరకు! నిశ్చయంగా అల్లాహ్ దౌర్జన్యపరులకు మార్గం చూపడు". (9:24)

సత్యం, సదాచారం, సానుభూతి, దైవమార్గంలో కృషి – అంటే జీవితపు సకల ఉన్నత పవిత్ర లక్ష్యాల కొరకు జిహాద్ లేక నిరంతర కృషి – కి మారుపేరే 'దైవప్రేమ'. దీన్నే మనిషియొక్క అంతులేని కోరికలకు, మనోకాంక్షలకు ఎదురుగా నిలుపుతుంది ఇస్లాం. ఈ కోరికల్ని దైవప్రేమకు లోబడి ఉంచాలని బోధిస్తుంది. గుడ్డికోరికల కళ్ళెంలేని గుర్రాన్ని దైవప్రేమ

ద్వారా అదుపులోకి తేవడాన్ని నేర్పుతుంది. జీవితంలో కేవలం దైవప్రేమకే ఆధిక్యత ఉండాలని, అదే అసలు కర్తృత్వశక్తిగా నెలకొనాలని కోరుతుంది. ఈ భాగ్యానికి నోచుకోని వ్యక్తి అసలు ముస్లిం కాజాలడు.

## జీవితాశయం

ఆశామోహాలకు, మనోకాంక్షలకు దాసుడయిన ఒక వ్యక్తి తన హ్రస్వదృష్టి కారణంగా, ఇతరులకంటే తన జీవితం ఎక్కువగా ఫలవంతమయిందని, సుఖసంతోషాలతో సౌభాగ్యాలతో విలసిల్లుతోందని భ్రమకు లోనవ్వడం సాధ్యమే. కాని ఈ తప్పుడు భావనకు శిక్ష అతడు అనతికాలంలోనే అనుభవించవలసి ఉంటుంది. అతడు ఏమరుపాటునుండి మేల్కొన్నప్పుడు, తాను మనోకాంక్షలకు కట్టు బానిస అయిన సత్యాన్ని గుర్తిస్తాడు. అలాంటి వ్యక్తికి అనంత శూన్యం, అంతులేని నిరాశా నిస్పృహలు, అంతంకాని అశాంతి తప్ప మరేదీ మిగలదు. ఎందుకంటే మనిషి ఒకసారి తన మనోకాంక్షల సన్నిధిలో మోకరిల్లాడంటే మరెప్పుడూ వాటిపై అదుపును సాధించలేడు. ఇంకా, కోరికలు ఎంతగా బలిసిపోతుంటాయో వాటి దాహం కూడా అంతే పెరుగుతూ పోతుంది. చివరికి మానవులు, పశుత్వపు నీచాతినీచ స్థాయికి దిగజారిపోతారు. రుచులు మరిగి వాటిలో ఎంతగా తేలియాడుతూ ఉంటారంటే, వారికి మరే వస్తువు స్పృహ కూడా ఉండదు. జీవితం పట్ల ఇలాంటి వైఖరి మానవాళిని ప్రగతి వైపుకు – అది భౌతిక ప్రధానమయినదయినా ఆధ్యాత్మిక మయినదయినా – గొనిపోజాలదు. ఏ విధమయిన ప్రగతి సాధించాలన్నా మనిషి తన పాశవిక కాంక్షల దాస్యం నుండి విమోచనం పొందడం మొదటి షరతు. ఆ తరువాతనే వైజ్ఞానిక, కళాత్మక, ధార్మికరంగాల్లో దేనిలోనయినా ప్రగతి అన్నది సాధ్యమవుతుంది.

అందువల్లనే ఇస్లాం, కాంక్షల దాస్యంనుండి విమోచనానికి ఎంతో ప్రాముఖ్యాన్నిచ్చింది. అయితే దానిగ్గాను సన్యాసత్వం వహించాలని అది కోరదు, లేక పరిశుద్ధమయిన వాటిని అనుభవించరాదని ఆంక్షలూ

విధించదు. ఈ అతివాదాలను కాదని అది మధ్యేమార్గాన్ని ఎన్నుకుంటుంది. ఇస్లాం మనిషికి తెలిపేదేమంటే ఈ ప్రపంచం నీ కొరకేకాని నీవు మటుకు ఈ ప్రపంచం కొరకు కాదు. అందువల్లనే రుచులు మరగడం, కోరికల దాస్యం, మనిషి స్థాయికంటే ఎంతో అధమమయినవి. ఈ ప్రాపంచిక సరంజామా అంతా మనిషికి ప్రసాదించడానికి కారణం మనిషి వీటి ద్వారా తన ఉన్నత జీవితాశయాన్ని సాధించాలన్నదే. మానవుని జీవితాశయం, మానవాళికి పరిపూర్ణత సిద్ధింపజేసే దైవమార్గదర్శకత్వపు వెలుగును - దైవధర్మాన్ని - మానవులందరి మధ్యనే సర్వవ్యాప్తం చెయ్యడం తప్ప మరేమీకాదు.

ఇస్లాం దృష్టిలో మానవ జీవితానికి రెండు స్పష్టమయిన లక్ష్యాలున్నాయి. ఒకటి ప్రతి మనిషికి అతని వ్యక్తిగత జీవితంలో, పరిశుభ్రమయిన, పరిశుద్ధమయిన జీవితం గడిపేందుకు అవసరమయిన వస్తుసామగ్రి లభించాలన్నది. రెండవది, సామూహికరంగంలో, అతని శక్తి సామర్థ్యాలన్నింటినీ, మానవాళియొక్క సామాన్య ప్రగతి వికాసాలకు వినియోగించే ఓ ఉత్తమ సమాజం ఉనికిలోకి రావాలన్నది; తద్వారా మానవ నాగరికతా మహా ప్రస్థానం, ఇస్లాం వెలుగుబాటపై సాఫీగా కదలిపోవాలన్నది; వ్యక్తీ, సమాజాల మధ్య సమతూకం నెలకొని, వీటిలో దేని హక్కులు కూడా భంగపడకుండా పురోగమించాలన్నది.

## భావ స్వాతంత్ర్యం

మానవ చింతనా పథానికి విస్తృత స్వేచ్ఛ నివ్వడంలో, ఇస్లాం, ప్రభావ వంతమయిన శక్తిగా ముందుకు వస్తుంది. ఇస్లాం, గుడ్డి నమ్మకాలకూ మూఢాచారాలకు బద్ధ విరోధిగా సదా నిలిచింది. చరిత్ర గతిలో మానవాళి ఏ ఆలోచన, ఆచరణల మార్గవిహీనతలకూ, వక్రవైఖరులకు లోనవుతూ వచ్చిందో వాటిలో కొన్ని మానవుల కాల్పనిక శక్తిలోనుండి ఉద్భవించిన విషయం యదార్థమే. ఆనాటి ప్రజలకు దాని గురించి బాగా తెలుసు కూడా. కాని కొన్ని వక్రమార్గాల వంశవృక్షం, మనిషి నిర్మించుకున్న 'దేవతా

మూర్తులు' కు చేష్టలతో పోయి కలుస్తుంది. అంటే ఇస్లాంకు పూర్వం మానవచింతనా గమనం చీకట్లలో దారి తెన్నూ లేని విధంగా సాగుతూ ఉండింది. ఇస్లాం ఆవిర్భవించి దానికి ప్రాజ్ఞత, పటిష్ఠతలను ప్రసాదించింది. ఇస్లాం ఆవిర్భావానికి పూర్వం, దేవమాల, గాథలు, ఇస్రాయీలీయుల కట్టు కథలు, క్రైస్తవ కల్పనలు - ఇవన్నీ అపరిపక్వమయిన, అపసవ్యమయిన దృక్పథాలను, ఆలోచనా విధానాలను సృజించాయి. వీటినుండి, వీటిరూపంలో ప్రపంచాన వ్యాప్తిచెందిన అంధవిశ్వాసాలు, మూఢాచారాలనుండి మానవచింతనకు విమోచనం ప్రసాదించింది ఇస్లాం. మరోసారి మానవుల్ని వారి నిజధర్మం సమక్షంలో, వారి నిజప్రభువు సన్నిధిలో నిలబెట్టింది.

ఇస్లాం ప్రత్యేకత ఏమిటంటే దాని పరిభాష బోధనలు ఎంతో సాధారణమయినవి, సరళమయినవి, సుబోధకములయినవి. ఇందులో మింగుడు పడని విషయాలు లేవు చిక్కు వీడని ముడులూ లేవు. దీన్ని అర్థం చేసుకోవడమూ కష్టంకాదు, దాన్ని గ్రహించి గుర్తించి విశ్వసించడమూ అసాధ్యం కాదు. ఇస్లాం కోరేదేమంటే, మనిషి తన సహజ శక్తి సామర్థ్యాలను పరిపూర్ణంగా వినియోగించి తనచుట్టూ వ్యాపించి ఉన్న జీవనకళ, విశ్వ వ్యవస్థలను గురించి ఇతోధికంగా జ్ఞానం సముపార్జించాలి. ప్రకృతి రహస్యాలను కనుగొనాలి. ఎందుకంటే ఇస్లాం మౌలికంగా, హేతువుకూ మతానికీ, ఆ మాటకు వస్తే సైన్సుకూ మతానికీ సహజంగానే రాజీ కుదరదని, వైరం, వైషమ్యం ఉందన్న విషయాన్ని అంగీకరించదు. దైవ విశ్వాసం అంటే అర్థంకాని, చిక్కులతో కూడుకున్న నమ్మకాలను, దృక్పథాలను మనిషి విశ్వసించాలన్న కట్టడి కూడా అదిపెట్టదు. అదే విధంగా వైజ్ఞానిక యదార్థాలను నమ్మడానికి తప్పనిసరిగా దైవాన్ని తిరస్కరించి నాస్తికతను అవలంబించవలసిన అవసరముందని కూడా అది మనిషిని బలవంత పెట్టదు. అంతేకాదు ఇస్లాం మనిషికి విస్పష్టంగా చెబుతుంది: ఈ ప్రపంచంలో మనిషికి లభ్యమయిన వస్తు సామగ్రి అంతా దైవం తన అపార కరుణానుగ్రహాలతో ప్రసాదించినవే. అందువల్ల మనిషి తన వైజ్ఞానిక పరిశోధనల ద్వారా ఏ కొంగ్రొత్త నిధుల్ని కనుగొంటాడో ఏ ప్రయోజనాలు పొందుతాడో అవి కూడా వాస్తవానికి ఆ పరమ కృపాలుని అనంతకారుణ్య కటాక్షాలకు

ఓ నిదర్శనం మాత్రమే. అందువల్ల మనిషి ఆయనకు కృతజ్ఞుడయిన దాసునిగా మెలగాలి. ఇంకా ఇతోధికంగా కృషి జరిపి చిత్తశుద్ధి, త్యాగనిరతి గల దాసునిగా ఆ ప్రభువు సమక్షంలో నిరూపించుకోవాలి. ఇస్లాం, విజ్ఞానాన్ని, సైన్సును, చెడుగా, దైవ విశ్వాసానికి ప్రతికూలమయిందిగా లేక దానికి భిన్నమయిందిగా భావించదు. దానికి బదులుగా విజ్ఞానం దైవ విశ్వాసంలో విడదీయరాని భాగంగా పేర్కొంటుంది.

పైన పేర్కొన్న సమస్యల పరిష్కారాలను మనిషి నేటికీ కనుగొనలేక పోతున్నాడు. ఉన్నతమయిన మానవ ఆశయాలు ఇంకా సిద్ధించలేదు. మనిషి నేటికీ అనేకానేక విధాలుగా అవకతవకలకు గురవుతున్నాడు. ఎన్నో రీతులుగా వంచనలకు లోనవుతున్నాడు. నిరంకుశ పాలకులు, నియంతల మధ్య నేటికీ ఊపిరి సలపని వాతావరణంలో మనిషి జీవిస్తున్నాడు. మానవత వారి అన్యాయాల, అక్రమాల క్రింద ఇంకా ఆక్రందన చేస్తూనే ఉంది. మానవత అన్నింటా, పశు ప్రాయమయిన కోరికలు, రుచులకు దాసోహమంటున్నది. అందువల్లనే మానవునికి మార్గదర్శకత్వం వహించడంలో ఇస్లాం ఇంకా ఎంతో ఉజ్వలమయిన పాత్ర నిర్వహించవలసి ఉంది.

## కొత్త దేముడు

నేటికీ ప్రపంచ జనాభాలో సగభాగం పూర్వకాలంలోనే విగ్రహారాధనలో మునిగి తేలుతోంది. భారతదేశం, చైనా, ఇంకా ప్రపంచంలో అనేక దేశాలను ఈ సందర్భంలో పేర్కొనవచ్చు. మిగతా ప్రపంచం కూడా అత్యధిక భాగం మరో మిథ్యా దైవం ఆరాధనా బంధాల్లో చిక్కుకుని ఉంది. ఈ కొత్త మిథ్యా దైవం మానవచింతన, భావనాలోకంలో అలజడి రేపడంలో తక్కువ తిన్నదేమీకాదు. ఈ సరికొత్త దైవమే ఆధునిక విజ్ఞానశాస్త్రం.

సైన్సు శక్తివంతమయిన సాధనం. దీని దృష్ట్యా ఇంతవరకు అది సాధించిన ఘనకార్యాల పట్టిక కూడా ఎంతో ఘనంగానే ఉంది. కాని ఈ ప్రకాశవంతమయిన విజయాలన్నీ పాశ్చాత్యులు చేసిన ఓ ఘోరమయిన పొరపాటు కారణంగా నిరాశా నిస్పృహలుగా మారిపొయ్యాయి – వారు సైన్సును 'దైవం' స్థానంలో ప్రతిష్ఠించారు. దాన్ని మనిషియొక్క భక్తి ప్రతిపత్తులకు, విధేయతా స్వయం సమర్పణలకు ఏకైక కేంద్రంగా ప్రకటించారు. పాశ్చాత్యులు చేసిన ఈ ఘోరమయిన పొరపాటుకు ఫలితంగా వారు అనుభవాత్మక (EMPIRICAL SCIENCE) సైన్సు యొక్క పరిశీలనల పరిమిత సాధనాలు తప్ప అపార విజ్ఞానానికి సాధ్యమయిన అనేక మార్గాలకు దూరమయ్యారు. మానవత తన ఆశయానికి, గమ్యానికి ఇంకా చేరువ కావలసిందల్లా పోయి అది ఇంకా సుదూరాలకు వెళ్ళిపోయింది. మానవుని ఎదుట, ప్రగతీ వికాసాలకు, కృషికి ప్రాప్తమయిన అవధుల్లేని అవకాశాలు, పాశ్చాత్యుల సంకుచితదృష్టి, భౌతికతా ప్రధానమయిన సైన్సువల్ల జనించే అనివార్యమయిన పరిమితులకు గురయ్యాయి. ఎందుకంటే సైన్సు కేవలం బుద్ధి ఆధారంగానే పురోగమించగలదు. అది మానవత పయనించే ఉన్నత స్థానాలను చేరుకోజాలదు. మానవత బుద్ధి మరియు ఆత్మ రెంటి సహకారాన్నీ పొందుతుంది. అప్పుడే దానికి తన కర్త సామీప్యాన్ని, పరమసత్యం పట్ల ప్రస్ఫుటమయిన చైతన్యాన్ని పొందే అర్హత కలుగుతుంది.

సైన్సు ఆధిక్యతా వాదనను బలపరిచేవారు సైన్సు మాత్రమే జీవితం యొక్క మదిలో ఈ విశ్వం యొక్క రహస్యాలను ఛేదించి మానవునికి పరిచయం చెయ్యగలదని వాదిస్తారు. అందువల్ల వారి ప్రకారం, సైన్సు దేన్నయితే సమర్థిస్తుందో అది మాత్రమే వాస్తవం, సత్యం. మిగతాదంతా అర్థంలేని వ్యర్థం, చెత్త. తమ వాదనా ఆవేశంలో ఈ పెద్దమనుషులు, సైన్సు సాధించిన ఎంతయిన ఘనకార్యాలు ఎన్ని ఉన్నా అది ఇంకా శైశవదశలోనే ఉందన్న వాస్తవాన్ని మరచిపోతూ వుంటారు. ఇప్పటికీ అనేక విషయాల్లో దానికి తెలిసింది బహుస్వల్పం; విశ్వసించ దగనివి ఇంకా ఎన్నో! ఎందుకంటే దాని పరిధి పరిమితమయింది, దాని

పరిశీలన స్థూలమయింది; వాస్తవికత లోతుల్లోకి పోయి పరిశీలించే యోగ్యతే దానికి లేదు. ఇదంతా తెలిసీ, చూస్తూ ఈ మహానీయులు 'ఆత్మ' అన్నదేదీ అసలు లేనే లేదనే పిడివాదాన్ని మటుకు పట్టుకు వ్రేల్లాడుతుంటారు. వీరి దృష్టిలో మనిషి, తన జ్ఞానేంద్రియాల అవధుల్ని దాటి అగోచరమయిన తెరల చాటున ఉన్న ప్రపంచంతో అసలు ఎలాంటి సంబంధమూ పెంపొందించుకోలేడు. ఆ సంబంధం స్వప్నావస్థలోనయినా లేక టెలిపతి (TELEPATHY)* ద్వారానయినా సరే సాధ్యంకాదని అంటారు. ఆధునిక యుగంలో ఆత్మ ఉనికిని కాదనడానికి కారణం ఏ అనుభవమో, ప్రయోగమో, పరిశీలనో ఎంతసేపటికీ కాదు. అసలు కారణం అనుభవాత్మక విజ్ఞానం, దాని అసంపూర్ణమయిన, అసంగతమయిన, అననుకూలమయిన పరికరాల అసమర్థత మాత్రమే. ఈ లోపాల కారణంగా అది సృష్టి రహస్యాలను కనుగొనడంలో తీవ్రంగా విఫలమయింది. వైజ్ఞానికులు తమ సొంత బుద్ధి వివేకాల ఆధారంగా ప్రపంచంలో ఆత్మకు అసలు స్థానమే లేదన్న నిర్ణయానికి వచ్చారు.

## సామరస్యానికి ఒక్కటే మార్గం

ఇదీ ఆధునిక మానవుడు లోనయి ఉన్న విజ్ఞాన వంతమయిన

---

FN.* :- TELEPATHY అంటే ఓ వ్యక్తి నుండి మరో వ్యక్తికి ఆలోచనల్ని చేరవెయ్యడం. దానికి సంబంధించిన చరిత్ర ప్రసిద్ధమయిన దృష్టాంతం బహుశా హజ్రత్ ఉమర్ (రజి అన్) కు సంబంధించిందే. ఆయన ఖలీఫాగా ఉన్నకాలంలో ఓసారి జుమా ప్రసంగం సందర్భంలో తన ఉపన్యాసాన్ని విరమించి అకస్మాత్తుగా, వందలాది మైళ్ళదూరాన ఉన్న తన సేనాపతిని సంబోధించి "సారియా! కొండవైపుకు, సారియా కొండవైపుకు" అని కేక వేశారు. హజ్రత్ సారియా వందలాది మైళ్ళ దూరాన్నుండి ఆ మాటలు విని సైన్యాన్ని కొండవైపుకు మరల్చుకు పొయ్యారు. తద్వారా మాటువేసి కూచున్న శత్రుసైన్యం బారినుండి తప్పించుకున్నారు. ఆ తరువాత దానిపై విజయం కూడా సాధించారు. నేడు టెలిపతిని ఓ యదార్థంగా గుర్తించినా ఆధునిక శాస్త్రజ్ఞుడు తన దురభిమానం సంకుచితత్వం వల్ల అందులో 'ఆత్మ' ప్రమేయం ఉందనే విషయాన్ని ఏ మాత్రం ఒప్పుకోడు. దాన్ని అనిర్వచనీయమయిన ఆరవ ఇంద్రియశక్తి యొక్క పనితనంగా చెప్పుకుని తృప్తి చెందడానికి నిష్ఫల ప్రయత్నం చేస్తుంటాడు.

అజ్ఞానం . దీన్నిబట్టి, నేడు ఇస్లాం ఎంత అవశ్యమయిందో అంచనా వెయ్యవచ్చు. ఎందుకంటే దాని ద్వారానే మనిషి ఆధునిక మరియు ప్రాచీన మూఢత్వాల ఊబినుండి విముక్తి పొందగలడు. మానవ బుద్ధీ వివేకాలు, ఆత్మకు నిజమయిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ప్రాప్తం కావాలంటే ఈ విమోచనం అవసరం. కేవలం ఇస్లాం మాత్రమే మతం మరియు సైన్సు యొక్క సంఘర్షణను రూపుమాపి వాటిమధ్య శాంతి, సామరస్యాలను స్థాపించగలుగుతుంది. అప్పుడే నేటి బాధాగ్రస్త ప్రపంచంలో శాంతి సుఖాల సంపదలు వెల్లివిరుస్తాయి. అప్పుడే పాశ్చాత్యుల అవివేకంవల్ల జీవితంలో పొడసూపిన వక్రవైఖరి అంతమయి మనిషి హేతువుకు అతని అంతర్గత ప్రేరణలకు ఏర్పడ్డ వైరుధ్యం దూరమవుతుంది. అప్పుడే మనిషిలోని వైజ్ఞానిక తృష్ణకు, దైవం కొరకు అతని తహతహకు మధ్య సామరస్యం ఏర్పడుతుంది.

## దేవతలూ! తప్పుకోండి

చారిత్రకంగా, ఆధునిక యూరపు సంస్కృతి, రోమను సామ్రాజ్యం ద్వారా ప్రాచీన గ్రీకు సంస్కృతిని వారసత్వంగా తెచ్చుకుంది. ప్రాచీన గ్రీకు సంస్కృతిలో మనిషీ అతని దేవతల సంబంధం శత్రుత్వం ఆధారంగా ఏర్పడుతుంది. వారి మధ్య నిత్యఘర్షణ, అనుదినం పోరాటం కానవస్తుంది. ఈర్ష్యా ద్వేషాలతో నిండిన ఈ దేవతలకే సాధ్యమయితే అవి మనిషిని సృష్టిలోని నిగూఢ రహస్యాలు కనుగొనే అవకాశం ఇచ్చేవికావు. పర్యవసానంగా మనిషి నేడు సృష్టి సంపదల్ని కైవసం చేసుకుని పొందుతున్న సౌలభ్యాలు, సౌఖ్యాలు మనిషికి కరువయ్యేవి. ఈ గ్రీకు దృక్పథం దృష్ట్యా, మనిషి సాధించిన ప్రతి వైజ్ఞానిక విజయం, ఈర్ష్యాపరులయిన ఈ దేవతలపై మనిషి ఎగురవేసే సరికొత్త విజయపతాక అన్నమాట! ఓ కొత్త వైజ్ఞానిక ఆవిష్కరణ జరిగినప్పుడల్లా 'దేవతలు మరోసారి ఓడి పొయ్యారు' అన్నమాట!

గ్రీకు సంస్కృతి యొక్క ఈ అపరిశుద్ధాత్మయే ఆధునిక యూరపు అధః చేతనలో ఉండి అప్పుడప్పుడు వ్యక్తమవుతూ ఉంటుంది కూడా. ఒక్కోసారి యదార్థాలకు, భావార్థాలు కల్పించేటప్పుడు, అది ప్రస్ఫుటమవుతుంది. ఈ కారణంగానే ఆధునిక పాశ్చాత్య సైంటిస్టు సైన్సు విజయాలను ఓ ప్రత్యేక రూపంలో బహిర్గతం చేస్తాడు - ఏదో గొప్ప శక్తితో మనిషి పోరాడి దాన్ని సాధించినట్లుగా, తత్ఫలితంగా సృష్టిశక్తులనే క్రమేణ తన అధీనంలోకి తీసుకుంటున్నట్లుగా ప్రకటిస్తాడు. దీని భావమేమంటే, ఇంతకాలం ఓ అగోచర దైవం ఎదుట మనిషి తలవంచుతూ వచ్చాడంటే దానికి కారణం, అతనిలో ఉన్న అశక్తతా భావం మాత్రమే. అయితే సృష్టికి ప్రతిగా సైన్సు సాధించే అపూర్వ విజయాల ఫలితంగా మనిషిలోని ఈ అశక్తత క్రమేపి స్వయంగా దూరమయిపోతుంది - మనిషి దైవత్వానికి చేరువయిపోతాడు; సృష్టి, జీవన్మరణాలు అన్నింటి నిగూఢ రహస్యాలను తెలుసుకుంటాడు, ప్రయోగశాలలో జీవపదార్థాన్నే సృజించ గలుగుతాడు - ఈ ఘనకార్యం సాధించిన తరువాత అతనిలోనూ దైవం అనబడే శక్తిలోనూ ఇక ఎలాంటి వ్యత్యాసమూ మిగలదు! ఆ తరువాత మనిషికి తాను తప్ప ఇతరుల ఎదుట మోకరిల్లే ఆవశ్యకతే ఉండదు!! ఇదీ రోమను సామ్రాజ్యం ద్వారా యూరపుకు అబ్బిన గ్రీకు సంస్కృతిలోని 'అపరిశుద్ధాత్మ' తెచ్చే పరిణామం.

ఆధునిక పాశ్చాత్య జగత్తు నేడు ఏ ఆధ్యాత్మిక రుగ్మతలకు ఆలవాలమయి ఉందో వాటిలోకెల్ల ఇది అత్యంత అపాయకరమయింది. ఇది మానవ జీవితంలో విషాన్ని నింపింది. మానవతను ఛిన్నాభిన్నం చేసివేసింది. మానవులు పరస్పరం పీక్కుతినే స్థితికి దిగజారారు. జీవితంలో శాంతి, ప్రశాంతత, తృప్తి అన్నవి కరువయ్యాయి. మనుగడలో అందం ఆనందం పూజ్యమయ్యాయి. అయితే ఈ పరిస్థితుల్లోనూ ఓ ఆశాకిరణం తళుక్కుమంటుంది. అదే ఇస్లాం! దైవంలేని పాశ్చాత్య నాగరికత తెచ్చిన వినాశాన్ని తప్పించుకోవాలంటే దైవాదేశాల వైపుకు మరలడం తప్ప గత్యంతరం లేదు. అది మనిషికి ఓ ఆరోగ్యవంతమయిన జీవన దృక్పథాన్ని అందజేస్తుంది. అది మనిషికి తెలుపుతుంది: ప్రపంచంలో నీకు ప్రాప్తమయ్యే

శాస్త్రీయ, భౌతిక, ఆధ్యాత్మిక విజయాలు వాస్తవానికి దయామయుడయిన నీ ప్రభువు కృపానుగ్రహాల ఫలితంగానే లభించాయి. ఈ విజయాలను నీవు తోటి మానవ సోదరుల సేవలో వినియోగించావంటే ఆయన నీ ఎడల ప్రసన్నుడవుతాడు. నీకు బహుమానాలనిస్తాడు. విజ్ఞానాన్వేషణలోనూ, సృష్టిరహస్యాల ఆవిష్కరణలోనూ నీవు చేసే కృషివల్ల ఆగ్రహం చెందడు. ఎందుకంటే ఆయనకు తెలుసు ఆయన సృష్టిరాశిలోని వారెవరూ తన విజ్ఞానం కారణంగా ఆయన దైవత్వానికి ఎన్నడూ ప్రమాదంగా పరిణమించలేరని. మానవులు తమ విజ్ఞానాన్ని, ప్రావీణ్యాల్ని, వైజ్ఞానిక పాటవాన్ని తోటి మానవ సోదరుల శ్రేయ సంక్షేమాలకు కాక వారి వినాశానికి వినియోగించినప్పుడే ఆయన ఆగ్రహోదగ్రుడవుతాడు.

## చిల్లర దేవుళ్ళు

నైతిక ఆచరణరీత్యా ప్రపంచం నేడు ఏ స్థానంలోనయితే ఉందో నేటికి 13 వందల ఏళ్ళ క్రితం కూడా ఆ స్థానంలోనే ఉండింది. ఆనాడూ మనిషిపై మనిషి అత్యాచారం,జులుం చేశాడు. నేడూ అదే జరుగుతోంది. ఆనాడు దాన్ని మిథ్యాదేవుళ్ళ సంకెళ్ళ నుండి విమోచనం ప్రసాదించింది ఇస్లామ్ మాత్రమే. నేటి మిథ్యాదైవాల పంజానుండి మానవతకు ముక్తి నిచ్చేది కూడా ఇస్లామ్ ఒక్కటే. ఈ దేవుళ్ళు నేడు సరికొత్త రూపాలు ధరించారు. నేడు జులుం, అత్యాచారాలు, రాచరికం, సామ్యవాదం, పెట్టుబడిదారీ రూపాల్లో కానవస్తోంది. ఓ వైపున పాషాణ హృదయం గల పెట్టుబడిదారీ విధానం శ్రామికుల రక్తాన్ని పీల్చి తన బొక్కసాలను నింపుకుంటూ ఉంటే మరోవైపున శ్రామిక నియంతృత్వం పేరిట కొందరు తమ దైవత్వపు దర్బారును తీర్చిదిద్దుకుంటున్నారు. వీరు ప్రజాభిప్రాయం పేరుతో ప్రజల స్వేచ్ఛల్ని కాలరాచి ప్రజాభీష్టాన్ని పూర్తి చేస్తున్నట్లు ప్రకటిస్తారు.

ఇస్లామ్ మానవునికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల సందేశాన్నిస్తుందన్న ఈ

వాదన విని, ముస్లిం దేశాల్లో స్వయంగా ముస్లింలపై ఇస్లాం పేరుచెప్పి దురాగతాలను సాగిస్తున్న నియంతల పంజా నుండి విముక్తి ఎందుకు ప్రసాదించదు ఇస్లాం అని ఎవరయినా అడగవచ్చు. ఈ నియంతలు ఇస్లాం పేరును వినియోగించుకుంటున్నారన్న విషయం వాస్తవమే అయినా వీరి పరిపాలనలో వీరి జీవితాల్లోనూ ఇస్లాంకు ఎలాంటి స్థానం, అధికారాల్లేవన్నది కూడా యదార్థమే. పేరుకు ముస్లిములయిన ఈ పెద్ద మనుషుల కోవకు చెందిన వారిని గురించి దివ్యఖుర్ఆన్ ఈ విధంగా ప్రకటిస్తోంది.

> ఎవరయితే అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం నిర్ణయాలు చెయ్యరో వారే అత్యాచారులు, దౌర్జన్యపరులు.
>
> (5:44)

> ఓ ప్రవక్తా! నీ ప్రభువు సాక్షిగా, వీరు విశ్వసించిన వారు కాలేరు - తాము పరస్పరం విభేదించుకున్న విషయాల్లో నిన్ను న్యాయ నిర్ణేతగా అంగీకరించనంతవరకు. ఇంకా నీవు చేసిన తీర్పుపట్ల తమ అంతర్యాల్లోనూ వీరు ఎలాంటి సంకోచం కలిగి ఉండరాదు; దాన్ని పూర్తిగా శిరసావహించి దానికి లొంగిపోవాలి.
>
> (4:65)

## వీరిది ఇస్లాం కాదు

మేము ఏ ఇస్లాం వైపుకు ప్రజల్ని పిలిచి, ప్రజలు దాన్ని తమ జీవితాల్లో మార్గదర్శకంగా స్వీకరించాలని కోరుతున్నామో, దానికీ ఆధునిక ముస్లిం పాలకులు అనుకరించే 'ఇస్లాం'కు ఎలాంటి సంబంధం లేదు. ఈ పాలకుల హృదయాల్లో దైవాజ్ఞల కొరకు ఎలాంటి ఆదరాభిమానాలు లేవు. వారు, తాము కోరినప్పుడల్లా ఆయన ఆదేశాలను త్రోసిరాజని ఇష్టారాజ్యం కొనసాగిస్తూ ఉంటారు. ఇలా చేసేటప్పుడు వారికి ఏ విధమయిన లజ్జ, అభిమానం అడ్డురావు. వారు తమకు ఇష్టమయింది

ఏది ఎక్కడ లభిస్తే దాన్నే గ్రహిస్తారు. అవి యూరపు దేశాల్లో మానవులు నిర్మించుకున్న శాసనాలయినా లేక షరీఅత్ చట్టాలయినా సరే. ఏదయితే వారి అభిలాషలకు, వారి ప్రయోజనాలకు ప్రతికూలమయిందో దాన్ని వారు త్రోసిపుచ్చుతారు. వీరు ఇటు మానవులకూ విశ్వసనీయులు కారు అటు దైవానికీ కారు. వారు మానవుడు, దైవం-ఉభయులపట్ల అత్యాచారానికి, అపచారానికి ఒడిగడుతున్న అపరాధులు. ఎందుకంటే వీరు ఒక విషయాన్ని స్వీకరించడానికయినా, తిరస్కరించడానికయినా వినియోగించే ప్రమాణం సత్యం, సత్యప్రియత్వం కావు - వ్యక్తిగత ప్రయోజనాలు, ఆశావ్యామోహాలే.

మాకు తెలిసిన ఇస్లాం, దురహంకారులయిన రాజులను, తలబిరుసుతనంగల పాలకులను అసలు ఏ మాత్రం సహించదు. అది వీరినీ సామాన్య ప్రజల మాదిరిగానే దైవశాసనాల బంధాల్లో బంధిస్తుంది. కాకపోతే వారిని శాశ్వతంగా అంతం చేస్తుంది. ఎందుకంటే:

> ఏదయితే వ్యర్థమయిన పైనురుగో అదంతా ఎగిరిపోతుంది. మరేదైతే మానవులకు ప్రయోజనకరమయిందో అది భువిలో నిలిచిపోతుంది.
>
> (13 : 17)

## పరిపాలన - ప్రజలహక్కు

మరో విధంగా చెప్పాలంటే ఇస్లాం అహంభావాన్ని, నియంతృత్వాన్ని సహించేందుకు సిద్ధంగా లేదు. అల్లాగే అది మనిషికి, తనలాంటి మానవులపై దైవం, దైవప్రవక్తల అభీష్టాన్ని కాదని తన సొంత ఆజ్ఞల్ని జారీచేసే అనుమతినీ ఇవ్వదు. దాని ప్రకారం పాలకుడు దైవానికీ ప్రజలకూ జవాబుదారుగా నిలువాలి. ఈ జవాబుదారీ కారణంగానే అతడు మానవుల్లో దైవాజ్ఞల్ని చెలాయించేందుకు బాధ్యుడవుతాడు. అతడు తన ఈ విద్యుక్తధర్మాన్ని నిర్వర్తించడంలో ఏ మాత్రం విఫలమయినా ప్రజల

విధేయతను పొందే అర్హత కోల్పోతాడు. ఈ యదార్థాన్ని ఇస్లామీయ రాజ్యానికి తొలి ఖలీఫా అయిన హజ్రత్ అబూబక్ర్ (రజిఅన్) తన ప్రప్రథమ ప్రసంగంలో ఈ విధంగా ప్రస్తావించారు:

> నేను దైవవిధేయతను పాటించేవరకు మీరు నన్ను అనుసరించండి.కాని నేను దైవ విధేయతా పరిధుల్ని అతిక్రమిస్తే ఆ తరువాత నా విధేయత పాటించడం మీ బాధ్యతకాదు.

దీని ద్వారా తెలిసేదేమంటే ఇస్లాం ప్రకారం పాలకునికి, ప్రభుత్వ ధనాగారం పైనా, దేశ శాసన నిర్మాణ కార్యంలోనూ గల అధికారం, ఓ సాధారణ పౌరునికి గల హక్కుకన్నా ఏ మాత్రం అధికం కాదు. మరో విషయం ఏమంటే ఒక వ్యక్తి పాలనాధికారాలను పొందాలంటే సంఘసభ్యులు అతన్ని తమ స్వేచ్ఛాభిమతంతో ఎన్నుకుని ఆ బాధ్యతను అప్పగించాలి. ఆ ఎన్నికలు, స్వేచ్ఛాయుత వాతావరణంలో, న్యాయవంతంగా, నిష్పాక్షికంగా జరగాలి. వాటిలో న్యాయం, సభ్యతా సంస్కారాలు, మంచితనం లాంటి ప్రామాణిక కట్టుబాట్లు తప్ప ప్రజలపై మరే విధమయిన నిర్బంధం ఉండరాదు.

## సామ్రాజ్యవాదానికి తిరుగుబాటు

ఇస్లామీయ రాజ్యం తన పౌరులకు కేవలం అంతర్గత దౌర్జన్యపరులయిన వారి బారినుండి రక్షణ నివ్వడం మాత్రమే కాదు, వెలుపలి దురాక్రమణల నుండి కూడా భద్రత కల్పిస్తుంది - ఈ దురాక్రమణ సామ్రాజ్యవాదుల దోపిడి రూపంలో దాపురించినా లేక మరే రూపం ధరించి వచ్చినాసరే. ఎందుకంటే ఇస్లాం స్వయంగా మహోజ్వలమయింది, శక్తిమంతమయింది. మనిషి దిగజారి మిథ్యా దైవమయిన సామ్రాజ్యవాదం ముందు మోకరిల్లడాన్ని అది ఏమాత్రం సహించదు. ఇస్లాం మనిషికి ఎంతో సాధారణమయిన జీవన వ్యవస్థనిస్తుంది.

మనిషి తన ప్రభువు ప్రసన్నతను పొందడానికి మనస్ఫూర్తిగా ఆయన మార్గంలో నిరంతర కృషి జరపాలని అతనికి ప్రేరేపిస్తుంది. మనిషి తన ఇష్టాన్ని దేవుని ఉచ్ఛతర ఇష్టం సమక్షంలో పూర్తిగా సమర్పించుకోవాలని, ఆయన ఆజ్ఞాపాలనలో తన యావత్తు సాధనా సంపత్తిని వినియోగించి దౌర్జన్యాన్ని, సామ్రాజ్యవాదాన్ని గట్టిగా ఎదుర్కోవాలని బోధిస్తుంది.

అందుకే అందరూ కలిసి ఇస్లాం ఆశ్రయాన్ని పొందాలి. అప్పుడే ప్రపంచం నుండి సామ్రాజ్యపు చిహ్నాలన్నీ సమసిపోతాయి. మానవాళిని సామ్రాజ్యవాదపు పిడికిలి నుండి రక్షించి, భూమండలాన్ని తన అత్యాచారాలకు ఆలవాలంగా చేసుకున్న రాక్షసం నుండి విముక్తిని సాధించి ఇవ్వగలిగే ఇదొక్క మార్గమే నేడు మిగిలింది. ఇస్లాం నుండే నిజమయిన స్వాతంత్ర్యపు బాటలు బయల్దేరుతాయి. అందులోనే మానవులందరికీ ఆలోచన, ఆచరణ, సంపాదన, మతావలంబనకు పరిపూర్ణమయిన స్వేచ్ఛ లభిస్తుంది. అందరి గౌరవం, ఆత్మాభిమానాలు భద్రంగా ఉంటాయి. అప్పుడే మనం నిజమయిన దైవవిధేయులుగా తమ ప్రభువుపట్ల భక్తి పరాయణులయిన దాసులుగా అలరారుతాము. ఆ ప్రభువే కదా ఇస్లాంను మన కొరకు ధర్మంగా,జీవన వ్యవస్థగా నిర్ణయించింది:

> నేడు నేను మీ జీవన ధర్మాన్ని మీ కొరకు పరిపూర్ణం గావించాను. నా అనుగ్రహవరాన్ని మీకు ప్రసాదించి ముగించాను. మీ కొరకు ఇస్లాంను మీ ధర్మంగా స్వీకరించాను. (5 : 3)

## విశ్వజనీన సంస్కరణ

ఇస్లాం తీసుకు వచ్చే ఈ విప్లవాత్మక సంస్కరణలు కేవలం ముస్లిం సమాజంవరకే పరిమితం కావు. ఇది తన నైజం రీత్యా ఒక విశ్వజనీన కార్యక్రమం. నేటి బాధాగ్రస్త ప్రపంచానికి, అంతరంగ యుద్ధాలకు,

పరస్పర ఘర్షణలకు లోనయి మూడో ప్రపంచ సంగ్రామ ప్రమాదానికి గురి కాబోతున్నట్లున్న ఈ లోకానికి దీని ఉనికి ఓ మహా వర ప్రసాదం.

నేడు ప్రపంచం రెండు విభిన్న - కాపటలిజం, కమ్యూనిజం - శిబిరాల్లోకి చీలిపోయింది. ప్రతిదీ ప్రపంచంపై తన పెత్తనం చెలాయించాలని తహ తహ లాడుతోంది. ప్రపంచ వాణిజ్య కేంద్రాలను, కీలకమయిన యుద్ధ స్థావరాలను కైవసం చేసుకోవాలని తాపత్రయ పడుతోంది. ఇవి రెండు పరస్పరం ఎంతగా విభేదించుకున్నా ఈ రెంటిలో ఓ విషయం పట్ల ఏకాభిప్రాయం ఉంది. రెంటి దృక్పథమూ సామ్రాజ్యవాదమే. ప్రపంచజాతులను తమ బానిసలుగా చేసుకోవాలని కోరుకోవడంలో రెంటిలో ఏదీ దేనికీ తీసిపోదు. తదనుగుణంగానే ఉభయశక్తులూ అత్యధిక మానవ, భౌతిక వనరుల్ని తమ అధీనంలోకి తీసుకోవాలని ప్రయాస పడుతుంటాయి. ఇతర మానవులు వీరి దృష్టిలో కేవలం మూగపశువుల కన్నా అధికం కాదు (వీరు తమ పరిభాషలో మానవుల సంఖ్యాబలాన్ని మానవ శక్తి (MAN POWER) గా పేర్కొంటారు). తమ నీచమయిన లక్ష్యాలను సాధించుకునేందుకు, మనుషులు వారి సమక్షంలో కేవలం పనిముట్లు మాత్రమే!

ఇస్లామీయ జగత్తు ఈ సామ్రాజ్యవాదుల రాక్షస ప్రాబల్యానికి, జులుంకు వ్యతిరేకంగా ఏకమయినట్లయితే అంతర్జాతీయ పోటీలు, ఘర్షణల కారణంగా ప్రపంచశాంతికి వాటిల్లిన ప్రమాదాన్ని గట్టిగా వారించడం సాధ్యమవుతుంది. ముస్లిం దేశాలు తమ మధ్య ఐక్యతను సాధించగలిగితే అవి అతి సునాయాసంగా ఓ మూడో-ఇస్లామీయ-బ్లాక్‌గా రూపొందగలుగుతాయి. ఒకవేళ ఇలాంటి బ్లాక్ ఒకటి ఉనికిలోకి వస్తే అది ప్రపంచ రాజకీయాల్లో కేంద్రీయ పాత్ర నిర్వహించే అవకాశాలున్నాయి. ఎందుకంటే భౌగోళికంగా ఈ ముస్లిం దేశాలు ప్రాక్ పశ్చిమాలకు సరిగ్గా నడుమన ఉన్నాయి. తమ ఈ స్థానాన్ని పురస్కరించుకుని ఇవి తమ జాతీయ, ముస్లిం సామాజిక ప్రయోజనాల దృష్ట్యా ఏ శిబిరంతోనయినా సరే పొత్తు కుదుర్చుకోవడానికి స్వేచ్ఛను కలిగి ఉంటాయి. లేదా మరొకరి

ఎత్తుగడలకు పావులుగా మారడానికి బదులుగా, తమ నిజమయిన ప్రయోజనాల కొరకు ఉమ్మడి కృషి చేసుకోగలుగుతాయి. మానవాళి భవితవ్యం ముడిపడి ఉన్న ఆశాజ్యోతి ఇస్లాం ఒక్కటే. నేటి సైద్ధాంతిక సంఘర్షణలో ఇస్లాం సైద్ధాంతిక ప్రాబల్యమే మానవ మోక్షానికి మార్గం. ఇస్లాం విజయానికి ఎంత ప్రాముఖ్యం ఉందో దాన్ని సాధించడం కూడా అంతగానే సాధ్యం. పూర్వమూ అది సాధ్యమయింది. నేడు కూడా అది సులభసాధ్యమే . అయితే ఒక షరతు. ఇస్లాం అనుయాయులు నోటిమాటలు కట్టిపెట్టి ఇస్లాంకు ప్రపంచాన ఆధిక్యత, ప్రాబల్యం లభించేంతవరకు విశ్రమించమని ప్రతినబూనాలి. దీనికి బాహ్యం నుండి మరే సహకారం అవసరం కూడా ఉండదు. ఒకటి మాత్రం నిజం. ఇస్లాం ప్రాబల్యం వహించడమంటే అర్థం - మూడో ప్రపంచ సంగ్రామ ప్రమాదం అంతమయిందన్నమాట ! అనేక మానసిక రోగాలు, ఉద్రిక్తతల నివారణకు మార్గమేర్పడిందన్నమాట!! సంతోషం, శాంతి, సుఖాలు విలసిల్లే ప్రశాంత జీవితం ప్రాప్తమయిందన్నమాట !!!

## ఇవి ప్రగతీ వికాసాలా?

ఈ సమస్యకు సంబంధించిన విషయాన్ని మరో కోణంలో పరిశీలిద్దాము. ఆధునిక పాశ్చాత్య మండలాన్ని సైన్సు, భౌతికంగా సుసంపన్నమయితే చేసింది కాని మంచి మనుషుల్ని ప్రసాదించలేక పోయింది. మానవత్వపు ప్రగతి నిలిచిపోయింది. అంతర్యాలల్లో ఉన్నత మానవీయ విలువలకు ఆదరణ కరువయింది. ఆధునిక నాగరికత, ఆత్మకంటే పదార్థానికి, ఆధ్యాత్మికతకు బదులుగా ఇంద్రియానుభూతులకు ప్రాధాన్యత నిచ్చింది. పర్యవసానంగా వ్యక్తులు ఉన్నత సామూహిక ప్రయోజనాలకు మారుగా సొంత సుఖభోగాలను, స్వార్థ ప్రయోజనాలను పొందడమే పరమార్థంగా భావిస్తున్నారు.

పరిస్థితుల ఈ స్వరూపాన్ని మానవ ప్రగతిగా, మానవత్వ పరిణామక్రమంగా పేర్కొనలేము. ఎందుకంటే మానవత ప్రగతి అంటే

కేవలం భౌతిక ప్రగతి మాత్రమే కాదు. నిజానికి ఇంద్రియ లోలత్వం, పాశవిక వాంఛల ఆధిక్యతనుండి సంపూర్ణమయిన స్వేచ్ఛ పొందడం కూడా ఈ భావంలోనే అంతర్లీనమయి ఉంది. ఈ విషయంలోనే ఇస్లాం మనల్ని ఆదుకుంటుంది. అది మాత్రమే మానవతకు నిజమయిన ప్రగతీ వికాసాలను అందజెయ్యగలుగుతుంది.

వేగంగా ఎగిరే విమానాలు, క్షణాలలో అంతా ధ్వంసం చేసే ఆటం బాంబులు, మాయలు పలికే రేడియో, కళ్ళు జిగేల్ మనిపించే విద్యుద్దీపాలను ప్రగతి అనడం, ప్రగతికి కొలమానాలనడం దృష్టి లోపమే. నిజమయిన ప్రగతిని తెలుసుకోదలిస్తే చూడవలసిందేమంటే, మనిషి తన పాశవిక వాంఛలు, భావావేశాలపై అదుపును సాధించాడా లేక ఇంకా వాటి చేతుల్లో ఆటబొమ్మగానే ఉన్నాడా. ఒకవేళ మనిషి నేటికీ మనోవాంఛల సమక్షంలో అశక్తుడయి, అసమర్థుడయి వాటికి అతీతంగా ఆలోచించలేకపోతే మనిషి నిజమయిన ప్రగతికి ఇంకా ఎన్నో ఆమడల దూరాన ఉన్నాడని గ్రహించవచ్చు. వైజ్ఞానిక రంగంలోని విజయాల దృష్ట్యా మనిషి ఎంత ముందంజ వేసినా మానవునిగా అతని పరిస్థితి, దయనీయమయిందేనని చెప్పాలి - పైగా అతన్ని ప్రగతి గడించిన వాడని, సాఫల్యం సాధించిన వాఢని కూడా అనడమా?!

## సహజమయిన ప్రమాణాలు

'ప్రగతి' కి పైన ఉదాహరించిన ప్రమాణం మతం, నైతికతలు స్వయంగా కల్పించుకున్నదో లేక బయటినుండి తెచ్చి మనిషిపై రుద్దినదో, లేక కేవలం ఊహాజనితమో కూడా కాదు. ఇది యదార్థం. దీని వ్రేళ్ళు మానవ నైజంలోను విశ్వం యొక్క మౌలిక వాస్తవికతలోనూ నిబిడీకృతమయి ఉన్నాయని చరిత్ర చాటి చెబుతోంది. ఈ ప్రమాణాన్ని త్రోసి రాజని ఏ జాతి అయినా సుఖభోగాలకు లోనయితే అది తిరిగి తన వైభవాన్ని, ప్రాభవాన్ని, గౌరవస్థానాన్ని పొందలేకపోయింది. ఇంకా మానవ ప్రగతీ

శ్రేయాలకై ఏ కార్యాన్నీ సాధించలేకపోయింది. ఇది చరిత్ర పలికే కాదనలేని యదార్థం. ప్రాచీన గ్రీకు అయినా, పర్షియా అయినా, రోమను సామ్రాజ్యమయినా, అబ్బాసీ పరిపాలన అయినా అన్నిటా కానవచ్చేది ఒక్కటే; భోగవిలాసాలూ, రుచులూ మరిగినందుకు పరిణామం సర్వనాశనం తప్ప మరేమీకాదు. ఆధునిక చరిత్రలో భోగవిలాసాలకు లోనయిన ఫ్రెంచి ప్రజల లజ్జా విహీనమయిన పాత్రను ఎవరు మరువగలరు? వారు రెండో ప్రపంచ మహా సంగ్రామంలో ఒకే దాడిలో శత్రువుకు లొంగిపోవడానికి ఎంతమాత్రం జంకలేదు! వారికి తమ దేశరక్షణ కంటే తమ ధనప్రాణాలు, వ్యక్తిగత సుఖభోగాలు ముఖ్యమయి పొయ్యాయి. తమ జాతీయ ప్రాభవ ప్రతిష్ఠలకన్నా తమ రాజధాని పేరిస్, దాని నృత్యశాలల భద్రత వారిని అమితంగా బాధించింది.

## లోతుగా పరిశీలిస్తే

ఈ సందర్భంలో కొందరు సరిగ్గా ఆలోచించకుండా అమెరికాను దృష్టాంతంగా పేర్కొంటారు. వారు చెప్పేదేమంటే, అక్కడి ప్రజలు ప్రాపంచిక రుచుల్లోనూ, ఇంద్రియ భోగాల్లోనూ పూర్తిగా మునిగి తేలుతున్నారు. అయినప్పటికీ వారికి ప్రపంచంలో వైభవ ప్రాభవాలు ప్రాప్తమయ్యాయి, ఉత్పాదన దృష్ట్యా ఆ దేశం ప్రపంచంలో అత్యున్నత స్థానాన్ని అలంకరించిందీ అని. ఈ మాటలన్నీ యదార్థాలే – సందేహం లేదు. కాని ఇలా వాదించే వారు మరచిపొయ్యేదేమంటే భౌతికత రీత్యానూ, నైతికత దృష్ట్యాను అమెరికా ప్రపంచ జాతుల్లో ఇంకా 'ప్రఫుల్ల శక్తి' అనే చెప్పవచ్చు. సాధారణంగా యవ్వనంలో, అంతర్గత రుగ్మతలు అణగి ఉంటాయి. వాటి రోగ లక్షణాలు కూడా బయట పడవు. ప్రఫుల్ల సామాజిక వ్యవస్థలో వివిధ వ్యాధుల బాహ్య లక్షణాలను బయల్పడకుండా చేసే భద్రతాశక్తి ఇంకా మిగిలి ఉంటుంది. కాని చూడగల నేత్రం సమాజంలోని ఇలాంటి మెరుగుల్ని చూచి భ్రమలకు లోనవదు. మనోజ్ఞమయిన, మనోహరమయిన ఈ బాహ్య తెరల వెనక దాగి ఉన్న భయంకర రోగాల లక్షణాలు దాని దృష్టికి

అందకుండా పోవు. నైతికంగా అమెరికా ఇతర పాశ్చాత్య దేశాలకన్నా ఏ మాత్రం భిన్నంగా లేదన్న యదార్థాన్ని చాటి చెప్పడానికి రెండు సంఘటనలు మాత్రం పేర్కొంటున్నాము. ఈ వార్తల ద్వారా మరో విషయం కూడా బోధపడుతుంది. ఎన్ని ప్రగతి సోపానాలు అధిరోహించినా సైన్సు, నేటికీ మానవ నైజంలో ఏ విధమయిన మౌలికమయిన మార్పునూ తీసుకురాగల సామర్థ్యం పొందలేదు. ఎందుకంటే స్వయంగా సైన్సు దైవశాసనానికి లోబడిన అంశమే -

దైవ నియమంలో మార్పు జరిగినట్టు నీవు
ఎన్నడూ చూడలేవు. (35 : 43)

మొదటివార్త: కొన్నాళ్ళ క్రితం పత్రికల్లో వచ్చిన వార్త ప్రకారం, అమెరికా విదేశాంగశాఖ తన 33గురు ఉద్యోగుల్ని, అవాంఛనీయ ప్రవర్తన కారణంగా, దేశ రహస్యాలు శత్రువులకు సరఫరా చేసిన ఆరోపణల కారణంగా ఉద్యోగాలనుండి బర్తరఫ్ చేసింది.

మరోవార్త ప్రకారం, ఒక లక్షా 20 వేలమంది అమెరికన్ సైనికులు సైన్యాన్ని వదలి పారిపొయ్యారు. అమెరికా సైన్యం పూర్తి అంగబలం దృష్ట్యాను అమెరికా జాతి ఇంకా యవ్వన దశలోనే ఉండి, ప్రపంచ నాయకత్వం చేపట్టాలని కలలు కంటున్న దృష్ట్యాను పారిపోయిన వారి ఈ సంఖ్య గణనీయమయినదే.

నిజానికి ఇదంతా ఇంకా ప్రారంభమే. ఒకవేళ అమెరికన్ జాతి, జీవితంపట్ల తన భౌతికతా ప్రధానమయిన వైఖరిని మార్చుకోలేకపోతే, అనివార్యమయిన అంతం ఎంతో దూరంలో లేదు.

ఇది కేవలం ఒక రూపం మాత్రమే. మరో కోణంలో చూస్తే కనిపించే దేమిటి? భౌతిక ప్రగతి, యవ్వనదశ, అపారమయిన వనరులు ఇవన్నీ ఉన్నప్పటికీ అమెరికన్ జాతి ఉన్నత నైతిక విలువలు, సిద్ధాంతాల

క్షేత్రంలో శూన్యంలో కొట్టుమిట్టాడుతోంది. ఎందుకంటే ఓ జాతిగా అది పూర్తిగా భౌతిక రుచులు, వాంఛలలో తేలియాడుతోంది. ఇంతవరకు పాశవిక స్థాయినుండి పైకి లేచి సమస్యల్ని అనుశీలించే భాగ్యం దానికి బహుశా ప్రాప్తం కానేలేదేమో! నల్లవారయిన అమెరికనులపట్ల జరిగే అమానుషమయిన ప్రవర్తన అమెరికా జాతి యొక్క శోచనీయమయిన ఆధ్యాత్మిక స్థితిని, దిగజారిన నైతికావస్థను ప్రతిబింబిస్తోంది. పాశవిక కోరికల తృప్తికోసం మనిషి వాటిని ఆరాధించే స్థితికి పతనమవడం మూలంగా మానవత ప్రగతీ వికాసాలను ఎన్నడూ సాధించలేదు.

నేటి ప్రపంచపు ఈ చిత్రపటం బహుధా అంధకారమయమయి ఉంది. కాని ముక్తికి ఓ మార్గం నేటికీ ఉంది. అదే ఇస్లాం. ఏ విధంగానయితే 1300 ఏళ్ళకు పూర్వం అది మానవుణ్ణి పాశవిక కోరికల అధీనం నుండి విముక్తం చేసిందో అదే విధంగా నేడు కూడా అది మానవతకు మనోకాంక్షల నుండి మోక్షం ప్రసాదిస్తుంది. తద్వారా మానవాళి తన మనో మస్తిష్కాల శక్తులన్నింటినీ జీవితంలో సదాచారాలు, సత్కార్యాలను నింపుకోడానికి వినియోగించుకునేలా సహాయపడుతుంది.

## ఇస్లాం పునరుజ్జీవనోద్యమం

ఇదంతా విని, ఇస్లాం పునరుజ్జీవనం అన్నది నేడు కాని పని అని, అందువల్ల దానికై కృషి చెయ్యడం నిష్ప్రయోజనం అని ఎవరయినా చెప్పవచ్చు. కాని ఒకటి మాత్రం వారు తెలుసుకోవాలి. గతంలో సాధ్యమయినది నేడు కూడా అది పునరావృతం కావడం సాధ్యమే. ఎందుకంటే మానవనైజంలో మౌలికంగా ఎలాంటి మార్పు వాటిల్లలేదు. ఇస్లాం ఆవిర్భావ కాలంలోనూ, నేటి మాదిరిగానే ప్రపంచ నైతిక స్థితి ఎంతో దిగజారి ఉండింది. ప్రాచీన-ఆధునిక పతనావస్థల్లో వాటి బాహ్యా రూపాల్లో తప్ప మౌలికంగా ఎలాంటి మార్పు లేదు. ప్రాచీన రోము, నైతిక పతనం దృష్ట్యా నేటి లండన్, పేరిస్ మరియు అమెరికా మహానగరాలకు ఏ

విధంగానూ తీసిపోదు. అదే విధంగా ప్రాచీన పర్షియా, నేటి కమ్యూనిస్టు దేశాల మాదిరిగానే లైంగిక విశృంఖలత్వానికి గురయి ఉండింది. ఇలాంటి చారిత్రక పూర్వ రంగంలోనే ఇస్లాం ఆవిర్భవించింది. అది వచ్చీరాంగానే తన అనుయాయుల నైతిక స్థితిని విప్లవాత్మకంగా అధః పాతాళాన్నుండి ఉచ్ఛస్థితికి లేవనెత్తింది. జీవితానికి ఓ ఉన్నత ధ్యేయాన్ని ప్రసాదించింది. నిత్యగమనశీల, క్రియాశీల భావాన్ని నూరిపోసింది. మంచి తనానికై, సత్యానికై నిరంతరంగా పోరాడే ఉన్నత భావశీలాన్ని సృజించింది. మానవతను ప్రగతి, సుఖశాంతులతో విలసిల్లజేసింది. ప్రాక్ పశ్చిమాలకు బహుకాలం వరకు ప్రభావితం చేస్తూ ఉన్న ఓ శాస్త్రీయ, ఆధ్యాత్మిక ఉద్యమాన్ని లేవనెత్తింది. ఫలితంగా ప్రపంచం ఓ మహోజ్వలమయిన ఆలోచనాత్మక విప్లవాన్ని చూచింది. ఇస్లామీయ ప్రపంచం వెలుగుకు, మార్గదర్శకత్వానికి, ప్రగతికి ప్రతీకగా రూపొందింది. దాని ద్వారా శతాబ్దాల తరబడి మానవతకు కాంతి, మార్గదర్శకత్వాలు సంప్రాప్తమయ్యాయి. తన ఆధిక్యత, వైభవ ప్రాభవాల కాలంలో ఇస్లామీయ జగత్తు, భౌతికంగా గాని, శాస్త్రీయంగా గాని, ఆధ్యాత్మికంగా గాని ఏమాత్రం వెనుకబడి ఉండలేదు. ఎందుకంటే ఇస్లాం, నైతిక మార్గ భ్రష్టత్వాన్ని, లైంగిక అరాచకత్వాన్ని, ధర్మవిహీనతను ఏ రూపంలోనూ సహించదు; వాటిని తలెత్తే అవకాశాన్నీ ఇవ్వదు. తదను గుణంగానే ఆ కాలంలో సచ్ఛీలత, సదాచారం, మానవీయ కృషికి సంబంధించిన అన్ని రంగాల్లోనూ ముస్లిములు ప్రపంచ జాతులకు మార్గదర్శకులుగా ఆదర్శప్రాయులుగా నిలిచారు. ఆ తరువాత ఎప్పుడయితే వారు క్రమేపి ఇస్లామీయ సిద్ధాంతాలకు, సూత్రాలకు దూరమవుతూ పొయ్యారో, ఎప్పుడయితే ఉన్నత ఆశయాలు, సిద్ధాంతాల ఛాయలు కూడా మిగల్లేదో వారు క్షుద్రమయిన కోరికలకు భావావేశాలకు దాసులయ్యారు. ఈ ఘోరమయిన నేరానికి ఫలితంగా, దైవం నిర్ణయించిన ఎదురులేని చట్టం ప్రకారం, చివరికి వారికి ఈ ప్రపంచంలోనే శిక్ష కూడా లభించింది; వారి వైభవ ప్రాభవాల సూర్యుడు కడకు అస్తమించాడు.

## ఆధునిక ఇస్లామీయ ఉద్యమం

ఆధునిక ఇస్లామీయ ఉద్యమం క్షణంక్షణం ముందుకే ముమ్ముందుకే పురోగమిస్తోంది. శక్తిమంతంగా పటిష్ఠంగా రూపొందుతోంది. అది తన గతాన్నుండి ఆధ్యాత్మిక శక్తిని గ్రహిస్తోంది. వర్తమానంలోని అన్ని పరిశుద్ధమయిన, ధర్మ సమ్మతమయిన సాధనాలను, వనరుల్ని వినియోగిస్తోంది. భవిష్యత్తుపై దృష్టి కేంద్రీకరించి గమ్యం వైపుకు పురోగమిస్తోంది. దాని భవిష్యత్తు ఉజ్వలంగా ఉంది. దాని ద్వారా పూర్వం కానవచ్చిన మహత్తు మరోసారి ప్రపంచం చూడటం సాధ్యం కాబోతోంది. ఆ తరువాత మనిషి పాశవిక వాంఛలకు అతీతంగా, ఉన్నతంగా ఎదిగి, కాళ్ళు నేలపై ఆనించి, చూపు నింగిపై నిలిపి పైపైనే పయనించాలని ఉద్యుక్తుడవుతాడు.

అంతమాత్రాన ఇస్లాం కేవలం ఆధ్యాత్మిక సిద్ధాంతం మాత్రమే అని లేక కేవలం నైతిక వ్యవస్థ అని, లేక భూమ్యాకాశాల శాస్త్రీయ పరిశోధనకు మారుపేరు అని కూడా అర్థంకాదు. ఇస్లాం, ఆచరణాత్మక జీవన వ్యవస్థ. అది ప్రపంచపు అన్ని రంగాలను, సకల సమస్యల్ని ఆవరించి ఉంది; అది మానవ జీవితపు సకల సంబంధాలను క్రమబద్ధం చేస్తుంది; అవి రాజకీయమయినవయినా, ఆర్థికమయినవయినా, సామాజిక మయినవయినా వాటి కొరకు యుక్తమయిన నియమాలు నింబంధనలు సమకూర్చి వాటిని క్రియారూపంలో అమల్లోకి తెస్తుంది. దాని విశిష్టత ఏమిటంటే, ఈ వ్యవస్థ ద్వారా, వ్యక్తి–సమాజం, బుద్ధి–అంతర్ప్రేరణ, ఆచరణ - ఆరాధన, భూమి - ఆకాశం, ఇహం–పరం, వీటన్నింటి మధ్య అద్వితీయమయిన, అపురూపమయిన సామరస్యాన్ని, సమతూకాన్ని సృజిస్తుంది ఇస్లాం. జీవితపు వివిధ కారణాలకు సంబంధించిన ఈ విషయాలన్నీ ఓ సమతూకం గల సమన్వయం గల పరిపూర్ణ ఏకత్వం లోని విభిన్న అంశాలుగా రూపొందుతాయి.

ఈ అధ్యాయంలో ఇస్లాం ప్రతిపాదించే సమగ్ర జీవన వ్యవస్థను వివరంగా చర్చించే అవకాశం లేదు. అయితే రాబోయే అధ్యాయాల్లో, ప్రాచ్య శాస్త్ర నిపుణులయిన పాశ్చాత్య పండితులు వ్యాపింపజేసిన అపోహల్ని చర్చించేటప్పుడు ఇస్లామీయ వ్యవస్థయొక్క కొన్ని విలక్షణమయిన ప్రత్యేకతల్ని పేర్కొనడం జరుగుతుంది. ప్రస్తుతం కేవలం కొన్ని విషయాలు క్లుప్తంగా స్పర్శించదలిచాము.

## మొదటి ప్రత్యేకత:

మొట్టమొదట ఇస్లాం గురించి తెలుసుకోవలసిన ముఖ్యవిషయం ఏమిటంటే ఇది కేవలం సిద్ధాంతం మాత్రం కాదు; ఓ ఆచరణాత్మకమయిన జీవన వ్యవస్థ. ఇది మానవ జీవితపు ఏ అవసరాన్నీ ఉపేక్షించక పోవడమే కాక దాన్ని సాధించే మార్గాలను సయితం విశదీకరిస్తుంది.

## రెండవ ప్రత్యేకత:

రెండవ విషయం ఏమిటంటే ఇస్లాం మానవ నైజం యొక్క పరిమితుల్ని ఏ క్షణాన కూడా విస్మరించదు. అది జీవన సంస్కరణను 'వ్యక్తి' నుండి ప్రారంభిస్తుంది. అతని జీవితంలో శరీరం, ఆత్మ, బుద్ధి, కోరికలు–వీటన్నిటి విభిన్న అవసరాల మధ్య సమతూకాన్ని, సామరస్యాన్ని, సమన్వయాన్ని స్థాపిస్తుంది– అందులో ఏదీ తన నిర్ణీత హద్దుల్ని అతిక్రమించకుండా ఉండేందుకు. ఉన్నత ఆధ్యాత్మిక స్థానాలను పొందడానికి పాశవిక ప్రేరణల్ని అణచివెయ్యదు ఇస్లాం. అలా అని, మనిషి రుచుల ఆస్వాదనలో మునిగి తేలుతూ పశువుగా తయారవడాన్ని కూడా శ్లాఘించదు. దానికి భిన్నంగా ఇస్లాం ఆత్మ మరియు శరీరం రెంటిలో సామరస్యాన్ని సృజిస్తుంది. వాటి యుక్తమయిన వాంఛల్ని పూర్తి చేస్తుంది. ఆత్మ మరియు శరీరాల మధ్య సమన్వయం కుదుర్చడం మూలాన, మానవ వ్యక్తిత్వం, పరస్పర విరుద్ధ భావాల రణరంగంగా మారకుండా, పర్యవసానంగా

ముక్కలు చెక్కలవకుండా భద్రంగా ఉంటుంది. ఈ విధంగా వ్యక్తిగత జీవితం ఆరోగ్యవంతమయిన పునాదులపై రూపుదిద్దుకున్న తరువాత ఇస్లాం, వ్యక్తి మరియు సమాజాల అవసరాల మధ్య సామరస్యాన్ని, సమన్వయాన్ని సృజించేందుకు సమాయత్తమవుతుంది. ఆ విధంగా అది ఓ వ్యక్తికయినా లేక సమాజానికయినా అన్యాయం చేసే అవకాశాన్ని ఏ వ్యక్తికీ ఇవ్వదు. మరోవైపు ఏ వ్యక్తి హక్కునయినా హరింపజేసే హక్కును సమాజానికీ ఇవ్వదు. ఒక వర్గం లేక ఒక జాతి మరోవర్గం, లేక జాతుపై తమ దైవత్వాన్ని, అధికారాన్ని, స్వామ్యాన్ని చెలాయించడాన్ని కూడా ఇస్లాం సహించదు. ఒక్కమాటలో చెప్పాలంటే, సామూహిక జీవితంలో పనిచేసే, పరస్పర వ్యతిరేకశక్తుల కళ్ళెం తన చేతుల్లో ఉంచుకుంటుంది. అవి పరస్పరం ఘర్షించుకోకుండా కాపాడుతుంది. ఇంకా వాటిమధ్య సానుకూలతను ఏర్పరుస్తుంది. అవన్నీ కలసి మనిషి మరియు మానవత యొక్క ఉన్నత ప్రయోజనాలకై కృషి చేసేలా వాటిని క్రమబద్ధం చేస్తుంది.

దీనికి తోడుగా ఆధ్యాత్మిక, భౌతిక, ఆర్థిక, మానవీయ శక్తుల మధ్య కూడా సమతూకాన్ని పెంపొందిస్తుంది ఇస్లాం. కమ్యూనిజం మాదిరిగా జీవితంలో, మానవీయ అంశాలపై ఆర్థిక అంశాల నిర్ణయాత్మక ఆధిక్యతను ఇస్లాం అంగీకరించదు. అయితే అదే విధంగా, ఆధ్యాత్మిక లేక సైద్ధాంతిక వాదుల అభిప్రాయం ప్రకారం, మానవ జీవితాన్ని కేవలం ఆధ్యాత్మిక లేక ఉన్నత ఆదర్శాల, దృక్పథాల ఆధారంగా మాత్రమే వ్యవస్థీకరించడం సాధ్యం అన్న వాదంతోనూ ఏకీభవించదు. ఎందుకంటే, సమాజం అంటే ఇస్లాం ప్రకారం, వీటిలో ఏదో ఒక్కకోణమో లేక కొన్ని కోణాలో అన్న భావం సరయినది కాదు; వీటన్నింటి కలయిక, మిశ్రమమే అని అది అభిప్రాయ పడుతుంది. తదనుగుణంగా వీటిని క్రమబద్ధం చేసి, సమంజసమయిన రీతిలో ఏర్చి కూర్చి సముచితమయిన ఓ సమగ్ర స్వరూపాన్ని రూపొందిస్తుంది.

## మూడవ ప్రత్యేకత:

బాగా గుర్తుంచుకోవలసిన మూడో విషయం ఏమిటంటే, ఓ సామాజిక సిద్ధాంతంగా, ఓ ఆర్థిక వ్యవస్థగా, ఇస్లాం తనదంటూ ఓ విలక్షణమయిన రూపం కలిగి ఉంది. కొన్ని నిమ్న విషయాల్లోనూ, వివరాల్లోనూ బయటికి కనిపించే పోలికలు కొన్ని ఉన్నప్పటికీ ఇస్లాంకు అటు కమ్యూనిజంతోనూ ఇటు కాపటలిజంతోనూ ఎలాంటి సంబంధం లేదు. ఇందులో ఈ రెండు వ్యవస్థల మంచి విషయాలున్నా వాటి బలహీనతలు, లోపాలనుండి ఇది సురక్షితంగా ఉంది. ఇది ఆధునిక పాశ్చాత్య విధానంలో మాదిరిగా 'వ్యక్తి'కి మితిమీరిన ప్రాముఖ్యాన్నిచ్చి అతని సమక్షంలో 'సమాజా' న్ని నిర్వీర్యం చేయడాన్ని, 'వ్యక్తి' పై ఎలాంటి అదుపు లేకుండా ఉండటాన్నీ అంగీకరించదు. వ్యక్తి యొక్క హద్దుపద్దులేని ఈ స్వేచ్ఛవల్లనే మనిషి, ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థలో బరి తెగించి, ఇతర వ్యక్తుల కొరకు చివరికి తన్ను పెంచి, పోషించి, వ్యక్తిత్వాన్నిచ్చిన సమాజం కొరకు కూడా ప్రమాదకరంగా పరిణమిస్తున్నాడు.

మరోవైపున సామాజిక జీవితాన్ని చర్చిస్తూ మరో అతివాదానికి పోదు. ఇలా చెయ్యడం కమ్యూనిస్టు ప్రభుత్వాల ప్రత్యేకత. ఈ ప్రభుత్వాల్లో సామూహిక వ్యవస్థే జీవితానికి మూలం. వ్యక్తికి దాని సమక్షంలో ఎలాంటి స్థానం, ప్రాముఖ్యం లేదు. ఫలితంగా వ్యక్తికి సమాజం యొక్క ప్రాబల్యాన్ని, ఆధిక్యతను, శక్తినీ, స్వేచ్ఛను ఛాలెంజి చేసే అధికారమూ లేదు, తన కోరికల్ని వ్యక్త పరచేందుకు అనుమతీ లేదు. ఈ దృక్పథం గర్భాన్నే కమ్యూనిజం జన్మించింది. వ్యక్తుల భవితవ్యానికి ఏకైక 'స్వామి' రాజ్యం అన్నది దాని వాదన. అది తన ప్రజల్ని తాను కోరిన విధంగా మలచుకునేందుకు పరిపూర్ణమయిన స్వేచ్ఛ, అవధుల్లేని అధికారాలూ కలిగి ఉంది.

కమ్యూనిజం మరియు క్యాపటలిజం యొక్క ఈ రెండు అతి

వాదాలను కాదని ఇస్లాం మధ్యే మార్గాన్ని అవలంబిస్తుంది. ఇది వ్యక్తికి, సమాజానికి సమంగా ప్రాముఖ్యాన్నిస్తుంది. వీటి మధ్య సామరస్యాన్ని సృజిస్తుంది. ఈ వ్యవస్థలో వ్యక్తికి తన శక్తిసామర్థ్యాలను పెంపొందించుకునే స్వేచ్ఛ అయితే లభిస్తుంది, కాని అతనికి ఇతర వ్యక్తుల హక్కుల్ని హరించేందుకు గాని, ఇతరులపై దౌర్జన్యం చెయ్యడానికి గాని అనుమతి ఉండదు. మరోవైపు ఈ వ్యవస్థ, సమాజానికి లేక దాని పరిపాలనా వ్యవస్థ అయిన రాజ్యానికి సామాజిక, ఆర్థిక సంబంధాల వ్యవస్థీకరణ విషయంలో విస్తృత అధికారాలనిస్తుంది. తద్వారా మానవజీవితంలో సామరస్యం, సమన్వయం స్థాపిస్తుంది. ఇస్లాం ప్రతిపాదించే ఈ సామాజిక వ్యవస్థకు ఆధారం, వ్యక్తి–సమాజాల మధ్య పరస్పర ప్రేమానురాగాల సంబంధం. కమ్యూనిస్టు సమాజంలో మాదిరిగా ఇది పరస్పర ద్వేషం, వర్గపోరాటం వల్ల ఉనికిలోకి వచ్చేది కాదు.

## దైవదత్తం ఈ జీవన విధానం

ఇక్కడ మరో విషయం కూడా అర్థం చేసుకోవడం అవసరం. ఇస్లాం ప్రతిపాదించే ఈ విలక్షణమయిన జీవనవ్యవస్థ ఆర్థిక కార్యణాల వల్లనో లేక పరిస్థితుల పరిణామంగానో ఉనికిలోకి వచ్చిందికాదు. దీని ఉనికికి విభిన్న వర్గాల, విరుద్ధ ప్రయోజనాల పరస్పర ఘర్షణ కూడా కారణం కాదు. ఇది దైవదత్తమయిన జీవన వ్యవస్థ. ఇది ఏనాడయితే తొలుత మనిషికి ప్రాప్తమయిందో ఆనాడు మానవ జీవితంలో ఆర్థిక కారణాలకు ప్రత్యేక ప్రాముఖ్యత ఏదీ లేదు. ఇంకా 'సామాజిక న్యాయం' అన్న దానికి నేడున్న భావం కూడా ఆనాటి మనిషికి తెలీదు. కమ్యూనిజం, కాపిటలిజం రెండున్నూ ఇస్లాంకు తరువాత చాలా కాలానికి ఉనికిలోకి వచ్చాయి.

జీవితపు ప్రాథమిక అవసరాల విషయాన్నే తీసుకోండి. తిండి, నీడ, లైంగిక తృప్తి – ఈ మూటినీ ప్రాథమిక అసరాలుగా పరిగణించి, ప్రభుత్వం తన పరిధిలో నివసించే మానవులందరికీ వాటిని సమకూర్చే బాధ్యత

స్వీకరించాలని ప్రకటించిన తొలి వ్యక్తి కార్ల్ మార్క్స్ అని సాధారణంగా అనుకుంటారు. ఈ ప్రకటన మానవ చింతనా పథంలో ఎంతో గొప్ప విప్లవాత్మకమయినదని కూడా భావిస్తారు. కాని వాస్తవమేమంటే కార్ల్ మార్క్స్ పుట్టక 13 శతాబ్దాలకు పూర్వమే ఇస్లాం ద్వారా ఈ విప్లవాత్మకమయిన ప్రకటన ప్రపంచానికి పరిచితమయింది. ఈ సందర్భంలో ఇస్లాం ప్రవక్త (సఅసం) ప్రవచించినట్లు ఉల్లేఖనం ఉంది; ఆయన ఇలా అన్నారు: "ఏ వ్యక్తయితే మన (ఇస్లామీయ ప్రభుత్వ) సిబ్బందిగా పని చేస్తున్నాడో అతనికి భార్య లేకపోతే పెళ్ళి చెయ్యాలి. అతనికి ఇల్లు లేకపోతే ఇల్లు సమకూర్చాలి. అతనికి సేవకులు లేకపోతే సేవకుల నియమించాలి. అతనికి వాహనం లేకపోతే దాని ఏర్పాటు చెయ్యాలి." మహనీయ ముహమ్మద్ (సఅసం) చేసిన చారిత్రాత్మక ప్రకటనలో, ఆ తరువాత ఎన్నడో కార్ల్‌మార్క్స్ చేసిన ప్రకటనలోని ప్రాథమిక మానవ అవసరాలే కాదు ఇంకా అనేకం ఉన్నాయి. అయితే వ్యత్యాసమేమంటే ఇస్లాం, వీటికి ప్రతిమూల్యంగా వర్గ విద్వేషాన్నీ, రక్తపాతం నిండిన విప్లవాన్నీ, ఉన్నత జీవన ప్రమాణాలను ఒక్కపోటుతో పరిహరించడాన్నీ అభిలషించదు.

ఇస్లాం ప్రతిపాదించే జీవనవ్యవస్థకు సంబంధించిన కొన్ని విశేషమయిన ప్రత్యేకతలు ఇవి. వీటి పరిశీలన ద్వారా ఒక్క విషయం మాత్రం విశదమవుతుంది. ఇస్లాం కొన్ని సమగ్రమయిన, సార్వజనీనమయిన సూత్రాల, నియమాల పరిధిలోనే మానవ జీవితపు విభాగాలన్నింటినీ– భావోద్రేకాలను, ఆలోచనల్ని, ఆచరణల్ని, ఆధ్యాత్మిక అనుభవాల్ని సామూహిక బాధ్యతల్ని అన్నింటినీ – సమన్వయపరచి ఓ సుందరమయిన జీవన నందనవనాన్ని రూపొందిస్తుంది. ఇలాంటి విశిష్టమయిన జీవన వ్యవస్థ ఏ కాలంలోనయినా తన ప్రయోజకత్వాన్ని కోల్పోతుందా? నిజానికి మనిషి దీనికి దూరమయి బ్రతగ్గలడా? భూమండలంపై జీవకళ ఉన్నంతకాలం ఈ వ్యవస్థ కూడా స్థిరంగా ఉంటుంది. సుస్థిరత, నిత్యత పుటికి పుచ్చుకున్న అందమయిన ముద్ర ఎన్నటికీ చెరగదు.

# క్రియాశీల వ్యవస్థ

ఆధునిక కాలంలో ఎదురవుతున్న పరిస్థితుల్ని, నేడు ఉత్పన్నమయిన ప్రశ్నల్ని, సమస్యల్ని చూచి, ఏ హేతువు ఆధారంగా ఆధునిక మనిషి, ఇస్లాంను, అది అందజేసే జీవనవ్యవస్థను కాదనగలడు? విద్య, విజ్ఞానాల అభివృద్ధికి ప్రతీక అయిన ఈ కాలంలోనూ మానవత, వర్ణ విద్వేషపు జుగుప్సాకరమయిన స్థితికి గురయి ఉంది. ఒక్క అమెరికా, దక్షిణాఫ్రికాలనే చూడండి, అంతా బట్టబయలవుతుంది. నీతి, సంస్కృతి, మానవతలకు సంబంధించిన రంగాల్లోనూ ఇరువయ్యో శతాబ్ది మనిషి ఇస్లాం ద్వారా ఎంతో నేర్చుకోవలసిఉంది. శతాబ్దాలకు పూర్వం ఇస్లాం ఆవిర్భవించి మానవాళికి సమస్త వర్ణ వివక్షతల నుండి, దురభిమానాలనుండి విముక్తిని ప్రసాదించింది. నేడు కూడా కేవలం ఇస్లాం మాత్రమే ప్రపంచాన్ని ఈ విద్వేష కూపంనుండి వెలికి తీయగలదు. ఎందుకంటే ఇస్లాం కేవలం సమానతల అందమయిన సూత్రాలను వల్లించి కూర్చోలేదు, క్రియా జగత్తులో ఆ పరిపూర్ణమయిన సమానతను స్థాపించి మరీ చూపింది. దానికి సమానమయిన మరో దృష్టాంతం చరిత్రలో కానరాదు. ఇస్లాం ఏలిన ఆ ఆదర్శయుగంలో నల్లని వారయినా తెల్లని వారయినా ఎర్రని వారయినా ఎవరికీ ఎవరిపైనా వంశం, వర్ణం, వర్గం ఆధారంగా ఎలాంటి ఆధిక్యత లేదు. ఇస్లాంలో ఆదరణ గౌరవాలు ఏవయినా ఉంటే వాటికి ఆధారం, మనిషిలోని మంచితనం, దైవభక్తి పరాయణతలు. తదనుగుణంగా ఇస్లాం బానిసల్ని బానిసత్వం నుండి విముక్తం చెయ్యడమేకాదు వారికొరకు ప్రగతి, వృద్ధి వికాసాల అవకాశాలనూ సువిశాలం చేసింది. చివరికి వారు రాజ్యాధినేతగా ఉన్నత పదవుల నలంకరించే హక్కునూ అంగీకరించింది. మహనీయ ముహమ్మద్ (సఅసం) ప్రవచించారు: "బాగా వినండి, మీ అమీర్ (అధినేత) కు విధేయులయి మెలగండి – అమీర్‌గా నియుక్తుడయిన ఆ వ్యక్తి నీగ్రో బానిస అయినా సరే – అతను దైవశాసనం ప్రకారం మిమ్మల్ని పరిపాలించి నంతకాలం అతని విధేయతను పాటించండి."

మరో కోణంలో చూసినా నేటి ప్రపంచం ఇస్లాంను ఉపేక్షించజాలదు. సామ్రాజ్యవాదం, అన్యాయం, అక్రమాల మూలంగా మానవాళి నేడు ఏ బాధలకు గురయి ఉందో, ఏ అమానుష చర్యలకు బలవుతూ ఉందో వాటి నుండి రక్షణకు ఇస్లాం తప్ప మరో మార్గం ఏ కోశాన కానరావడం లేదు. ఎందుకంటే ఇస్లాం, సామ్రాజ్యవాదాన్ని, అది జరిపే దోపిడీనీ తీవ్రంగా వ్యతిరేకిస్తుంది. ఇస్లాం అధికారం చెలాయించిన కాలంలో ముస్లిం పరిపాలకులు తమ పరిపాలనలోని ముస్లిమేతర ప్రజలతో వ్యవహరించిన తీరు, కనబరిచిన విశాల హృదయత, అవలంబించిన ఉన్నత మానవీయత అనన్యమయింది. నేటి యూరపులోని మరుగుజ్జు మేధావుల దృష్టి ఆ ఔన్నత్యాలను అందుకోజాలదు. ఈ సందర్భంలో రెండవ ఖలీఫా ఉమర్ ఖత్తాబ్ (రజి అన్) జరిపిన ఓ న్యాయవిచారణ, అప్పుడు ఇచ్చిన తీర్పు ఉదాహరించడం సబబుగా తోస్తోంది. ఒక కిబ్తీ (ఈజిప్షియన్)ని అకారణంగా కొట్టి బాధించినందుకు, స్వయంగా ఈజిప్ట్ విజేత, గవర్నర్ అయిన అమ్రబిన్ ఆస్ కుమారుణ్ణి కొరడా దెబ్బలు వేయించారు ఆయన. అంతేకాదు స్వయంగా అంత గొప్ప తండ్రిని కూడా శిక్షించడానికి సిద్ధ మయ్యారు. ఈ ఒక్క దృష్టాంతం వల్లనే తెలుస్తోంది, ఇస్లామీయ రాజ్యంలో పౌరులకు లభించిన పౌరహక్కులు ఏ స్థాయికి చెందినవో అన్న విషయం.

నేడు పెట్టుబడీదారీ వ్యవస్థ ఓ అభిశాపంలా ప్రపంచాన్ని అలుము కుంది. అది జీవితాన్ని విషభరితం చేసివేసింది. దాన్నుండి రక్షణ కావాలంటే ఇస్లాం తప్ప గత్యంతరం లేదు. పెట్టుబడిదారీ వ్యవస్థకు మూలాధారమయిన వడ్డీ వ్యవస్థను, నిత్యావసర వస్తువుల నిల్వుపుదలను, అపరిమితంగా ధనం కూడ బెట్టడాన్ని ఇస్లాం తీవ్రంగా వ్యతిరేకిస్తుంది. వాటిని నిషేధిస్తుంది. మరోమాటలో చెప్పాలంటే నేటి ప్రపంచంలో పెట్టుబడిదారీ వ్యవస్థ తెచ్చిపెట్టిన చెడులను దూరం చెయ్యాలంటే అది కేవలం ఒక్క ఇస్లాంకే సాధ్యం అన్నమాట.

అలాగే భౌతికతా ప్రధానంగా, దైవ నిరాకరణ ఆధారంగా ఉనికిలోకి వచ్చిన కమ్యూనిజం దోపిడి వ్యవస్థను నిర్మూలించడం కూడా ఇస్లాం చేతుల మీదుగానే సాధ్యం. ఎందుకంటే ఇస్లాం కేవలం పరిపూర్ణ సామాజిక

న్యాయాన్ని స్థాపించడం, దాన్ని సుస్థిరం చెయ్యడంతో ఆగదు, ఉన్నత మానవీయ, ఆధ్యాత్మిక ప్రమాణాలను కూడా పరిరక్షిస్తుంది. అది కమ్యూనిజంలా సంకుచిత దృక్పథానికి కట్టుబడి లేదు, దాని క్రియా ప్రపంచం కేవలం ఇంద్రియ పరిధుల మేరకే పరిమితమయి అంతకన్నా లేదు. పైగా ఇస్లాం తన మాటను బలవంతాన ఒప్పించాలని కోరదు. నమ్మకాలు, దృక్పథాల విషయంలో అది ఎలాంటి బలాత్కారాన్నీ సహించదు. అందువల్ల దానికి ప్రోలిటేరియన్ డిక్టేటర్ షిప్ (శ్రామిక నియంతృత్వం) అనబడే ఉక్కు పంజా అవసరమే కలగదు. ఈ విషయం లో దాని దృక్పథం ఇలా ఉంది :

> "ధర్మం (జీవనమార్గం) విషయంలో ఎలాంటి బలాత్కారం లేదు. రుజుమార్గం తప్పుడు బాటనుండి ప్రస్ఫుటంగా వేరుపరచి చూపడం జరిగింది." (2 : 256)

నేడు ప్రపంచంపై మూడో ప్రపంచ సంగ్రామ నీలిమేఘాలు అలుముకున్నాయి. వీటిని దూరం చెయ్యాలన్నా ఇస్లాం ప్రభాకరుడు ఉదయించడం తప్ప మార్గాంతరం కానరావడం లేదు. కాని ఇది ఎలా సాధ్యమవుతుంది? మానవాళి ఇస్లామ్‌ను తన జీవన మార్గంగా స్వీకరించాలి, నిజమయిన శాంతి శ్రేయాల ఈ మార్గాన నడవడానికి సిద్ధమవ్వాలి.

ఇస్లాం కాలం చెల్లలేదు. మరో మాటలో, ఇస్లాం యుగం ఇప్పుడు ప్రారంభమవుతోంది. ఇది నిర్జీవమయిన సిద్ధాంతం కాదు. ఇది సజీవమయిన, సంచలనాత్మకమయిన శక్తి. ఒకనాటి యూరపు చిమ్మ చీకటి గుహల్లో తచ్చాడుతూ ఉండగా ప్రపంచమంతా దీని జ్యోతిలో వెలుగొందింది. దీని గతం ఎంత వైభవోపేతమయిందో దాని భవిష్యత్తు కూడా అంతే దేదీప్యమానంగా భాసిల్లుతుంది.

# 2. బానిసల సమస్య

ముస్లిం యువకుల్ని పెడత్రోవను పట్టించి, వారిని వారి ధర్మానికి దూరంగా, వ్యతిరేకంగా మలచడానికి కమ్యూనిస్టులు ప్రయోగించే అత్యంత నీచమయిన ఆయుధం ఈ బానిసల సమస్య. వారు చెప్పేదేమంటే, ఇస్లాం జీవితపు అన్ని కాలాలకు అనువయినది, అన్ని అవసరాలకు అనుగుణమయినదే అయితే అది మానవుల్ని బానిసలుగా చేసేందుకు అనుమతి నిచ్చేదీకాదు, బానిస వృత్తిని సహించేదీకాదు. అందువల్ల ఇది ఓ ప్రత్యేక చారిత్రక స్థితికి వర్తించే ధర్మం. ఇప్పుడు దీనికి కాలం చెల్లింది. ఇది తన బాధ్యతను ఆనాడు నెరవేర్చింది. ఇప్పుడు పాతబడిపోయింది. అందువల్లనే ఇది అన్ని కాలాలకూ అన్ని పరిస్థితులకూ చెల్లదు.

## సందిగ్ధంలో యువతరం

సందేహాలు, సంశయాల వాతావరణంలో ఇలాంటి మాటలకు చిత్తశుద్ధిగల ముస్లిం యువకులు కూడా ప్రభావితులు కాక మానరు. వీరి హృదయాల్లోనూ అనేక సందేహాలు, సంశయాలు జనిస్తుంటాయి. ఇస్లాం దైవం అవతరింపజేసిన ధర్మమే - సందేహం లేదు. అన్ని కాలాల్లోను, అన్ని దేశాల్లోనూ మానవాళిని సాఫల్యం వైపుకు గొనిపోవడమే దీని లక్ష్యం - అందులోనూ సందేహం లేదు. అయితే అది ఈ బానిస వృత్తిని ఎందుకు సహించింది? ఇస్లాం పునాదుల్లోనే మానవుల పరిపూర్ణ సమానత్వపు సూత్రాలున్నాయి. అది మానవాళినంతటినీ ఒకే తల్లిదండ్రుల సంతానమని భావిస్తుంది. అది ఈ సూత్రాల ఆధారంగా సామాజిక జీవితపు నవ నిర్మాణాన్ని క్రియారూపంలో చేసి చూపింది కూడా. అలాంటి ఇస్లాం తన సామాజిక వ్యవస్థలో బానిస వ్యవస్థకు చోటు ఎందుకు కల్పించింది? దానిగ్గాను వివిధ నిబంధనలు, శాసనాలు కూడా ఎందుకు నిర్మించింది? మానవాళి అంతా స్వాములని, బానిసలని శాశ్వతంగా రెండు వర్గాల్లో విభక్తమయి ఉండాలన్నది దేవుని కోరికా? మానవుల్లో ఓ వర్గాన్ని నోరులేని

పశువుల్లా సంతలో అమ్మకానికి, కొనుగోలుకు పెట్టడమే అల్లాహ్‌కు ఇష్టమా? ఆయన తన దివ్య గ్రంథంలో ఏమన్నాడు? -

> నిస్సందేహంగా మేము ఆదమ్ సంతానానికి గౌరవ మర్యాదల నిచ్చాము. (17 : 70)

ఒకవేళ అలా జరగడం దైవానికి ఇష్టం లేదంటే ఆయన ఈ బానిసత్వం పట్ల నిషేధాన్ని స్పష్టంగా ఎందుకు ప్రకటించలేదు - మద్యపానం, జూదం, వడ్డీ విషయంలో చేసినట్లు? ఒక్కమాటలో చెప్పాలంటే నేటి ముస్లిం యువకునికి, ఇస్లాం సత్యధర్మమని బాగా తెలుసు. అయితే అతను హజ్రత్ ఇబ్రాహీం (అస్సలాం) మాదిరిగా సందిగ్ధంలో పడ్డాడు. ఈ స్థితినే దివ్యఖుర్‌ఆన్ ఈ విధంగా అభివర్ణించింది :

> ఇబ్రాహీమ్ (అస్సలాం) ఇలా కోరిన వేళ: 'నా ప్రభూ! నాకు చూపించు, నీవు మృతుల్ని ఎలా బ్రతికిస్తావో? (దేవుడు) అడిగాడు, నీవు (దీన్ని) నమ్మడం లేదా? అని. (ఆయన) విన్నవించుకున్నాడు, 'నమ్మకమయితే నాకు ఉంది కాని నా మనస్సుకు తృప్తిని కలిగించడానికి (ఇలా అడుగుతున్నాను) ;

దీనికి భిన్నంగా ఎవరయితే సామ్రాజ్య శక్తుల పన్నాగాలకు, వారి కుట్రలకు తమ బుద్ధిని అమ్ముకున్నారో, ఎవరయితే విశ్వాసాలు సిద్ధాంతాల విషయంలో చంచల మనస్కులో వారిలో సత్యాన్ని గ్రహించడానికి కావలసిన సహనస్థయిర్యాలే కానరావు. అందువల్ల ఇలాంటి వారు తమ భావోద్రేకాల వెల్లువలో కొట్టుకుపోతారు. పర్యవసానంగా ఆలోచించకుండా అర్థం చేసుకోకుండా ఇస్లాం గతించిపోయిన ఓ గాథ, ఇప్పుడు దాని ఆవశ్యకత తీరి పోయింది, దానికి కాలం చెల్లింది అన్న నిర్ణయానికి వచ్చేస్తారు.

## శాస్త్రీయ వంచన

కమ్యూనిస్టు ప్రచారకులు తాము బోధించేది సశాస్త్రీయమయిన సిద్ధాంతాలని ప్రజలను మోసగిస్తూ ఉంటారు. కాని వారి 'సైంటిఫిక్ సిద్ధాంతాల' వాస్తవికత ఏమంటే ఇవి వీరి సొంత మేధనుండి ఉత్పన్నమయినవి కావు. అవి వారు తమ విదేశీ స్వాములనుండి అరువుతెచ్చుకున్నవి. ఏ సత్యాన్ని వారు కనుగొన్నట్లు ప్రగల్భాలు పలుకుతున్నారో అది తార్కిక భౌతిక వాదం (DIALECTICAL METERIALISM) అనే సిద్ధాంతం. ఈ సిద్ధాంతం ప్రకారం మానవ జీవితం కొన్ని ప్రత్యేక, అనివార్యమయిన ఆర్థిక దశలను దాటుకుపోతుంది. మొదటి దశ కమ్యూనిజం· రెండవది బానిసత్వం, భూస్వామ్యం, కాపిటలిజం. మూడవది లేక చివరిది రెండవ కమ్యూనిజం (ఇది చివరి ఘట్టమన్నమాట).

ఈ సిద్ధాంతం చెప్పేదేమంటే మానవాళికి చరిత్ర గతిలో ఎదురయిన సకల విశ్వాసాలు, సిద్ధాంతాలు, ఆలోచన ఆచరణల వ్యవస్థలు సర్వం వాస్తవానికి ఆయా కాలాల ప్రత్యేక ఆర్థిక వ్యవస్థల్ని లేక సామాజిక పరిస్థితుల్ని సంఘటనల్ని ప్రతిబింబిస్తాయి. గతంలో ఉత్పన్నమయిన విశ్వాసాలు, సిద్ధాంతాలు, తత్వాలు, ఆయా కాలాలకు సరయినవే. ఎందుకంటే అవి, ఆనాటి ఆర్థిక చక్రం, ఆర్థిక పరిస్థితులతో పూర్తిగా సామరస్యం కలిగి ఉండేవి. కాని ఆ తరువాత వృద్ధి చెందిన కాలాలకు అవి ఏ విధంగానూ సరిపడవు. ప్రతి దశలోనూ ఆయా కాలపు తత్వ వ్యవస్థ దానికి మునుపటి దానికంటే ఎంతో మేలయినదిగా ఉంటుంది. దీనివల్ల తేలిందేమంటే మానవ జీవితం కొరకు ప్రత్యేకమయిన, శాశ్వతమయిన, రాబోయే కాలాలన్నింటికీ సరిపడే ఏ జీవనవ్యవస్థను రూపొందించడమయినా దుర్లభమే.

"ఇస్లాం వచ్చిన నాటికి బానిసత్వపు కాలం తన అంతిమ దశలో ఉండింది. అప్పుడప్పుడే భూస్వామ్య వ్యవస్థ రూపు దిద్దుకుంటూ ఉండింది.

అందువల్ల ఇస్లాం ప్రతిపాదించిన విశ్వాసాల్లోనూ, జీవన వ్యవస్థలోనూ ఆ కాలపు ప్రత్యేక ఆర్థిక పూర్వరంగం కొట్టవచ్చినట్టు కానవస్తుంది. ఈ కారణం చేతనే ఇస్లాం, ఆనాడు చెలామణిలో ఉన్న బానిసత్వాన్ని ధృవీకరించింది. భూస్వామ్య వ్యవస్థను యథాతథంగా ఉండనిచ్చింది. ఎందుకంటే ఘనత వహించిన కారల్ మార్క్స్ గారి మనోజ్ఞసూక్తి ప్రకారం, నేడు లేని, రేపు రాబోయే అధికతర ప్రగతినొందిన ఆర్థిక పరిస్థితుల్ని ఊహించి ఆ అవసరాలకనుగుణమయిన చట్టాలను చెయ్యడమయినా జీవన నియమావళిని సమకూర్చడమయినా కానేరని కార్యం."

కమ్యూనిజం చేసే ఈ వాదనలో ఎంతవరకు సత్యముంది అన్న విషయాన్ని తెలుసుకోడానికి బానిసత్వపు సమస్య ఏమిటో, దాని నిజమయిన చారిత్రక, సామాజిక, మనోశాస్త్రి పరమయిన నేపథ్యమేమిటో అన్వేషించడం, యదార్థాన్ని అర్థం చేసుకోవడం ఎంతో అవసరం.

## భయంకర చిత్రం అపార్థానికి మూలం

నేటి మానవుడు, 20వ శతాబ్దలో కూచోని, బానిసత్వ సమస్యను పరిశీలించినప్పుడు, ఆ చరిత్రలో మనుషుల్ని వ్యాపార వస్తువుగా క్రయ విక్రయాలకు గురిచేసిన రోమను యుగం, అసహ్యాకరమయిన అపరాధాలతో మలినమయి ఉండటం గమనిస్తాడు. అతనికి బానిసత్వపు చరిత్ర అత్యంత జుగుప్సాకరమయినదిగా, భయంకరమయినదిగా దర్శనమిస్తుంది. ఇస్లాం ప్రతిపాదించే సిద్ధాంతాలు, చట్టాలు మనిషిని అన్నిరకాల బానిసత్వాల నుండి విముక్తం చేసే మౌలిక భావన ఆధారంగా రూపొందినవే అయినప్పుడు అది ఇలాంటి బానిసత్వాన్ని ధర్మబద్ధం చేస్తుందంటే అతనికి నమ్మ శక్యం కాదు. కాని ఇక్కడ ఓ పొరపాటు జరిగింది. ఇస్లాంను గురించి పరిపూర్ణ అవగాహన లేకపోవడం చేతనే ఇలాంటి భావం ఏర్పడింది. ఎందుకంటే బానిసత్వపు ఈ జుగుప్సాకరమయిన భావనకు ఇస్లాంతో ఎలాంటి సంబంధం లేదు.

ఈ విషయంలో చరిత్ర సాక్ష్యాధారాలను పరిశీలించడం ఉత్తమం. రోమను సామ్రాజ్యంలో బానిసలు ఏ విధంగా జీవించేవారో అర్థం చేసుకోడానికి మన వద్ద సాక్ష్యాలు, వివరాలు పుష్కలంగా ఉన్నాయి. వాటిని ముందుంచుకుని చూస్తేనేగాని ఇస్లాం బానిసల విషయంలో తెచ్చిన మహత్తర విప్లవం ప్రస్ఫుటం కాదు. ఇస్లాం కేవలం బానిసల 'విడుదల' లేక విముక్తికి మాత్రమే కృషి చెయ్యలేదు, సకల మానవ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు సంబంధించిన సరయిన భావనను కూడా ప్రతిపాదించింది. అంతేకాదు, ఆ భావనకనుగుణంగా ఆచరించి మరీ చూపింది. ఈ మహోత్కృష్టమయిన విప్లవం సంభవించిన తరువాత ప్రపంచం ఈ విషయంలో మరో చర్య ఏదీ తీసుకునే అవసరం లేకుండా పోయింది.

## వారికన్నా పశువులే నయం

రోమను పాలనాకాలంలో బానిసల్ని మానవులుగా కాక వ్యాపార వస్తువుగా భావించేవారు. వారికి ఎలాంటి హక్కులూ ఉండేవికావు; కఠినమయిన విధులు, అలవికి మించిన బాధ్యతలతో, వారిని అణచి వేసేవారు. అసలు ఈ బానిసలు ఎలా లభించేవారు. వారు లభించే పెద్ద మార్గం యుద్ధాలు-అవి ఏదో గొప్ప ధ్యేయం కొరకో, ఉన్నత సిద్ధాంతాల కొరకో చేసే యుద్ధాలు కావు. ఇతరుల్ని బానిసలుగా చేసి వారిని తమ స్వార్థ ప్రయోజనాల కొరకు పావులుగా ఉపయోగించుకోవడానికి చేసేవి. ఆ యుద్ధాల్లో పట్టుబడే ఖైదీలందరినీ బానిసలుగా మార్చుకునేవారు. ఈ యుద్ధాల లక్ష్యం, రోమనుల కొరకు విలాస సామగ్రి, చల్లని, వెచ్చని స్నాన వాటికలు, ఆడంబర అంబరాలు, స్వాదిష్టమయిన ఆహారాలు, జీవితపు ఇతర రుచులు సమకూర్చుకోవడం తప్ప మరేదీకాదు. తత్కారణంగా వ్యభిచారం, మధుపానం, నృత్యగాన కచ్చేరీలు, ఇతర 'సాంస్కృతిక' సమావేశాలు, సంతలు గట్రా విరివిగా సాగేవి. భౌతిక సౌలభ్యాలు, భోగవిలాసాల ఈ సామగ్రిని పొందడానికి రోమనులు ఇతర జాతుల వారిపై దాడులు జరిపేవారు, వారిని బానిసలుగా చేసుకుని నిర్దయగా

తమ విషయలాలాలస, విషయలోలత్వపు వాంఛల పరిపూర్తికై వాడుకునేవారు. రోమనులు జరిపే అత్యాచారాలకు, వారి వాతనబడ్డ ఈజిప్ట్ ప్రబల నిదర్శనం. ఇస్లాం విచ్చేసి ఈజిప్ట్‌ను రోమనుల బారినుండి విముక్తం చేసింది. రోమను సామ్రాజ్యం కొరకు ఈ దేశం కేవలం గోధుమల్ని సరఫరా చేసే గోదాముగా లేక ఇతర భౌతిక అవసరాలను తీర్చే మార్గంగా మాత్రమే పనికి వచ్చేది.

కాంక్షాదాసులయిన రోమన్ సామ్రాజ్యవాదుల కొరకు భోగ విలాస సామగ్రిని సమకూర్చేందుకు బానిసల 'మందలు' పగలంతా పొలాల్లో పశువుల్లా నిమగ్నులయి ఉండేవారు. అయినా వారికి కడుపు నిండా కూడు కూడా ప్రాప్తమయ్యేది కాదు. ఊపిరి నిలుపుకునేందుకు ఎంతో కొంత వారిముందు పడేసేవారు. దాని ఆధారంగా వారు తమ ప్రభువుల సేవచేస్తూ ఉండవలసి వచ్చేది. ప్రాణంలేని చెట్లకన్నా, జంతువులకన్నా వారి పరిస్థితి అధ్వాన్నంగా తయారయింది. పగల్లో పనివేళల్లో కాళ్ళకు బేడీలు వేసేవారు – వారు తమ కాపరుల చూపు తప్పించుకు పారిపోకుండా ఉండేందుకు. వారి వీపులపై కొరడా దెబ్బలు లెక్కలేకుండా వర్షించేవి. నిజానికి వారి యజమానికి లేక కాపరికి అలా చావబాదడంలో, బాధించడంలో ఎంతో ఆనందం తృప్తి లభించేవి. సాయంత్రానికి పని ముగిసినప్పుడు పదేసిమందిని, ఒకొక్కప్పుడు యాభయ్యేసి మందిని వివిధ గ్రూపులుగా చేసి పశువుల్లా దుర్వాసనా భరితమయిన, అసహ్యకరమయిన, ఎలుకలు, గండుచీమలు ఇతర కీటకాలతో నిండిన దొడ్లల్లో వేసి బంధించేవారు. చేతులకు, కాళ్ళకు ఆ స్థితిలోనూ బేడీలు తప్పేవికావు. జంతువులే నయం. వాటికయినా విశాలమయిన దొడ్లు లభించేవి. కాని ఈ జనం ఆ సౌలభ్యానికీ నోచుకోలేదు.

## ఉల్లాసానికి, కాలక్షేపానికి

బానిసల విషయంలో రోమనుల వైఖరి ఎంత జుగుప్సా

కరమయినదిగా ఏహ్యమయినదిగా ఉండేదో నిరూపించే చిత్రం, వారి ప్రియాతి ప్రియమయిన కాలక్షేపంలో కానవచ్చేది. దాని ద్వారా రోమనుల సంస్కృతిలో ఊపిరిగా అలరారిన మృగత్వం, రాక్షసత్వం, చండాలత్వం వ్యక్తమవుతాయి. ఆధునిక యుగంలో యూరపు మరియు అమెరికా కూడా తమ సకల సామ్రాజ్య వాదపు సాధనా సంపత్తితో పాటు వీటిని కూడా వారసత్వంగా పుణికి పుచ్చుకు తెచ్చాయి.

ప్రభువులవారి కాలక్షేపం కొరకు కొందరు బానిసలకు కత్తులు, కరవాలాలు, బల్లెములూ ఇచ్చి ఓ మైదానంలో వదిలేవారు. మైదానానికి నలువైపులా ప్రేక్షకుల కొరకు కూర్చునే ఏర్పాట్లు ఉండేవి. వాటిపై బానిసల యజమానులు, తరచుగా స్వయాన రోము చక్రవర్తి ఆసీనులయి తమాషా తిలకించేవారు. ఆట మొదలయిందంటే బానిసలు ఆ కత్తులు కటారులు తీసుకొని ఒకరిపై మరొకరు విరుచుకు పడేవారు. పర్యవసానంగా చివరికి వాళ్ళంతా నుజ్జు నుజ్జు అయ్యేవారు. అదృష్టవంతులు ఎవరయినా ఆ ఆటలో బ్రతికి బయటపడితే వారిని విజేతలుగా నిర్ణయించేవారు. వారిని బాగా ప్రశంసించేవారు. బాగా చప్పట్లు చరచి, ఆనందాతిశయంతో కేకలువేసి, నవ్వుల తోరణాలు విసిరి వారిని స్వాగతం పలికేవారు.

రోమనుల జగత్తులో బానిసల సామాజిక స్థితి ఇదే. ఈ సందర్భంలో రోమను శాసనాల్లో సూచించబడిన బానిసల స్థితిని గురించిగాని, యజమానుల ప్రచండ అధికారాలను గురించిగాని ప్రస్తావించడం అనవసరమని భావిస్తున్నాము. ఆ చట్టాల ప్రకారం బానిసల జీవన్మరణాలు యజమానుల ఇష్టాయిష్టాలపై ఆధారపడి ఉండేవి. యజమానులు నిర్దయంగా, నిర్భయంగా తమ నీచ లక్ష్యాలకుగాను వారిని వాడుకునే అధికారం కలిగి ఉండేవారు. ఎందుకంటే బానిసలకు సమాజంలోని ఏ వర్గం మద్దతు కూడా లభించేది కాదు.

పర్షియా, భారతదేశం ఇంకా ఇతర ప్రపంచదేశాల్లోనూ బానిసలపై

జరిగే జులుంలోగాని, దాని ఎడల బానిసల అశక్తతలోగాని పెద్ద వ్యత్యాసం ఉండేదికాదు.ఏదో కొంత స్వల్పమయిన తేడా తప్ప ప్రపంచంలోని విభిన్న దేశాల్లో బానిసల స్థితి, వారి సామాజిక స్థాయి విషయంలో పెద్ద వ్యత్యాస ముండేదికాదు. బానిసల ప్రాణానికి విలువేలేదు. వారిని హతమార్చినా రక్తపరిహారంగాని మరే విధమయిన శిక్షగాని విధించేందుకు అదొక అపరాధంగానే పరిగణించేవారు కాదు. వారిపై బాధ్యతలు, విధుల భారమేకాని వారికి హక్కులు మాత్రం పూజ్యం. ప్రపంచ దేశాల్లో బానిసలను గురించి దృక్పథం రీత్యాను, వారి సామాజిక హక్కుల రీత్యాను ఎలాంటి వ్యత్యాసముండేదికాదు. ఏదయినా వ్యత్యాసముంటే అది బానిసల పట్ల యజమానుల వైఖరిలోని కాఠిన్యంలోను, దౌర్జన్యపరత్వపు తీవ్రతలోను కానవచ్చేది. ఒక్కోచోట బానిసలు అన్యాయం, అత్యాచారాల జుగుప్సాకరమయిన వ్యవహారానికి గురయితే మరోచోట కాస్తంత తక్కువ స్థాయి అక్రమాలకు లోనయ్యేవారు.

## విప్లవాత్మకం ఈ పిలుపు

ఇలాంటి పరిస్థితుల్లో ఇస్లాం ఆవిర్భవించింది. అది బానిసలకు వారు కోల్పోయిన మానవీయ ఘనతను వారికి అనుగ్రహించింది. అది యజమానుల్నీ బానిసల్నీ సమంగా బోధించి స్పష్టంగా ప్రకటించింది:

"మీరంతా ఒకే వర్గానికి చెందినవారు." (4 :25)

ఇంకా ఇలా ప్రకటించింది:

> "ఎవరయితే బానిసని హత్యచేస్తారో అతనికి బదులుగా వారినీ హతమార్చడం జరుగుతుంది. ఎవరయితే అతని ముక్కును కోస్తారో వారి ముక్కునూ కొయ్యడం జరుగుతుంది. ఎవరయితే అతన్ని నపుంసకుణ్ణి (STERILE) గా చేస్తారో వారినీ అలా

చెయ్యడం జరుగుతుంది."[1]

ఇస్లాం బానిసలు, యజమానులు, ఒక్కమాటలో మానవులందరికీ ఉమ్మడి ప్రారంభం, ఉమ్మడి నివాసం, ఉమ్మడి పరిణామం ఉందని విశదీకరించింది:

"మీరంతా ఆదం సంతానమే. ఆదం మన్నుతో సృజించబడ్డాడు."[2]

అందువల్ల అది యజమానికి బానిసపై, కేవలం యాజమాన్యం ఆధారంగా ఎలాంటి ఘనతను గొప్పదనాన్ని ఆపాదించలేదు. గొప్పదనానికి పునాదులు కేవలం భయభక్తులు, రుజువర్తనం మాత్రమే అని చాటింది:

" అరబ్బుకు అరబ్బేతరునిపైగాని, అరబ్బేతరునికి అరబ్బు పైగాని, నల్లవానికి తెల్లవానిపైగాని, తెల్లవానికి నల్లవానిపైగాని ఎలాంటి ప్రాధాన్యత లేదు - భయ భక్తుల ఆధారంగా తప్ప."[3]

ఇస్లాం, బానిసలపట్ల న్యాయవంతమయిన, ఉత్తమమయిన రీతిలో వ్యవహరించమని యజమానులకు బోధించింది.

"తల్లి దండ్రులతో మంచిగా వ్యవహరించండి. బంధువులు, అనాధలు, నిరాధారుల ఎడల ఉత్తమ రీతిలో వ్యవహరించండి. పొరుగున వున్న బంధువుతో, పరిచయంలేని పొరుగువారితో, తోడుగా ఉండేవారితో, ప్రయాణీకునితో, మీ అధీనంలో ఉండే బానిసలతో ఉత్తమ రీతిలో వ్యవహరించండి. బాగా తెలుసుకోండి. అల్లాహ్ అహంకారులను గర్విష్ఠులను ఇష్టపడడు." (4 : 36)

---

(1) ప్రవక్త ప్రవచనం - హదీసు - బుఖారి, ముస్లిం, అబూదావూద్, తిర్మిజి, నసాయి.
(2) హదీసు - ముస్లిం, అబూదావూద్.
(3) హదీసు - బుఖారి.

ఇస్లాం మరో విషయాన్ని కూడా బోధించింది. యజమాని, బానిసల మధ్య సంబంధం యాజమాన్యం మరియు బానిసత్వాలదో, లేదా అధికారి, విధేయుడిదో కాదని, సోదరత్వం, బంధుత్వాల సంబంధం అని నొక్కి చెప్పింది. యజమానులు తమ బానిసల్ని పెళ్ళి చేసుకోవడం పట్ల ఇలా ఉద్బోధించింది :

> "మీలో ఎవరయితే ముస్లిములయిన కుటుంబ స్త్రీలను పెళ్ళి చేసుకునే స్తోమత కలిగి ఉండడో అతడు మీ అధీనంలో ఉండే ముస్లిములయిన బానిస స్త్రీలను పెళ్ళి చేసుకోవాలి. అల్లాహ్‌కు మీ విశ్వాసం గురించి బాగా తెలుసు. మీరంతా ఒకే వర్గానికి చెందినవారు. అందువల్ల వారి (బానిసల) పోషకుల అనుజ్ఞ పొంది వారితో పెళ్ళి చేసుకోండి. ఇంకా మామూలు రీతిలో వారి మహర్‌ని చెల్లించండి." (4 : 25)

బానిసలు మీ సోదరులని ఇస్లాం యజమానులకు తెలియపరిచింది. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు:

> మీ బానిసలు మీ సోదరులు. అందువల్ల మీలో ఎవరి అధీనంలోనయినా అతని సోదరుడు ఉన్నప్పుడు, అతడు తాను తినే తిండిని, తాను తొడిగే బట్టను అతనికీ తినిపించాలి, తొడిగించాలి. అతడు చెయ్యనలవికాని ఏ పనినీ అతనికి పురమాయించరాదు. ఒకవేళ ఎప్పుడయినా అలాంటి పని తటస్థపడితే తానూ అతనికి చేయూత నివ్వాలి.[1]

అంతేకాదు ఇస్లాం, బానిసల భావోద్రేకాలను అనుభూతులను కూడా గౌరవించింది, ఆదరించింది. దైవ సందేశహరుని ప్రబోధం:

---

★ హదీసు

> "మీలో ఎవ్వరూ మీ బానిసల ఎడల వీరు నా బానిసలని, బానిస స్త్రీ అని సంబోధించరాదు. 'వీరు నా పనిమనిషి (సహాయకుడు) పనికత్తె (సహాయకురాలు)' అని చెప్పాలి."

ఈ బోధన, శిక్షణల ప్రభావమే ఒకసారి హజ్రత్ అబూ హురైరా చేత ఇలా చెప్పించింది:

> ఒకసారి ఒకవ్యక్తి గుర్రాన్నెక్కి పోతూ ఉండగా అతని బానిస గుర్రం వెనుక నడుస్తూ పోవడాన్ని అబూ హురైరా చూశారు. అప్పుడు ఆయన స్వారి చేస్తున్న యజమానిని ఉద్దేశించి 'ఇతన్ని గుర్రంపై నీ వెనకాల కూర్చోబెట్టుకో, అతడూ నీ సోదరుడే, అతనికీ నీలాంటి ప్రాణమే ఉంది' అని ఆదేశించారు.

## తొలిసారిగా అన్ని హక్కులు

బానిసల సంక్షేమం కొరకు ఇస్లాం చేసిన సేవ ఇంతమాత్రమే కాదు. ఆ గాథ ఎంతో నిడివయినది. కాని ముందుకు సాగేముందు, ఇస్లాం మూలంగా మొదటి దశలో బానిసల సామాజిక స్థానం, స్థాయిల్లో ఎంత బృహత్తర పరివర్తనం వ్యక్తమయిందో దానికి మూల కారణమయిన ఆ మహోన్నత విప్లవం యొక్క రూపురేఖల్ని క్లుప్తంగా చర్చించడం అవసరం.

ఇస్లాం ఆవిర్భావం తరువాత బానిసల స్థితిలో వచ్చిన మార్పుకు పర్యవసానంగా వారు వ్యాపార వస్తువుగా కాక మొదటిసారిగా పూర్తిగా మానవతా హక్కుల్ని గౌరవాదరణల్ని పొందారు. ఇస్లాంకు పూర్వం వారిని మానవులుగా కాక క్షుద్రమయిన సృష్టిగా పరిగణించేవారు. వారు కేవలం ఇతరుల సేవచేయడానికే పుట్టినట్లు, ఇతరులు జరిపే అవమానం, పరాభవాలను ఓరిమితో, కృతజ్ఞతతో భరించడం సహించడం మాత్రమే వారి విధి అయినట్లు భావించేవారు. బానిసల ఎడల ఈ దృక్పథం కారణంగానే బానిసల్ని నిస్సంకోచంగా హతమార్చేవారు. అనాగరిక

శిక్షలకు గురిచేసే వారు. వారిచేత అత్యంత కఠినమయిన, అసహ్యాకరమయిన పని చేయించేవారు.* ఇంత జరిగీ ఒక్కని మనస్సాక్షిలోనయినా, ఏ కాస్త అయినా, స్వల్పమయిన బాధకూడా రగిలేదికాదు. ఇస్లాం, బానిసలను ఈ అత్యంత నీచమయిన స్థాయినుండి లేవనెత్తి, స్వతంత్ర మానవుల స్థాయికి చేర్చింది. ఇస్లాం చేసిన ఈ మహత్కార్యాలు కేవలం అందమయిన ప్రకటనలే కాదు చరిత్ర కాదనలేని సత్యాలు. చరిత్ర పుటలే దానికి సాక్ష్యం.

## సర్వత్రా సమానత

ఇస్లాం అంటేనే మండిపడే యూరపు పండితులు సయితం, ఇస్లాం ప్రారంభ కాలంలో బానిసలకు లభించిన ఉన్నత సామాజిక స్థాయిని ప్రపంచంలో మరెక్కడా, మరే జాతిలోనూ ప్రాప్తం కాలేదన్న యదార్థాన్ని ఒప్పుకున్నారు. ముస్లిం సమాజంలో బానిసలకు గౌరవప్రదమయిన స్థానం లభించింది. బానిసత్వపు బంధనాలనుండి విముక్తులయిన బానిసలకు తమ మాజీ యజమానుల పట్ల ద్రోహం తలపెట్టే ఆలోచన కూడా వచ్చేది కాదు. నిజానికి మాజీ యజమానుల పట్ల వారికి ఏ విధమయిన భయమో, లేక వారి సహాయ సహకారాల ఆశో వారికి లేకపోయినా వారు కక్ష సాధింపు వైఖరిని అవలంబించలేదంటే కారణం వారు తమ మాజీ

---

* భారతదేశంలో బానిసలు (శూద్రులు) దేవుని పాదాల నుండి పుట్టారన్న భావన ఉండేది. అందువల్ల వారిని నీచంగా తక్కువగా చూసే వారు. తమ జన్మ కారణంగా వారు ఎన్నటికీ మారే ప్రసక్తే లేదన్న భావం కూడా ప్రబలిఉండేది. పర్యవసానంగా వారికి మిగిలింది ఒకే దారి. ఈ పరాభవాన్ని జుగుప్సాకరమయిన ప్రవర్తనను వారు సహనంతో భరించాలి – వచ్చే జన్మలో నయినా మేలయిన సృష్టిగా పుట్టే ఆశతో. ఈ విధంగా వారి చేత శారీరకంగా దాస్యం చేయించుకోవడమే కాక, ఆ దాస్యం పట్ల తృప్తి చెంది దాన్ని తమ కర్మగా భావించి పడి ఉండేలా వారి మానసిక తర్ఫీదు కూడా చెయ్యడం జరిగింది. వారు ఆ అన్యాయపు వ్యవస్థకు తిరగబడి తమ భవితవ్యాన్ని మెరుగుపరచుకునే అవకాశమే లేకుండా పోయింది.

యజమానులకు సమానులుగా అవడమే. వారిప్పుడు యజమానుల కుటుంబంలోని సభ్యులుగా రూపొందారు. ఇస్లాం వారి మధ్య 'విలాయత్' సంబంధాన్ని ఏర్పరచింది. అది రక్త సంబంధానికి ఏ విధంగాను తక్కువయింది కాదు.

మరో విషయం ఏమిటంటే, బానిసల ప్రాణం కూడా స్వతంత్ర వ్యక్తుల ప్రాణానికి సమానంగా ఆదరణీయమని గౌరవనీయమని ప్రకటించటం జరిగింది. స్వయంగా చట్టమే వారి ప్రాణాలను కాపాడే బాధ్యత తనపై వేసుకుంది. బానిసలకు ప్రతికూలంగా మాటలచేత నయినా చేతల వల్లనయినా ఏ విధమయిన అత్యాచారం జరపడం కూడా అపరాధంగా పరిగణించబడింది. వారిని బానిసలుగా పిలువడం కూడా నిషేధించారు మహాప్రవక్త (స అసం). వారిలో ఆత్మవిశ్వాసం పెరిగేలా, వారి మధ్య మానసిక దూరాలు తగ్గేలా వారు తమను తమ యజమానుల కుటుంబ సభ్యులుగా భావించేలా వారిని సంబోధించాలని ఆయన బోధించారు. "దైవం మిమ్మల్ని వారి యజమానులుగా చేశాడు. ఆయన సంకల్పిస్తే మిమ్మల్ని వారి చేతుల్లో బానిసలుగా చేసి ఉండేవాడే" అని కారుణ్యమూర్తి పలికారు. భావమేమంటే సందర్భవశాత్తు వారు బానిసలయ్యారు లేకపోతే నిజానికి వారికీ వారి యజమానులకూ మధ్య మానవులవడం రీత్యా ఎలాంటి వ్యత్యాసమూ లేదు అన్నమాట. ఈ విధంగా ఇస్లాం యజమానుల అనవసరమయిన గర్వాన్ని అణచింది. మరోవైపు బానిసల సామాజిక స్థాయిని పెంచి వారిని కేవలం మానవత ఆధారంగా తమ యజమానులతో కలిపివేసింది. పర్యవసానంగా బానిసలు, యజమానులు చేరువయ్యారు. వారి మధ్య ప్రేమానురాగాలు పెరిగాయి. ఈ ప్రేమే మున్ముందు సకల మానవీయ సంబంధాలకు మూలాధారంగా రూపొందింది. శారీరక బాధ లేక నష్టానికి సంబంధించినంతవరకు బానిసలకు యజమానులకు అందరికీ ఒకే చట్టం ఏర్పరచడం జరిగింది. ఈ రూపంలో వారి మధ్య ఎలాంటి వ్యత్యాసాన్ని వివక్షతను పాటించే ఆస్కారం లేకుండా చూడటం జరిగింది. ఇస్లాం శాసనాంగం ప్రకారం, 'బానిసని చంపినవాడు,

చంపబడతాడు' అన్నది, దాని విస్తృత ప్రభావ పరిధి దృష్ట్యా ఎంతో స్పష్టమయిన చట్టం. * యజమాని, బానిసల మధ్య సంపూర్ణమయిన సమానతను నెలకొల్పడమే దీని లక్ష్యం. వారికీ జీవితంలో సకల అవకాశాలూ సమానంగా లభించాలన్నదే దాని ధ్యేయం.

## మానవ హక్కులు

ఇస్లాం బోధనల ప్రకారం ప్రస్ఫుటమయిన యదార్థం ఏమిటంటే బానిసలు కేవలం తమ ఈ ప్రస్తుత పరిస్థితుల కారణంగా ఏ మానవీయ హక్కుల్నీ కోల్పోరాదు. ఇస్లామీయ షరీఅత్ ప్రసాదించిన ఈ హక్కులు కేవలం బానిసల ప్రాణాలను కాపాడటం మాత్రమే కాక అవి ఎంతో విశాల హృదయాన్నీ, శ్రేష్టమయిన ప్రమాణాలను సూచిస్తున్నాయి. అలాంటి అనుపమ హక్కుల్ని ఇస్లామ్‌కు పూర్వపు చరిత్రగాని తరువాతి సమాజాలు కాని సూచించలేకపొయ్యాయి. ఈ సందర్భంలో ఇస్లాం ఎంతవరకు వెళ్ళిందంటే తన బానిసకు ఒక చిన్న చెంప దెబ్బ కొట్టే అర్హతకూడా యజమానికి లేకపోయింది – ఏదో తప్పు చేసినప్పుడు శిక్షించడానికి వినా. అయితే ఈ శిక్షకు కూడా కొన్ని అతిక్రమించరాని పరిధులు హద్దులు నియమించడం జరిగింది. ఆ శిక్ష చిన్న పిల్లలకు పెద్దలు విధించే శిక్ష కంటే పెద్దది కాదు. కాని ఈ నిబంధనే ఆ తరువాత బానిసల విముక్తి కొరకు ఒక చట్టబద్ధమయిన కారణంగా పరిణమించింది. ఇక ఆ తరువాత ప్రాప్తమయిన నిజమయిన స్వేచ్ఛ విముక్తులను గురించి చర్చిద్దాము.

## సర్వ స్వతంత్రత వైపుకు

తన సంస్కరణోద్యమం తొలిదశలో ఇస్లాం, బానిసలకు మానసిక

---

* ఇమామ్ గజాలి వ్రాసిన "ఇస్‌యా ఉల్ ఉలూముద్దీన్" లో బానిసల అధ్యాయం చూడండి.

మయిన ఆధ్యాత్మికమయిన స్వేచ్ఛను స్వతంత్రతను ప్రసాదించింది. వారు కోల్పోయిన మానవతా స్థానంలో వారిని పునస్థాపించింది. ఒకే మూలం- మానవతకు సంబంధించిన వారవడంచేత వారూ వారి యజమానులూ అందరూ సమానంగా ఒకే విలువను కలిగి ఉన్నారు. వారు స్వేచ్ఛను కోల్పోయినంతమాత్రాన మానవతనూ కోల్పోలేదు. ఒక్క 'బానిసత్వం' తప్ప వారు సకల విధాలా ఇతర మానవులకు సమానమయిన వారే. ఈ విధంగా వారికి తమ ప్రభువులకు ఉన్న హక్కులన్నీ లభించాయి. ఇది తొలి దశ.

ఇస్లాం అంతటితో ఆగిపోలేదు. ఎందుకంటే అది ఆకాంక్షించేది సంపూర్ణ మానవ సమానత్వం. ఆ సంపూర్ణ స్వతంత్రస్థాయిలో వారు అందరితో పాటు సమానంగా సకల హక్కులూ కలిగి ఉండాలన్నదీ దాని అభిలాష. అందువల్ల ఇస్లాం బానిసల అసలయిన స్వేచ్ఛా స్వతంత్రతల వైపుకు పురోగమించింది. ఈ లక్ష్యసిద్ధికి రెండు మార్గాలు అవలంబించింది. (1) అల్ ఇత్క్ - అంటే యజమానుల తరఫున బానిసల స్వచ్ఛంద స్వేచ్ఛ. (2) ముకాతబత్ - అంటే యజమానులూ బానిసల మధ్య స్వేచ్ఛకు సంబంధించిన వ్రాతమూలకమయిన ఒప్పందం.

## అల్ ఇత్క్

షరీఅత్‌లో అల్ ఇత్క్ అంటే ఒక యజమాని తన బానిసను సంతోషంగా స్వచ్ఛందంగా విడుదల చేసే చర్య అని అర్థం. దీన్ని ఇస్లాం ఎంతో ప్రోత్సహించింది. స్వయంగా ప్రవక్త మహనీయులు (సఅసం) ఈ విషయంలో తన సహచరుల సమక్షంలో ఉన్నతమయిన ఆదర్శాన్ని నెలకొలిపారు. ఆయన తన బానిసలందరినీ విడుదల చేసివేశారు. ఆయన సహచరులు కూడా ఆయన అనుసరణలో తమ తమ బానిసలకు స్వేచ్ఛను ప్రసాదించారు. ఇంకా హజ్రత్ అబూబక్ర్ అయితే తన సంపదలో అత్యధిక భాగాన్ని బానిసల్ని వారి యజమానుల నుండి కొని

విడుదల చెయ్యడంలోనే వినియోగించారు. బైతుల్ మాల్ (ఇస్లామీయ రాజ్య ధనాగారం) లో కూడా ఈ ఉద్దేశానిగ్గాను కొంత ధనం కేటాయించడం జరిగింది. దాని ద్వారా బానిసల్ని కొని వారికి స్వేచ్ఛను ప్రసాదించడం జరిగేది. యహ్యాబిన్ సయీద్ ఉల్లేఖనం ప్రకారం "ఒకసారి హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రజిఅన్) నన్ను జకాత్ వసూలు చెయ్యడానికి ఆఫ్రికా పంపారు. నేను జకాత్‌ను వసూలు చేసి దాన్ని పంచిపెట్టడానికి అర్హులయిన అగత్యపరులకొరకు అన్వేషించడం మొదలెట్టాను. నాకు జకాత్‌ను పొందే అర్హుడయిన వ్యక్తి ఒక్కడయినా తటస్థించలేదు. ఎందుకంటే హజ్రత్ ఉమర్‌బిన్ అబ్దుల్ అజీజ్ ప్రజలకు ఆ విధంగా సౌభాగ్యవంతులుగా చేశారు. అప్పుడు నేను ఆ మొత్తాన్ని బానిసల్ని కొని విడుదల చెయ్యడానికి వినియోగించాను."

మహనీయ ముహమ్మద్ (సఅసం) నిర్ణయించిన నియమాల్లో ఒకటేమంటే ఒక బానిస పదిమంది నిరక్షరాస్యులకు చదవనూ వ్రాయనూ నేర్పిస్తే లేక అలాంటిదే మరేదయినా సాంఘిక సేవచేస్తే అతను బానిస బంధనాలనుండి విముక్తి పొందగలడు. అలాగే దివ్యఖుర్ఆన్‌లో, కొన్ని పాపపు కార్యాలకు ప్రాయశ్చిత్తం బానిసల్ని విడుదల చేయించడం అని కూడా నిర్ణయించింది. స్వయంగా దైవ సందేశహరులు (సఅసం) కూడా, కొన్ని అపరాధాలకు ప్రాయశ్చిత్తం బానిసల్ని విముక్తి కలిగించడమని బోధించారు. తదనుగుణంగా అసంఖ్యాకమయిన బానిస గణం స్వేచ్ఛా వాయువు పీల్చుకోగలిగారు. దైవప్రవక్త (సఅసం) ఒకసారి ప్రవచించారు, "ఆదం సంతతిలో పాపాలకు అతీతుడయిన వాడెవడూ లేడు" అని. తప్పు చేసిన వ్యక్తి పాప పరిహారంగా బానిసల్ని విడుదల చేయించేవాడు. ఈ సందర్భంలో మా ఉద్దేశ్యాన్ని విశదీకరించడానికి, ఒక ముస్లింని పొరపాటుగా చంపే తప్పును ఇక్కడ ప్రస్తావించడం భావ్యమనుకుంటున్నాము. ఇస్లాం ప్రకారం ఒక ముస్లింని మరొక ముస్లిం పొరపాటుగా చంపివేస్తే పాపపరిహారంగా ఒక బానిసను విడుదల చేయించాలి. ఇంకా హతుని వారసులకు రక్త పరిహారాన్ని చెల్లించాలి. దైవ గ్రంథంలో ఇలా ఉంది:

మరెవరయినా ఒక మోమిన్‌ని పొరపాటుగా చంపి వేసినట్లయితే దాని ప్రాయశ్చిత్తం: ఒక మోమిన్‌ని బానిసత్వపు బంధనాల నుండి విముక్తం చెయ్యడం, ఇంకా హతుని వారసులకు రక్త పరిహారాన్ని చెల్లించడం. (4:92)

ఒక వ్యక్తిని పొరపాటుగానయినా సరే హత్య చేసిన హంతకుడు, వాస్తవానికి సమాజంకోసం పాటుపడే ఓ వ్యక్తిని లేకుండా చేశాడు. తద్వారా అతను హతుని వారసుల హక్కుల్ని, సమాజపు హక్కుల్ని కాజేశాడు వాటి పరిహారంగా హంతకుడు వారసులకు నిర్ణీత రక్త పరిహారం చెల్లించాలని, సమాజానికి మరో వ్యక్తిని-స్వేచ్ఛ పొందిన బానిసను - అందజెయ్యాలని కోరుతుంది. మరో మాటలో చెప్పాలంటే, ఒక బానిసన్ను విడుదల చేయించడం ఇస్లాం దృష్టిలో ఒక మానవుణ్ణి బ్రతికించడానికి సమానమన్నమాట. దీనివల్ల తెలిసేదేమంటే, బానిసలకు అది అనుగ్రహించిన ఇన్ని భద్రతలు ఉన్నా, ఇస్లాం దృష్టిలో బానిసత్వం అనేది మృత్యువుతో సమానమయిందే. అందువల్లనే ఇస్లాం, మానవుల ఈ దళిత, బాధిత వర్గానికి స్వేచ్ఛా స్వతంత్రతల జీవనదాయకమయిన భావనలతో భాసిల్ల జెయ్యడానికి, సజీవ వ్యక్తుల్లో స్థానం కల్పించడానికి లభించిన ప్రతి అవకాశాన్నీ సద్వినియోగం చేసుకుంది.

చరిత్ర మనకు తెలిపేదేమంటే ఈ 'అల్ ఇత్క్' విధానం ద్వారా బానిసత్వపు సంకెళ్ళనుండి విడుదల పొందినంతమంది మరే ప్రాచీన లేక ఆధునిక జాతిలోనూ బానిసత్వం నుండి బయటపడలేదు. అయితే ఈ సందర్భంలో మరో విషయం కూడా కనుమరుగు కారాదు. ముస్లిములు ఇంత అధిక సంఖ్యలో బానిసల్ని విడుదల చేశారంటే అది ఏదో భౌతిక ప్రయోజనాల కొరకు కాదు. వారి ఈ చర్యకు ప్రేరేపణ కేవలం దైవ ప్రసన్నత పొందాలన్న భావం మాత్రమే.

## ముకాతబత్

బానిసల్ని బంధ విముక్తులుగా చెయ్యడానికి ఇస్లాం అనుసరించిన రెండో విధానం ముకాతబత్ విధానం. అంటే వ్రాత మూలకంగా ఒప్పందం. బానిస ఎవరయినా తన యజమానిని స్వేచ్ఛను అర్థిస్తే యజమాని ఈ ముకాతబత్ విధానాన్ని అనుసరించి ఆ బానిసను నిర్ణీత రొక్కం తీసుకుని విడుదల చెయ్యాలి. రొక్కం ఎంత ఉండాలన్నది యజమాని, బానిసల మధ్య పరస్పర సంప్రదింపుల ద్వారా నిర్ణయమయ్యేది. ఒకవేళ యజమాని కాదంటే బానిస కోర్టు ఎక్కేవాడు. నిర్ణీత రొక్కం వసూలు చేసి బానిసను విడుదల చేసేందుకు న్యాయస్థానానికి పూర్తి హక్కులుండేవి.

ఈ ముకాతబత్ విధానం వల్ల స్వేచ్ఛనుకోరే బానిసలందరికీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పొందే మార్గం సుగమం అయింది. ఆ తరువాత వారు యజమానుల దయాదాక్షిణ్యాలు, మంచితనం, దైవభీతిలాంటి గుణాలపై ఆధారపడి బానిసత్వం నుండి విముక్తికై నిరీక్షించే అవసరం లేకుండా పోయింది.

ఒక బానిస ముకాతబత్ ద్వారా తన విముక్తిని వాంఛిస్తే యజమాని ఏదయినా ప్రతీకార చర్య తీసుకుంటాడన్న భయం కూడా బానిసకు లేకుండేది. ఎందుకంటే ఇస్లామీయ ప్రభుత్వమే బానిసలకు అండగా నిలచేది. ఈ ఒప్పందం కుదిరిన తరువాత యజమాని తన బానిసకు అతని అదనపు సేవలకు ప్రతిఫలంగా కొంత వేతనం ఇచ్చేలా చూడటం ప్రభుత్వం బాధ్యత అయింది. యజమాని ఇలాంటి అదనపు పనికి వేతనం ఇచ్చేందుకు ఇష్టపడకపోతే బానిసకు వేరే జీవనోపాధిని కల్పించడం కూడా ప్రభుత్వ బాధ్యతే. తద్వారా అతను తన యజమానికి చెల్లించ వలసిన రొక్కం కూడబెట్టి విముక్తిని పొందగలిగేవాడు. సరిగ్గా ఇదే పరిస్థితి యూరపులో ఎదురయింది. ఎప్పుడు? 14 వ శతాబ్దంలో! అంటే ఇస్లాం తన అధికారపరిధిలో దాన్ని అమలు పరచిన 7 వందల ఏళ్ళ తరువాత

అన్నమాట. అప్పటికి ఇస్లామీయ రాజ్య పరిధిలో బానిసత్వం అసలు నామరూపాల్లేకుండా పొయ్యింది.

ఇస్లామీయ ప్రభుత్వానికి ఈ విషయంలో మరో ప్రత్యేకత కూడా ఉంది. ఈ ప్రత్యేకత మరెక్కడా కానరాదు. స్వేచ్ఛను కోరే బానిసలకు ప్రభుత్వ ధనాగారం నుండి ధన సహాయం. దీనికి బదులుగా ఎలాంటి భౌతిక ప్రయోజనం అది కోరదు - కేవలం విశ్వ ప్రభువు ఆదేశాలను పాలించి ఆయన ప్రసన్నతను పొందాలన్న వాంఛ తప్ప. జకాత్ ఫండును ఖర్చుచేసే పద్దుల్ని ప్రస్తావిస్తూ దివ్య ఖుర్ఆన్ ఇలా ప్రకటిస్తుంది:

> సదకాత్ (జకాత్) అయితే కేవలం నిరుపేదల కొరకు,
> అగత్య పరులకొరకు, జకాత్ వసూలు చేసే కార్యకర్తల
> కొరకు ............ ఇంకా బానిసల్ని విడుదల చేయించ
> డానికి ఖర్చు చెయ్యాలి. (9 : 60)

ఈ ఆయత్‌లో, తమ సొంత సంపాదనతో స్వేచ్ఛను పొందలేని బానిసలకు ధన సహాయం చెయ్యాలన్న ఆదేశం స్పష్టంగా ఉంది.

## సాలెగూడు పటాపంచలయింది

ఇస్లామీయ వ్యవస్థలోని ఈ రెండు వ్యవస్థలు, అల్ ఇత్క్, ముకాతబత్ - బానిసత్వపు భయంకర చరిత్రలో మహోన్నతమయిన క్రియాత్మక విప్లవాన్ని సూచిస్తున్నాయి. మిగతా ప్రపంచం ప్రగతి శీలకమయిన ఈ స్థాయికి చేరేవరకు కనీసం 7 శతాబ్దాలు దాటిపొయ్యాయి. అంతేకాదు, బానిసలకు ప్రభుత్వం తరఫున రక్షణ కల్పించి, ఇస్లాం ప్రపంచానికి ప్రగతిశీల దృక్పథం అంటే ఏమిటో తెలిపింది. ఎలాంటి రాజకీయ, ఆర్థిక వత్తిడులకు గురిచెయ్యకుండా, ఎలాంటి ప్రలోభాలు ఆశలు చూపకుండా, స్వచ్ఛందంగా బానిసల్ని విడుదల చెయ్యాలని ఇస్లాం

ముస్లిముల్ని ప్రేరేపించింది. ఇలాంటి ఒక్క నిదర్శనమయినా చూపగలదా నేటి సభ్య సమాజం?

ఈ యదార్థాలు చాటేదేమిటి? కమ్యూనిస్టులు ఇస్లాంను గురించి చేసే ప్రచారం అంతా బూటకమని! తార్కిక భౌతికవాదం ప్రకారం ఇస్లాం ఇతర జీవన విధానాల మాదిరిగానే, మానవ చరిత్ర యొక్క ఓ ప్రత్యేక కాలానికి చెందిన ఆర్థిక పరిస్థితుల ప్రభావంవల్ల ఉనికిలోకి వచ్చిందని, అందువల్ల అది రాబోయే ఏ అభ్యుదయ ఆర్థిక అవసరాలతో సరిపడ జాలదని వారు వాదించారు. కాని వారి ఈ బూటకపు ప్రచారాన్ని ఇస్లాం కుండబద్దలు కొట్టినట్టు బహిర్గతం చేసింది. నిజానికి నేటికీ ఇస్లాం ఉనికియే కమ్యూనిస్టుల వంచనపూరిత ప్రచారానికి గట్టి క్రియాత్మకమయిన జవాబు. ఇస్లాం అరేబియా ద్వీపకల్పంలోనూ దీవి వెలుపలనూ ఏ విధంగా శక్తీ కీర్తీ ప్రాభవాలతో భాసిల్లిందో అది కార్ల్‌మార్క్స్ సిద్ధాంతానికి చెంపపెట్టు లాంటిది. బానిసలపట్ల ఇస్లాం వైఖరి అయినా లేక జీవితపు ఇతర విషయాల్లో దాని వ్యవహారమయినా, సంపద పంపిణీ అయినా పాలక పాలితుల, సేవక సేవితుల సంబంధాల నిర్ణయమయినా ఇస్లాం ప్రత్యేకత ప్రతిచోటా కొట్టవచ్చినట్లు కానవస్తుంది. ఇస్లాం తన సామాజిక ఆర్థిక వ్యవస్థల కట్టడాన్ని స్వచ్ఛందంగా సంతోషంగా అనుసరించే ఓ వ్యవస్థకు ఆధారంగా నిర్మించింది. వివిధ సామాజిక వ్యవస్థల చరిత్రలో ఈ అనుపమ వ్యవస్థకు సాటి రాగల వ్యవస్థ మరొకటి నేటి వరకు ఉనికిలోకి రాలేదని చెప్పవచ్చు.

## సమస్య – సమగ్ర పరిశీలన

ఈ సందర్భంలో ఓ ప్రశ్న ఉత్పన్నం కావచ్చు. బానిసల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల ధ్వజవాహిక అయిన ఇస్లాం, వారి విముక్తి కొరకు, ఎలాంటి రాజకీయ ఆర్థిక వత్తిడి లేకుండానే ఇన్ని విప్లవాత్మక చర్యల్ని తీసుకు

రాగలిగిన ఇస్లాం, బానిసత్వాన్ని శాశ్వతంగా ఎందుకు రూపుమాపలేదు? అప్పుడే కదా మానవాళికి దాని సకలశుభాలూ అందగలిగేది! అప్పుడేకదా, ఇస్లాం నిజానికి ఓ పరిపూర్ణ ధర్మమని, తన సృష్టి నంతటిపై మానవాళికి విశిష్టత ప్రసాదించిన దైవం మానవుల మార్గదర్శకత్వం కొరకు పంపిన ధర్మమని నిర్ద్వంద్వంగా రుజువయ్యేది!

ఈ ప్రశ్నకు సమాధానాన్ని తెలుసుకునేందుకు బానిసత్వం వల్ల జనించే అనేక మానసిక, సామాజిక, రాజకీయ సమస్యల్ని అర్థం చేసుకోవలసి ఉంటుంది. ఎందుకంటే ఈ కారణాల వల్లనే ఇస్లాం, బానిసత్వంపై వెంటనే చివరిదెబ్బ తీయలేదు. దాన్ని కొంతకాలం వరకు వాయిదా వేసింది. సమస్యను ఈ కోణంతో పరిశీలించేటప్పుడు గుర్తుంచుకోవలసిన మరో విషయం ఏమిటంటే బానిసత్వాన్ని పూర్తిగా నిర్మూలించడంలో జరిగే ఈ అసాధారణమయిన జాప్యం నిజానికి ఇస్లాంలో అభిలషనీయం కాదు. తన విధానాలకు భిన్నమయిన వాటితో రాజీపడని దాని పరిశుద్ధ నైజం వల్ల అది సాధ్యపడేదీకాదు. జాప్యానికి అసలు కారణం తరువాతి కాలంలో ఇస్లాం పరిశుద్ధ సెలయేరును కలుషితం చేసిన మార్గ విహీనత, మార్గ భ్రష్టతల పోకడలు.

ఇస్లాం ఆవిర్భావం జరిగినప్పుడు ప్రపంచమంతటా బానిసత్వం మూడు పువ్వులు ఆరు కాయలుగా పరిఢవిల్లుతూ ఉండింది. ఆ కాలపు సామాజిక, ఆర్థిక వ్యవస్థలో అది దాని అనివార్యమయిన అంశంగా రూపొందింది. పరిస్థితుల ఈ స్వరూపాన్ని మార్చాలంటే, బానిసత్వాన్ని సంపూర్ణంగా తుడిచిపెట్టాలంటే సుదీర్ఘకాలంవరకు వివిధ దశల్లో కృషి చెయ్యటం అవసరం. ఇలాంటి దశల వారీగా సంస్కరించే, దీర్ఘకాలికమయిన విధానం ఇతర ఇస్లామీయ శాసనాల అమలులో సయితం కానవస్తుంది. ఉదాహరణకు, మద్యపానం ఓ వ్యక్తిగతమయిన చెడుగు, పైగా అజ్ఞాన కాలంలోనూ అరబ్బుల్లో కొందరు మద్యపానాన్ని మానవ గౌరవానికి, సంస్కారానికి ప్రతికూలమయినదిగా భావించి దానికి దూరంగా ఉండేవారు. అలాంటి దాన్నే ఒకేసారి నిషేధించడం జరగలేదు. నిషేధానికి పూర్వం కొన్నేళ్ళపాటు మానసికమయిన మార్పునకై కృషి చెయ్యడం జరిగింది. కాని

బానిసత్వం విషయం అలాకాదు. ఈ విషయంలో వారి దృక్పథం పూర్తిగా భిన్నమయింది. ఆ కాలపు సామాజిక వ్యవస్థలో, ఆనాటి ప్రజల నైజంలో, వారి అంతరాళాల్లో దాని వేర్లు లోతుగా నాటుకు పొయ్యాయి. ఎందుకంటే వ్యక్తిగత, సామాజిక, ఆర్థిక జీవితానికి సంబంధించిన అనేక యదార్థాలు, అనేక మూల హేతువులు దానితో ముడివడి ఉన్నాయి. ఈ కారణాల వల్ల మద్యపానం మాదిరిగా బానిసత్వాన్ని చెడుగుగా భావించడమో లేక దాన్ని ఇష్టపడక పోవడమో అన్నమాటే తలెత్తలేదు. ఈ కారణంగానే దాని సంపూర్ణ నిర్మూలనం కొరకు మహాప్రవక్త దైవదౌత్య కాలంకంటే, అంటే దైవాదేశాల అవతరణ కాలంకన్నా కూడా అధిక కాలం కావలసి వచ్చింది; అప్పటిగ్గాని దాన్ని తుదముట్టించడం సాధ్యపడలేదు.

సకల సృష్టిరాశికి కర్త, వాటి సహజ ప్రవృత్తుల నెరిగిన స్వామి అయిన దైవానికి బాగా తెలుసు, మద్యపానాన్ని నిషేధించే లక్ష్యం కేవలం కొన్ని సంవత్సరాల్లోపల నోటి ఆదేశాల ఆధారంగా నెరవేరగలుగుతుందని. అందుచేత ఆ సమయం ఆసన్నం కాగానే ఆయన దాన్ని పూర్తిగా నిషేధించే ఉత్తరువుల్ని ప్రకటించాడు. అలాగే బానిసత్వాన్ని నిషేధించేందుకు పరిస్థితులు అనుకూలంగా అనువుగా ఉంటే, కేవలం ఓ ఆదేశం ద్వారా దాన్ని అరికట్టడం సాధ్యం కలిగేలా ఉంటే సర్వశక్తి మాన్యుడయిన మహోన్నత ప్రభువు ఎలాంటి జాగు చెయ్యకుండా స్పష్టంగా, ప్రస్ఫుటమయిన ఆదేశాలద్వారా తన సంప్రదాయం ప్రకారం చిరకాలానికి దాన్ని నిషేధించి ఉండేవాడు. కాని అలా వీలు లేదు కాబట్టే ఆయన అలా చెయ్యలేదు. *

---

* మద్యపానం, బానిసత్వాల్లో మరో వ్యత్యాసం కూడా ఉంది. మద్యం ఎన్నడూ మనిషి యొక్క అనివార్యమయిన అవసరాల్లోకి చేరలేదు. అది ఓ చెడుగు. దాన్ని మానుకోవడం వల్ల వ్యక్తిలోగాని సమాజంలోగాని ఎలాంటి వెలితి ఏర్పడదు. నిజానికి దాని నిషేధం వల్ల దౌష్ట్యానికి ఓ మూలకారణం దూరమవుతుంది. కాని ఇస్లాం ఆవిర్భావ కాలంలో బానిసత్వం ఒక ఆర్థిక, సామాజిక,సామూహిక, రాజకీయ అవసరం. దాన్ని ఒక్కసారిగా రద్దుచేసినట్లయితే అనేక చెడుగులకు పుట్టినిల్లు కాగల ఓ వెలితి ఏర్పడేది. ఇస్లాం అనుసరించిన పద్ధతివల్ల బానిసత్వపు చెడు ప్రభావాలు దూరమవడమే కాకుండా సంఘంలో ఎలాంటి కొరత కూడా ఉత్పన్నం కాలేదు. (అను)

## పరిణామం,ప్రగతి, పరిణతిమార్గం – ఇస్లాం

ఇస్లాం మానవాళి సంతతికీ వర్తించే ధర్మమని, అన్ని కాలాల ప్రజలు దాని బోధనల్ని దాని ఆరోగ్యవంతమయిన సిద్ధాంతాలను అనుసరించి పవిత్ర జీవితం గడపగలుగుతారని అంటే దానికి భావం, ఇస్లాం చలనంలేని, పరిణామ ప్రగతుల్లేని జీవన వ్యవస్థ అని, అది మానవ జీవితానికి సంబంధించిన అల్ప స్వల్ప విషయాలన్నింటినీ ముందే నిర్ణయించి వేసిందని ఏ మాత్రం కాదు. నిత్యం మారే పరిస్థితులూ జీవిత సమస్యలకుగాను ఇస్లాం కొన్ని సూత్రప్రాయమయిన ఆదేశాలనిచ్చి వివరాల విషయంలో స్వేచ్ఛ నిచ్చింది. ఆ సూత్ర ప్రాయమయిన ఆదేశాల వెలుగులో జీవన ప్రగతి కొనసాగాలన్నది దాని ఉద్దేశ్యం. బానిసత్వపు సమస్యపట్ల ఇస్లాం ఈ విధానాన్నే అనుసరించింది. అది బానిసల స్వేచ్ఛకై గట్టి ప్రాతిపదికలు 'అల్ ఇత్క్', 'ముకాతబత్' రూపంలో ప్రవేశపెట్టడమే కాక చిక్కులతో కూడుకున్న ఈ ప్రాచీన సమస్యను భావికాలాల కొరకు శాశ్వతంగా పరిష్కరించడానికి శాశ్వత ప్రాతిపదికపై ఓ సుస్థిరమయిన పరిష్కారాన్నీ సూచించింది.

## మనిషిలో మానవత

ఇస్లాం మానవ నైజాన్ని మార్చడానికి ఆవిర్భవించలేదు, దాన్ని సంస్కరించడానికే అది వచ్చింది. ఎన్నో పరిమితులకు లోనయిన మానవ నైజం ఎలాంటి బాహ్యాప్రేరణ, ఎలాంటి ఒత్తిడి లేకుండా పరిణత మానవతా స్థాయిని పొందగలగాలన్నది దాని ఆశయం. మానవశీల నిర్మాణంలో విప్లవాత్మకమయిన విధానాలను అనుసరించి ఇస్లాం అద్భుతమయిన ఫలితాలను సాధించగలిగింది. అలాగే సామాజిక సంస్కరణ విషయంలోనూ అనన్యసామాన్యమయిన .ఫలితాలు దాన్ని ఆశ్రయించాయి. అయినా మానవుల వ్యక్తిత్వాన్నే పూర్తిగా మార్చివేసి వారు తమ పరుగులో మానవ అవధులనే అధిగమించి చేరలేని ఔన్నత్యాలను అందుకునేలా చెయ్యాలన్నది

మాత్రం దాని అభిమతం కాదు. ఎందుకంటే ప్రపంచంలో ఇలాంటి మానవాతీత సృష్టినే సృష్టించదలిస్తే అల్లాహ్ మనుషుల్ని కాదు, దైవదూతల్ని సృష్టించి ఉండేవాడు. వారికి దైవదూతలు మాత్రమే ఆచరించ గలిగే ఆదేశాల నిచ్చేవాడు. దైవదూతలను గురించి దివ్యగ్రంథం ఇలా వివరిస్తుంది:

> వారికి ఏ ఆదేశమయితే ఇవ్వడం జరుగుతుందో ఆ ఆజ్ఞాపాలనలో వారు దైవాజ్ఞను ఏ మాత్రం జవదాటరు. ఇంకా ఏ ఆదేశమయితే ఇవ్వడం జరుగుతుందో దాన్ని వెంటనే అమలు పరుస్తారు.
>
> (5 : 66)

మనిషిని దైవ దూతలుగా చెయ్యడం దేవుని ఉద్దేశ్యం కాదు - ఉత్తమ మానవులుగా చెయ్యడమే అసలు ఉద్దేశ్యం. ఆయన భువిలో మనుషులనే సృజించాడు. ఆయనకు మనుషుల శక్తి సామర్థ్యాలు బాగా తెలుసు. తాను ఇచ్చే ఆదేశాలను ఉత్తర్వుల్ని అర్థంచేసుకుని ఆచరించేందుకు వారి సహజమయిన శక్తి సామర్థ్యాలు పెంపొంది వికసించడానికి ఎంతకాలం పడుతుందో కూడా ఆయనకు తెలుసు.

మానవ చరిత్రలో మొదటిసారిగా బానిసత్వానికి వ్యతిరేకంగా ఎలుగెత్తి చాటింది ఇస్లాం. అంతేకాదు, వారి విముక్తికై ఓ విలక్షణమయిన ఉద్యమాన్ని మానవ నైజానికి అతి సమీపమయిన పంథాలో లేవనెత్తింది. అయితే బానిసత్వానికి మరోకారణం లేకుండా ఉన్నట్లయితే బానిసత్వం ఓ అభిశాపంలా ప్రపంచాన్ని బహుకాలం వరకు వేధిస్తూ ఉండేది కాదు. బానిసత్వాన్ని కూకటి వ్రేళ్ళతో పెకళించడానికి అడ్డుగోడగా నిలిచిన ఆ కారణం యుద్ధాలు విరివిగా నిరంతరంగా సాగిన మహా సంగ్రామాలు. యుద్ధాలే ఆ కాలంలో బానిసత్వానికి పట్టుగొమ్మలుగా తయారయ్యాయి.

## మానసికమయిన అవాంతరాలు

బానిసత్వపు సమస్యను చర్చించేటప్పుడు మనం ఒక సత్యాన్ని

ఎప్పుడూ విస్మరించరాదు. స్వాతంత్ర్యం అన్నది ఎవరో దయదలిస్తే లభించే దానం కాదు, దాన్ని తమ బాహుబలంతో కృషించి సాధించవలసి ఉంటుంది. అందువల్ల కేవలం ఓ చట్టాన్ని చెయ్యడం ద్వారానో ఓ ఆదేశాన్ని ప్రకటించడం మూలంగానో శతాబ్దాల తరబడిగా వస్తున్న బానిసలు వారంతటవారే స్వయంగా విమోచనం పొందలేరు. అమెరికాలో జరిగిన ప్రయోగం, దాని అనుభవాలు, పర్యవసానాలు యదార్థానికి ప్రత్యక్ష తార్కాణాలు. అమెరికా అధ్యక్షులు అబ్రహాం లింకన్ ఒక్క ఫర్మానా ద్వారా బానిసల విడుదలకై ఆదేశాలను జారీచేశారు. జరిగిందేమిటి? శతాబ్దాల తరబడి అణచివేతకు, పీడనకు గురవుతూ వస్తూన్న బానిసలు నిజానికి స్వేచ్ఛను పొందారా? లేదు. ఎందుకంటే మానసికంగా ఆధ్యాత్మికంగా వారు స్వేచ్ఛకై సిద్ధంగాలేరు. తత్కారణంగా, చట్ట బద్ధంగా స్వేచ్ఛ పొందిన తరువాత కూడా వారు తమ మాజీ యజమానుల వద్దకు పోయి వారిని ఇండ్లనుండి వెళ్ళగొట్టవద్దని, తిరిగి బానిసలుగా తమ వద్ద ఊడిగం చేయించుకునేందుకు ఉంచుకొమ్మని బ్రతిమాలిన సందర్భాలు కూడా అనేకం కానవచ్చాయి.

ఈ విషయాన్ని స్థూలంగా చూస్తే వింతగా అగుపించినా, మానవ మానసికావస్థ దృష్ట్యా కాస్త లోతుగా పరిశీలిస్తే అది అంతగా ఆశ్చర్యకరమయిందిగా తేలదు. మానవ జీవితంలో కొన్ని ప్రత్యేకమయిన పరిస్థితులకు ప్రముఖ పాత్ర ఉంటుంది. అతడు నివసించే వాతావరణం అతని ఆలోచనల్ని, భావాలను ఇంకా అతని సంపూర్ణ మానసికావస్థను ప్రభావితం చేస్తుంది.* బానిసల మానసిక స్థితి, వారి నైజం తరతరాల

---

* భౌతిక వాదుల ప్రకారం మానవ ఆలోచనా జగత్తును వారున్న పరిస్థితులే సృజిస్తాయి. కాని ఈ వాదన కేవలం ఒక అపోహ మాత్రమే. యదార్థమేమంటే, జీవితంలో ఒకానొక మానసికావస్థ ప్రాతిపదికగా ఉన్నప్పుడే పరిస్థితులు తమ ప్రభావం చూపగలుగుతాయి. అందువల్ల ఆలోచనలపై చింతనా పరిధులపై భౌతిక పరిస్థితుల ప్రభావం ఉంటుందన్నది వాస్తవమే అయినా ఆలోచనలు, దృక్పథాలు కేవలం భౌతిక పరిస్థితుల మూలంగానే ఉనికిలోకి వస్తాయన్న మాట మటుకు సరయింది కాదు. మనో పీఠంపై మౌలిక విషయం ఉన్నప్పుడే పరిస్థితులు ప్రభావం చూపుతాయి.

మానసిక శిక్షణ మూలంగా ఓ స్వతంత్ర మనిషి యొక్క మానసిక స్థితికి పూర్తిగా భిన్నమయి ఉంటుందన్నది మాత్రం యదార్థం. కాని పూర్వీకులు, ఛాందసులు భావించినట్లు, స్వతంత్ర, బానిస వ్యక్తుల్లోని ఈ మానసిక వ్యత్యాసం, మనుషుల పుట్టుకకు సంబంధించిన మౌలిక వ్యత్యాసం వల్ల ఏర్పడిందన్న వాదన మటుకు ఎంతమాత్రం సరయిందికాదు. చిరకాలంగా బానిసత్వపు బంధనాల్లో చిక్కుకుని ఉండటం మూలాన, బానిసత్వం బానిసల మానసిక జీవితాన్ని ఓ ప్రత్యేకమయిన నైజంలోకి మలచివేస్తుంది. ఈ నైజంలో విధేయతా భావమే తప్ప స్వేచ్ఛాయుత, బాధ్యతాయుత భావాలకు తావే ఉండదు. బానిస ఓ స్వతంత్ర సమాజంలో బాధ్యతాయుత వ్యక్తిగా తన బాధ్యతల్ని సరిగ్గా నిర్వర్తించే మానసిక స్థితిని, ఆ యోగ్యతను కలిగి ఉండడు. అతడు స్వతంత్రంగా ఆలోచించనూలేడు, తనంతట ఎలాంటి క్రియాశీలతను (INITIATIVE) చూపనూలేడు.

ఒక బానిస, తాను స్వతంత్రంగా ఆలోచించే అవసరం లేనంతవరకు సరిగ్గా పనిచెయ్యగలుగుతాడు. అతని బాధ్యత, తన యజమాని ఆదేశాలను ఆజ్ఞల్ని కేవలం పాటించేంతవరకు పరిమితమయినప్పుడే అతని కార్య నిర్వహణ సరిగ్గా ఉంటుంది. కాని ఎప్పుడయినా అతను స్వయంగా నిర్ణ యాలు గైకొనవలసివస్తే అతని పరిస్థితి వర్ణనాతీతం. అతని నిర్ణయశక్తి స్థంభించిపోతుంది. తన జీవితంలోని ఎంతో సాధారణ విషయాల్లోనూ అతను ఎలాంటి నిర్ణయం గైకొనడానికి, లేక దాని ఫలితాలను ధైర్యంగా ఎదుర్కొనడానికీ సాహసించలేడు. ఈ పరిస్థితికి కారణం అతనిలో ఏదో శారీరక మానసిక బలహీనత ఉండటం కాదు. మనస్తత్వభాషలో చెప్పాలంటే అతను తన చేష్టల పరిణామాలను ఎదుర్కొనే నైతికబలాన్ని కోల్పోయి ఉంటాడు. ఏవో అర్థంలేని భయాలు, ఆందోళనలు, కష్టాలు అతన్ని భీతా వహుణ్ణి చేసివేస్తాయి. అందువల్ల వాటిని అదుపులోకి తీసుకోవడం తన వల్ల అయ్యేపని కాదని ఉత్తుత్తి భ్రమలకు లోనవుతాడు. ఇలా ఆలోచించు కుంటూ అతడు తనలో తానే కుంచించుకుపోతాడు. చివరికి ఈ 'విపత్తు' నుండి తన్ను కాపాడుకునే ప్రయత్నంలో జీవన రంగం నుండే

మెల్లిగా తప్పుకుంటాడు.*

ప్రాచ్యదేశాల సమీప గతాన్ని దాని చరిత్రను ఒక్కసారి పరికించి చూస్తే పాశ్చాత్య సామ్రాజ్యవాదులు ఈ దేశాలపై మోపిన మానసిక శారీరక బానిసత్వపు భారం కారణంగా ఇక్కడి ప్రజల జీవితాలు ఎంతగా నిరుపయోగంగా, నిరర్థకంగా తయారయ్యాయో తెలుసుకోవచ్చు. పాశ్చాత్య సామ్రాజ్య వాదులు తమ నీచమయిన ప్రయోజనాలకొరకు ఓ నిర్ణీత పథకం ప్రకారం ఇక్కడ మానసికమయిన శారీరకమయిన బానిసత్వాన్ని నెలకొలిపారు. పోతూ పోతూ కూడా ప్రాచ్యదేశాలను ఆ బానిసత్వ బంధనాల్లో గట్టిగా కట్టి పడేసి మరీ పొయ్యారు. ఈ మానసిక బానిసత్వమే మనలోని పాశ్చాత్య ప్రభావితులయిన వారి సంవాదనల్లో, సంభాషణల్లో, ప్రసంగాల్లో ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. ఈ కారణం చేతనే వారు కొన్ని చట్టాలను నేడు అనాగరికమయినవని, ఆచరణయోగ్యం కానివనీ అంటూ ఉంటారు. అలా భావించినప్పుడు వారి హృదయాంతరాళాల్లో పనిచేస్తూ ఉండేది ఆ బానిసత్వపు భావమే. ఆ భావం మనసులో నాటుకుపోతే మనిషి స్వేచ్ఛగా ఆలోచించి నిర్ణయాలు తీసుకుని, వాటి పరిణామాలను ధైర్యంగా ఎదుర్కొనే సామర్థ్యాన్నే కోల్పోతాడు. ఈ కారణంగానే ఒక బ్రిటిషు లేక అమెరికన్ న్యాయవేత్త అక్కడ ఏదయినా అత్యంత అసహ్యాకరమయిన చట్టాన్ని ప్రవేశపెట్టినప్పుడు ఇలాంటి మన ప్రబుద్ధులు, దాన్ని ఇక్కడ కూడా అమలు జరపాలని ఇట్టే సిద్ధమవుతారు. ఎందుకంటే వారికి, తమ స్వేచ్ఛాయుత ఆలోచనతో, స్వతంత్రంగా నిర్ణయం తీసుకుని, తమశక్తి సామర్థ్యాల ఆధారంగా చట్టం చేసి అమలు జరిపే బాధ్యత తప్పుతుంది. ప్రాచ్యదేశాల్లో నేడు మనకు గోచరించే బ్యూరోక్రసీ కూడా ఆ బానిసత్వపు కాలంలోని అవశేషమే. ఈ కార్యాలయాల బాధ్యతారహితమయిన కార్య

---

* మన నాట దళిత ప్రజలు, నేటికీ పాలకవర్గమయిన అగ్రకులాలనబడే వారి రాజకీయ ఎత్తుగడలకు ఎలా పావులుగా మారుతారో, తమకు లభించిన రాజ్యాంగ బద్ధమయిన కొన్ని సౌకర్యాలను సౌలభ్యాలను కూడా తమ మానసిక అపరిపక్వత కారణంగా ఎలా ఉపయోగించుకోలేక పోతున్నారో ఈ సందర్భంలో గమనించవచ్చు. (అను)

నిర్వహణ, భయకంపితులయిన గుమాస్తాలు - దీన్నంతటినీ చూచి, ఆ బానిసత్వపు ముదనష్టపు ఛాయలు నేడుకూడా ప్రాచ్యదేశాల ప్రజల హృదయాలను ఏమేరకు ఆక్రమించుకుని ఉన్నాయో అర్థం చేసుకోవచ్చు. ఈ ఉద్యోగుల్లో ఏ ఒక్కరిలోనూ స్వతంత్రంగా నిర్ణయాలు చేసే యోగ్యత కానరాదు. పై అధికారుల నుంచి స్పష్టమయిన ఆదేశాలు రానంతవరకు వారు బాధ్యతాయుతంగా ఏ నిర్ణయమూ గైకొనలేరు. వీళ్ళ ఉన్నతాధికారుల సంగతి కూడా అంతకంటే మెరుగ్గాలేదు. వారూ మానసిక స్థితి బానిసత్వపు కోరల్లో చిక్కుపడి ఉండకపోతే వీరు ఇలా నిర్జీవమయిన యంత్రాల్లా తయారయ్యేవారు కారు, ఇలా అశక్తతతో ఇతరులపై ఆధారపడి వుండేవారు కారు. వీరి ప్రత్యేకమైన బానిస మనస్తత్వం ఇతరుల ఆదేశాలను అమలు జరపడానికయితే ఎంతో అనువుగా ఉంది కాని స్వతంత్రంగా నిర్ణయాలు గైకొనే విషయంలో పూర్తిగా నిరుపయోగం. ఇలాంటి మానసికావస్థలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లభించినా అవి సద్వినియోగం కావు. నిజానికి స్వేచ్ఛాయుత జీవితం గడపడమూ సాధ్యపడదు. ఈ కారణంగానే బాహ్యంలో వీరు స్వతంత్రులుగా అగుపించినా వాస్తవానికి వీరి స్థితి బానిసలకన్నా ఏమాత్రం భిన్నంగా లేదు.

ఈ బానిస మనస్తత్వం వల్లనే ఒక వ్యక్తి బానిసగా రూపొందుతాడు. ఇది ప్రారంభంలో బాహ్యపరిస్థితుల ప్రభావంవల్ల ఏర్పడినా కాలక్రమేణ దాని పట్టు మనిషిపై పటిష్టమవుతూ ఉంటుంది. చివరికి అది శాశ్వతస్థాయిని సృజించుకుంటుంది. ఏ విధంగానయితే ఒక చెట్టు కొమ్మ భూమిపై కొన్నాళ్ళు అనుకూల వాతావరణంలో పడి ఉంటే అది క్రమేణ భూమిలో తన వేర్లను పరచుకుంటూ పోతుందో, అదేవిధంగా మానవ మానసికావస్థ కూడా ఓ వాతావరణానికి అలవడితే క్రమేణ అది దాని నైజమయిపోతుంది.

## సంస్కరణ – సహజరీతిలో

అందువల్ల ఇలాంటి బానిస మనస్తత్వాన్ని రూపుమాపడానికి బానిసత్వానికి వ్యతిరేకంగా కేవలం చట్టాలు చెయ్యడం మూలాన దూరం

కాదు. దీన్ని నిర్మూలించాలంటే విప్లవం లోనుండి రావాలి. కొత్త వాతావరణాన్ని పరిస్థితుల్ని సృజించాలి. అప్పుడే బానిసల మానసిక, స్వాభావిక స్థితిని కొత్త రూపంలో మలచడం సాధ్యమవుతుంది. అతని వ్యక్తిత్వంలో ఓ స్వతంత్ర జీవికి అనివార్యమయిన కొత్త కోణాలను పెంపొందించడం కూడా అప్పుడే సాధ్యమవుతుంది.

అందువల్ల ఇస్లాం సరిగ్గా ఈ ఆచరణా విధానాన్నే అనుసరించింది. ప్రారంభంలో అది బానిసలపట్ల న్యాయవంతంగా, ఉత్తమ మానవీయ పద్ధతులతో, ఉదారబుద్ధితో వ్యవహరించమని బోధించింది. అది బాగా దెబ్బతిన్న బానిసల మానసికావస్థను సరిదిద్దడానికి, వారిలో మానవీయ ఔన్నత్యం, ఆత్మగౌరవం, ఆత్మాభిమానాలను సృజించడానికి ఉత్తమ రీతిలో ఉపకరించింది. ఎందుకంటే మనిషి ఒకసారి స్వేచ్ఛ, మానవ గౌరవ ఔన్నత్యాలను సరిగ్గా అర్థంచేసుకుంటే ఆపైన అతను వాటివల్ల వాటిల్లే బాధ్యతలనూ అర్థం చేసుకోగలడు. అంతేగాని అమెరికాలో విమోచనం పొందిన అప్పటి నవ విముక్త బానిసల్లా తిరిగి బానిసత్వంలోనే శరణు పొందాలని అభిలషించడు.

బానిసలపట్ల ఉత్తమరీతిలో వ్యవహరించే విషయంలోనూ వారి మానవ స్థానాన్ని పునరుద్ధరించడంలోనూ ఇస్లాం చేసిన కృషికి అనుపమ దృష్టాంతాలను చరిత్ర పుటలు భద్రపరిచాయి. పైన కొన్ని దివ్యఖుర్ఆన్ ఆయత్‌లను, ప్రవక్త ప్రవచనాలను ప్రస్తావించడం జరిగింది. దిగువన ఆచరణాత్మక ఆదర్శాలు కొన్ని ఇస్లాం ప్రారంభదశలోనివి ఉదాహరిస్తున్నాము.

## బానిసలు కాదు సోదరులు

మక్కానుండి మదీనా వచ్చిన తరువాత ప్రవక్త మహనీయులు (సఅసం) ముస్లిముల మధ్య ఏర్పరచిన సోదరత్వంలో ఆయన అరబ్బు

నాయకమన్యుల్ని స్వేచ్ఛ పొందిన బానిసల సోదరులుగా చేశారు. రిబాహ్ కుమారుడు బిలాల్‌ను ఆయన రువైహతల్ ఖస్‌అమ ఖాలిద్ సోదరునిగా నిర్ణయించారు. తాను స్వయంగా స్వేచ్ఛ నిచ్చిన బానిస జైద్‌ను తన బాబాయి హమ్జాకు సోదరుని గాను, ఖారిజాబిన్ జైద్‌ను హజ్రత్ అబూబక్ర్ సోదరునిగాను ఆయన ఏర్పరిచారు. సోదరత్వపు ఈ సంబంధం నిజమయిన రక్తసంబంధంకన్నా ఏ విధంగానూ తక్కువ కాదని చెప్పవచ్చు. ఈ విధంగా సోదరులుగా చెయ్యబడ్డవారు రక్త సంబంధీకుల మాదిరిగానే తమ ఈ సోదరుల ఆస్తులకు వారసులుగా కూడా ఖరారయ్యారు.

అంతేకాదు. ఇస్లాం సంస్కరణోద్యమం మరో అడుగు ముందుకు వేసి సమత్వాన్నీ సోదరత్వాన్నీ ప్రస్ఫుటంగా అభివ్యక్తం చేసే అతి నాజూకయిన వివాహ సంబంధాల్లోనూ బానిసల్ని సముద్ధరించడానికి ఉపక్రమించింది. దైవ సందేశహరుడు (సఅసం) తన మేనత్త కూతురు జైనబ్ వివాహం తాను విముక్తం చేసిన బానిస హజ్రత్ జైద్‌తో చేశారు. కాని పెళ్ళి అన్నది మనిషి, అందునా స్త్రీ యొక్క అతి సూక్ష్మమయిన భావాలతో, అనుభూతులతో సంబంధం కలిగి ఉంటుందన్న యదార్థం మనం మరువరాదు. దైవ ప్రవక్త ఆదేశం మేరకు హజ్రత్ జైనబ్ బానిసతో పెళ్ళి అయితే చేసుకున్నారు కాని సామాజిక స్థాయిలోని వ్యత్యాసం ఆమె అంతర్యం నుండి దూరం కాలేక పోవడం చేత వారిరువురి మధ్య సమన్వయం కుదరలేదు. అయితే ప్రవక్త మహనీయుని దృష్టిలో ఉన్న అసలు ఉద్దేశ్యం నెరవేరింది. ప్రవక్త తన సొంత కుటుంబంలోని మహిళ పెళ్ళి బానిసతో చేసి, బానిసత్వపు అంధకార బంధురమయిన పాతాళాల నుండి, పీడిత వ్యక్తులయిన బానిసల్ని మానవ గౌరవోన్నతుల శిఖరాలకు లేవనెత్తారు. ఒక బానిస ఖురైషీ నాయకుల కుటుంబంలోని మహిళకు భర్త అయి, వారితో సమాన స్థానాన్ని పొందగలడన్న ప్రమాణం క్రియాత్మకంగా రుజువయింది.

ఇస్లాం బానిసలకు సైన్యాధిపత్యాన్నీ, జాతీయ నేతృత్వాన్నీ, ఉన్నత

పదవుల్నీ ప్రసాదించింది. దైవ ప్రవక్త అన్సార్, ముహాజిర్లలోని గొప్ప గొప్ప నాయకులతో కూడిన ఓ సైనిక బృందాన్ని తయారు చేసినప్పుడు దానికి తన బానిస జైద్‌ని నాయకుడుగా చేశారు. జైద్ మరణానంతరం సైన్యాధిపతి పదవిని జైద్ కుమారుడు హ్రజత్ ఉసామాకు అనుగ్రహించారు. ఆ సైన్యంలో హ్రజత్ అబూబక్ర్, హ్రజత్ ఉమర్ (రజిఅన్) లాంటి గొప్పగొప్ప గుర్తింపు పొందిన నాయకులూ ఉన్నారు. వారు మహాప్రవక్త జీవితంలో ఆయనకు ముఖ్య సలహాదారులు,ఆయన తరువాత ఆయన స్థానంలో ఇస్లామీయ రాజ్యానికి ఖలీఫాలుగా వ్యవహరించిన మహనీయులు. ఈ విధంగా ఆయన (సఅసం) బానిసల్ని స్వతంత్ర మనుషులకు సమానంగానే కాక వారి నాయకులుగా కూడ నియమించారు. ఈ విషయంలో దైవప్రవక్త చేసిన తాకీదు చాలా ముఖ్యమయింది. ఆయన ఇలా బోధించారు: "వినండి, మీ నాయకులకు విధేయులయి ఉండండి - మీ నాయకుడు ఎండు ద్రాక్షలాంటి తల గల నీగ్రో బానిస అయినా సరే! అతను మీ మధ్య దైవాదేశాలను జారీ చేసేంతవరకు మీరు అతనికి విధేయులుగా ఉండండి." [1] అంటే అర్థం ఏమిటీ? ఓ బానిస అయినా ఇస్లామీయ రాజ్యంలో అత్యున్నత పదవిని అలంకరించడానికి హక్కు కలిగి ఉన్నాడన్న విషయాన్ని ఇస్లాం గుర్తించిందన్న మాట. హ్రజత్ ఉమర్ తన తరువాత ఖలీఫాగా నియమించవలసిన అవసరం ఏర్పడినప్పుడు, "అబూహుజైఫా బానిస 'సాలిమ్' బ్రతికి ఉన్నట్లయితే నేను నా తరువాత ఖలీఫాగా నియమించేవాణ్ణి" అని అన్నారు. దైవప్రవక్త బోధన, సంప్రదాయాలకు అనుగుణంగా, వాటి విశదీకరణగా ఆయన సహచరుల జీవితాల్లో ఆచరణ రూపేణ ఇలాంటి మహత్తర ఆదర్శాలు కానవస్తాయి.

హ్రజత్ ఉమర్ జీవిత వివరాలను పరిశీలిస్తే ఇస్లామీయ సమాజంలో బానిసలకు ప్రాప్తమయిన ఉన్నతస్థానాన్ని అర్థం చేసుకోవడానికి అది దోహదపడుతుంది. 'ఫయ్' [2] విషయంలో ఆయనకు ఒక మాజీ బానిస హ్రజత్ బిలాల్‌కు భేదాభిప్రాయం వచ్చినప్పుడు, ఆయన, హ్రజత్

---

(1) బుఖారి (2) ఫయ్ = యుద్ధంలో గెలుచుకున్న సాగుభూములు

బిలాల్‌ను సంతృప్త పరచడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలం కాగా దైవాన్ని ఇలా ప్రార్థించారు. "అల్లాహ్, బిలాల్ మరియు అతని సహచరులు నాపై చేస్తున్న దానికి నాకు ప్రతిఫలాన్నివ్వు". ఎంత దయనీయ మయింది ఈ వ్యవస్థ! ఒక ఖలీఫాకు తన ప్రజల్లో ఓ వ్యక్తి అదీ మాజీ బానిస సమక్షంలో ఎంత నిస్సహాయత !!

ఇస్లాం ఒకవైపు ముస్లిములను ప్రేరేపించింది - స్వచ్ఛందంగా తమ బానిసలకు విమోచనమివ్వాలని, రెండోవైపు బానిసల మానసిక, నైతిక స్థాయిని పెంచేందుకు శ్రద్ధ వహించింది. తాము కోల్పోయిన స్వేచ్ఛను, హక్కుల్ని సౌలభ్యాలనన్నింటినీ పొందవచ్చు అన్న హామీనిచ్చింది. ఈ మానసిక శిక్షణ ద్వారా వారిలో విమోచనా కాంక్షను జాగృతం చేసింది. స్వేచ్ఛ తెచ్చే బాధ్యతలను ఎదుర్కొనేలా వారిని సమాయత్తపరిచింది.

మనుషుల్లో స్వేచ్ఛా స్వాతంత్ర్యాల వాంఛను రేకెత్తించి, వారి స్వాతంత్ర్యతా భావానికి భాషనిచ్చి, దాన్ని సాధించే మార్గాలు సుగమం చేసి, వారు దాన్ని కోరగానే వారి స్వేచ్ఛను వారికి అప్పగించే ఓ వ్యవస్థలోనూ, బానిసల్ని శాశ్వతంగా బానిసత్వపు బంధనాల్లో కట్టి ఉంచి, వారిని బలహీనులుగా, అశక్తులుగా చేసి, బాహ్యంలో ఆర్థిక, సామాజిక విప్లవాల ఒత్తిడి రానంతవరకు, లక్షలాది ప్రజలు మృత్యువు ఒడిలో చేరనంతవరకు, వారు తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కొరకు నోరు విప్పకుండా అణచిపెట్టే వ్యవస్థలోనూ - ఈ రెండింటిలోనూ వ్యత్యాసమంటూ ఏమీ కానరావడం లేదా?

## చేదు ఫలాలు

బానిసత్వాన్ని నిర్మూలించడంలో ఇస్లాంకు ఇతర వ్యవస్థలపై గల ఆధిక్యత అనేక కోణాలనుంచి పరిశీలనార్హమయింది. బానిసల్ని బాహ్యరూపంలోనూ అంతర్గతంగానూ విమోచనాన్ని ప్రసాదించడం ఇస్లాం

ఉద్దేశ్యం. అబ్రహాం లింకన్‌లా బానిసల్ని మానసికంగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కొరకు సమాయత్త పరచకుండానే కేవలం కొన్ని సద్భావాలపై ఆధారపడి ఒక్క ఉత్తర్వును జారీ చెయ్యడంతో సరిపుచ్చలేదు ఇస్లాం. ఇస్లాం అనుసరించిన విధానాన్ని చూస్తే దానికి మానవ మనస్తత్వం యొక్క అవగాహన ఏ మేరకు ఉందో, ఇంకా అది తన లక్ష్యసాధనకై ఏ విధంగా లభించిన సాధనాలను మార్గాలను పూర్తిగా వినియోగించుకుందో ద్యోతకమవుతుంది. యూరపులో మాదిరిగా మానవహక్కుల కొరకు అక్కడి బానిసలు ప్రాణాలను ఒడిగట్టేందుకు సిద్ధం కానంతవరకు గత్యంతరంలేని పరిస్థితిలో స్వేచ్ఛ నివ్వలేదు ఇస్లాం. యూరపులో మాదిరిగా వర్గపోరాటాలు ఉత్పన్నమయ్యేవరకు, ఘర్షణలు జరిగి సమాజంలో వెగటు చోటు చేసుకునే వరకు నిరీక్షించకుండా స్వయంగా ముందుకువచ్చి బానిసలకు దాస్యబంధనాల నుండి విమోచనం కలిగించింది ఇస్లాం. ఆ వర్గ పోరాటానికి పర్యవసానంగా మానవుల్లోని ఆధ్యాత్మిక, ప్రేమైకధార ఇంకిపోయింది. నైతిక ఆధ్యాత్మిక వికాసానికి ఎనలేని నష్టం వాటిల్లింది.

## మూఢ సంప్రదాయాలు

ఒక్క యుద్ధం తప్ప బానిసత్వానికి మూలకారణాలయిన వాటినన్నింటి ద్వారాలను ఇస్లాం శాశ్వతంగా మూసివేసిందని లోగడ మనం పరిశీలించాము. యుద్ధాన్ని అంతమొందించడం క్రియాత్మకంగా కొరకరాని కొయ్యలా తయారయినందువల్లనే ఇలాంటి పరిస్థితి ఎదురయిందన్నదీ గమనించాము. ఆ సమస్యను కూడా ఇస్లాం ఏ రూపంలో పరిష్కరించడానికి కృషి చేసిందో చూద్దాము.

ప్రాచీనకాలంలో ప్రపంచంలో ఓ విధానం చెలామణిలో ఉండేది. యుద్ధరంగంలో పరాజితులయిన సైనికుల్ని – మినహాయింపు లేకుండా అందరినీ నిర్దయంగా చంపడమో లేక వారిని బానిసలుగా చేసుకొనడమో

జరిగేది. * కాలక్రమేణ యుద్ధానికి సంబంధించిన ఈ సంప్రదాయం ఒక యదార్ధంగా, అనివార్యమయిన అవసరంగా రూపొందింది.

ఈ సామాజిక పూర్వరంగంలో ఇస్లాం ఆవిర్భవించింది. అది తన విరోధులతో ఎన్నో యుద్ధాలు చెయ్యవలసి వచ్చింది. ఈ యుద్ధాల్లో ఖైదీలుగా పట్టుబడ్డ ముస్లిముల్ని విరోధులు బానిసలుగా చేసుకునేవారు. వారిని, ఆ కాలంలో బానిసల విధిరాతగా తయారయిన బాధలు యాతనలన్నింటికీ గురిచేసే వారు. ఖైదీ స్త్రీల మానభంగంలో విజేతలకు ఎలాంటి జంకూ వంకూ, సిగ్గూ శెరము ఉండేవి కావు. ఒక్కొక్కసారి తండ్రి, కొడుకు ఇతర మిత్రబృందం అందరూ కలిసి ఒకే స్త్రీని తమ కామానికి బలిగొనేవారు. ఆమె వారందరికీ ఉమ్మడి ఉంపుడుకత్తెగా వ్యవహరించేది. స్త్రీ గౌరవమో, ఆమె కన్య కావడమో లేక వివాహిత స్త్రీ కావడమో ఏదీ అడ్డు వచ్చేదికాదు. యుద్ధాల్లో పట్టుబడే బాలలకు కూడా ఇదే గతిపట్టేది.

## అపజయమే వారి అపరాధం

ఇలాంటి పరిస్థితుల్లో ఇస్లాం తన విరోధీ ఖైదీలనందరినీ పట్టుకున్న వెనువెంటనే విడుదల చెయ్యడమన్నది సాధ్యమయ్యే పనికాదు. ఒకవేళ ఇలా చేసి ఉన్నట్లయితే అది వివేచనారహితమయిన చర్యగానే పరిగణించ బడుతుంది. దానివల్ల విరోధులకు ఇంకా కాస్త సాహసం కలిగేది. వారు ఎలాంటి ప్రతీకార చర్యకు భయపడకుండా ముస్లిముల బంధువులూ ఆత్మీయుల్ని బానిసలుగా చేసుకుని నిర్దాక్షిణ్యంగా, ద్వేషం చల్లారేవరకు తమ దౌర్జన్యకాండను, ప్రతీకార చర్యల్ని కొనసాగనిచ్చేవారు. ఇలాంటి

---

* UNIVERSAL HISTORY OF THE WORLD అనే పుస్తకంలో 2273వ పుటలో ఈ విధంగా ఉంది. క్రీ.శ 599లో రోమను చక్రవర్తి మారియుస్ (MARIVS) లక్షలాది యుద్ధ ఖైదీలను పట్టుకున్నాడు. కాని ఆయన వారిని విడుదల చెయ్యడానికో, వారికి బదులుగా పరిహారాన్ని స్వీకరించడానికో అంగీకరించలేదు. వారందరి శిరచ్ఛేదనం చేయించాడు.

పరిస్థితిలో ఇస్లాం అనుసరించగల మార్గం ఒక్కటే. విరోధుల చేతుల్లో చిక్కుకున్న తన ఖైదీలపట్ల విరోధులు ఎలా ప్రవర్తించాలని అది కోరుకుంటుందో కనీసం అలాంటి ప్రవర్తనే అది తన చేజిక్కిన ఖైదీల పట్ల అనుసరించవలసి ఉంటుంది. యుద్ధ ఖైదీలను బానిసలుగా చేసే ఈ సంప్రదాయాన్ని శత్రుపక్షం కూడా ఇస్లాంతో సహకరించనంతవరకు అంతమొందించడం సాధ్యమయ్యేదికాదు. అందుచేతనే ఇస్లాం, బానిసత్వాన్ని పూర్తిగా అంతమొందించేందుకు పరిస్థితులు అనుకూలించనంతవరకు, ప్రపంచ ప్రజలంతా యుద్ధ ఖైదీల విషయంలో ఓ ఉమ్మడి కార్యాచరణ విధానం పట్ల అంగీకారానికి రానంతవరకు భరించింది.

ప్రాచీనకాలం నుండి నేటివరకు యుద్ధాల చరిత్ర ఒక జాతిపై మరో జాతి జరిపిన మోసం, జులుం, దౌర్జన్యాల గాథలతో, ఓ జాతిని మరోజాతి బానిసగా చేసుకున్న ఉదంతాలతో, జాతుల విస్తీరణా వాదపు సంకల్పాలతో, రాజుల, సేనానాయకుల స్వార్థపూరిత ప్రతీకార కాంక్షల పర్యవసానాలతో నిండి ఉంది. ఈ యుద్ధాల్లో పట్టుబడే ఖైదీలను బానిసలుగా చేసుకోవడానికి కారణం పరాజితజాతి విశ్వాసాలో, నిమ్నోన్నతా విభేదాలో, శారీరక మానసిక శక్తి సామర్థ్యాలు కొరవడటమో - ఏదీకాదు. వారు పరాజిత జాతికి చెందిన వారవడం ఒక్కటే వారి అసలు అపరాధం. అందువల్ల విజేతలకు, తమ ఇష్టం వచ్చినట్లు వారితో వ్యవహరించే సకల అధికారాలూ ఉన్నాయి. వారిని అడ్డుకునే వాడెవడూ లేడు. ఉత్తమ సిద్ధాంతం, ఉన్నత ధ్యేయం, ఉజ్వల జీవన సూత్రాలేవీ వారిముందు లెవ్వుగనుక వారు ఆడిందే ఆట, పాడిందే పాట, పలికిందే వేదం, చేసిందే ధర్మం !

## యుద్ధం కాదు 'జిహాద్'

ఇస్లాం ఆవిర్భవించి ఈ చెడులన్నింటినీ అంతమొందించింది. అది దైవమార్గంలో 'జిహాద్' చెయ్యడం తప్ప అన్ని యుద్ధాలనూ ఖండించింది.

వాటిని నిషేధించింది. జిహాద్‌ను మాత్రమే ధర్మబద్ధం చేసింది. ఎందుకం మనిషిని అన్యాయం, అక్రమం, అత్యాచారాలనుండి కాపాడటం దా ఉద్దేశ్యం. సత్యాన్వేషకుల మార్గంలో అవరోధాలు సృష్టించి, దైవదాసుల దైవానికి దూరంచేసి తామే దైవాలుగా తయారయి కూర్చున్న నిరంకు పాలకుల్ని శక్తినుపయోగించి అంతమొందించటం ఎంతో అవసరం. అప్పు మనుషులకు నిజమయిన స్వేచ్ఛా స్వతంత్రతలు ప్రాప్తిస్తాయి. అప్పు వారు తమ ఇష్టాయిష్టాల ప్రమేయంతో సత్యాన్ని దర్శించగలుగుతారు దివ్యఖుర్‌ఆన్‌లో ఈ విషయాన్ని ప్రస్తావించడం జరిగింది:

> ఇంకా మీతో కయ్యానికి దిగేవారితో అల్లాహ్ మార్గంలో
> మీరూ పోరాడండి. అయితే అన్యాయం చెయ్యకండి.
> అల్లాహ్ అన్యాయం చేసేవారిని ఇష్ట పడడు ( 2:19)
>
> (మానవుల జీవనమార్గం) ధర్మం పరిపూర్ణంగా అల్లాహ్
> కొరకే ఏకోన్ముఖం కానంతవరకు మీరు వారితో పోరాడండి.
> (8 : 39)

ఇస్లాం సందేశం శాంతిశ్రేయాల సందేశం. అది ప్రతి వ్యక్తి అవసరమయిందే. అందువల్ల దాని సందేశాన్ని విని, అర్థం చేసుకు గ్రహించగలిగే మార్గం సుగమం కావాలి.

ముస్లిం జగత్తులో నేటికీ క్రైస్తవులూ, యూదులు గణనీయమయిన సంఖ్యలో ఉన్నారన్న వాస్తవం, వారు తమ ధర్మంపై పూర్తి స్వేచ్ఛత స్థిరంగా ఉన్నారన్న యదార్థం చాటేదేమిటి? ఇస్లాం తన విశ్వాసాలను ఇతరులపై బలవంతంగా రుద్దదనడానికి, ఈ విషయంలో అది ఎలాంటి ఒత్తిడినీ, బలాత్కారాన్నీ అంగీకరించదనడానికి ఇది కాదనలేని తార్కాణం కాదా ?*

---

* ప్రఖ్యాత చరిత్రాచార్యుడు, రచయిత ఆర్నాల్డ్ తనగ్రంథం THE PREACHING OF ISLAM లో ఇస్లాం చేసే ఈ వాదాన్ని నిర్ధారించడమే కాదు బలపరిచాడు కూడా.

## ముస్లిమేతరులు - ఇస్లాం - యుద్ధం

ప్రజలు ఇస్లాం అందజేసే సందేశాన్ని స్వీకరించి అది ప్రకటించే యదార్థాలను విశ్వసిస్తే వారికీ ముస్లిములకు మధ్యనుండే శత్రుత్వం అంతా సమసి పోతుంది. అంతేకాక వారు స్వయంగా ముస్లిం సమాజంలో ఓ భాగంగా రూపొందుతారు. ఇక వారిని బానిసలుగా చెయ్యడం ధర్మసమ్మతం కాజాలదు - అలా చేసే ప్రశ్నే తలెత్తదు. ఇతర ముస్లిములకు లభించే హక్కులే వారికీ లభిస్తాయి. అరబ్బుకు అరబ్బేతరునిపైగాని అరబ్బేతరునికి అరబ్బు పైగాని ఎలాంటి ఆధిక్యత లేదు. ఇక్కడ ఆధిక్యత అంటూ ఏదయినా ఉంటే అది కేవలం మనిషిలోని ఋజువర్తనం ఆధారంగాను, భయభక్తుల ఆధారంగా మాత్రమే ఉంటుంది. దీనికి భిన్నంగా ప్రజలు ఇస్లాంను ధర్మంగా స్వీకరించకుండా ఇస్లామీయ రాజ్యం నీడలో ముస్లిములతో పాటు శాంతియుతంగా ఉండగోరితే ఇస్లాం వారిని బలాత్కరించి తమతో ఏకీభవించేలా చెయ్యదు. వారినుండి ఓ ప్రత్యేక రుసుము వసూలు చేసి వారి భద్రతా బాధ్యతను పూర్తిగా తన తలపై వేసుకుంటుంది. దీన్నే 'జిజ్‌యా' అనంటారు. దీన్ని వసూలు చేసేటప్పుడు ఇస్లామీయ ప్రభుత్వం తన బాధ్యతా ఛాయల్లో శరణుపొందిన వారితో ఒప్పందం చేస్తుంది. దాని ప్రకారం ఇస్లామీయ ప్రభుత్వం బయటి దురాక్రమణనుండి వారిని రక్షించలేకపోతే ఈ రుసుము మొత్తాన్ని వాపసు చెయ్యడం జరుగుతుంది.*

---

* ఇస్లామీయ చరిత్రలో ఇలా జరిగిన దృష్టాంతాలనేకమున్నాయి. ఈ సందర్భంలో ఇక్కడ T.W.ARNOLD రచించిన THE PREACHING OF ISLAM (ASHR'AF'S EDITION 1965) అనే పుస్తకంనుండి కేవలంరెండింటిని ఉదాహరిస్తున్నాము. ఈ పుస్తకం 61వ పుటలో శ్రీ ఆర్నాల్డ్ ఇలా వ్రాస్తున్నారు: "హిరహ్ చుట్టు ప్రక్కల గ్రామాలతో ఖాలిద్ (బిన్ వలీద్) ఒప్పందం చేసుకున్నారు. అందులో 'మేము మిమ్మల్ని రక్షించ గలిగితే జిజ్‌యా మాదవుతుంది. కాని ఒకవేళ మేము మిమ్మల్ని రక్షించలేకపోతే దానికి (జిజ్‌యాకు) మేము 'అర్హులము కాము'. ఇంకా కాస్త ముందుకు సాగి ఆయన ఇలా వ్రాశారు: అప్పుడు జనరల్ అబూ ఉబైదా సిరియాలోని

ఇతర మతావలంబీకుల రక్షణ విషయంలో గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే రక్షణపొందే మతంకన్నా ఇస్లామే ఉత్తమమయిందని అది నమ్మినా తన పరిధిలోని ఇతర మతాలవారి రక్షణా భారం అది తానే వహిస్తుంది. కాని ఒకవేళ ఏ ప్రజలయినా అటు ఇస్లాంను తిరస్కరించి ఇస్లామీయ ప్రభుత్వానికి, ఇటు జిజ్‌యా చెల్లించకుండా ఉంటే ఇస్లాం అలాంటి ప్రజల్ని తన వ్యతిరేకులుగా పరిగణిస్తుంది. అంటే ఇలాంటి ప్రజలు తమ మంకుతనం కారణంగా ఇస్లాంతో వైషమ్యాన్ని కొనసాగిస్తూ అది అందించే శాంతి హస్తాన్ని అందుకోడానికి సంధిని కుదుర్చుకోడానికి సిద్ధంగా లేరన్నమాట. ఇలాంటి వారే అన్ని కాలాల్లోనూ తమ భౌతికశక్తిని, ధన సంపత్తుల్ని వినియోగించి సత్యానికి పెద్ద అవరోధాలయి నిలుస్తారు. ఇలాంటి పరిస్థితుల్లోనే ఇలాంటి వారికి వ్యతిరేకంగానే ఇస్లాం కరవాలాన్నెత్తే అనుజ్ఞనిస్తుంది – అదీ పరిస్థితుల్ని మెరుగు పరిచే మార్గాలన్నీ మూయబడిన తరువాత ఇంకా క్రమబద్ధంగా అల్టిమేటం ప్రకటించిన తరువాతే. రక్తపాతాన్ని వీలయినంత మేరకు ఆపగలిగితే ఆపాలని శాంతిని సుస్థాపితం చెయ్యాలని ఇలాంటి చివరి ప్రయత్నాలన్నీ జారవిడుచుకోదు. దైవాదేశం :

> వారు సంధి ఒడంబడికకై సిద్ధమయితే మీరున్నూ సంధికై సిద్ధపడండి. అల్లాహ్‌పై భరోసా కలిగి ఉండండి. (8:61)

---

నగరాల గవర్నర్లందరికీ వ్రాత మూలకంగా ఆదేశం పంపారు, జిజ్‌యా మూలకంగా వసూలయిన మొత్తాన్ని ఆ నగరాల ప్రజలకు వాపసు ఇచ్చి వెయ్యాలని. అప్పుడు ఆయన ఆ ప్రజలకు ఇలా వ్రాశారు, "మేము మీ ధనాన్ని మీకు వాపసు చేస్తున్నాము. ఓ బ్రహ్మాండమయిన సైన్యం మాపై దండెత్తి వస్తోందని మాకు సమాచారం అందింది. ఇప్పుడు మేము మా ఒప్పందం ప్రకారం మిమ్మల్ని రక్షించే స్థితిలో లేము. కాబట్టి మీనుండి వసూలు చేసిన ధనాన్ని మీకు వాపసు చేస్తున్నాము. ఒకవేళ మేము శత్రుసైన్యాన్ని జయిస్తే మన మధ్య కుదిరిన ఈ ఒప్పందం ఇంకా పటిష్టమవుతుంది, దాని షరతు లన్నింటికీ మేము బద్ధులవుతాము."

## ధర్మపథంలో అనివార్యమయి ......

ఇదీ ఇస్లామీయ యుద్ధాల గాథ. మానవాళి ఋజు మార్గాన పయనించాలన్న భావమే వాటికి మూలప్రేరణ. ఈ ధ్యేయ సాధనలో శాంతియుత మార్గాలు ప్రయోజనకరం కాకపోతే గత్యంతరం లేక ఇస్లాం శక్తిని వినియోగిస్తుంది. ఇస్లాం చేసే ఈ యుద్ధాలు సైనిక వీరుని స్వార్థమో రాజ్యవిస్తీరణా తృష్ణయో లేదా ఇతరుల్ని తనకు బానిసలుగా చేసుకోవాలన్న దురహంకారమో సృజించినవి కావు. ఈ యుద్ధాలు ఏ ప్రజనూ లొంగ దీసుకుని అణచివెయ్యడానికి జరగలేదు. వీటి అసలు ప్రేరణ దైవ ప్రసన్నత పొందే సద్భావమే తప్ప మరేమీకాదు. అయితే కేవలం 'సద్భావం' మాత్రమే కాదు అది నెరవేరడానికి, యుద్ధాలకు సంబంధించిన సూత్రాలు, నియమాలు కూడా ఖరారు చేసింది ఇస్లాం. దైవ ప్రవక్త (సఅసం) ముస్లిములకు బోధించారు, "అల్లాహ్ నామం స్మరిస్తూ వెళ్ళండి; ఆయన మార్గంలో పోరాడండి; దైవాన్ని ధిక్కరించే వానితో పోరాడండి; ఒప్పందాన్ని భంగ పరచకండి; చిత్రవధ చెయ్యకండి; కళేబరాలను వికృతం చెయ్యకండి; బాలల్ని హతమార్చకండి." * అలాగే ఆ ఆదర్శమూర్తి ముస్లిముల కెదురుగా పోరాటంలో పాల్గొన్న వారు తప్ప ఇతర శాంతియుత ప్రజలపై ఆయుధాన్ని గురిపెట్టడాన్ని నిషేధించారు. సామగ్రి సంపత్తులను నాశనం చెయ్యడాన్ని, గౌరవభంగం చెయ్యడాన్ని కూడా ఆయన నిషేధించారు. వారు ఎలాంటి చెడును, కల్లోలాన్నీ ప్రోత్సహించరాదని ప్రబోధించారు, ఎందుకంటే :

అల్లాహ్ కల్లోల జనకులంటే ఇష్టపడడు (5 : 64)

ముస్లిములు తాము పాల్గొన్న యుద్ధాలన్నింటిలోనూ వంచనాగ్రేసరులయిన క్రూసేడర్స్ కెదురుగా పోరాడవలసి వచ్చిన

---

* ముస్లిం, అబూదావూద్, తిర్మిజి.

యుద్ధాల్లోనూ - తమ ఈ ఉన్నత సంప్రదాయాలను కాపాడుకుంటూ వచ్చారు. క్రైస్తవులు ఎరుష్లేముపై దురాక్రమణ జరిపినప్పుడు, అక్కడి ముస్లిం పౌరులను వారు నానా విధాలుగా దౌర్జన్యం, అత్యాచారాలకు గురిచేశారు. వారి మాన గౌరవాలను కాలరాచారు. వారి స్త్రీ పురుషుల్ని విచక్షణా రహితంగా చంపారు. చివరికి నగరంలోని మహోన్నతమయిన మస్జిద్ కూడా వారి 'హస్తలాఘవం' నుండి తప్పించుకోలేక పోయింది. కాని ముస్లిములు ఆ నగరాన్ని తిరిగి హస్తగతం చేసుకున్నప్పుడు వారు దౌర్జన్యపరులపై ఎలాంటి ప్రతీకార చర్యలు తీసుకోలేదు. వాస్తవానికి అన్యాయం అక్రమం జరిగినప్పుడు ప్రతీకారం తీర్చుకునే అధికారం, హక్కు వారికి దైవం తరఫుననే ఇవ్వడం జరిగింది.

> ఎవరయితే మీపై దౌర్జన్యం చేస్తారో వారిపట్ల
> మీరు కూడా అంతే బలాన్ని ప్రయోగించండి (2 :194)

కాని ముస్లిములు తమ శత్రువులపట్ల కనబరచిన ఉదారగుణం నేటికీ అనన్యంగా, అసమానంగా, అద్వితీయంగా చరిత్రలో నిలిచిపోయింది.

## విలక్షణమయిన పంథా

"విగ్రహారాధనాభి శాపంలో పడి కొట్టుమిట్టాడుతున్న వారు, సత్యాన్నీ, సదాచారాన్నీ వ్యతిరేకించేవారు అసలు మానవులే కారు; అనాగరికులు, అడవి మనుషులు. ఆ కారణంగా వారు బానిసలుగా ఉండదగిన వారే ; వారు మానవ గుణగణాల రీత్యా మానసిక స్థితి దృష్ట్యా అధములు కాకపోతే సత్యాన్నీ, ప్రకాశాన్నీ వ్యతిరేకించేవారుగా ఎందుకు తయారయ్యేవారు? సత్యానికి ఎదురుగా ఎందుకు ఉద్యమించేవారు ? వీరి ఈ చర్య మానవతాస్థాయికి అవమానకరంగా ఉంది కాబట్టి ఈ జనులు ఎలాంటి గౌరవ మర్యాదలకూ అర్హులు కారు; వారికి స్వేచ్ఛను పొందే

హక్కూ లేదు - ఇవన్నీ కేవలం స్వతంత్ర ప్రజలకే ప్రత్యేకం, వారిదే ఈ మహాభాగ్యం" అనే వాదనను, దృక్పథాన్ని బలపరచినా అప్పట్లో చెల్లేదే.

కాని అది ఎన్నడూ అలా చెయ్యలేదు. ముస్లిములు యుద్ధ ఖైదీలను గత్యంతరం లేక బానిసలుగా చేసుకున్నా అది కేవలం వారి విరోధులు తమకు చేజిక్కిన ముస్లిం యుద్ధ ఖైదీలను బానిసలుగా చేసుకోవడం వల్లనే. అలాకాక ఇస్లాం ఏకపక్షంగా బానిసత్వాన్ని నిర్మూలిస్తున్నట్లు ప్రకటించి ఉన్నట్లయితే ముస్లిముల శత్రువులు బలపడేవారు. వారు ఎలాంటి హద్దు పద్దు లేకుండా తమకు యుద్ధ ఖైదీలుగా ప్రాప్తమయిన ముస్లిములనందరినీ సిగ్గువిడిచి సకల విధాల సంకటాలకు, బాధలకు, పరాభవాలకు గురి చేసేవారు.

ఈ సందర్భంలో ఖైదీలపట్ల వ్యవహరించే తీరును బోధించే దివ్యఖుర్ఆన్ (ఆయత్) వాక్యాన్ని ప్రస్తావించడం అవసరం :

> ఆ తరువాత, వారిని మంచితనంతో వదలి వెయ్యండి
> లేదా పరిహారం తీసుకుని వదలండి - పోరాడేవారు
> ఆయుధ విసర్జన చెయ్యనంతవరకు (4 :47)

ఈ ఆయత్‌లో ఖైదీలను బానిసలుగా చేసే ప్రస్తావనే లేదు. ఆ ప్రస్తావనే గనక ఉంటే అది ఇస్లామీయ యుద్ధ నియమాల్లో భాగంగా శాశ్వతంగా నిలిచిపొయ్యేది. ఇందులో రెండు విధానాలు సూచించబడ్డాయి. పరిహారం తీసుకుని వదలి వెయ్యడం లేక పరిహారం తీసుకోకుండా ఉచిత రీతిన విడుదల చెయ్యడం. ఈ రెండు మార్గాలే ఇస్లామీయ యుద్ధ శాసనంలో చోటు చేసుకున్నాయి గనుక వీటిని మాత్రమే అవలంబించడం సాధ్యం. దీని ద్వారా తెలిసేదేమంటే ప్రారంభంలో ముస్లిములు యుద్ధ ఖైదీలను బానిసలుగా చేశారంటే అది సమకాలీన పరిస్థితుల వెలుగులో ఆనాటి అవసరాల కనుగుణంగా ముస్లిములు అవలంబించిన పాలిసీ

(కార్యాచరణ విధానం) లోని భాగం మాత్రమే.

## ఆచరణలో ఆదర్శం

ఎన్ని అవసరాలున్నా ఎన్ని కారణాలున్నా, యుద్ధ ఖైదీలను తప్పని సరిగా బానిసలుగా చెయ్యాలన్నది ఇస్లాం అభిమతం ఎన్నటికీ కాదు. దీనికి భిన్నంగా యుద్ధాలు ముగిసి శాంతి నెలకొన్నప్పుడు ఎవరినీ బానిసలుగా చెయ్యడం జరిగేది కాదు. స్వయంగా మహనీయ ముహమ్మద్ (సఅసం) బద్ర్ యుద్ధంలో పట్టుబడ్డ ఖురైష్ నాయకుల్ని కొందరిని పరిహారం తీసుకుని మరి కొందరిని పరిహారం లేకుండానే విడుదల చేశారు. అలాగే ఆయన నజ్‌రాన్ క్రైస్తవ బృందంతో కుదిరిన ఒప్పందం ప్రకారం వారిని ఇస్లామీయ రాజ్య పరిధిలో చేర్చుకుని వారినుండి జిజ్‌యా గ్రహించి వారి ఖైదీల నందరినీ విడుదల చేశారు. ఇస్లాం అనుసరించిన ఈ వెలుగు బాటను చూచే మానవాళి క్రమేణ గతంలోని చీకటి బంధనాలనుండి విముక్తమయి యుద్ధఖైదీల సమస్యను కేవలం మానవతా దృష్టితో పరిష్కరించేందుకు ముందుకు వచ్చింది.

వివిధ యుద్ధాల్లో ముస్లిముల చేజిక్కిన ఖైదీల విడుదలకు ఒకే ఒక షరతు ప్రతిపాదించడం జరిగింది - వారు స్వేచ్ఛను పొంది అది తెచ్చే బాధ్యతల్ని, తెచ్చే సమస్యల్ని ఎదుర్కొనే యోగ్యతను సంపాయించుకోవాలి. ఆ విధంగా వారిలో ఎవరయినా ఈ ప్రమాణాల రీత్యా యోగ్యులుగా తోస్తే వారిని జాప్యం చెయ్యకుండా విడుదల చేసేవారు. నిజానికి వారిలో కొందరు ముస్లిముల ఖైదీలవడానికి పూర్వం తరతరాలుగా బానిసలుగానే బ్రతుకుతూ వచ్చారు. వీరిని పర్షియన్ మరియు రోమన్ సామ్రాజ్యాలు ఇతర దేశాలనుండి పట్టుకువచ్చి, ముస్లిములకు ఎదురుగా పోరాడేందుకు వినియోగించుకునేవారు. అలా రణరంగంలోకి వచ్చి ముస్లిములకు పట్టుబడ్డ వీరిని వారి యోగ్యతా యోగ్యతల పరిశీలన తరువాత విడుదల చెయ్యడం జరిగేది.

## మహిళా బానిసలు

పోతే మహిళల విషయంలో, బానిసలయినా యుద్ధఖైదీలయినా వారి స్త్రీత్వపు గౌరవాన్ని పూర్తిగా కాపాడింది ఇస్లాం. వారు యుద్ధంలో పట్టుబడిన వారయినా వారిపట్ల అగౌరవంగా ప్రవర్తించడానికి, వారి మానభంగం జరపడానికి ఎవరినీ అనుమతించలేదు ఇస్లాం. రణరంగంలో లభించిన యుద్ధ సొమ్ముగా భావించి ఎవరికి వారు, వారిపై స్వామ్యం చెలాయించడానికి ముస్లిములెవరికీ అనుమతి నివ్వలేదు ఇస్లాం. ఇలాంటి ఖైదీ స్త్రీలను 'ఉమ్మడి సరకు' గా ప్రకటించి ఇష్టమయిన వారు అడ్డు లేకుండా తమ కామాగ్నిని చల్లార్చుకునేందుకు వీలు కల్పించలేదు ఇస్లాం. దీనికి భిన్నంగా ఇస్లాం వారిని కొందరి పోషణలో పెట్టి అలాంటి యజమానుల వద్దనే సేవకురాండ్రుగా ఉండే ఏర్పాటు చేసింది. ఆ తరువాత ఇతరులెవరూ వారితో లైంగిక సంబంధాలు పెట్టుకోవడం ధర్మ సమ్మతం కాదని ప్రకటించింది. వారు కూడా 'మకాతబత్' ద్వారా విడుదల పొందే అవకాశాలు కల్పించింది. ఇంకా ఏ బానిస స్త్రీ అయినా తన యజమానివల్ల సంతానవతి అయినట్లయితే తనంతట ఆమె విడుదలయినట్లు, ఆమె, ఆ పుట్టే శిశువు కూడా స్వతంత్రులయినట్లు నిర్ణయించడం జరిగింది. దీని ద్వారా ఖైదీ మహిళల పట్ల వారు ఖైదీలుగా ఉన్నంతవరకు ఇస్లాం ఎంత ఉదారంగా ఉదాత్తంగా పవిత్రంగా ప్రవర్తించిందో ద్యోతకమవుతోంది.

ఇస్లాంలో బానిసత్వానికి సంబంధించిన గాథ ఇది. ఇది మానవ చరిత్రలో ఓ కాంతిమయమయిన అధ్యాయం. సూత్రప్రాయంగా బానిసత్వాన్ని ఇస్లాం ఎన్నడూ సమ్మతించలేదు. తాత్కాలికంగా గత్యంతరం లేక దాని ఉనికిని అది సహించినా తరువాత ప్రపంచ దేశాలు ఈ విషయంలో ఓ నిర్ణయానికి వచ్చి ఓ పరిష్కారానికి సమ్మతించినప్పుడు ఇస్లాం దానికి స్వాగతం పలికింది. ఎందుకంటే ఇస్లాం ప్రతిపాదించే జీవన వ్యవస్థలోని ప్రాథమిక సూత్రాల ప్రకారం స్వేచ్ఛా స్వతంత్రతలు, సర్వ సమానతలు సకల మానవుల ప్రాథమిక హక్కులు.

## ఆధునిక యుగంలో బానిసత్వం

ఆ తరువాత ముస్లిం రాజ్యాల్లో కనిపించే బానిసత్వం, మనుషుల క్రయ విక్రయాలు, మనుషుల వ్యాపారం - వీటితో ఇస్లాంకు ఎలాంటి సంబంధంలేదు. బానిసత్వపు ఈ రూపాలు ఇస్లాం సూచించే జిహాద్‌కు పర్యవసానంగా ఉనికిలోకి వచ్చినవికావు. ఇస్లాం పేరు మీదుగా నేటికీ ముస్లిం పరిపాలకులు చేసే అనేక అపరాధాల కోవకు చెందిన అపరాధమే అదీను. నేడు వీరు చేసే అపరాధాలను ఇస్లాంకు అంటగట్టడం ఏ విధంగా అసమంజసమో అలాగే చరిత్రలో జరిగిన బానిసత్వపు గాథల్ని ఇస్లాంతో ముడిపెట్టడం కూడా అసంబద్ధమే.

## బానిసత్వం అంతమయిందా?

బానిసత్వపు సమస్యను పరిశీలించేటప్పుడు క్రింది యదార్థాలు మన కనుమరుగవరాదు.

(1) ఇస్లాం తరువాతి కాలాల్లో ప్రపంచమంతటా విభిన్న పరిపాలకులు బానిసత్వాన్ని సమర్థించారు. దాని విభిన్న రూపాలను విభిన్న విధాలుగా మిగులనిచ్చారు. నిజానికి ఆ కాలాల్లో ఎలాంటి బలవత్తర కారణమూ లేకపోయినా దాన్ని వారు పోషించారు. దానికి అసలు కారణం రాజ్య విస్తీర్ణా కాంక్ష, అధికార పిపాస మాత్రమే. ఈ కారణంగా ప్రతి జాతి మరో జాతిని, ప్రతి వర్గం మరో వర్గాన్ని తన దాస్య బంధనాల్లో బిగించి ఉంచాలని ప్రయత్నించింది. ఇంతేకాక బానసత్వానికి మరో కారణం బీదరికం, ఆకలిదప్పులు. నిరుపేద కుటుంబాల్లో పుట్టిన వారిని, వ్యవసాయ కూలీలుగా పనిచేసే వారిని నీచంగా చూసేవారు. వారిని బానిసలుగా భావించి వారిచేత దాస్యం చేయించుకునేవారు. ఇస్లాం బానిసత్వపు ఈ రూపాలన్నింటినీ నిర్మూలించాలనే కోరింది. అందువల్ల ఈ రూపాలన్నింటినీ అంతమొందించింది. తన అదుపులో లేని (యుద్ధ ఖైదీల) ఒక్క రూపం తప్ప ! దానికి అప్పట్లో పరిస్థితులు అనుకూలంగా

ఉండేవికావని ముందే చూశాము.

(2) యూరపులో ఎలాంటి బలవత్తరమయిన సామాజిక అవసరం లేకపోయినా చాలా కాలంవరకు బానిసత్వం కొనసాగింది. చివరికి దాని నిర్మూలనం జరిగినా, అది చిత్తశుద్ధితో చేసిన పనికాదు. గత్యంతరం లేక చేసిన పని. ఈ విషయంలో స్వయంగా పాశ్చాత్య పండితుల రచనలే దీనికి ప్రబల సాక్ష్యాలు. యూరపులో బానిసత్వపు నిర్మూలనకు అసలు కారణం అక్కడి ఆర్ధిక పరిస్థితులు. అప్పుడు బానిసలు తమ యజమానుల సంపదను పెంచడానికి బదులు, వారిపై ఆర్ధిక భారాన్ని పెంచే వారుగా తయారయ్యారు. ఎందుకంటే వారిలో తమ యజమానుల కొరకు కష్టించాలన్న భావమూ సన్నగిల్లింది, కష్టించేందుకు శక్తీ సన్నగిల్లింది. బానిసల ఆహారం, వారి భద్రతకు అయ్యే ఖర్చు వారి సంపాదన కన్నా ఎన్నో రెట్లు పెరిగిపోయింది. తలకు మించిన ఈ భారాన్ని మొయ్యలేక లాభనష్టాల బేరీజు వేసుకొని చేసిన 'వ్యాపార' ఉద్యమం అది! యూరపులో బానిసల విమోచనోద్యమం!! దీనికి ఇస్లాం చూపిన పవిత్రమయిన మార్గానికి ఎలాంటి సంబంధమేలేదు. ఈ కారణం వల్లనే యూరపు విమోచనోద్యమ చరిత్ర నెత్తుటి చారలతో ఎరుపెక్కిన సాంఘిక విప్లవాలతో నిండిపోయింది. ఇస్లామీయ విమోచన చరిత్రలో అలాంటి ఓ చిన్న సంఘటన కూడా మచ్చుకయినా కానరాదు. ఆ విప్లవాలు జరిగిన మీదట యజమానులు బానిసల్ని తమ అదుపులో ఉంచుకునే పరిస్థితిలోనే లేకపొయ్యారు. పర్యవసానంగా, ఇష్టంలేకపోయినా వారిని స్వతంత్రులుగా చెయ్యవలసి వచ్చింది.

ఈ సాంఘిక విప్లవాల తరువాత కూడా యూరపు బానిసలకు తమ స్వేచ్ఛ భద్రంగా ఉందన్న గ్యారంటీ ఎప్పుడూ ప్రాప్తం కాలేదు. ఈ విప్లవాల పరిణామంగా దాస్యం, లేమి, బీదరికాలు తమ పంజాను వారిపై ఇంకా పటిష్ఠం చేశాయి. బానిసలు కట్టు బానిసలయ్యారు. వారి భవితవ్యం వారి వ్యవసాయ భూములతో ముడివడిపోయింది. భూములు అమ్ముడు పోయి నప్పుడల్లా దానితోపాటు వారు కూడా అమ్ముడుపొయ్యేవారు. ఈ వ్యవసాయ

కూలీలకు ఆ భూములు వదలి మరెక్కడికయినా పొయ్యే అనుమతి, అధికారం లేవు. వారిలో ఎవరయినా ఇలాంటి చేష్టకు పాల్పడితే చట్టం రీత్యా అతను ఫరారీ అయిన నేరస్థుడుగా పరిగణించబడేవాడు. అతను పట్టుబడితే వాతలు పెట్టేవారు. కాళ్ళకు బేడీలు వేసి తిరిగి వారి యజమానులకు అప్ప జెప్పేవారు. ఈ రకపు బానిసత్వం (వెట్టి చాకిరి) యూరపు 18వ శతాబ్దంలో సంభవించిన ఫ్రెంచి విప్లవం వరకు కొనసాగింది. అంటే యూరపుకు బానిసల్ని ఆ బంధనాల నుండి విముక్తి చేసే సద్బుద్ధి, బానిసల విమోచనా ప్రణాళిక ఇస్లాం ప్రకటించిన 11 శతాబ్దాలకు గాని కలగలేదన్న మాట.

(3) అయితే కాస్త నిదానంగా చూడాలి. అందమయిన పేర్లు, మనోహరమయిన పదాలు, మనోజ్ఞమయిన పద బంధాలు చూచి మోసపోరాదు. ఫ్రెంచి విప్లవం తరువాత యూరపులోను, అబ్రహాం లింకన్ జారీ చేసిన ఆదేశాల తరువాత అమెరికాలోనూ బానిసత్వం అంతమయిపోయిందన్న మాట అయితే బాగానే ప్రచారంలోకి వచ్చింది. ప్రపంచం బానిసత్వాన్ని నిరసిస్తూ తన తీర్పును కూడా ఇచ్చింది. అయితే వాస్తవం, ఈ పదాల్లో కానవచ్చేంత ఆహ్లాదకరంగా లేదు. ఎందుకంటే బానిసత్వపు దౌర్భాగ్య రూపం నేటికీ ప్రపంచంలో దర్శనమిస్తూ ఉంది. అలా కాకపోతే దౌర్జన్యం, అత్యాచారం, అన్యాయం, నేడు వేషాలు మార్చి బహురూపాల్లో ప్రపంచమంతటా స్వేచ్ఛగా విలయ తాండవం చేస్తూ కాన వచ్చేదికాదు. ఒకవేళ బానిసత్వం అంతమయిపోతే అల్జీరియాలో ఫ్రాన్స్ సాగించిన ఘోర కలికి ఏమని పేరుపెట్టగలం? అమెరికా తన దేశ వాసులయిన నల్లవారిపట్ల జరిపే చీకటి నేరాలను ఏమని పిలువగలం? దక్షిణాఫ్రికాలో నల్లవారయిన ప్రజలపట్ల యూరపు అవలంబించే క్రూర వైఖరికి ఏ పేరుపెట్టి పిలువగలం?

## అందమయిన తెరల చాటున

బానిసత్వం అంటే ఏమిటి? ఒకజాతి మరోజాతిని లోబరచుకుని

దాని మానవహక్కులన్నింటినీ హరించి వేసి పీడించడం! ఇదే బానిసత్వానికి నిజమయిన నిర్వచనం. మనం సొగసయిన నినాదాల వల్ల మోసపోరాదు. అసలు విషయమేమిటో గ్రహించడానికి ప్రయత్నించాలి. బానిసత్వపు ఈ విభిన్న రూపాలపై స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం, సమానత్వం అన్న అందమయిన లేబిళ్ళను అంటిస్తూ తిరగరాదు. ఎందుకంటే అందమయిన లేబిళ్ళ వల్ల ఒక వస్తువులోని కుళ్ళు తాజాదనంగాను, చెడుగు మంచి తనంగానూ మారవు. అలాగే జుగుప్సాకరమయిన ఘోర నేరాలపై రంగుల తెరలు వేసి వాటిని మరుగుపరచడమూ మంచిది కాదు. అది సాధ్యపడదు కూడా. ముఖ్యంగా, మానవాళి ఇలాంటి చేదు ఫలాలను ఒక్కసారి కాదు మాటిమాటికీ అనుభవించి ఉండగా ఇలాంటి సత్యాలు ఎంత దాచినా దాగవు.

తన ఉద్దేశాన్ని, అభిమతాన్ని ప్రకటించడంలో ఇస్లాం ఎన్నటికీ వెనుకాడదు. ఎల్లవేళలా స్పష్టంగా భావప్రకటన చేసింది – తన అసలు లక్ష్యం, సంకల్పం ఏమిటో ప్రస్ఫుటంగా ఉండాలన్న ఉద్దేశ్యంతో బానిసత్వం పట్ల తన దృక్పథం ఏమిటో వ్యక్త పరచింది. దాని మూలకారణాలను సూచించింది. దాన్ని వారించే దారి చూపింది. దాని నిర్మూలనకు మార్గం సుగమం చేసింది. తాను చెప్పిందే చేసింది. చేసినదాన్ని మరుగు పరచకుండా చెప్పుకుంది.

దీనికి భిన్నంగా కృత్రిమత కుత్సితత పూసుకున్న అందమయిన ఆధునిక సంస్కృతి తన ఉద్దేశ్యంలోనూ కార్యాచరణ విధానంలోనూ అస్పష్టతే తన ప్రత్యేకతగా అలరారుతోంది. దాని నిజమయిన రూపం ఏమిటో అది తెలియపరచదు. దాని విధానమేదో స్పష్ట పరచదు. దాని ప్రత్యేకత ఏమిటంటే జిగేలు మనిపించే ముఖం, అంధకార కుహరమయిన అంతర్యం! టునీషియా, అల్జీరియా, మొరాక్కోలలో ఈ సంస్కృతీ వారసులు వేలాది ప్రజల్ని, కేవలం స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని కోరినందువల్ల మానవతా గౌరవాదరణలు కావాలన్నందువల్ల, తమ దేశంపై తమ సొంత ప్రభుత్వం

నెలకొల్పుకోవాలన్నందువల్ల, తమ భాషలో మాట్లాడు కోవాలని సంబరపడినందువల్ల ప్రపంచంలోని ఇతర జాతుల్లా తమ దేశమూ సర్వస్వతంత్రం కాగలగాలని అభిలషించినందువల్ల ఎలాంటి పరదేశ జోక్యం లేకుండా తమ దేశంలో తమ ధర్మం తమ నమ్మకాల కనుగుణంగా జీవితం గడపాలని కాంక్షించినందువల్ల తమకు ఇష్టమయిన రీతిలో ఇతర దేశాలతో ఆర్థిక రాజకీయ సంబంధాలు కుదుర్చుకోవాలని కోరుకున్నందువల్ల – నిర్దాక్షిణ్యంగా మట్టుపెట్టారు. ఈ ఆధునిక సంస్కృతీ ధ్వజవాహకులు, అమాయకులయిన ఈ ప్రజల రక్తంతో తమ చేతులు కడుక్కున్నారు. క్రుళ్ళి, కంపుకొట్టే శిక్షా గృహాల్లో (TORTURE HOUSES) లో బంధించారు. వారి మానాన్ని దోచుకున్నారు. వారి స్త్రీల మానాన్ని కొల్లగొట్టారు. గర్భంతో ఉన్న స్త్రీల కడుపుల్ని పందెం కాసి మరీ చీల్చారు. ఇరవయ్యో శతాబ్దపు ఈ ద్వంద్వ, అమానుష నాగరికతాప్రియులు జుగుప్సాకరమయిన ఈ నేరాలన్నింటినీ చేశారు. కాని ఎక్కడికి వెళ్ళినా చేసే ప్రకటన ఏమిటి? ప్రపంచానికి స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం, సమానత్వం బోధించింది తామేనని, వీరు తాము చేసిన ఈ ఘోర కృత్యాలకు, క్రుళ్ళు నేరాలకు కాంతి అని, క్రాంతి అని గొప్ప గొప్ప పేర్లు పెడతారు. కాని నేటికి 14 వందల ఏళ్ళ క్రితం ఇస్లాం ఎలాంటి ఒత్తిడికి, ఎలాంటి బలవంతపు స్థితికి లోనవకుండా కేవలం మానవతా గౌరవభావం నిండిన గుండెలతో బానిసలపట్ల చేసిన ఉదారప్రవర్తనను, బానిసత్వం మానవ జీవితంతో శాశ్వతంగా ముడిపెట్టుకున్న అంశంకాదని, ఇది కేవలం తాత్కాలిక స్థితి మాత్రమే అని చేసిన ప్రకటనను ఈ ప్రబుద్ధులు అనాగరికత అని, తిరోగమనమని, మూఢాభిప్రాయమని చిత్రిస్తారు.

## నాగరికతా సదనంలో బానిస వదనం

అమెరికనులు తమ వినోదగృహాలపై "కేవలం తెల్లవారి కొరకే" అని, "నల్ల వారికి, కుక్కలకు ప్రవేశము లేదు" అని బోర్డులు తగిలిస్తున్నారు నేటికీ. ఈ నాగరిక అమెరికనులు నలుగురికి, వర్ణంగల వ్యక్తి (COL-

ORED) కనిపిస్తే అతన్ని పట్టుకుని తమ క్రూరత్వం, మృగత్వానికి (LYNCHING) గురిచేస్తారు. అతన్ని రోడ్డుపై బూటుకాళ్ళతో బంతిలా ఎగురవేస్తూ ఉంటారు – అతని పంచప్రాణాలు భవ బంధాలను తెంచుకుని ఊర్ధ్వ లోకాలకు ఎగిసిపోయేవరకు. తమాషా ఏమిటంటే ఈ అమానుషత్వాన్ని ఘోరకృత్యాలను పోలీసు వినోదంలా కిమ్మనకుండా చూస్తూ ఉంటుంది. నిజానికి ఆ దౌర్భాగ్యుడు భాషరీత్యా, మతంరీత్యా, మానవత దృష్ట్యా వారిలోని వాడే, వారి దేశస్థుడే. ఆధునిక నాగరికతా వారసుల జీవితం ఈ ఘోరమయిన నేరాల చెరగని ముద్రలతో నిండిపోయింది. అయినా వారు నాగరికులవడంలో, సంస్కారవంతులవడంలో, ఉదాత్త చరితులవడంలో, ప్రగతిశీలురవడంలో ఎలాంటి లోటురాదు! వారి సభ్యతా సంస్కృతులపై, వారి వృద్ధీ వికాసాలపై ఎలాంటి మచ్చరాదు.

ఒకవైపున ఆధునిక నాగరికతా వారసుల వైఖరి ఇలా ఉంటే, ఇస్లామీయ చరిత్రలోని దేదీప్యమానమయిన దృష్టాంతాలు మరో వైపున ఆలోచనకై ఆహ్వానిస్తున్నాయి. ఆ కాలపు ఖలీఫా హజ్రత్ ఉమర్ పరిపాలనా కాలంలో ఒక బానిస వ్యక్తి ఆయన్ని చంపి వేస్తానని బెదిరిస్తాడు. అన్నీ చెల్లి ఉన్నా, అధికారమున్నా ఆయన అతనికి ఏమీ చెయ్యలేదు. ఖైదులోనూ వెయ్యలేదు, దేశాన్నుండి బహిష్కరించనూలేదు, అనాగరికుడు అంటూ అతన్ని ప్రాణాంతకంగా హింసించేవారి పాల్జెయ్యలేదు. ఆ బెదిరింపుకు బదులుగా కేవలం ఈ మాటలు పలికారు. "ఈ బానిస నన్ను బెదిరిస్తున్నాడు". అంతే అతని స్వేచ్ఛపై ఎలాంటి ప్రతిబంధకాలూ విధించలేదు. అతనిపై ఖలీఫా హత్యానేరం మోపబడింది – అయితే ఎప్పుడు? వాస్తవంగానే అతను ఆ ఘోరాన్ని క్రియారూపంలో చేసివేసినప్పుడు!

ఆఫ్రికాలో నల్లవారిపట్ల ఇంగ్లీషు ప్రజలు వ్యవహరించే తీరు, బ్రిటన్ పేపర్ల మాటల్లో చెప్పాలంటే, "ఏ విధంగానయితే వారిని జంతువుల్లా వేటాడారో, వారి మానవ హక్కుల్ని ఏ విధంగా కాలరాచారో అదంతా ఇంగ్లీషు ప్రజల న్యాయబుద్ధికి, ఆధునిక సభ్యతా సంస్కృతులకు తార్కాణం.

ఇక్కడ మన బ్రిటిషు వారి న్యాయం, సభ్యతా సంస్కారాలు తమ అసలు రూపంలో, పతాకస్థాయిలో దర్శనమిస్తాయి.'' ఈ 'ఉన్నత' మయిన 'మహోజ్వల' మయిన జీవన సూత్రాల ఆధారంగానే పాశ్చాత్యులు ప్రపంచ జాతులపై తమ ఆధిక్యతను చాటుతారు, పెత్తనం చెలాయిస్తారు. కాని యుద్ధ ఖైదీలుగా లభించిన శత్రువుల్ని సయితం సమాన స్థాయినిచ్చి, తాత్కాలికంగా బానిసలుగా చేసే అనుమతి నిచ్చినందుకు ఇస్లాంను వారు అనాగరికమని, తిరోగమనవాదమని అమానుష విధానమని తిట్టిపోశారు. వారి అభిప్రాయంలో ఇస్లాం అనాగరికమయిన ధర్మం - ఎందుకంటే అది మనుషుల్ని జంతువుల్లా వేటాడేందుకు అనుమతించలేదు. కేవలం నల్ల తోలు కారణంగా ఎవరి నిండు ప్రాణాలనూ బలిగొనేందుకు ఒప్పుకోలేదు. అంతేకాదు దాని 'మూఢత్వం' ఏ స్థాయికి చేరుకుందంటే, స్పష్టంగా ప్రకటించింది: ''వినండి, మీరు మీ నాయకుని మాట వినాలి; అతని విధేయత పాటించాలి - అతడు, ఎండిన ద్రాక్ష పండులాంటి తల గల నల్ల (బానిస) వాడయినా సరే''.

## మహిళా 'విమోచనం'

ఖైదీ స్త్రీల విషయం పూర్తిగా భిన్నమయింది. యుద్ధంలో ఖైదీలుగా వచ్చే స్త్రీల సమస్యను పరిష్కరించడానికి ఇస్లాం వారిని ముస్లిముల్లో ఓ పద్ధతిలో పంచి వేసింది. అవకాశాన్ని బట్టి, ఒక్కో వ్యక్తికి ఒకరికంటే అధికంగా కూడా ఈ స్త్రీలను ఇవ్వడం జరిగేది. ఆ స్త్రీలపై వారికి యాజమాన్యపు హక్కులు ప్రాప్తమయ్యేవి. ఆ యజమానికి తన బానిస స్త్రీతో లైంగిక సంబంధం పెట్టుకోడానికి హక్కు ఉండేది. ఇంకా అతడు కోరితే వారిలో తనకు నచ్చిన స్త్రీతో నియమబద్ధంగా నికాహ్ చేసుకునేవాడు. ఆధునిక యూరపు, ఇస్లాం అప్పుడు అనుసరించిన ఈ పద్ధతిపట్ల అసహ్యం ప్రకటిస్తుంది. కాని తమ పాశ్విక కోరికల సంతృప్తి కొరకు పరస్పర అక్రమ సంబంధాలు ఏర్పరచుకునే స్త్రీ పురుషులు ఏ చట్టాన్ని ఉల్లంఘించినా, ఎలాంటి మానవీయ ప్రమాణాలనూ ఖాతరు

చెయ్యకపోయినా అది పట్టించుకోదు. దాని అంతరాత్మ ఏమ్మాత్రం చలించదు. విశృంఖల కామక్రీడలు దాని దృష్టిలో ఏ విధమయిన అపరాధం కావు. నిజానికి ఇస్లాం చేసే "క్షమించరాని నేరం" ఏమిటంటే అది అసభ్యకరమయిన చేష్టలకు, నీతి బాహ్యమయిన పనులకు అనుమతి నివ్వదు. బహుశా ఈ కారణాల మూలంగానే నవనాగరిక యూరపు ఇస్లాం అంటే ఆగ్రహోదగ్రమయిపోతుంది.

ఇతర జాతుల్లో యుద్ధ ఖైదీ స్త్రీలతో అత్యంత లజ్జా విహీనమయిన రీతిలో వ్యవహరించడం జరిగింది. ఆ ఖైదు తరువాత, వేశ్యా వృత్తిలో జుగుప్సాకరమయిన జీవితం గడపడం తప్ప ఆ స్త్రీకి గత్యంతరం లేకపొయ్యేది. ఎందుకంటే సమాజంలో వారికి ఎలాంటి విలువ గౌరవాలుండేవికావు. వారి మానాన్ని, శీలాన్ని కాపాడటానికి, వారిని తన యాజమాన్యంలో తీసుకుని వారి రక్షణా పోషణా భారం వహించే ఏ అధికారమూ ఏ శక్తీ లేక పోయింది. తరచుగా స్వయంగా వారి యజమానులు బానిసల్ని వేశ్యావృత్తికై బలాత్కరించేవారు. కాని 'అనాగరిక, ప్రగతి నిరోధకమయిన' ఇస్లాం తన కాలంలో నీతి బాహ్యమయిన పనులు, వ్యభిచార కార్యకలాపాల ఈ ద్వారాన్నీ మూయించింది. దాని చట్టం ప్రకారం, వారి యజమానులు మాత్రమే బానిసలతో లైంగిక సంబంధం కలిగి ఉండగలరు. ఆ యజమానులే వారి పోషణ, సంరక్షణ భారం కూడా వహించాలి. ఆ విధంగా బానిసలు ఆర్థిక వత్తిడులకు లోనయి గత్యంతరం లేక వ్యభిచార వృత్తికి, చెడు నడతకు పాల్పడకుండా చూడటం జరిగింది. ఇంకా వారు తమ యజమానుల అండన పవిత్రమయిన పరిశుద్ధమయిన జీవితం గడిపే వీలు కల్పించడం జరిగింది.

కాని యూరపు యొక్క అతి 'సున్నితమయిన' అంతరాత్మ ఇస్లాం చేసే " అనాగరికతను, అమానుషత్వాన్ని" సహించలేదు. దాని దృష్టిలో ఇస్లాం తీసుకునే ఈ చర్య మూఢకాలపు అవశేషము. అందువల్ల అది నీతి బాహ్యతను, శీల విక్రయాన్నీ న్యాయ బద్ధమనడమే కాక దానికి చట్టం

రీత్యా భద్రత కూడా అందజేస్తుంది. తన ఏహ్యమయిన సామ్రాజ్యవాదపు దుష్ట సంకల్పాల పరిపూర్తికై ప్రపంచాన్నంతటినీ ఈ రొంపిలోకి, ఈ జాడ్యంలోకి దింపాలని కోరుతోంది. అందుచేతనే నేటికీ ఈ అభిశాపం మానవాళిపై ప్రపంచంపై ఇంకా తిష్ఠవేసే ఉంది. అయితే దీనికి కొత్త నామధేయాలు ప్రాప్తమయ్యాయి. దానిపై రకరకాల, రంగు రంగుల తెరలు వెయ్యబడ్డాయి. మహిళా విమోచనపు వాదనలెన్ని ఉన్నా స్త్రీ నేటికీ అన్యాయానికి గురవుతూనే ఉంది. పురుషునికి విలాస వస్తువుగానే పరిగణించబడుతోంది. నవనాగరిక కాలంలో ఎంతో సింగారించుకుని హుందాగా వేశ్యావృత్తి చేసే స్త్రీని నిజభావంలో స్వేచ్ఛ కలిగి ఉన్న స్త్రీ అని అనగలమా? ఇస్లాం, బానిస స్త్రీలు వారి యజమానుల మధ్య ఏ మానవీయ నైతిక సంబంధాలను రూపొందించిందో వాటిలోని పరిశుద్ధత, ఉదాత్తతకు నవనాగరికతా ఛాయల్లో జరిగే శీల విక్రయంలోని అసహ్యమయిన వ్యాపారానికీ ఏదయినా సంబంధం ఉందా?

## ఆధునిక వెలియాలి

ఇస్లాం తన దృక్పథాల విషయంలోనూ, సిద్ధాంతాల విషయంలోనూ స్పష్టంగా ప్రకాశవంతంగా భాసిల్లుతోంది. కాని నవనాగరికతకు ఈ విశిష్టత లోపించింది. భావాల్లో గమ్యరాహిత్యం, సంకుచిత ఆలోచనా సరళి నేటి ప్రత్యేకతలు. దీనికి ఒక్క ఉదాహరణ వ్యభిచార వృత్తి, శీల విక్రయ వ్యాపారం. నవనాగరికత దీన్ని బానిసకాలపు అవశేషంగా గుర్తిస్తుంది. కాని దాని మనుగడను, అది ఒక 'అనివార్యమయిన సామాజిక అవసరమ' ని సహిస్తుంది. ఈ 'అనివార్యమయిన సామాజిక అవసరం' ఏమిటో కూడా కాస్త పరిశీలించండి. దాని కారణంగా యూరపు వ్యభిచార కార్యకలాపాలను ఎందుకు కొనసాగనివ్వాలని పట్టుబడుతోందో తెలుసుకుందాం.

నేడు వ్యభిచార వృత్తికి పెద్దకారణం నవనాగరికతలో అంతర్లీనమయి ఉన్న స్వార్థ ప్రియత్వం. దీని కారణంగా ఆధునిక యూరపులోని ఏ నాగరిక

వ్యక్తి అయినా సరే తన సొంత అవసరాలు తప్ప మరెవ్వరి - వారు త. భార్య, పిల్లలయినాసరే - ఆర్థిక బాధ్యతల్ని స్వీకరించడానికి సిద్ధంగాలేడు. అతడు రుచులు మరిగాడు. అయితే ఏ విధమయిన బాధ్యతల్నీ తలమీద వేసుకోడానికి తయారుకాడు. తత్కారణంగా అతనికి తన లైంగిక తృష్ణ తీర్చే స్త్రీ - ఆమె శరీరం మాత్రం కావాలి.

ఇదీ ఆ అనివార్యమయిన సామాజిక అవసరం'. దీని ప్రాతిపదికగానే నేటి అభ్యుదయవాదులు స్త్రీ బానిసత్వాన్ని న్యాయబద్ధ మయినదిగా నిరూపించడానికి కృషి చేస్తూ ఉంటారు. కాని ఇది వట్టి భ్రమ మాత్రమే. ఎందుకంటే నిజానికి వ్యభిచార వృత్తికి అసలు కారణం కేవలం ఆధునిక మనిషిలోని కోరికల దాస్యం, అతని దృష్టిలోపం మాత్రమే. అందువల్ల మనిషిలో మానవతా స్థాయి ఎదగనంతవరకు వ్యభిచార వృత్తి అభిశాపానికి విరుగుడు లేదు.

ఈ సందర్భంలో మరో విషయం విశదమవడం అవసరం. పాశ్చాత్య దేశాల్లోని నాగరిక ప్రభుత్వాలు కొన్ని, తరువాతి కాలంలో వ్యభిచార వృత్తిని నిషేధించినా దాని అసలు ప్రేరణ వేశ్య యొక్క స్త్రీత్వాన్నీ, మానవతను గౌరవించాలన్న పవిత్ర భావం కాదు. ఇంకా ఆ ప్రజల్లో ఏదో నైతిక, మానసిక, ఆధ్యాత్మిక పరివర్తన కలిగిందనడానికీ అది తార్కాణం కాదు. ఈ నిషేధానికి అసలు కారణం ఏమిటంటే సకల సింగారాలతో దర్శనమిచ్చే సొసైటీ గర్ల్స్ రంగంలో దిగిన తరువాత ఈ వేశ్యల 'సామాజిక ఆవశ్యకత' అంతగా గోచరించలేదు. పైగా ఈ వ్యభిచారం పట్ల ప్రజల్లో అపరాధ భావం కూడా మిగల్లేదు. వారి స్థితి ఇంత దిగజారినా వారు నేటికీ ఇస్లాంను ఎత్తిపొడుస్తూ ఉంటారు. అలాచేస్తూ వారు ఓ విషయాన్ని మరచిపోతూ ఉంటారు - మానవోన్నతికి చిహ్నంగా, పరిణతి పొందిన శాశ్వత నాగరికతా ఏ ఇరువయ్యో శతాబ్దపు నాగరికతను పొగుడు తుంటారో దానికి ఎన్నో రెట్లు పరిశుద్ధమయింది, సహజమయింది, సంపూర్ణమయింది ఇస్లాం నేర్పిన నాగరికత అని.

ఆధునిక పాశ్చాత్య సమాజంలో రుచులవేటలో విలాసాల తోటలో

బరితెగించి తిరగాడే సొసైటీ గర్ల్స్ ఏ 'స్వేచ్ఛ' తో తమ శరీరాలను ఇతరులకు అప్పజెప్పుతుంటారో అది స్వేచ్ఛ కాదు, బానిసత్వం. ఈ కోవకు చెందిన బానిసత్వంలో బానిస స్వయంగా తానే బానిసత్వపు గుదిబండను తన మెడలో వేసుకుంటుంది. ఈ బానిసత్వం బానిసలకు ఎంతో అందంగా మనోహరంగా ఆహ్లాదకరంగా అగుపించేలా చేస్తాడు, ఆధునికత, నవ నాగరికత అబ్బిన వాళ్ళ కొత్త యజమాని. అయితే ఇలాంటి కొందరు బానిస నైజంగల స్త్రీలను, వారు తమ స్వేచ్ఛాయుత స్థితిని వదలుకోవడాన్ని ఆధారం చేసుకుని వారిని ఇలా బానిసత్వపు కూపంలో శాశ్వతంగా మగ్గనివ్వడం అన్నది ఇస్లాం దృష్టిలో న్యాయబద్ధంకాదు. అంతే కాదు ప్రపంచంలోని మరే మతమయినా, మరే జీవన తత్వమయినా ఈ కారణాలవల్ల వారి బానిసత్వాన్ని ధర్మబద్ధంగా భావించజాలదు.

పరిస్థితుల స్వరూపాన్ని చూస్తే తేలేదేమిటి? మనుషులు గత్యంతరం లేక స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకుబదులుగా బానిసత్వాన్ని కోరుకునేలా ఆర్థిక, రాజకీయ, ఆధ్యాత్మిక, చింతనాత్మక వాతావరణాన్ని సృజించడం, ఎంత వినాశకరమయిన జీవనవ్యవస్థను సూచిస్తున్నదో విశదమవుతోంది. వాస్తవంగా యూరపు నాగరికత నేటివరకు సాధించిన ఘనకార్యం యొక్క పద్దు పొడుగును బేరీజు వేస్తే తేలేది:

నిరుద్యోగం, బీదరికం, మద్యం అశ్లీలం !!

ఇదీ యూరపులో బానిసత్వపు సంక్షిప్త గాథ. దాని చరిత్ర - పురుషులు, స్త్రీలు, జాతులు, వర్గాలు - అందరి, అన్ని రకాల బానిసత్వపు చరిత్రకు నిర్వచనం. అక్కడ బానిసత్వానికి పలు కారణాలున్నా ఆ తరువాత, బహుకాలం వరకు ఎలాంటి సామాజిక అవసరం లేకపోయినా దాన్ని కొనసాగనివ్వడం జరిగింది. యూరపులో బానిసత్వం ఇలా కొనసాగడం దాని నాగరికతలోని అసభ్యతకు, మానవతా విరుద్ధ నైజానికి తార్కాణం .

## ఇది మరో బానిస గాథ

చివరన ఆధునిక సామ్యవాద (కమ్యూనిస్టు) దేశాల గురించి కూడా కొన్ని మాటలు చెప్పాలని మా అభిలాష. ఆ దేశాల ప్రజలపై కూడా బానిసత్వం అభిశాపంలా అలుముకుంది. వారు కమ్యూనిజం నిరంకుశ రాక్షసి పాదాల క్రింద నలిగి పోతున్నారు. వారి దేశాల్లో యజమాని ఒక్కడే - అదే ప్రభుత్వం. ఇతర ప్రజలంతా నోరెత్తకుండా దాని విధేయతను పాటించవలసిందే. చివరికి ఆ దేశాల పౌరులకు తమకు ఇష్టమయిన వృత్తిని, ఉద్యోగాన్ని ఎన్నుకునే స్వేచ్ఛ కూడా లేదు. ఎందుకంటే వారు బానిసలు. బానిసలకు ఇచ్ఛ, కోరిక లేమిటి? ఈ విషయంలో కమ్యూనిస్టు దేశాల్లోనూ కాపటలిస్టు దేశాల్లోనూ ఎలాంటి వ్యత్యాసం లేదు. ఒక వ్యవస్థలో ప్రభుత్వం అధికారాలకు శక్తికీ కేంద్రమయితే మరో వ్యవస్థలో పెద్ద పెద్ద పెట్టుబడిదారులు, శక్తిని అధికారాన్ని చేజిక్కుంచుకుని ఉంటారు, శ్రామికులు వారి దయాదాక్షిణ్యాలపై బ్రతకవలసి ఉంటుంది.

విషయాన్ని ముగించేముందు పాఠకులతో కూడా ఒక మాట మేము చెప్పదలిచాము. పెట్టుబడి దారీ వ్యవస్థ సమర్ధకులు, కమ్యూనిజం సమర్ధకులు ఉభయులూ తమతమ జీవిత సిద్ధాంతాల గురించి నోటి తడి ఆరకుండా పొగడుకుంటూ కనిపిస్తారు. అయితే పాఠకులు మేము సమర్పించిన వాదనను దృష్టిలో ఉంచుకుంటే వారు ఈ ప్రజల వంచనలకు గురికాకుండా ఉండగలరు. మేము సమర్పించిన ఈ వివరణల ద్వారా, పేర్లు నిర్వచనాలు వేరయినా కమ్యూనిజమయినా, కాపటలిజమయినా వాస్తవంగా ప్రాచీన బానిసత్వపు సరికొత్త రూపాలే అన్న యదార్ధాన్ని పాఠకులు గ్రహించి ఉంటారు. బానిసత్వపు ఈ కొత్తరూపాలు, నిజానికి నాగరికత, సామాజిక ప్రగతి తెరల వెనకాల సురక్షితంగా సుస్థిరంగా మనగలుగుతున్నాయి. ఇస్లాం చూపిన ఋజుమార్గాన్ని కాదని మానవాళి ప్రగతిని సాధించిందా లేక క్రమేణ ఆధ్యాత్మిక పతనానికి, నైతిక అధోగతికి లోనయిందా దాన్ని కూడా పాఠకులు అంచనా వెయ్యగలరు. నేడు కూడా మానవాళికి ఇస్లాం మార్గదర్శకత్వం ఎంత అవసరమో వారే నిర్ణయించుకోగలరు.

# 3. భూస్వామ్య వ్యవస్థ

ఒక విద్యార్థి ఎం.ఏ పట్టం పొందడానికి వ్రాసిన పరిశోధనా వ్యాసంలో ఇస్లాం ఓ భూస్వామ్య వ్యవస్థ అని రుజువు చేశాడని ఇటీవలనే విన్నాను. నాకు ఎంతో ఆశ్చర్యం కలిగింది. విద్యార్థి కొంతవరకు పాపం, మన్నింపదగిన వాడే. అతని ఉద్దేశ్యం ఇస్లాంను అప్రతిష్ట పాల్జేయడం కావచ్చు. లేదా అతనికి నిజంగానే అసలు విషయం తెలీదేమో. కాని అతనికి పట్టం ప్రదానం చేసిన ఆచార్యుల మాటేమిటి? వారి వైఖరినేమనాలి? ఇస్లాం సామాజిక, ఆర్థిక వ్యవస్థ విషయంలోను, ఇస్లామీయ చరిత్రపట్ల వారు కనబరచిన ఉపేక్షాభావాన్ని ఏమని సమర్థించగలం?

కాని ఈ ప్రముఖ ఆచార్యులెవరు? వీరిని ఏ విధంగా తయారు చెయ్యడం జరిగింది? అన్న ఆలోచనరాగానే నా ఆశ్చర్యమంతా తొలిగిపొయ్యింది. ఆచార్యుల ఈ బృందం కళ్ళు ఇతరుల ప్రాపగాండావల్ల చెదిరిపొయ్యాయి. ఇతరుల ఆలోచనలో సిద్ధాంతాలకు వారి మనోమస్తిష్కాలు పరాధీనమయ్యాయి. వీరి భావనా ప్రపంచమంతా పరదేశీ ప్రయోగాల ద్వారా ఉనికిలోకి వచ్చినదే. మిస్టర్ డన్లప్ * ప్రత్యేక శ్రద్ధకు కేంద్ర బిందువులు వీరే. వీరు సప్తసముద్రాలుదాటి ఆధునికశాస్త్ర అధ్యయనం చేసివచ్చారు. దాని లక్ష్యం, వారిని తమ సంస్కృతీ, సభ్యతలకు, నాగరికతకు, తమ పరంపరకు, సంప్రదాయాలకు దూరం చెయ్యడం. ఈ విధంగా వీరిని తమ ధర్మాన్ని, తమ చరిత్రను, తమ విశ్వాసాలను ద్వేషించేవారుగా, తమ పాశ్చాత్య ప్రభువుల అనుకరణే గర్వకారణంగా గౌరవకారణంగా భావించే మేధావులుగా తీర్చిదిద్దడం జరిగింది. ఇలాంటి మేధావులు చరిత్రను, వాస్తవాలను తారుమారుచేసే పన్నాగంలో భాగం పంచుకుంటూ అగుపిస్తే అందులో ఆశ్చర్యపడవలసిన అవసరమేముంది.

---

* మిస్టర్ డన్లప్ (DUNLOP) బ్రిటిష్ సామ్రాజ్యం తరఫున ఈజిప్ట్ విద్యా విధానాన్ని రూపొందించేందుకు నియుక్తుడయిన ఇంగ్లీషు ఆఫీసర్.

# భూస్వామ్య వ్యవస్థ

అసలు విషయాన్ని చర్చించే సమయంలో భూస్వామ్యం అంటే ఏమిటో ఓ స్పష్టమయిన భావన మన ముందుంటే బాగుంటుంది. ఈ విషయంలో మనం డా॥ రాషిదుల్ బర్గావి రచించిన 'కమ్యూనిస్టు వ్యవస్థ' అనే పుస్తకం నుండి ఓ భాగాన్ని చూద్దాము. రచయిత భూస్వామ్య వ్యవస్థను ప్రస్తావిస్తూ ఇలా వ్రాశారు :

"భూస్వామ్య వ్యవస్థ ఓ ఉత్పాదక వ్యవస్థ. దాని విశేషమేమిటంటే, అందులో, నిత్యం ఒక బానిస వర్గం తప్పక ఉంటుంది. ఈ వ్యవస్థలో జమీందారు లేక అతని సిబ్బంది ఉత్పత్తిలోని నిర్ణీతభాగం రైతునుండి వసూలు చేస్తూ ఉంటారు. జమీందారులకు కొన్ని ప్రత్యేక ఆర్థిక సౌకర్యాలు కూడా ఉంటాయి. జమీందారు ఆ రైతు ద్వారా ఏ విధమయిన సేవ చేయించుకో దలచినా అలా చేయించుకునే అధికారాలు అతనికి ఉంటాయి. అతను కోరితే రైతునుండి ధనరూపేణ లేక వస్తు రూపేణ పన్ను కూడా వసూలు చెయ్యగలడు. భూస్వామ్య వ్యవస్థలో సమాజంలోని వ్యక్తుల్ని రెండు విశేషమయిన వర్గాలుగా విభజించడం జరుగుతుంది. (1) జమిందారులు, జాగీర్దారులు (2) వ్యవసాయదారులు, వ్యవసాయ కూలీలు. వీరి సామాజిక స్థాయి, పని, విధులు, బాధ్యతల మార్పు ద్వారా సదా మారుతూ ఉంటుంది. రైతు, వ్యవసాయ కూలి, బానిస అనేవి ఈ సామాజిక పరివర్తనలకు వేర్వేరు దశలు. ఇందులో కొన్ని వర్గాలు పూర్తిగా అంతమయ్యాయి. మిగిలినవి క్రమేణ అంతమవుతున్నాయి.

"రైతులు భూమిని దున్ని విత్తనం నాటి పంట పండిస్తారు. అందువల్ల వారికి పంటలో కొంతభాగాన్ని ఇచ్చి వేస్తారు. దాని ద్వారా వారు తమ భార్యా బిడ్డల భృతికై ఏర్పాట్లు చేసుకోవాలి. అలాగే వారు పొలాల్లోనే గుడిసెలు వేసుకునేందుకు భూమి కూడా కేటాయించడం జరుగుతుంది. ఈ సౌకర్యాలకు ప్రతిమూల్యంగా వారు తమ వ్యవసాయపు పనిముట్లతో

పశువులతో పాటుపోయి జమిందారుల పొలాలు దున్నుతారు. నారు నాటడం మొదలుకుని కోతల సమయం వరకు వీరు జీతంలేని కూలీలుగా పనిచెయ్యాలి. అప్పుడప్పుడు కమతం దార్ల సన్నిధిలో ముడుపులు కూడా చెల్లించుకోవాలి. ఇంతేకాక వారు తమ ధాన్యం జమిందారుగారి మిల్లుల్లోనే మర వేయించుకోవాలి. ద్రాక్ష పళ్ళరసం తీయించదలిస్తే కమతం దారుగారి మిషన్ల ద్వారానే అదీ జరగాలి. *

"భూస్వామ్య వ్యవస్థలో జమిందారుగారికి తమ జాగీరులో నివసించే రైతులపై పెత్తనం చెలాయించే, చట్టాలు చేసే అన్ని అధికారాలూ ఉంటాయి. ఈ వ్యవస్థలో ఉత్పాదనకు మూల కారణమయిన వ్యవసాయదారులకు, మనం నేడు చెప్పుకునే భావంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉండేవి కావు. రైతు ఏ భూములు సాగుబడి చేసేవాడో వాటిపై అతనికి యాజమాన్యపు హక్కులుండేవి కావు. అతడు దాన్ని అమ్మగలిగే వాడూ కాదు, అది అతని తరువాత సహజంగా అతని సంతానానికి వారసత్వంలో ప్రాప్తమయ్యేదీ కాదు. అతని యజమాని (అంటే జమిందారు) తాను కోరినప్పుడల్లా అతని చేత వెట్టి చాకిరి చేయించుకునేవాడు. దాన్ని కాదనే హక్కు రైతుకు ఏ మాత్రంలేదు -దాని మూలంగా అతను ఎంత పెద్ద నష్టాన్ని భరించవలసి వచ్చినా సరే. పైగా తన విధేయత, భక్తి ప్రతిపత్తుల్ని ప్రదర్శించుకునేందుకు అతను జమిందారు గారికి పెద్దపెద్ద మొత్తాల్లో పన్నులు చెల్లించుకోవడం కూడా తప్పేదికాదు. ఆ పన్ను ఎంత ఉండాలి? అన్న విషయం జమీందారుగారే తమ ఇష్టానుసారం తన అవసరం మేరకు నిర్ణయిస్తారు. జమీందారు ఒకవేళ తన భూముల్ని మరో భూస్వామికి అమ్మివేసినట్లయితే ఆ భూములపై సేద్యం చేసే కట్టుబడి రైతు కూలీలు కూడా అమ్ముడు పొయ్యేవారు. వారు కొత్త జమీందారు గారి 'సొత్తు' గా పరిగణించబడేవారు. పొట్ట పోసుకునేందుకు మరెక్కడయినా పనిచేసుకోడానికి కూడా వారికి హక్కు లేకుండేది. వారు

---

* యూరపు వ్యవస్థను దృష్టినందుంచుకుని చేసిన రచన ఇది అని మరువరాదు (అను)

తమ ఇష్టంతో తమ యజమానిని కాదని మరో జమీందారు గారి కొలువులో కూడా చేరలేరు. భూస్వామ్య యుగంలోని క్రింది తరగతి ప్రజల్ని, ప్రాచీనకాలపు బానిసలకూ ఆధునిక కాలపు రైతు కూలీలకూ మధ్య 'సంధివర్గం' అని చెప్పుకోవచ్చు.

"రైతుకు సేద్యం చేసే అనుమతి నివ్వడమో కాదనడమో జమీందారు గారి ఇష్టం. ఏ రైతుకు ఎంత భూమినివ్వాలి అన్న విషయం నిర్ణయించేది కూడా ఆయన ఒక్కడే. రైతుల విధుల్లూ బాధ్యతలు కూడా ఆయనే నిర్ణయిస్తాడు. ఇలాంటి ముఖ్యమయిన నిర్ణయాలు గైకొనేటప్పుడు కూడా అతనికి రైతుల వాస్తవమయిన అవసరాలేమిటి? వారి హక్కులేమిటీ అన్న ధ్యాస ఉండదు. ఇలాంటి నిర్ణయాల వల్ల పొరుగు జమీందారులపై ఎలాంటి ప్రభావం పడుతుందిఅన్న చింత కూడా అతనికి ఉండదు."

## పలాయనం – పర్యవసానం

రచయిత ఇంకా ఇలా వ్రాశాడు : ' ఈ కారణాల మూలంగా 13వ శతాబ్దంలో, 'వ్యవసాయ కూలీల ' నే వర్గానికి జన్మనిచ్చిన ' ఫరారీ ఉద్యమం' ఉనికిలోకి వచ్చింది. ఈ ఉద్యమం చరిత్రలో "రైతుల ఫరారీ" అని పిలువబడుతుంది. ఫలితంగా జమిందారులు తమ మధ్య ఓ ఒప్పందం కుదుర్చుకున్నారు. దాని ప్రకారం ఫరారీ అయిన తన రైతుల్ని జమీందారు తిరిగి వాపసుకోరే హక్కును పొందాడు. ఈ ఒప్పందం ప్రకారం, తమ జాగీరులో ప్రవేశించే రైతుల నందరినీ నిర్బంధించే అధికారం కూడా జమీందారులకు లభించింది. కాని ఈ ఉపాయం కూడా రైతుల పరారీని వారించలేకపోయింది. ఇంకా ఈ విషయం శృతిమించి రాగాన పడింది. చివరికి 'ఫరారీ' అన్నది ఆ కాలపు ఓ విశిష్టతగా రూపొందింది. ఈ కారణం వల్ల జమిందారులు తమ భూములు సేద్యానికి గత్యంతరం లేక అత్యధికమయిన జీతాలిచ్చి కూలీలను నియమించుకోవలసి వచ్చింది. ఈ వ్యవసాయ కూలీలపైనే ఆధారపడవలసి వచ్చింది. జమిందార్లులు చేసుకున్న ఒడంబడికలు విలువలేకుండా పొయ్యాయి.

అంటే వారి మధ్య మునుపటిలా సహకార వాతావరణం కూడా అంతరించి పోయిందన్నమాట. తద్ఫలితంగా జరిగిన మరో ముఖ్యమయిన పరిణామం ఏమిటంటే పొలాల్లో వెట్టి చాకిరి చేయించుకోవడం మానుకుని, జమీందారులు, అక్కడ పనిచేసేవారికి రొక్కం రూపంలో వేతనాలు చెల్లించడం మొదలెట్టారు.

"ఆ తరువాత కాలక్రమేణా రైతులు ఆర్థికంగా బలపడసాగారు. మరోవైపు పురాతన జాగీర్దారులు, జమీందారులు తమ అవసరాలను పెంచుకుంటూ పొయ్యారు. వారి సకల సాధనా సంపత్తులు కూడా వాటిని పూరించలేక పొయ్యాయి. రైతులు ఈ అనుకూల పరిస్థితులను బాగా వినియోగించుకున్నారు. అప్పుడు తమ మాజీ యజమానులకు నగదు రూపేణ మూల్యం చెల్లించి వారినుండి చిరకాలానికిగాను విమోచనాన్ని పొందారు. 13వ శతాబ్దం చివరన 'రైతు కూలీల స్వేచ్ఛ' గుర్తింపు పొందినంతవరకు ఈ పరిస్థితి కొనసాగింది. ఆ తరువాత పరిస్థితుల్లో వచ్చిన మార్పుల్లో విశిష్టత ఏమిటంటే భూస్వామ్య వ్యవస్థ పునాదులు కదలిపొయ్యాయి. ఆ తరువాత శతాబ్దాల్లో అది పూర్తిగా శిథిలమయి పొయింది." *

ఇదీ భూస్వామ్య వ్యవస్థ యొక్క నిజ స్వరూపం. మేము ఈ సుదీర్ఘమయిన భాగాన్ని ఎందుకు ఉదాహరించామంటేతద్వారా పాఠకులు భూస్వామ్య వ్యవస్థను దాని ప్రత్యేకతలను బాగా ఆకళింపు చేసుకోవాలని, కేవలం బాహ్యా సారూప్యత కారణంగా మరే వ్యవస్థతోనూ దాన్ని పోల్చి చూసే పొరపాటు చెయ్యరాదని మా ఉద్దేశ్యం. ఈ ప్రత్యేకతలు, ఈ ఘనకార్యాలు చేసిన భూస్వామ్య వ్యవస్థ ఇస్లామీయ చరిత్రలో ఎక్కడ, ఎప్పుడు కాన వచ్చింది? అన్నదే ముఖ్యమయిన ప్రశ్న.

---

* "కమ్యూనిస్టు వ్యవస్థ" (రచయిత రాషిదుల్ ఖరావి) పుటలు : 22,23.

## అపార్థానికి మూలం

ఏ బాహ్య సారూప్యత వల్ల తరచుగా ప్రజలు మోసపోయి, అపార్థానికి గురయ్యారో, అవకాశవాదులు, కాలానికి దాసులయిన వారికి ఇస్లాం పట్ల అపోహాలు సృష్టించడానికి వీలు కలిగిందో అది ఒక చారిత్రక వాస్తవం. ప్రారంభంలో ఇస్లామీయ సమాజం భూమికి సంబంధించినంత వరకు రెండు వర్గాలుగా ఉండింది. (1) భూమిగల వాళ్ళు (2) రైతులు – వీరు భూస్వాముల భూముల్లో పనిచేసేవారు. కాని ఇది కేవలం స్థూలమయిన సారూప్యత. దీని ఆధారంగా ఇస్లాం ప్రతిపాదించే వ్యవసాయ వ్యవస్థను భూస్వామ్య వ్యవస్థగా పేర్కొనడం అన్యాయం.

పైన ఉదాహరించిన వ్యాసభాగం ద్వారా ద్యోతకమయ్యే భూస్వామ్య వ్యవస్థ ప్రత్యేకతల్ని సంక్షిప్తంగా ఇలా పేర్కొనవచ్చు:

(1) శాశ్వతమయిన వ్యావసాయిక బానిసత్వం (కట్టుబడి రైతు)

(2) రైతులపై విధులూ బాధ్యతల భరించరాని భారం. దాని ప్రకారం ప్రతి రైతు క్రింది విధులు నిర్వర్తించాలి.

(అ) వారంలో ఒకరోజు పూర్తిగా జమిందారు పొలాల్లో వెట్టి చెయ్యాలి.

(ఆ) సేద్యం, పంటలకోతలు అన్ని సమయాల్లోనూ ఎలాంటి జీత వేతనాలు లేకుండా జమిందారుగారి నౌకరి చెయ్యాలి.

(ఇ) మత సంబంధమయిన పండుగల్లో లేక ఇతర సంతోష కరమయిన వేడుక దినాల్లో తాను బీదరికంలో, లేమిలో క్రుమ్గుతున్నా సకల విధాలా సంపన్నుడయిన యజమాని (జమీందారు)కి విలువయిన కానుకలు సమర్పించుకోవాలి.

(ఈ) తన ధాన్యం కేవలం జమీందారుగారి మిల్లులోనే పట్టించుకోవాలి.

(3) జమీందారుకు విస్తృతమయిన అపరిమితమయిన అధికారాలు:

(అ) విభిన్న రైతులకు తా దలచినంత భూమిని తన ఇష్టాయిష్టాల

ప్రకారం కేటాయించగలడు.

(ఆ) రైతుల విధుల్నీ బాధ్యతల్నీ నిర్ణయించగలడు.

(ఇ) రైతులు చెల్లించవలసిన పన్నులు నిర్ణయించగలడు.

(4) జమీందారుకు అపరిమితమయిన పాలనాధికారాలు, న్యాయాధికారాలు; వాటినిఅతడు దేశంలోని చట్టాలననుసరించి కాకుండా ఇష్టమయిన రీతిలో వినియోగించుకునేవాడు.

(5)భూస్వామ్య వ్యవస్థ పతనావస్థకు చేరుకున్నప్పుడు, రైతులు, తాము విమోచనం పొందగోరితే, ముందు జమిందారుకు ఓ నిర్ణీత రొక్కం తప్పకుండా చెల్లించడం తప్పింది కాదు.

భూస్వామ్య వ్యవస్థలోని ఈ ప్రత్యేకతల్ని చూస్తూ, ఎవరయినా, దీనికి ఇస్లాంతో సంబంధముందని ఎలా అనగలరు? ఇస్లామీయ చరిత్రలో ఎక్కడా ఎప్పుడూ ఇలాంటి ఓ వ్యవస్థ చూచాయగా కూడా కానరాదే?

## వ్యావసాయిక కట్టు బానిసత్వం *

ఇస్లాం వ్యావసాయిక కట్టు బానిసత్వాన్ని సుతరామూ సహించదు. మేము గత అధ్యాయంలో సవివరంగా చర్చించిన ఆ ఒక్క కోవకు చెందిన బానిసత్వాన్ని తప్ప మరే విధమయిన బానిసత్వాన్నీ ఇస్లాం గుర్తించదు. ఇస్లామీయ చరిత్రలో దాని ఉనికికి గల కారణాలు, సంఘటనలు అన్నీ మేము చర్చించాము. వాటి దృష్ట్యా, వ్యావసాయిక కట్టు బానిసత్వానికి ఏ విధమయిన అనుమతి లభించదు. ఈ బానిసత్వం ప్రకారం రైతులు ఓ ప్రత్యేకమయిన భూమితో కట్టబడిపోతారు. ఇస్లామీయ చరిత్ర ద్వారా తెలిసేదేమంటే, వివిధ యుద్ధాల్లో పట్టుబడి వచ్చే యుద్ధ ఖైదీలను మాత్రమే ఓ విధమయిన బానిసత్వంలో నిర్బంధించడం జరిగేది. అలాంటి బానిసల పట్ల ముస్లిములు ఎలా ప్రవర్తించే వారో వివరాలు గత అధ్యాయంలోనే ప్రస్తావించాము. ప్రారంభ ఇస్లామీయ సమాజంలో

---

F.N* వ్యావసాయిక కట్టు బానిసత్వం అన్నపదాన్ని మేము ఇంగ్లీషు పారిభాషిక పదం SERFDOM కు బదులుగా ప్రయోగించాము (అను)

స్వల్పమయిన బానిసల సంఖ్యను స్వేచ్ఛాయుత పౌరులసంఖ్యతో పోలిస్తే భూమ్యాకాశాల తేడా ఉండేదని ద్యోతకమవుతుంది. ఈ బానిసలు తమ యజమానుల పొలాల్లో పనిచేసేవారు. వారిని యజమానులు సంతోషంగా విడుదల చెయ్యడమో లేక వారు స్వయంగా 'ముకాతబత్' పద్ధతి ద్వారా తమ విడుదలను కోరుకోవడమో జరిగేది. పాశ్చాత్యుల భూస్వామ్య వ్యవస్థలో బానిసల ఈ విధమయిన విడుదల, స్వతంత్రత కునుచూపు మేరలో కానరాదు. ఎందుకంటే ఆ వ్యవస్థలో రైతుల్ని, రైతు కూలీలను స్వాతంత్ర్య ప్రియులుగా మార్చే ఉద్దేశ్యమే లేదు. దీనికి భిన్నంగా ఆ భూస్వామ్యవ్యవస్థ బానిసల్ని శాశ్వతంగా ఆ బంధనాల్లోనే బిగించి ఉంచాలనే ప్రయత్నించింది. తద్వారా, ఒకవేళ ఎప్పుడయినా రైతులు స్వేచ్ఛను పొందగోరినా దానికి అవకాశం లభించకుండా చేసింది. పాశ్చాత్య దేశాల్లో రైతును వ్యావసాయిక కట్టు బానిసగా భావించేవారు. వారూ భూమి మాదిరిగానే క్రయవిక్రయాలకు లోనయ్యేవారు. తదనుగుణంగా భూస్వామి ఎప్పుడయినా ఏ భూభాగాన్నయినా విక్రయిస్తే దానితోపాటు అందులో పనిచేసే రైతులందరు కూడా అమ్ముడుబొయ్యేవారు. వారు భూమికి కొత్తగా ఏర్పడిన యజమాని యొక్క సొత్తుగా మారిపొయ్యేవారు. ఈ కట్టు బానిసలు ఏ భూమిని సేద్యం చేసేవారూ కారు, దాన్ని వదలి మరెక్కడికయినా పోగలిగే వారూ కారు లేక జమీందారుగారి వెట్టిచాకిరిని కాదనగలిగే వారు కూడా కాదు.

## దాస్యం ఆయనకే

ఇస్లాంకు ఇలాంటి కట్టు బానిసత్వం అంటే పూర్తిగా గిట్టదు. జీవన్మరణాల కర్త అయిన ఆ దైవం ఒక్కని దాస్యం తప్ప మరే దాస్యం, మరే విధేయతనూ అది గుర్తించదు. అన్ని దాస్యాలనూ తిరస్కరిస్తుంది. వాటిని తీవ్రంగా ఖండిస్తుంది. ఇస్లాం ప్రకారం, ఏ మనిషికీ తనలాంటి మరో జీవినీ తన దాసుడుగా చేసుకునే హక్కులేదు. ఇలా జరగడం అసహజం, అసమంజసం. ఇలా జరిగిందంటే దానికి కారణాలు నిత్యం కొన్ని

ఇస్లామేతర అంశాలేకాని మరేమీ కావు. అది తన శక్తినంతా ఉపయోగించి వాటిని అంతమొందించాలని అభిలషిస్తుంది. అందుగ్గాను అది బానిసల్లో, స్వేచ్ఛను విమోచనాన్ని పొందే ప్రబల కాంక్షను సాహసాన్ని సృజిస్తుంది, దానిగ్గాను దీనికి తోడుగా దాస్య బంధనాల నుండి విముక్తం కాగోరే బానిసలకు సకల విధాలా సహకారం అందజెయ్యాలని అది ప్రభుత్వంపై ఒత్తిడి కూడా తెస్తుంది.

ఆర్థిక పరిధిలోనూ, మనుషులు తమలాంటి ఇతర మనుషుల దాస్యం చెయ్యడాన్ని ఇష్టపడదు ఇస్లాం. యుద్ధ ఖైదీలను బానిసలుగా చేసే అనుమతి అది సంతోషంగా ఇవ్వలేదు. పరిష్కారం సాధ్యమయ్యే పరిస్థితులు ఏర్పడగానే, బానిసల్లో ఆధ్యాత్మికంగా, మానసికంగా స్వేచ్ఛాయుత సమాజంలో స్వతంత్ర పౌరులుగా బ్రతికే సంస్కారం జనించగానే ఇస్లాం వారిని విడుదల చేసి వారి స్వేచ్ఛను పునరుద్ధరించింది.

## బాధ్యతాయుత భూస్వామి, స్వేచ్ఛాయుత రైతు

ఇస్లాంలో ఆర్థికవ్యవస్థకు పునాదులు, స్వేచ్ఛాయుత వ్యవహారం, పరిపూర్ణ సహకారం, పరస్పర సేవా సహాయాలు. అందువల్ల ఇస్లామీయ ప్రభుత్వం, అర్థపరమయిన పరుగులో వెనకబడ్డవారి హక్కుల్ని, సమంజసమయిన జీవన సదుపాయాలకు ఏ కారణాలవల్లనయినా దూరమయిన వారి ప్రయోజనాలను కాపాడే బాధ్యత తనపై వేసుకుంటుంది. ఇస్లామీయ సమాజంలో ఏ వ్యక్తీ జమిందారులకు కట్టుబానిస అయి జీవించడానికి బద్ధుడు కాడు. ఎందుకంటే ప్రభుత్వం తన వనరులు, సాధనాలనన్నింటిద్వారా అతనికి అండగా నిలుస్తుంది. ఇస్లామీయ రాజ్య పరిధిలోని పౌరులందరికీ నిత్యావసరాలను అందజేసే బాధ్యత ప్రభుత్వానిదన్న విషయం ఇక్కడ మరువరాదు.

ఇస్లాం తన ఆధ్యాత్మిక స్వభావం రీత్యాను, తన ఆర్థిక వ్యవస్థ

దృష్ట్యాను భూస్వామ్య వ్యవస్థకు పూర్తిగా విరుద్ధమయింది. మానవాళి ఇంకా వ్యావసాయిక కట్టు బానిసత్వపు కోరల్లో చిక్కుకొనక పూర్వమే ఇస్లాం దాన్ని ఆ వ్యవస్థలోని దోపిడి నుండి రక్షణ కల్పించింది.

భూస్వామ్య వ్యవస్థలో రైతుపై విధులు, బాధ్యతల భారం అతని నడుం విరిచి వేసేది. కాని ఇస్లామీయ చరిత్రలో అది ఏ కోశానా కానరా ు. ఇస్లామీయ వ్యవస్థలో, ఒక రైతు అపరాధిగా రుజువయిన పక్షంలో భూమిగలవాడు అతన్నుండి తన భూమిని వాపసు తీసుకుని ఇతరులకి అప్పజెప్పగలడేకాని, ఆ రైతుపై ఏ విధమయిన బలాత్కారంగాని, దౌర్జన్యంగాని జరిపేందుకు అతనికి ఎలాంటి అధికారమూ లేదు. ఎందుకంటే భూమిగలవాడు మరియు అతని రైతుల మధ్య సంబంధాన్ని, ఇస్లాం, యజమాని, బానిసల రూపంలో కాక స్వతంత్రత, సమానతల ఆధారంగా నిర్మిస్తుంది.

ఇస్లాం దృష్టిలో రైతు, భూస్వామి మధ్య ధర్మ బద్ధమయిన చట్టపరమయిన సంబంధాలు రెండు విధాలుగా సాధ్యం : (1) కౌలు (2) పాలు. కౌలు కిచ్చిన రూపంలో, రైతు భూమిలో పండిన మొత్తంలోనుండి నిర్ణీతభాగం భూస్వామికి భూమికి అద్దెగా చెల్లించేందుకు బాధ్యుడవుతాడు. అది పోగా మిగతా ఉత్పాదన అతని సొంతమవుతుంది. దాని ద్వారా అతడు తన కుటుంబ అవసరాలను తీర్చుకుంటాడు. ఈ విధంగా ఇస్లామీయ వ్యవస్థలో రైతు స్వేచ్ఛా స్వతంత్రతలు భద్రంగా ఉండడమేకాక, భూమి, దాని సేద్యం విషయంలో అతను స్వేచ్ఛగా తనకు భావ్యమనితోచిన పద్ధతుల్ని అవలంబించగలడు కూడా.

పాలికిచ్చిన పక్షంలో అతడు పంటలో భూస్వామితో సమానంగా భాగస్వామి అవుతాడు. సేద్యం విషయంలో అయ్యే ఖర్చులన్నీ భూస్వామియే భరించవలసి ఉంటుంది. రైతు బాధ్యత కేవలం భూమిని సాగు చెయ్యడం, దాని సేద్యం విషయంలో, దాని పైరు పంటల విషయంలో జాగ్రత్తలు తీసుకోవడం, కృషి చెయ్యడం, కాపలా కాయడం వరకు మాత్రమే

పరిమితం.

## వ్యావసాయిక వ్యవస్థ

ఈ రెండు పద్ధతుల్లోనూ వెట్టిచాకిరీకి, కట్టు బానిసత్వానికి, భూస్వామి బెదిరించి జీతభత్యాల్లేకుండా రైతుద్వారా సేవచేయించుకోడానికి ఎలాంటి తావులేదు. ఇందులో, కమతందారు, నిరంకుశ అధికారాలతో, హద్దులేని హక్కులతో హక్కులూ, సదుపాయాలు లేని విధుల నియమాల్లో రైతుల్ని బంధించే భయమూ లేదు. ఎందుకంటే భూస్వామి మరియు వ్యవసాయ దారుల మధ్య సంబంధాలు సమాన ప్రతిపత్తి, సమానస్వేచ్ఛ, సమాన విధులూ, సదుపాయాలు - ఇచ్చి పుచ్చుకునే సమాన ప్రమాణాల ప్రాతిపదికగా ఏర్పడుతాయి.

ఇస్లామీయ వ్యవస్థలోని మొదటి ప్రత్యేకత ఏమిటంటే ఇందులో రైతు తనకు నచ్చిన భూభాగాన్ని కౌలుపై సాగుబడికై ఎన్నుకునే పూర్తి స్వేచ్ఛ ఉంటుంది. ఇంకా అతడు ఏ భూస్వామి వద్ద పాలుకు కుదర దలుస్తాడో తన ఇష్టం ప్రకారం కుదరగలడు. తాను కోరినప్పుడు వదలుకోగలడు.

రెండో ప్రత్యేకత ఏమిటంటే భూస్వామితో రైతు కౌలు (ఒప్పందం) చేసుకునేటప్పుడు అతను భూస్వామితో సమానస్థాయి కలిగిఉంటాడు. అతడు ఒత్తిడికిలోనయి లేదా భయపడి ఒప్పందం కుదుర్చుకోవలసిన అవసరముండదు. ఎందుకంటే అతడు ఇస్లామీయసమాజంలో ఓ స్వతంత్ర పౌరుడు. అతను ఆ ఒప్పందం తనకు లాభదాయకం కాదని భావిస్తే దాన్ని రద్దుచెయ్యగలడు. భూస్వామి ఎలాంటి ఒప్పందాన్ని అతనిపై బలవంతంగా రుద్దలేడు. అతను నిరాకరిస్తే ఎలాంటి ప్రతీకార చర్యకు గురి చెయ్యనూలేడు. పాలికాపుగా కూడా రైతుకు, భూస్వామికి సమానంగా చట్టపరమయిన రక్షణలుంటాయి. వారుభయులూ పరస్పరం సమానంగా

భాగస్వాములయి ఉంటారు. భూమినుండి లభించే ఉత్పత్తిని ఉభయులూ సమంగా పంచుకుంటారు.

## వాణిజ్య వ్యవహారం కాదు, సేవాతత్పరత

పాశ్చాత్య భూస్వామ్య వ్యవస్థలో మత సంబంధమయిన పండుగల్లో ఇంకా ఇతర వేడుకల్లో బీద రైతులు సంపన్నులయిన భూస్వాములకు ముడుపులు చెల్లించుకోవడం తప్పనిసరి అయ్యే విషయాన్ని మనం ఇది వరకే పరిశీలించాము. కాని ఇస్లామీయ వ్యవస్థలో పరిస్థితి దీనికి పూర్తిగా భిన్నమయింది. ఇక్కడ పేదరైతు భూస్వాములకు కానుకలు ఇచ్చుకోవడం జరుగదు, వారి నుండి కానుకలు పుచ్చుకుంటాడు. సంపన్నులయిన భూస్వాములు, పండుగలు పబ్బాలకు, పెళ్ళి పేరంటాలకు ముఖ్యంగా రమజాన్ పవిత్ర మాసంలో తమ నిరుపేద రైతు సోదరులకు కానుకలు విరివిగా పంపేవారు. వారికి విందులు చేసేవారు. సమాజంలోని అగత్యపరులు, నిరుపేదలకు సహాయం చేసేవారు. మరో మాటలో చెప్పాలంటే ఇస్లామీయ వ్యవస్థలో సంపన్నులు నిరుపేదల్ని, 'నాగరిక' యూరపు మాదిరిగా కానుకల పేరిట దోచుకునే వారుకారు; పైగా తమ సిరి సంపదల్ని వారి సంక్షేమం, సుఖసంతోషాల కొరకు ధారాళంగా ఖర్చు చేసేవారు. పాశ్చాత్య భూస్వామ్య వ్యవస్థలో మాదిరిగా రైతులను వెట్టి చాకిరికి గురిచేసి వారిపై అనవసరమయిన బాధ్యతల భారం మోపి, బేడీలు తొడిగించి, గుదిబండలు వేసి వేధించేందుకు ఇస్లాంలో ఏ మాత్రం తావులేదని దీనివల్ల ద్యోతకమవుతోంది.

యూరపు భూస్వామ్య వ్యవస్థలో జమీందారులు, రైతుల్ని అన్యాయంగా తమ దాసులుగా చేసుకుని వెట్టి చాకిరి చేయించుకున్నందుకు గాను ఇతరులు ఆ రైతులపై దౌర్జన్యం చెయ్యకుండా వారిని బాధించకుండా కాపాడటానికి కొంతవరకు బాధ్యత తీసుకునేవారు. ఇస్లామీయ వ్యవస్థలో ఈ కోణంలో చూసినా ఎలాంటి వెలితి మనకు కానరాదు. ముస్లిమ్

భూస్వాములు రైతులనుండి వెట్టిచాకిరి లాంటి మూల్యం ఏదీ గ్రహించకపోయినా ఈ బాధ్యతను వారు స్వచ్ఛందంగానే నిర్వర్తించేవారు. వారి ఈ సేవకు కేవలం దైవప్రసన్నత బడయటం మాత్రమే అసలు ప్రేరణ. పవిత్రమయిన విశ్వాసం ప్రాతిపదికగా రూపొందే జీవన వ్యవస్థను ఇతర జీవన వ్యవస్థలతో వేరుచేసే అసలు మౌలిక విషయం ఇదే. ఈ వ్యవస్థలో మనిషి తనతోటి సోదరులతో మంచిగా మెలగడం, వారికి మేలు చెయ్యడం దైవారాధనగా భావించి మరీ చేస్తాడు. తద్వారా దైవ సాన్నిధ్యం పొందాలని ఆశిస్తాడు. అయితే ఇతర జీవన వ్యవస్థల్లో, తోటి సోదరులపట్ల చేసే సత్కార్యం కూడా ఓ విధంగా వాణిజ్య వ్యవహారంగా రూపొందుతుంది. ఈ వ్యవహారంలో భాగస్వాములయిన వారు ప్రతి ఒక్కరూ తామే అత్యధిక లాభం కాజెయ్యాలని, ఇతరులకు అనివార్యమయినంత మేరకు ఇవ్వడం తప్ప గత్యంతరం లేని పక్షంలో మాత్రమే ఇవ్వాలని కోరుకుంటాడు, అలాగే ప్రయత్నిస్తాడు కూడా. అందువల్ల లాభనష్టాల ఈ పరుగులో నిర్ణయాత్మక మయిన వస్తువు భౌతిక వనరులు మాత్రమే. ఎవరివద్ద ఇవి అధికంగా ఉంటాయో అతనిదే పై చెయ్యి. జీవితంలో సకల లాభాలూ తనకే దక్కాలని అతను కృషి చేస్తాడు.

## అధికారాలు ఏకపక్షం కావు

భూస్వామ్య వ్యవస్థలోని మూడో ప్రత్యేకత! భూస్వామి తాను కోరిన వారికి కోరినంత భూమి సేద్యానికి కేటాయించే హక్కు అధికారాలు కలిగి ఉంటాడు. ఆ తరువాత అతను తన ఇష్టం ప్రకారమే వెట్టి చాకిరికి సంబంధించిన విధులు, బాధ్యతల నిడువయిన ఓ పట్టిక తయారు చేసి దాన్ని రైతుల తలపై రుద్దుతాడు. ఇది పూర్తిగా యూరపులోని యజమాని, బానిస భావనల్లో నుండి పుట్టుకు వచ్చిన ప్రత్యేకత. ఇస్లాంకు ఇది పూర్తిగా అపరిచితం.

భూమి కౌలుకు తీసుకున్న పక్షంలో, ఇస్లాం ప్రకారం, రైతుల హక్కుల్నీ, అధికారాలను నిర్ణయించేది రైతు ఇష్టం లేక అతని ఆర్థిక

పరిస్థితి. భూస్వామిని రైతుతో పోల్చి చూస్తే ఎలాంటి ప్రత్యేకత, ఆధిక్యతలతో కూడుకున్న సౌకర్యాలుండవు. భూస్వామికి ఒకే హక్కు. కౌలుపై భూమి తీసుకున్నప్పుడు రైతు చేసుకున్న ఒప్పందం ప్రకారం రొక్కం లేదా ధాన్యం చేరుతుందా లేదా అని చూసుకోవడం.

అలాగే పాలి ఒప్పందం చేసుకున్న పక్షంలో ఏ రైతు ఎంత భూమిని తీసుకోవడానికి అర్హుడు? అన్న విషయం కూడా ఇస్లామీయ వ్యవస్థలో కేవలం భూస్వామి ఇష్టాయిష్టాలకు వదలడం జరగదు. రైతు స్వయంగా తన ఇష్టం ప్రకారం నిర్ణయించుకుంటాడు. అతని కుటుంబంలోని వ్యక్తులు ముఖ్యంగా కొడుకులు భూమి దున్నడంలోనూ, పంట పండించడంలోనూ అతనికి తోడుగా ఉన్నట్లయితే, అతను ఎక్కువ భూమిని సాగుబడి చెయ్యగలనని భావిస్తే అతను అలా చెయ్యగలడు. అతనికి ఎలాంటి ప్రతి బంధకం ఉండదు. వ్యవసాయదారునిగా అతని బాధ్యతలు అతని సాగుబడిలో ఉండే భూభాగం వరకు మాత్రమే పరిమితమయి ఉంటాయి. అందులో పంటలు పండేవరకు ఆ భూములు అతనికీ ఆ భూస్వామికీ మధ్య ఉమ్మడి సొత్తుగా పరిగణించబడతాయి. అయితే భూస్వామి యొక్క ఇతర భూములపట్ల, జాగీర్ల పట్ల వ్యవసాయ దారునిగా అతనికి ఎలాంటి బాధ్యత ఉండదు. లేక అతను యూరపు వ్యవసాయిక కట్టు బానిసల్లా అక్కడికి పోయి సేద్యం చెయ్యడానికి ఇతర పనులు నిర్వహించడానికీ బాధ్యుడు కాడు.

## న్యాయం నిష్పాక్షికం

ఇస్లాం మరియు భూస్వామ్య వ్యవస్థల మధ్య వ్యత్యాసానికి మౌలిక అంశం ఏమిటంటే భూస్వామ్య వ్యవస్థలో భూస్వాములకు రైతులపై చెలాయించేందుకు పాలనా పరమయిన న్యాయపరమయిన అధికారాలు ప్రాప్తమయి ఉండటం అన్నది తమ జాగీరు పరిధిలో సామాజిక రాజకీయ జీవన వ్యవహారాలన్నింటిలోనూ వారిదే పైచెయ్యి. మంచీ చెబ్బరలన్నీ వారి అధీనంలోనే ఉండేవి. ఇస్లాం వచ్చి, భూస్వాముల ఈ “దైవత్వ” పు

కట్టడాన్ని తునాతునకలు చేసి వేసింది. ఎందుకంటే ఒక వర్గం పై మరో వర్గానికి ఇలాంటి ప్రాధాన్యతకు, ప్రత్యేక సౌలభ్యాలకు ఇస్లాంలో అసలు తావే లేదు. ఇలాంటి కల్తీలనుండి మానవ జీవితాన్ని పరిశుద్ధం చెయ్యడం దాని ప్రధాన లక్ష్యాల్లో ఒకటి.

యూరపులో సరయిన న్యాయవ్యవస్థ కూడా లేకపోయింది – భూస్వామి, రైతులమధ్య పరస్పర సంబంధాలను నిర్ణయించి వాటిని సుసంగఠితం చెయ్యడానికి. పాశ్చాత్య శాసన నిర్మాణానికి మూలాధారమయిన రోమను చట్టంలో జాగీర్దార్లకు అపరిమితమయిన అధికారాలుండేవి. వారు తమ జాగీరు పరిధుల్లో నిరంకుశ ప్రభువులుగా చెలామణీ అయ్యేవారు. వారు తమ 'పాలితుల' కొరకు చట్టాలు చెయ్యడమే కాక వాటిని తమకు ఇష్టమయిన రీతిలో అనువయిన రీతిలో అన్వయింప జేసుకునేవారు కూడా. ఈ జమీందారులు, జాగీర్దారులు, శాసనకర్తలు గానే కాక పాలనాధికారులు, న్యాయాధిపతులుగా కూడా వ్యవహరించేవారు. ఇలా ఓ విధంగా వారు ప్రభుత్వం పరిధిలోనే మరో ప్రభుత్వాన్ని స్థాపించుకున్నారు. అవసరం కలిగినప్పుడు వారు దేశ సైనిక, ఆర్థిక ఆవశ్యకతల్ని నెరవేర్చేంత వరకు ప్రభుత్వం వారి జోలికి పొయ్యేదికాదు.

ఇది ఇస్లామ్‌కు సుతరామూ పడని జీవిత విధానం. ఇస్లామీయ వ్యవస్థలో కేంద్ర ప్రభుత్వం ఒకటి ఉంటుంది. దేశంలో శాసనాన్ని అంటే షరీ అత్‌ని (ఇస్లామీయ శాసనాంగాన్ని) అమలు జరపడం దాని బాధ్యత. దాని దృష్టిలో పౌరులందరూ సమాన గౌరవాదరణలకు అర్హులు. ఏ పౌరునికయినా శిక్ష విధించాలంటే అతని నేరం వాస్తవంగా రుజువయి నప్పుడు మాత్రమే అది సాధ్యం. కాలక్రమేణ ప్రభుత్వ వ్యవస్థ తన ఇస్లామీయ ప్రాతిపదికలకు దూరమయి అనువంశిక రాచరిక వ్యవస్థగా రూపొందినప్పుడు కూడా అందులో ఇస్లామీయ ప్రభుత్వపు కొన్ని లక్షణాలు మిగిలాయి. ఉదాహరణకు, అది తన పరిపాలనా పరిధిలో జీవించే ప్రజలందరికి ప్రాథమిక అవసరాలను అందజేసే ప్రయత్నంజేసేది. సువిశాలమయిన ఇస్లామీయ రాజ్య పరిధిలో ఒకే శాసనం (LAW OF THE

LAND) చెలామణిలో ఉండేది. కాగా ఈ శాసనబద్ధమయిన పరిపాలనే రైతుల్ని, భూస్వాముల అత్యాచారం, దౌర్జన్యాల నుండి, దోపిడినుండి, వారి గొంతెమ్మ కోరికల నుండి, వారి మూఢనమ్మకాల నుండి కాపాడగలిగింది. అక్కడ జమీందార్ల, జాగీర్దార్ల చట్టాలు కాదు, దైవం నిర్ణయించిన చట్టాల ప్రకారం పరిపాలన జరిగేది. దాని దృష్టిలో ఒక్క జమీందారులు, రైతులే కాదు మానవులందరూ సమానులే. వారంతా ఒకే విధమయిన వ్యవహారానికి అర్హులు.

ముస్లిముల చరిత్రలో అక్కడక్కడ, కొందరు ముస్లిం న్యాయ మూర్తులు న్యాయ పక్షంగా కాక అధికారులకు అనుకూలంగా తీర్పులు చెప్పినటువంటి నిదర్శనాలున్న మాట వాస్తవమే. వారు తెలిసీ అధికారుల, భూస్వాముల ప్రయోజనాలను కాపాడే ఉద్దేశ్యంతో అలా చేశారు. కాని ఇలాంటి దృష్టాంతాలు ఇస్లామీయ చరిత్రలో బహుస్వల్పం. కొందరు యూరపు పండితులే వ్రాసినట్లు ఇలాంటి ఉదంతాలు మినహాయించదగ్గవే. రెండవ విషయం ఏమిటంటే ఇలాంటి ఒకటీ అర సంఘటనలకంటే వీటికి భిన్నమయిన నిదర్శనాలే ఇస్లామీయ చరిత్ర అంతటా నిండి ఉన్నాయి. వాటిలో కాజీలు (న్యాయమూర్తులు) జమీందారులకు, గవర్నర్లకు మంత్రులకు మాత్రమేకాదు, సర్వాధికారి అయిన ఖలీఫాలకు కూడా ప్రతికూలంగా నిరుపేదలు, కూలీలకు అనుకూలంగా తీర్పులు చెప్పారు. అయినప్పటికీ ఏ ఒక్క కాజీనీ బర్తరఫ్ చెయ్యడమో, అలాంటి కాజీపట్ల ప్రతీకారంగా అధికారులు చర్య తీసుకోవడమో ఎన్నడూ జరగలేదు.

## స్వేచ్ఛ, ప్రగతులు తోడునీడగా

ఇస్లామీయ చరిత్రలో, యూరపులో మాదిరి 'రైతుల ఫరారీ' లాంటి ఉద్యమం ఒక్కటీ కానరాదు. ఎందుకంటే ఇస్లామీయ వ్యవస్థలో, ఒక్క జాగీరు నుండి మరో జాగీరుకే కాదు, సువిశాల ఇస్లామీయ రాజ్య పరిధిలో ఎక్కడయినాసరే నిరాఘాటంగా తిరిగే స్వేచ్ఛ ప్రతి పౌరుడికీ ఉండింది. అయితే ఈజిప్ట్ రైతుల్లా స్వయంగా వారే మరో చోటికి మారడం ఇష్టపడకపోతే అది వేరే విషయం. ఒక్క ఈజిప్ట్‌ను వదలి ఇస్లామీయ

జగత్తులోని దాదాపు అన్ని దేశాల రైతులు రాకపోకల ఈ స్వేచ్ఛను బాగా వినియోగించుకున్నారు. ఎందుకంటే వారు ఈజిప్ట్ రైతుల్లా ఓ ప్రత్యేక భూభాగం పట్ల గుడ్డి ప్రేమలో పడిపోనూ లేదు, లేదా వారి మార్గంలో యూరపు మాదిరిగా చట్టపరమయిన, సామాజికమయిన ఎలాంటి ప్రతిబంధకాలుండేవీ కావు.

యూరపులో భూస్వామ్య వ్యవస్థ చివరి కాలాన రైతులు ప్రతిమూల్యం చెల్లించి తమ స్వేచ్ఛను కొనుక్కోవలసి వచ్చింది. కాని ముస్లిముల చరిత్రలో, ఇలాంటి ఉదంతం ఒక్కటీ కానరాదు. దానికి కారణం చాలా సాధారణమయింది. ఇస్లామీయ వ్యవస్థలో రైతుల్ని కట్టుబానిసలుగా భావించడం ఎన్నడూ జరగలేదు. వారు స్వతంత్రులుగానే పుట్టారు. సమాజంలో మరే ఇతర వర్గానికి ఉన్న హక్కులన్నీ వారికీ ఉండేవి. అందువల్ల మూల్యం చెల్లించి స్వేచ్ఛనుకొనే దౌర్భాగ్యం వారికి ఎన్నడూ దాపురించలేదు.

మరో విషయం ఏమిటంటే ఇస్లామీయ జగత్తులో అన్ని కాలాల్లోనూ అనేక జాగీరులు - చిన్నవి, పెద్దవీ - నిత్యం ఉంటూ వచ్చాయి. వాటి రాబడిని జాగీర్దారులు స్వయంగా తమ అవసరాలకై ఖర్చు చేసుకోవడమేకాక నౌకా వాణిజ్యం, పరిశ్రమల స్థాపనకు కూడా వెచ్చించేవారు. తద్వారా వారు సమాజ వికాసానికి సంక్షేమ ప్రగతులకు తోడ్పడ్డారు. దీనికి భిన్నంగా యూరపులో భూస్వామ్య వ్యవస్థ ఉనికిలోకి వచ్చినప్పుడు, ఆ వరద, అక్కడ ముందునుంచి ఏర్పడి ఉన్న పరిశ్రమల్ని కూడా ముంచివేసింది. ఆ తరువాత యూరపు భూభాగాన ఆధ్యాత్మిక పతనం, శాస్త్రీయ అచేతనావస్థలు సుదీర్ఘమయిన చీకటిరాత్రిగా ఆవరించాయి. చివరికి ఇస్లాం ఆవిర్భవించి దాన్ని ఆ చీకటినుండి, అజ్ఞాన కుహారం నుండి వెలికి తీసింది. జ్ఞాన జ్యోతిని ప్రవేశపెట్టింది. క్రూసేడ్స్ (క్రైస్తవ యుద్ధాల) ద్వారా యూరపు ఇస్లామీయ జగత్తుకు సన్నిహితమవడంతో ఈ మార్పుకు మార్గమేర్పడింది. రెండవ అవకాశం, స్పెయిన్‌లో ఇస్లామ్ ను యూరపు రెండవసారి ఎదుర్కొన్నప్పుడు ప్రాప్తమయింది. ఇస్లాం యూరపుల ఈ సంబంధం పునరుజ్జీవనోద్యమానికి నాందిపలికింది.

తద్వారా యూరపు శతాబ్దాల శాస్త్రీయ అచేతనావస్థకి స్వస్తి పలికి మత పరమయిన అజ్ఞానం నుండి క్రమేణ మేల్కొన్నది.

## విశ్వాసం బలహీనమయితే ... పతనం !

ముస్లిం ప్రపంచంలో ఇస్లాం, ఆధిక్యతతో అధికార శక్తిగా రంగంలో ఉన్నంతవరకు ఏ ముస్లిం దేశంలోనూ భూస్వామ్య వ్యవస్థ నెలకొనలేక పోయింది. ఇస్లాంకు అవకాశం లభించినప్పుడల్లా అది భూస్వామ్య వ్యవస్థ స్థాపనకు దోహదపడే కారణాలను, పరిస్థితుల్ని - అన్నింటినీ అదుపులోకి తెచ్చింది. బనూ ఉమయ్య, బనూ అబ్బాస్ వంశాల పరిపాలనా కాలంలో కానవచ్చే భూస్వామ్య వ్యవస్థ పరిధి చాలా పరిమితమయింది. పైగా ముస్లిముల సామాజిక జీవితంలో ఓ శాశ్వత అంశంలా రూపొందగల ప్రజాదరణ దానికి ఎన్నడూ ప్రాప్తం కాలేదు.

ఉస్మానియా (OTTOMAN) ప్రభుత్వ పతన కాలం చివరన మటుకు ఇస్లామీయ జగత్తులో భూస్వామ్య వ్యవస్థ ఛాయా ప్రాయంగా గోచరిస్తుంది. కాని ఆ కాలంలో ముస్లిముల ధార్మిక విశ్వాసాలు బలహీనమయ్యాయి. వారి సామూహిక వ్యవహారాల సూత్రధారులు నామ్‌కేవాస్తే ముస్లిములుగా చెలామణీ అయినటువంటి వారయ్యారు. సరిగ్గా ఆ సమయంలోనే పాశ్చాత్యుల సంస్కృతి - దైవాన్ని మరచిన, భౌతికారాధన నిండిన దురాక్రమణ భావాల సంస్కృతి - విజయఢంకా మ్రోగిస్తూ ఇస్లామీయ ప్రపంచంలో ప్రవేశించింది. అప్పుడే పరిస్థితులు బాగా దెబ్బతిన్నాయి. ఈ కొత్త నాగరికత ముస్లిం దేశాల్లో సైనిక విప్లవాలను సృష్టించింది. ముస్లిముల ఆధ్యాత్మిక నైతిక ప్రమాణాలను కాలరాచింది. సహాయ సహకారాల భావాలను రూపుమాపింది. వాటిస్థానే పెట్టుబడిదారీ లక్షణాలయిన స్వార్థం, దోపిడి విధానాలకు వృద్ధీ వికాసాలు లభించాయి. ఫలితంగా ఇక్కడి పేద వర్గాల ప్రజలు అంతులేని లేమికి, హద్దులేని బీదరికానికి గురయ్యారు. దాని ప్రభావం నేటి వరకు కొనసాగుతూనే ఉంది. ఈ భూస్వామ్య వ్యవస్థ నిజానికి యూరపు నుండి దిగుమతి

అయినా తన మూలంలోని ప్రత్యేకతలతో సహా నేటికీ కొన్ని ముస్లిం దేశాల్లో నిక్షేపంగా రాజ్యమేలుతోంది. నేడు ముస్లిం దేశాల్లో దాని ఉనికికి ఇస్లాంపై ఏ విధమయిన బాధ్యతా లేదు. ఈ ముస్లిం దేశాల్లో ఇస్లామీయ వ్యవస్థ రంగంలో ఉండి ఉన్నట్లయితే, దాని చట్టాలు దేశంలో చెలామణీ అవుతూ ఉంటే అట్టి పరిస్థితిలోనూ ఈ అసహ్యాకరమయిన వ్యవస్థ మనగలిగి ఉంటే, ఆ బాధ్యత ఇస్లాంపై వెయ్యడంలో అర్థముంది. నిజానికి నేడు ఏ 'ముస్లిమ్' పాలకులు ఈ దేశాలను పరిపాలిస్తున్నారో వారు తమ ప్రభుత్వ కార్యకలాపాలన్నింటినీ ఇస్లాంకు బదులుగా, యూరపు దేశాల నుండి అరువు దెచ్చుకున్న విభిన్న రాజ్యాంగాల ఆధారంగా, శాసనాల ఆధారంగా నడుపుకుంటున్నారు.

## చర్చయొక్క సారాంశం

ఈ చర్చవల్ల అనేక యదార్థాలు బయల్పడ్డాయి. అవి ఆధునిక ప్రపంచంలో సాగుతున్న సైద్ధాంతిక సంఘర్షణ మొత్తానికి మూలపదార్థాలు, కేంద్ర బిందువులనడం సత్య దూరం కాదు. వాటిలో ప్రస్తావించ దగ్గవి ఇవి:

1. భూస్వామ్యవ్యవస్థనుపెంచి పోషించడంలో కేవలం 'వ్యక్తిగత ఆస్తి' అన్న ఒక్క అంశానికే ప్రాధాన్యత లేదు. ఇందులో మనిషి చేసే వేరే కృషికి ఎలాంటి ప్రమేయం లేదనడానికి వీల్లేదు. భూస్వామ్య వ్యవస్థ వాస్తవానికి, సమాజంలో నెలకొన్న ఆస్తికి సంబంధించిన విధానాలు, ఇంకా భూస్వాములూ, భూమి లేని వారిమధ్య ఏర్పడే పరస్పర సంబంధాల ఆధారంగా పెంపొందుతుంది. ఈ కారణంగానే ఇస్లామీయ వ్యవస్థలో 'వ్యక్తిగత ఆస్తి' ఉన్నప్పటికీ జమీందారీ, జాగీర్దారీలు ఏర్పడి వర్ధిల్లడానికి అవకాశం లభించలేదు. ఇస్లాం, సైద్ధాంతికంగాను, ఆచరణాత్మకంగాను సమాజంలోని వ్యక్తుల మధ్య ఏర్పరిచే సంబంధ బాంధవ్యాల కారణంగా అక్కడ భూస్వామ్య వ్యవస్థ తలెత్తడానికి తావే ఉండదు.

2. యూరపు భూస్వామ్య వ్యవస్థ అభిశాపానికి గురయినంత మాత్రాన మానవ ప్రగతి మార్గంలో ఇది కూడా అనివార్యమయిన దశ అనడానికి ఏ ఆధారమూ లేదు. యూరపు ఈ అభిశాపానికి లోనయిందంటే, దానికి అసలు కారణం, దానివద్ద, మానవాళిమధ్య సంబంధ బాంధవ్యాలను చక్కదిద్దే మార్గదర్శకత్వం, అవసరమయిన విశ్వాసమూ జీవన వ్యవస్థల్లేవు. ఇస్లామీయ ప్రపంచానికి ఈ మహా వరప్రసాదం లభ్యమయింది. యూరపుకు అలాంటి వ్యవస్థ ఏదయినా లభించి ఉంటే అక్కడ కూడా భూస్వామ్య వ్యవస్థ మూడు పువ్వులు ఆరుకాయలుగా పరిఢవిల్లేది కాదు.

3. కమ్యూనిస్టులు ప్రతిపాదించే గతి తార్కిక భౌతికవాదం (DIALECTICAL MATERIALISM) లోని మానవ చరిత్రకు అనివార్యమయిన అంశాలు ఆర్థిక పరిణామ క్రమంలోని విభిన్న దశలు- ప్రారంభ కమ్యూనిజం, బానిసత్వం, భూస్వామ్యం, పెట్టుబడిదారీ వ్యవస్థ, రెండవ కమ్యూనిస్టు వ్యవస్థ - వగైరా నిజానికి యూరపు చరిత్రలో తప్ప మరెక్కడా మచ్చుకయినా కానరావు. అందువల్ల ఈ తత్వంలో వాస్తవికత అసలే లేదు. ఇస్లామీయ జగత్తుకు అది ఏ మాత్రం వర్తించదు. దీని చరిత్రలో భూస్వామ్య దశ ఎన్నడూ రాలేదు. కమ్యూనిస్టు వ్యవస్థ అంతకన్నా లేదు. ఇంకా ముున్ముందు ఎప్పుడయినా సరే ఇలాంటి దశ వచ్చే అవకాశమూ లేదు.

# 4.పెట్టుబడిదారీ వ్యవస్థ

పెట్టుబడిదారీవ్యవస్థ ఇస్లామీయ జగత్తులో కాదు, యూరపులో పుట్టింది. ఇది 'యంత్రం' ఆవిర్భవించినదానికి ఫలితం. యంత్రాన్ని కాకతాళీయంగా యూరపులో కనిపెట్టడం జరిగింది. అక్కణ్ణుంచే ప్రపంచమంతా వ్యాపించింది.

ఇస్లామీయ ప్రపంచానికి పెట్టుబడిదారీ వ్యవస్థ పరిచయమయ్యేనాటికి అది ప్రత్యేకమయిన యూరపు రంగు పూర్తిగా పులుముకుంది. సరిగ్గా ఆ సమయాన ఇస్లామీయ జగత్తును పతనం, క్షీణదశలు ఆక్రమించుకున్నాయి. ఫలితంగా అక్కడ ఎటు చూచినా అజ్ఞానం, అవిద్య, బీదరికం, వెనకబడ్డతనం తాండవమాడుతున్నాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ రాకతో ఇస్లామీయ జగత్తులో కొంత భౌతికప్రగతి జరిగినమాట వాస్తవమే. దానివల్ల కొందరికి ఓ అపోహ కలిగింది-ఇస్లాం పెట్టుబడిదారీని సమర్థిస్తుందని, ఇంకా ఇస్లాం దృష్టిలో దాన్ని ప్రస్తుత స్వరూపంలో, అందులోని చెడులతో సహా స్వీకరించడంలో ఎలాంటి తప్పులేదని, పెట్టుబడిదారీ మరియు ఇస్లామీయ విశ్వాసాలూ చట్టాల్లో ఎలాంటి వైరుధ్యంలేదని; పైగా ఇస్లాంలో వ్యక్తిగత ఆస్తికి గల హక్కును గమనిస్తే ఇస్లాం పెట్టుబడిదారీకి ఏ మాత్రం వ్యతిరేకం కాదన్నది స్పష్టమవుతుందని కూడా కొందరు భావించారు.

వాస్తవానికి ఇదంతా కట్టుకథ. పెట్టుబడిదారీవ్యవస్థ వడ్డీ వ్యాపారం, గుత్తాధిపత్యం లేకుండా మనజాలదు. కాని ఇస్లాం కాపటలిజం పుట్టక వెయ్యేసంవత్సరాల క్రితం ఈ రెంటినీ విస్పష్టంగా నిషేధించింది. ఇదొక్క విషయమేచాలు ఈ రెండూ భిన్న ధృవాలని తెలుపడానికి.

ఇంతకు ఈ విషయాన్ని కాస్త వివరంగా పరిశీలించడం అవసరం. యంత్రాన్ని ఇస్లామీయ జగత్తులో కనిపెట్టివుంటే దాని ఫలితంగా విలసిల్లే

ఆర్థిక పురోభివృద్ధి పట్ల ఇస్లాం వైఖరి ఎలా ఉండేది? శ్రమ, ఉత్పాదనల వ్యవస్థీకరణకొరకు ఇస్లామీయ చట్టాలు, నియమాలు ఎలా పరిస్థితుల్ని ఎదుర్కొనేవి? అన్న ప్రశ్నల్ని పరిశీలించాలి.

## యంత్రం ప్రగతికి మూలమంత్రం

ఆర్థిక శాస్త్రవేత్తలు ఒక్క విషయంలో ఏకాభిప్రాయం కలిగి ఉన్నారు. చివరికి పెట్టుబడిదారీకి బద్ధశత్రువయిన కార్ల్ మార్క్స్ కూడా ఒప్పుకుంటాడు. అదేమిటంటే, ప్రారంభంలో పెట్టుబడిదారీ విధానంవల్ల మానవాళికి గొప్పప్రయోజనం చేకూరింది. దాని పుణ్యమా అని ప్రపంచం కొత్త ప్రగతి సోపానాలు దర్శించింది. ఉత్పాదన పెరిగింది. రవాణా సౌకర్యాలు మెరుగయ్యాయి. జాతీయ ఒనరుల్ని విస్తృతరూపంలో వినియోగించడం సాధ్యమయింది. పూర్వం కేవలం వ్యవసాయం పైన్నే ఆధారపడ్డ కార్మికుల జీవన ప్రమాణం ఎంతో ఎదిగింది.

కాని పెట్టుబడిదారీ విధానం యొక్క ఈ స్వర్ణయుగం అతి శీఘ్రగతిన అంతరించి పోయింది. ఎందుకంటే ఈ ప్రగతికి సహజ పరిణామంగా ధనం క్రమేణ సమీకృతమయి కొందరు పెట్టుబడిదారుల చేతుల్లోకి వచ్చేసింది. బీద కార్మికులు తమ ఆస్తిని, సంపదను అన్నింటినీ కోల్పోయ్యారు. పర్యవసానంగా పెట్టుబడిదారులకు కార్మికులు సులువుగా దొరకసాగారు. వారి శ్రమకు ఫలితంగా పెట్టుబడిదారుల సంపదలోనూ వ్యాపారంలోను అంతులేని పెరుగుదల పొడసూపింది. అయినప్పటికీ, కమ్యూనిస్టులమాటల్లో చెప్పాలంటే, అధిక ఉత్పాదనకు మూలకారకులయిన కార్మికుల వేతనాలు ఏమాత్రం పెరగలేదు. వారికి ప్రాప్తమయ్యే వేతనాలలో సాధారణత: సగటు జీవితం గడపాలన్నా సాధ్యమయ్యేదే కాదు. వారి శ్రమవల్ల వచ్చే లాభం పెట్టుబడిదారులయిన యజమానులు తమ విలాసాలకు వినియోగించుకునేవారు.

కార్మికులకు తక్కువ వేతనాలు లభించడంవల్ల ఏర్పడిన పరిణామాల్లో

ఒకటి, పెట్టుబడిదారీ దేశాల సామాన్యప్రజల కొనుగోలు శక్తి క్షీణించింది. వారు తయారు చేసిన సరుకు కుప్పలు తెప్పలుగా పేరుకోసాగింది. అప్పుడు పెట్టుబడిదారులు తమ సరుకును అమ్ముకోడానికి కొత్త మండీలను వెదకసాగారు. ఈ అన్వేషణ వలస రాజ్యాల వ్యవస్థను, మండీల విషయంలో, ముడిసరుకు విషయంలో అంతర్జాతీయ శత్రుత్వాన్ని సృజించింది. చివరికి వ్యవహారం, దాని అనివార్యమయిన పరిణామానికి, అంటే వినాశకరమయిన యుద్ధాల వరకు చేరుకుంది.

అందువల్లనే పెట్టుబడిదారీ వ్యవస్థలో మార్కెటు నిత్యం మాంద్యానికి గురయ్యే ప్రమాదముంటుంది. ఈ పరిస్థితి ఉత్పాదనలు పెరిగే కొద్దీ చాలీ చాలని వేతనాల కారణంగా తరిగే డిమాండుకు పర్యవసానంగా ఏర్పడుతుంది. అందువల్ల పెట్టుబడిదారీ వ్యవస్థలో కొంతకాలానికోసారి మార్కెటు మాంద్యాన్ని ఎదుర్కొంటూ ఉండటం తప్పదు.

కొందరు మేధావులు, ఈ చెడులన్నీ 'పెట్టుబడి'లో అంతర్గతంగా ఉండే సహజమయిన చెడులని వాదిస్తారు. వారి ప్రకారం, ఇందులో పెట్టుబడి దారుల్ని వారి దుష్ట సంకల్పాన్ని, వారి దోపిడీ తత్వాన్నీ దూషిస్తే లాభంలేదని వారి వాదన. ఈ తర్కాన్ని ఒప్పుకుంటే, మనిషి తన సకల భావాలూ, సంకల్పాలూ శక్తులతో సహా ఆర్థిక పరిస్థితులకు లొంగిపోవలసినవాడే అని కూడా ఒప్పుకోవలసి ఉంటుంది.

## ప్రారంభంలోనే జరిగింది పొరపాటు

పెట్టుబడిదారీ ప్రారంభదశలో మానవాళికి దానివల్ల కలిగిన లాభాలను, జరిగిన భౌతికప్రగతినీ సుసంపన్నతనూ దేన్నీ ఇస్లాం కాదనదు, దేన్నీ వ్యతిరేకించదు. కాని ఇస్లామీయ జగత్తులో పెట్టుబడిదారీ ఆవిర్భవించి ఉంటే ఇస్లాం దాన్ని అలా నిరంకుశంగా వదిలివేసేది కాదు. పెట్టుబడి దారుని దుష్టసంకల్పంవల్లగానీ పెట్టుబడిలోని అంతర్గత దౌర్జన్యం వల్లగాని నెలకొనే దోపిడికి తావే లేకుండా చట్టాలను, నియమాలను అది

నిర్మించేది. ఇస్లాం నియమం ప్రకారం పెట్టుబడిదారునితో పాటు కార్మికునికి కూడా లాభంలో భాగం లభించేలా ఈ సందర్భంలో చట్టం చెయ్యడం సాధ్యమయ్యేది. ప్రఖ్యాత ధర్మవేత్త ఇమామ్ మాలిక్ (రహ్మాలై) కార్మికుడు, యజమానితో పాటు లాభంలో సమానహక్కు కలిగి ఉన్నాడని అంటారు. ఎందుకంటే ఆ లాభం గడించడంలో పెట్టుబడిదారుని పెట్టుబడికి ఎంత ప్రాముఖ్యముందో కార్మికుని శ్రమ కూడా అంతే ప్రముఖ పాత్ర వహిస్తుంది. అందువల్ల ఉభయులకూ లాభంలో సమానమయిన హక్కు లభించాలి అంటారాయన.

ప్రారంభకాలంలో వృత్తులూ పరిశ్రమలు అత్యంత సాధారణరీతిలో జరిగేవి. మనుషులు అత్యధికంగా తమ చేతులతోనే పనులు చేసుకునేవారు. ఇస్లాం ప్రతిపాదించిన పై సూత్రం వెలుగులో శ్రమ, పెట్టుబడుల పరస్పర సంబంధాన్ని అప్పుడే వ్యవస్థీకరించి ఉంటే దానికి ఒక న్యాయవంతమయిన ప్రాతిపదిక లభించి ఉండేది. ఆ తరువాత యూరపులో పొడ సూపిన చెడులు అందులో ఉత్పన్నమయ్యేవికావు.

## దుష్ట ద్వయం

ఆర్థిక శాస్త్రవేత్తలు మనకు తెలిపేదేమంటే, పెట్టుబడిదారీ వ్యవస్థ తన ప్రారంభకాలంనాటి 'స్వర్ణయుగం' దాటి నేటి 'దుష్టయుగం' లోకి ప్రవేశించినప్పటి నుంచి అది జాతీయ ఋణాలకై ఆధారపడటం అధికమయింది. ఫలితంగా బ్యాంకులు వెలిశాయి. అవి తమ వ్యాపారాన్ని మెరుగుపరచడానికి వడ్డీ తీసుకుని ప్రభుత్వాలకు ఋణాలు అందజెయ్యసాగాయి. బ్యాంకు వ్యవహారాల ఆర్థిక, సాంకేతిక వివరాల్లోకి వెళ్ళకుండా మేము ఇక్కడ విశదపరచదలచుకున్న వాస్తవమేమంటే వ్యవహారమంతా అధికంగా వడ్డీ ప్రాతిపదికగానే సాగుతోంది. వడ్డీని ఇస్లాం, నిర్దిష్టంగా నిషేధించింది.

పెట్టుబడిదారీ వ్యవస్థలోని రెండో ప్రత్యేకత వ్యాపారంలో తీవ్రమయిన

పోటి. దీని ఫలితంగా చిన్న చిన్న వ్యాపార సంస్థలు నాశనమయిపోతాయి, లేదా అవన్నీ ఒక్కటయి పెద్ద పెద్ద సంస్థలుగా రూపొందుతాయి. అప్పుడే అవి ఇతర సంస్థలతో పోటీలో నెగ్గుకురాగలవు. ఇదే గుత్తాధిపత్యానికి (MONOPOLY) నాంది వాచకం. కాని ఇస్లాం ఈ గుత్తాధిపత్యాన్ని ఎదురిస్తుంది. దైవప్రవక్త (సఅసం) ప్రబోధం:

గుత్తాధిపత్యాన్ని స్థాపించేవాడు అపరాధి.
(ముస్లిం, అబూదావూద్, తిర్మిజి)

ఈ రెండే పెట్టుబడిదారీకి పునాదులు. ఇస్లాం ఈ రెంటినీ సూత్రప్రాయంగా వ్యతిరేకిస్తుంది. దీని తరువాత కూడా ఇస్లాం పెట్టుబడిదారీ వ్యవస్థకు వ్యతిరేకమని వేరుగా చెప్పనవసరం లేదేమో ! కాని పెట్టుబడి ఇస్లాం ఒడిలో పుట్టి ఉన్నట్లయితే దాని 'దుష్టయుగం' లోని చెడులు నేడు బయల్పడి ఉండేవికావు. పెట్టుబడి, అడ్డులేని దోపిడికి, వలసరాజ్యాలకు, యుద్ధం, వినాశాలకు మారుపేరుగా మారి ఉండేది కాదు.

## ఆ విప్లవం ఇక్కడ వచ్చి ఉంటే

మొదటి విషయం ఏమిటంటే, ఇస్లామీయ జగత్తులో పారిశ్రామిక విప్లవం వచ్చిఉంటే దాన్ని తన లక్షణాలకనుగుణంగా మలచుకోవడంలో ఇస్లాంకు ఎలాంటి చిక్కులు ఎదురయ్యేవి కావు. వృత్తిపనులూ చిన్న చిన్న పారిశ్రామిక ఫ్యాక్టరీల లాభాలను యజమానులు, కార్మికులు తమలో తాము పంచుకునేవారు. అంతమాత్రాన, వాటిని పరిమిత స్థాయిలోనే కొనసాగనివ్వాలని పట్టు పట్టేది కాదు ఇస్లాం. దానికి బదులుగా ఇస్లాం ఆశ్రయంలో ఉత్పత్తి ఎంత పెరిగినా యజమానులూ, కార్మికుల సంబంధాలు 19, 20వ శతాబ్దాల్లో యూరపులో మాదిరిగా ఎడముఖం పెడముఖంగా మాత్రం ఉండేవికావు. మేము పైన సూచించిన విధంగా యజమాని, కార్మికులు లాభాల్లో పరస్పరం సమంగా భాగస్వాములుగా ఉండే సూత్రం ఆధారంగా వారి సంబంధాలు నెలకొనేవి.

ఈ సూత్రాన్ని అమలుపరచిన తరువాత వడ్డీ మరియు గుత్తాధిపత్యం పూర్తిగా అంతమయి పొయ్యేవి. కార్మికులు, యూరపులోని పెట్టుబడిదారీ వ్యవస్థలో అప్పుడప్పుడు ఎదురయ్యే బీదరికం, దారిద్ర్యం, దోపిడీలకు గురయ్యేవారుకారు.

ఇలాంటి సామాజిక న్యాయస్థాపనకై కమ్యూనిజం మాదిరిగా ఇస్లాం కూడా వర్గపోరాటం, ఆర్థిక వత్తిడులు, ఇతర కష్టాలకు తప్పనిసరిగా గురికావలసి వచ్చేదని, ఆ తరువాత దాని నియమాల్లో వాటంతట అవే మార్పులు చేర్పులు జరిగేవని భావించడం అవివేకం. బానిసత్వాన్ని, భూస్వామ్య వ్యవస్థను, ప్రారంభ పెట్టుబడిదారీని పరిష్కరించడంలో ఇస్లాం ఏ విధంగా ప్రపంచంలోని ఇతర వ్యవస్థలకు భిన్నంగా వ్యవహరించి సాధించిందో ఇదివరకే మేము వివరించాము. ఇస్లాం ప్రవేశపెట్టిన సంస్కరణలన్నింటి వెనక ఇస్లాం యొక్క సత్యం న్యాయాల శాశ్వతసూత్రాలు పనిచేశాయి. వాటిని కమ్యూనిస్టు మేధావులు తరచు హేళన చెయ్యడం కద్దు. దీనికి భిన్నంగా 'ప్రపంచపీడిత ప్రజల ఆశాజ్యోతి, మొట్టమొదటి (ఏకైక) కమ్యూనిస్టు రాజ్యం' గా ఖ్యాతిగాంచిన ఆదర్శ కమ్యూనిస్టు రాజ్యమయిన రష్యా కూడా కారల్‌మార్క్స్ ప్రచారం చేసిన తత్వానికి భిన్నంగా రూపొందుతూ ఉంది. అది భూస్వామ్య వ్యవస్థ నుండి ఆ తరువాత పెట్టుబడి దశలో ప్రవేశించకుండానే ఏక్‌దమ్మున కమ్యూనిస్టు దశలోకి దుమికివేసింది. కారల్‌మార్క్స్ సందేశ ధ్వజవాహిక అయిన రష్యాయే ఈ విధంగా, ఆ తత్వాన్ని చీల్చి చెండాడింది. ప్రతి మానవ సమాజం తన పరిణామక్రమంలో కొన్ని విశేష దశల్ని తప్పనిసరిగా దాటవలసి ఉంటుందన్న ఆ సిద్ధాంతాన్ని క్రియారూపంలో ఖండించి వేసింది. *

---

* స్టాలిన్ మొదలుకుని గొర్బచెవ్ వరకు జరిగిన అనేక మార్పులే దానికి ప్రత్యక్ష నిదర్శనాలు. 1986 నవంబరు నెలలో 'కార్మిక సాంఘిక సమస్యల కమిటీ' చెయిర్మన్ శ్రీ ఇవాన్ ఒక బిల్లు ప్రవేశపెడుతూ 'వ్యక్తుల ఆర్థిక కార్యకలాపాలకు దేశంలో ఇదివరకే విస్తృత ఆమోదం లభించిందని' ఇంకా 'సోవియట్ ప్రజల

## వలస రాజ్యవ్యవస్థ పరిణామక్రమంలో భాగమా?

వలసరాజ్యాలు, యుద్ధాలు, ఇతర జాతుల దోపిడి ఇంకా పెట్టుబడిదారీ వ్యవస్థ తెచ్చిపెట్టిన ఇతర సర్వవ్యాప్తమయిన చెడుల్ని ఇస్లాం ఖండిస్తుంది. వలసరాజ్యాలు స్థాపించడాన్ని లేక ఇతరుల్ని తమ లక్ష్యాలకు పావులుగా మార్చుకునేందుకు వారితో యుద్ధాలు చెయ్యడాన్ని ఇస్లాం నిరసిస్తుంది.

కమ్యూనిస్టులు, వారితో ఏకీభవించేవారు, వలసరాజ్యవ్యవస్థ మానవ పరిణామక్రమంలో ఓ అనివార్యమయిన దశ అని భావిస్తారు. వారి ప్రకారం, అది ఓ ప్రత్యేక ఆర్థిక సమస్య మూలంగా ఉనికిలోకి వచ్చింది. ఆ సమస్య, పారిశ్రామికంగా వృద్ధి చెందిన దేశాల్లో మిగులు ఉత్పాదన, దాని విక్రయానికై విదేశీవాణిజ్య స్థావరాల ఆవశ్యకత. ఈ కారణాల వల్ల వలస వ్యవస్థ మానవ ప్రగతిలో ఓ అనివార్యమయిన ఘట్టం. దాన్ని ఏ నైతిక సిద్ధాంతం ఆధారంగానూ వారించశక్యం కాదు. దాన్ని వాయిదా వెయ్యడమూ సాధ్యపడదు.

ఇస్లాం, వలసరాజ్య వ్యవస్థకు సంబంధించిన ఈ ఊహాగానాన్ని ఎంతమాత్రం అంగీకరించదు. కమ్యూనిజం ధ్వజవాహకులు చెప్పేదేమంటే, రష్యా తన మిగులు ఉత్పాదన సమస్యను, పనివేళల్లో తగ్గుదలద్వారా, ఉత్పాదనలో మానవశ్రమను ఆదా చేయడం ద్వారా ఎట్టకేలకు పరిష్కరించుకుంటుందని. ఇప్పుడు ప్రశ్న ఏమంటే, కమ్యూనిస్టు రష్యా తాను కని పెట్టిన 'పరిష్కారం' ద్వారా ఈ సమస్యను చక్కదిద్దుకోగలిగితే ఇతర వ్యవస్థలు దాన్ని వినియోగించి ఆ సమస్యను ఎందుకు పరిష్కరించుకోలేవు? వారు మటుకు వలస రాజ్య దశను దాటడం

---

అభిప్రాయాలను, ఇతర సోషలిస్టు దేశాల అభిప్రాయాలను పరిగణలోకి తీసుకున్నా' మని ఆయన అన్నారు. బిల్లుప్రకారం, 1987 మేడే (!) నుండి చెప్పులు మొదలుకుని స్కిల్డ్ లేబర్ వరకు అన్నీ అమ్ముకోవచ్చు, టాక్సీలు నడుపుకోవచ్చు అట. (అను)

అనివార్యమెందుకు అవుతుంది?

చరిత్ర చెప్పేదేమంటే వలస రాజ్యస్థాపనకు మూలం, మానవనైజంలోని ఓ అతి పురాతన దౌర్బల్యం. పెట్టుబడిదారులు ఆధునిక మారణాయుధాలు చేతబూనిరావడం వల్ల అందులోని రక్తపాతం ఎన్నోరెట్లు పెరిగినమాట వాస్తవమే కాని పరాజితులు, పరాభవానికి పాలయిన జాతుల అక్రమ దోపిడి విషయంలో ప్రాచీన రోమనుల వలస సామ్రాజ్యం నవీన యూరపు సామ్రాజ్యానికి ఏ మాత్రం తీసిపోదు.

చరిత్ర వల్ల మనకు తెలిసే మరో విషయం ఏమిటంటే, యుద్ధాలకు సంబంధించినంతవరకు ఇస్లాం, ప్రపంచంలోకెల్ల అత్యంత పరిశుద్ధమయిన వ్యవస్థనిస్తుంది. ఇస్లామీయ యుద్ధాల ఫలితంగా ఎప్పుడూ ఏ జాతీ దోపిడికి గురికాలేదు. ఇంకా ఎవరూ బానిసత్వపు అభిశాపానికి లోనవలేదు. ఒక వేళ ఇస్లామీయ జగత్తులో పారిశ్రామిక విప్లవం వెలిసినా మిగులు ఉత్పాదన ( SURPLUS PRODUCTION) సమస్యను ఇస్లాం శాంతియుత విధానం ద్వారా పరిష్కరించుకునేది. దానిగ్గాను అది ప్రపంచాన్ని యుద్ధాల అగ్నిగుండంలో పడవేసే అవసరమూ వచ్చేదికాదు. పెట్టుబడిదారీ మౌలిక సూత్రాలను మార్చివేస్తే మిగులు ఉత్పాదన సమస్య అసలు ఉద్భవించేదే కాదు.

## సమస్యకు మూలాంకురం

పెట్టుబడిదారీ వ్యవస్థలో ప్రభుత్వం, సంపద కేంద్రీకరణను అరికట్టే స్థితిలో ఉండదు. ఇస్లామీయ వ్యవస్థలో ప్రభుత్వం ఈ విధంగా అశక్తత కనబరచడమో నిరాసక్తంగా ఉండడమో జరగదు. ధనం కేవలం కొన్ని కుటుంబాల్లో కేంద్రీకృతమయి మిగతా ప్రజలంతా లేమికి గురవకుండా చూడటం దాని బాధ్యత. ఎందుకంటే ధనం కొందరి మధ్యనే పరిభ్రమిస్తూ ఉండరాదని, ప్రజలందరూ ప్రయోజనం పొందేలా అది అందరికీ

అందుబాటులో రావాలని అభిలషిస్తుంది ఇస్లామీయ షరీఅత్. ఇస్లాం సూచించే వారసత్వపు చట్టం షరీఅత్ యొక్క ఈ స్వభావాన్నే వ్యక్త పరుస్తుంది. దాని లక్ష్యం ఏమిటంటే ఒక తరంవారు సమీకరించి వదలి వెళ్ళే సంపద, ఆస్తులు అది ఆ తరువాత వచ్చే తరంవారిలో సముచితమయిన రీతిలోనూ, సాలుసరి ఆదాయంలోను. లాభాల్లోనూ 2.5 శాతం అగత్యపరుల సంక్షేమానికిగాను కేటాయించడం అవసరం పైగా ఇస్లాం ధనాన్ని కూడబెట్టడంపట్ల తన అయిష్టతను స్పష్టంగా వ్యక్తపరచింది. దీనికి తోడుగా ధనాన్ని కూడ బెట్టేందుకు మూలకారణమయిన వడ్డీని హరామ్ (నిషిద్ధం)గా నిర్ణయించింది. అంతేకాదు ఇస్లాం, సమాజంలోని వివిధ వర్గాలమధ్య సంబంధాలను దోపిడీకి బదులుగా ఉమ్మడి బాధ్యతల ఆధారంగా నిర్మిస్తుంది.

ఈ సందర్భంలో గుర్తుంచుకోవలసిన విషయం మరొకటి ఉంది. దైవప్రవక్త (సఅసం) బోధన ప్రకారం ఇస్లామీయ ప్రభుత్వం తన ఉద్యోగుల ప్రాథమిక జీవితావసరాలను అందజేసే బాధ్యత వహించవలసి ఉంటుంది. ఆయన ప్రబోధం: "ఎవరయితే మన(ఇస్లామీయరాజ్యం)లో సేవజేసేందుకు నియమితుడయ్యాడో అతను అవివాహితుడయితే అతని వివాహం చెయ్యాలి. అతనికి ఇల్లులేకపోతే ఇల్లు ఇవ్వాలి. పనులు చేసుకునేందుకు నౌకరు కావలసి వస్తే నౌకరునూ ఇవ్వాలి. వాహనం లేకపోతే అదీ సరఫరా చెయ్యాలి"

ప్రాథమిక అవసరాల ఈ హామీ కేవలం ప్రభుత్వోద్యోగులవరకే పరిమితం కాదు, ఎందుకంటే ఇవయితే ప్రతి మనిషికీ కావలసిన జీవితావసరాలే కదా. అందువల్ల ఇస్లామీయ రాజ్యంలో లేక సమాజంలో ఏదో ఒక సేవ ఏదో ఓ రూపంలో చేసే ప్రతి వ్యక్తీ దానికి అర్హుడే. అందువల్ల ఇస్లామీయ ప్రభుత్వం తన ఉద్యోగులకు ఇలాంటి ఈ సౌకర్యాలు అందజేసే బాధ్యతస్వీకరిస్తే సమాజంలో సేవ చేసే ఇతర సభ్యులకు కూడా అలాంటి సదుపాయాలే ప్రాప్తం కావాలి. అందుచేతనే ఇస్లామీయ ప్రభుత్వం, ప్రభుత్వ ధనాగారంనుండి వృద్ధులకు, వ్యాధిగ్రస్తులకు, తమ బ్రతుకు

తెరువును తామే సంపాయించుకునే స్థితిలో లేని వారికి అవసరాల మేరకు భృతిని చెల్లిస్తుంది. అలాగే ఎవరి ఆదాయం, తక్కువగా, పరిమితంగా, చాలనంతగా ఉంటుందో వారికీ ప్రభుత్వ ధనాగారం నుండి ధన సహాయం అందజేస్తుంది.

ఇస్లామీయ రాజ్యపరిధిలో ఉండే వ్యక్తులందరి ప్రాథమిక జీవిత అవసరాలను సమకూర్చే బాధ్యత ఆ ప్రభుత్వం వహిస్తుందని ఈ వివరణల వల్ల రుజువవుతుంది. ఈ లక్ష్యసాధనకు అది ఏ విధానాన్నిఅవలంబిస్తుంది? అన్నది ముఖ్యం కాదు. అసలు ప్రాముఖ్యత ఇస్లామీయ రాజ్యం అనుసరించే మూల సూత్రానికే ఉంది. దాని ప్రకారం జాతీయ లాభనష్టాల్లో జాతి ప్రజలందరూ సమానంగా భాగస్వాములవుతారు. ఈ వ్యవస్థలో ఉద్యోగులూ, కార్మికులూ ఇతరులు దోపిడికి దూరంగా భద్రంగా ఉండటమేకాక ఎంతో పరిశుద్ధమయిన జీవితాలూ గడుపుకో గలుగుతారు.

నేటి పాశ్చాత్య పెట్టుబడిదారీ వ్యవస్థలో బయట పడుతున్న వికృతరూపం ఇస్లాం ఛాయల్లో పెట్టుబడికి ఎన్నడూ ప్రాప్తమయి ఉండేదికాదు. షరీఅత్‌లోని ఏ చట్టమయినా - అది మౌలికాధారాల నుండి గ్రహించినదయినా, పరిస్థితుల కనుగుణంగా ధర్మపరిధిలో షరీఅత్ అన్వయింపు ప్రకారం నిర్మించుకున్నదయినా - కార్మికుల్ని తమ పేరాశకు బలిచేసే అనుమతిని మాత్రం పెట్టుబడిదారులకు ఇవ్వదు. ఇస్లాంలో పెట్టుబడిదారీవల్ల జనించే ఇతర దౌర్భాగ్యాలు, వలస సామ్రాజ్యం, యుద్ధాలు, బానిసత్వం మొదలయినవి ఎన్నటికీ తలెత్త జాలవు.

## జీవితంలో సమతూకం, సామరస్యం

ఆర్థిక విషయాల్లో కేవలం మంచి మంచి సూత్రాలు, నియమాలు చెయ్యడంతో సరిపుచ్చదు ఇస్లాం. వాటికి తోడుగా అది మనిషిలోని ఆధ్యాత్మిక, నైతిక భావోద్రేకాలనూ ప్రేరేపిస్తుంది. వీటిని కమ్యూనిస్టులు

అపహసించడానికి కారణం యూరపు చరిత్రలో వీటి క్రియాత్మక ప్రయోజనం ఉన్నట్లు ఏ కోశానా కానరాకపోవడమే. అయితే నైతిక, ఆధ్యాత్మిక ప్రమాణాలు మానవుని దైనందిన జీవితానికి దూరంగా వేరుగా లేవన్నది ఇస్లాం దృక్పథం. ఈ కోణంలో చూస్తే ఇస్లాం ఓ విశిష్టమయిన ఏకైక జీవన వ్యవస్థ. అది ఆత్మపరిశుద్ధతకు సమాజ వ్యవస్థాపనకు పరస్పరానుబంధం ఏర్పరచి వాటిలో సామరస్యాన్ని సృష్టిస్తుంది. అది సమాజాన్నీ ఉపేక్షించదు, వ్యక్తినీ గాలికి వదలివెయ్యదు. అప్పుడే మనిషికి సిద్ధాంతం, ఆచరణల్లో సమన్వయాన్ని నిర్మించుకోవడం సాధ్యపడుతుంది. ఇస్లామీయ శాసనాల పునాది నైతికత ఆధారంగా ఏర్పడుతుంది. అందువల్లనే ఇస్లాంలో చటం మరియు నైతికతల్లో ఎన్నడూ వైరుధ్యం పొడసూపదు. ఈ రెంటిమధ్య సామరస్యం తొణికిసలాడుతుంది. రెండూ చెట్టాపట్టాలు వేసుకుని జంటగా అంటుకు తిరుగుతాయి. ఒక దానిలో ఏదయినా కొరవడితే రెండోది దాన్ని పూరిస్తుంది. వాటి మధ్య ఎన్నడూ సంఘర్షణో, ద్వంద్వ రీతియో వ్యక్తమవదు.

సంపద కేవలం కొన్ని చేతుల్లోనే ఆడటం మూలాన తప్పనిసరిగా జనించే భోగవిలాసాల్లో తేలియాడటం, రుచులు మరగటంలాంటివన్నీ ఇస్లామీయ నైతికతలో ధర్మసమ్మతం కావు. దానితోపాటు యజమానులకు ఇస్లాం తాకీదు చేస్తుంది - వారు తమ ఉద్యోగులపట్ల అన్యాయంగా ప్రవర్తించరాదని. వారి న్యాయవంతమయిన వేతనాన్ని తగ్గించరాదని, వారికి వారి హక్కుల్ని పూర్తిగా చెల్లించాలనీను. ధన సమీకరణకూడా ఉద్యోగులపట్ల ఓ విధమయిన అన్యాయం, అక్రమం అనే చెప్పాలి. అందువల్ల అన్యాయాన్ని అంతమొందించాలంటే దాన్ని కూడా అరికట్టడం అవసరమే. ఈ కారణంవల్ల కూడా ఇస్లాం ధన సమీకరణను వ్యతిరేకిస్తుంది. ఇస్లాం ప్రజల్లో దైవమార్గాన దనం వెచ్చించే గుణం పెంపొందాలని కోరుతుంది. దానిగ్గాను వారు అవసరమయితే తమ సర్వస్వాన్నీ ధారపోసేలా ప్రేరేపిస్తుంది. ఏ సమాజంలోనయితే సంపన్నులు ఈవిధంగా సుఖాలను,

స్వార్థాలను త్యజించి, దైవంకొరకు తమ ధనాన్ని ఇతరులకై ఖర్చుచేస్తారో అక్కడ బీదరికం, లేమి అనేవి మచ్చుకయినా కానరావు.

## ఆంతర్యం కోరేదే బాహ్యంలో చట్టమయితే?

పైగా ఇస్లాం ప్రజలకు ఏ ఆధ్యాత్మిక ఔన్నత్యాలను పరిచయం చేస్తుందో వాటివల్ల వారికి దైవ సామీప్యం ప్రాప్తమవుతుంది. దైవ ప్రసన్నత, పరలోక ఫలాపేక్షలో వారు, ప్రపంచంలో లభించే సకల లాభాలనుండి, సుఖాస్వాదనలనుండి దూరమవడానికి సంతోషంగా అంగీకరిస్తారు. వాస్తవమేమంటే దైవనిర్ణయాల పట్ల ప్రసన్నుడయ్యే వ్యక్తి, పరలోకంలో లభించే శిక్షాసాఫల్యాలను విశ్వసించేవ్యక్తి ఎన్నడూ ధన సమీకరణ రోగానికి గురికాజాలడు, తన ప్రయోజనాల సాధనకై ఇతరులపై ఎన్నడూ అన్యాయం అక్రమాలకు, దోపిడీ దుండగాలకు పాల్పడడు.

ఇస్లాం మనిషిని ఏ విధంగా ఆధ్యాత్మిక ఔన్నత్యాలకు లేవనెత్తుతుందో ఆ విధానం, పెట్టుబడిదారీలోని సకల రుగ్మతలను రూపుమాపే ఆర్థిక శాసనాలను అమలు జరపడం సులభతరం చేస్తుంది. ఇస్లామీయ సమాజంలో వాటిని అమలు పరచినప్పుడు సంఘ సభ్యులందరూ దాన్ని సంతోషంగా స్వీకరిస్తారు. వాటిని నిండు హృదయంతో అనుసరిస్తారు. వీరు ఇలా చెయ్యడానికి కారణం శిక్షను పొందే భయంకాదు, అది వారి జీవితానికి నైతిక ప్రాతిపదిక. వారి అంతరాత్మ దేన్నయితే కోరుతుందో అదే చట్టమయి ముందుకు వస్తుంది గనుక !

చివరన మరోమాట. నేడు ముస్లిం జగత్తుపై తిష్టవేసిఉన్న పెట్టుబడిదారీ వ్యవస్థ చెండాలపు రూపానికి ఇస్లామీయ వ్యవస్థతో ఏ విధంగానూ సంబంధం లేదు. అందువల్ల అది జనింపజేసిన చెడులకు ఇస్లాం ఏమాత్రం బాధ్యత వహించజాలదు.

# 5. వ్యక్తిగత ఆస్తి

సొంత ఆస్తిని కలిగి ఉండటం మనిషి స్వభావసిద్ధమయిన వాంఛయా? కమ్యూనిస్టులు దీనికి కాదని జవాబు ఇస్తారు. వారి వాదన ప్రకారం మానవాళి ప్రారంభదశ లేక ప్రారంభయుగం కమ్యూనిస్టుయుగం. ఆ కాలపు మానవ సమాజంలో వ్యక్తిగత ఆస్తి అంటే ఏమిటో ఎవరికీ తెలీదు. అప్పుడు అన్ని వస్తువులూ ఉమ్మడిసొత్తుగానే ఉండేవి. వాటిలో అందరికీ సమానంగా భాగం ఉండేది. అప్పటి వారిలో ప్రేమానురాగాలు, సహాయసహకారాలు, సోదరభావాలు వెల్లివిరిసేవి. ఈ స్వర్ణయుగం అతి త్వరలోనే అంతమయిపోవడానికి కారణం ఏమిటంటే సమాజంలో వ్యవసాయం ప్రారంభంకాగానే మనుషులు వ్యవసాయభూములు, ఉత్పత్తి సాధనాలకొరకు పరస్పరం కలహించుకోసాగారు. ఆ సంఘర్షణ ముందుకు సాగి యుద్ధాలుగా రూపొందింది. కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రకారం ఈ పరిస్థితుల పరిష్కారానికి మానవాళి మరోసారి ఆ "తొలి కమ్యూనిజం" వైపుకు మరలాలి. అన్ని వస్తువులూ అందరిసొత్తుగా మారాలి. అప్పుడే అందరూ వాటిద్వారా ప్రయోజనం పొందగలుగుతారు. కమ్యూనిస్టుల ప్రకారం ఈ విధంగా మాత్రమే ప్రపంచంలో ప్రేమ, శాంతి, సామరస్యాలు పరిఢవిల్లుతాయి.

## అనుభవం ఇచ్చే సాక్ష్యం

కాని మనిషి స్వభావసిద్ధమయిన భావాలు, అభిప్రాయాలు, అలవాట్లు, లక్షణాల్లోనూ అతడు తన పరిసరాలనుండి, శక్తిసామర్థ్యాల ద్వారా గ్రహించిన భావాలు, అలవాట్లు, లక్షణాల్లోనూ ఉన్న వ్యత్యాసం ఏమిటి ? మనస్తత్వ శాస్త్రవేత్తలు ఈ ప్రశ్నకు విభిన్నమయిన సమాధానాలు ఇస్తారు. ఈ విషయంలో వారి మధ్య తీవ్రమయిన భేదాభిప్రాయాలున్నాయి. వ్యక్తిగత ఆస్తి విషయంలోనూ ఇంతే. కొందరు మనస్తత్వ శాస్త్రవేత్తలు, సాంఘిక శాస్త్రవేత్తలు దీన్ని మనిషిలోని స్వభావసిద్ధమయిన భావమని, ఇది పరిస్థితులు లేక వాతావరణంవల్ల జనించింది కాదని వాదిస్తారు. కాని

కొందరు దీన్ని మనిషి కృషితో సాధించిన భావమని, ఇది పరిసరాలు, పరిస్థితుల ప్రభావం వల్ల మనిషిలో జనిస్తుందని అభిప్రాయపడతారు. ఉదాహరణకు ఒక బాలుడు తన ఆట వస్తువును వదలుకోవడానికి నిరాకరిస్తాడంటే, దానికి కారణం, వారి ప్రకారం, తన ఆటవస్తువులు తగ్గిపోతాయన్న భయం, లేదా మరో పిల్లవాడు అతని ఆటవస్తువుల్ని దోచుకుంటాడేమో అన్న ఆందోళన తప్ప మరేమీకాదు. ఆ కారణంచేతనే పదిమంది బాలలుండి ఆటవస్తువు ఒక్కటే ఉంటే వారిలో కలహం చెలరేగడం అనివార్యం. కాని వారిలో ప్రతి ఒక్కనికీ ఓ ఆటవస్తువు ఉన్నట్లయితే ఎలాంటి జగడమూ తలెత్తదు.

కమ్యూనిస్టులు, ఈ మానసిక శాస్త్రవేత్తలూ, సాంఘిక శాస్త్రవేత్తలతో మేము కొన్ని విషయాలు విన్నవించదలిచాము.

## ఏది సహజం?

1. ఇంతవరకు ఏ సైంటిస్టు కూడా, 'వ్యక్తిగత ఆస్తి' అన్నది మానవుని ప్రవృత్తిలో లేదని ఎలాంటి బలమయిన ఆధారంతో రుజువుచెయ్యలేక పోయాడు. మహాఅయితే వ్యక్తిగత ఆస్తి మానవనైజంలోఉందనడానికి గట్టిరుజువు ఏదీలేదని మాత్రమే అనగలరు. అది వేరే ప్రశ్న.

2. తమ దృక్పథాన్ని బలపరచడానికి బాలలు మరియు ఆట వస్తువుల ఉదాహరణ ద్వారా కమ్యూనిస్టు సోదరులు ఏ ఫలితాలనయితే రాబట్టదలిచారో అవి ఎంతమాత్రం వ్యక్తం కావు. పది ఆటవస్తువులున్నప్పుడు పదిమంది బాలురు పరస్పరం కలహించుకోకుండా ఉండటం, మనిషి నైజంలో వ్యక్తిగత ఆస్తి భావన లేదనడాన్ని రుజువు చెయ్యదు. దీని ద్వారా, 'ఆరోగ్యవంతమయిన వాతావరణంలో వ్యక్తిగత ఆస్తి వాంఛ పరిపూర్ణ సమానత్వం తద్వారా కూడా నెరవేరుతుంది' అని మాత్రమే ద్యోతకమవుతుంది. మరో యదార్థం కూడా ఈ సందర్భంలో మన నిత్యానుభవంలో వస్తూనే ఉంటుంది. అనేకమంది బాలురు తమవద్ద ఆటవస్తువులు ఉంచుకుని

కూడా తమ స్నేహితుల ఆటవస్తువుల్ని దోచుకుంటారు. వారు అశక్తులయి తమకు అలవికాకపోతే తప్ప తాను చేసే ఈ చేష్టను మానుకోరు.

3. ఇక, కమ్యూనిస్టులు సూచించే ఆ 'స్వర్ణయుగం' విషయానికి వస్తే, వారన్నట్టు అది ప్రారంభ మానవ సమాజాల అన్నింటి ప్రత్యేకతే. కాని వాస్తవమేమంటే, ఈ స్వర్ణయుగం నిజంగానే ఉండిందా అని తెలుసుకునేందుకు నేటికి గట్టి సాక్ష్యాధారం ఒక్కటీ లభించలేదు. కేవలం చర్చ కోసం అది ఉండిందని ఒప్పుకున్నా, మరో విషయాన్ని కూడా అంగీకరించవలసి ఉంటుంది - ఆ సువర్ణయుగంలో ఉత్పత్తి సాధనాలు అసలేలేవన్న యదార్థం. ఉత్పత్తి సాధనాలే లేకపోతే కలహాలు, కలతలకు తావేది? ఆ కాలంలో మనిషికి ఆహార సంపాదన ఏమంత కష్టతరమయింది కాదు. వారు కోరుకున్నప్పుడు చెయ్యిచాచి చెట్ల ఫలాలు కోసుకునేవారు. వేటకు వెళ్ళినప్పుడు, అడవి మృగాల భయంవల్ల బృందాలరూపంలో వెళ్ళేవారు. కాని వేట జంతువు మాంసాన్ని నిల్వచేసే ప్రశ్నే తలెత్తదు. ఎందుకంటే అది చెడిపొయ్యే ప్రమాదం ఉండింది. వీలయినంత తొందరగా దాన్ని వినియోగించుకోవాలని ప్రయత్నించేవారు. ఇలాంటి ఓ యుగంలో మానవ సమాజంలో ఎలాంటి సంఘర్షణ గోచరించకపోతే దానివల్ల సొంత ఆస్తికి సంబంధించిన ప్రకృతి సిద్ధమయిన వాంఛ వారిలో లేదని చెప్పడానికి వీల్లేదు. ఎందుకంటే అప్పుడు వివాదానికి కారణ భూతమయ్యే ఏ వస్తువూ లేకపోయింది. అందువల్లనే వ్యవసాయ కాలం ప్రారంభం కాగానే సంఘర్షణ కూడా మొదలయింది. వ్యవసాయం కనుగొనడంవల్ల మానవుల్లో నిద్రాణమయివున్న సంఘర్షణా బుద్ధి జాగృతమయింది. తద్వారా దానికి మొదటిసారిగా ప్రేరణ ప్రాప్తమయింది.

4. కమ్యూనిస్టులు ప్రతిపాదించే సిద్ధాంతం ప్రకారం ప్రారంభంలో స్త్రీ అందరి ఉమ్మడి సొత్తుగా ఉండేదని ఒప్పుకున్నా ఆ కాలంలో స్త్రీ కోసం పురుషుల్లో కలహాలు, బలప్రదర్శనలూ జరిగేవి కావని గట్టిగా చెప్పడం సాధ్యపడదు. ఎందుకంటే ఉమ్మడి వస్తువే అయినా ఓ స్త్రీ మరో స్త్రీ కంటే అందమయినదవడం చేత పురుషుల్లో వివాదాస్పదం కావడానికి

ఆస్కారముంది. ఈ సందర్భంలో మనం మరో విషయాన్నీ మరువరాదు. వ్యవహారం ఒకే రకమయిన, సమానమయిన వస్తువులదయితే వాటి గురించి కలహం చెలరేగదని చెప్పవచ్చు. కాని వస్తువుల విలువలరీత్యా అవి అధమమయినవి, అధికమయినవీ అన్న విభేదం మనుషుల్లో ఏర్పడినప్పుడు వివాదం, సంఘర్షణలు ప్రారంభమవడం అనివార్యం – అది కమ్యూనిస్టులు భావిలో ఎప్పుడో ఏర్పడబోతోందని కలలు గనే ఆ 'దేవతల' ఊహాలోకపు సమాజమయినాసరే.

5. మనుషుల్లో ప్రారంభకాలంనుండే తోటిమానవుల సమక్షాన ఏదో ప్రత్యేకత కలిగి ఉండాలన్న వాంఛ ఉండేది. అందువల్లనే కొందరు శూరత్వం, శరీరసౌష్టవం, ఇంకా ఇతర విధాలా తమ వ్యక్తిత్వాన్ని విశేషంగా ప్రదర్శించడానికి ప్రయత్నించేవారు. ఇప్పటికీ కొన్ని ప్రాచీన తెగల ప్రజలు, కమ్యూనిస్టుల ప్రకారం 'తొలి కమ్యూనిజం' యొక్క ఆదర్శకాలంలో జీవితం గడుపుతున్నవారు, తమ కూతుళ్ల వివాహం, ఏ యువకులయితే ఎలాంటి శోషగాని బాధగాని వ్యక్తపరచకుండా తమ వీపులపై నూరు కొరడా దెబ్బలు భరించగలుగుతారో వారితోనే చేస్తారు. ఈ యువకులకు ఇలాంటి ప్రమాదాన్ని కొని తెచ్చుకునేందుకు పురికొలిపేది ఏమిటి? ఇది కేవలం తమ వ్యక్తిత్వపు ప్రదర్శనాభిలాష మహాత్మ్యం కాదా? ప్రపంచంలోని వస్తువులన్నింటిలో సమానత్వం ఉందన్న అభిప్రాయమే నిజమయిన దయితే, ఒక మనిషిచేత ఇతరుల ఎదుట 'నేను మీలాంటి వాణ్ణికాను, మీ కంటే ఉత్తముణ్ణి, అధికుణ్ణి' అనిపించే ఆ భావం మాటేమిటి? మానవ ప్రకృతి యొక్క ఈ కోణం ఎంతో ప్రముఖమయింది. ఒకవేళ కమ్యూనిస్టుల వాదన ప్రకారమే వ్యక్తిగత ఆస్తి మనిషిలోని ప్రకృతి సిద్ధమయిన అభిలాషకాదని ఒప్పుకున్నప్పటికీ, దానికి మరో సహజవాంఛతో ప్రగాఢ సంబంధం ఉంది – అంటే అది, మనిషి భువిలో అడుగిడిన నాటినుండి అతని నైజంలో ఓ భాగంగా అగుపిస్తున్న భావం – అందరిలోనూ తాను ప్రత్యేకత కలిగి ఉండాలన్న వాంఛ!

## అన్యాయానికి మూలం ఏమిటి?

కమ్యూనిస్టులు చెప్పేదేమంటే వ్యక్తిగత ఆస్తి, అన్యాయం ఈ రెంటికీ అవినాభావ సంబంధం ఉంది. అందువల్ల మనిషి అన్యాయం, అత్యాచారం, దౌర్జన్యాలనుండి విముక్తిని కోరదలిస్తే అతను వ్యక్తిగత ఆస్తిని సయితం వదలుకోవాలి.

కాని ఈ మహనీయులు ఇలాంటి వాదన చేసేటప్పుడు రెండు యదార్థాలను మరచిపోతారు. ఒకటి, మానవప్రగతి అంటూ ఏదయినా ఉంటే అది కేవలం వ్యక్తుల కృషివల్లనే సాధ్యం. రెండు, ఊహాజనితమయిన ఆ 'తొలి కమ్యూనిజం' నాటి ఆ 'ఆదర్శ' రోజుల్లో మానవ ప్రగతి పూజ్యం తప్ప మరేమీ కాదు. అంటే, మనిషి ప్రగతి సాధించడం ప్రారంభించాడంటే అది కేవలం వ్యక్తిగత ఆస్తివల్ల సంఘర్షణ ప్రారంభమయిన సందర్భంలోనే సాధ్యమన్నమాట! దీనివల్ల తెలిసేదేమంటే ఇలాంటి సంఘర్షణ యావత్తు కేవలం మనిషి పాలిటి చెడుగు మాత్రమే కాదు. నిజానికి న్యాయ పరిధుల్ని దాటకుండా ఉంటే అది మానవుని అనివార్యమయిన మానసిక, సామాజిక, ఆర్థిక ఆవశ్యకత.

ప్రపంచంలో జరిగిన అన్యాయం, అత్యాచారాలు, దౌర్జన్యాలన్నింటికీ మూలకారణం వ్యక్తిగత ఆస్తి అన్నది ఇస్లాం దృష్టిలో సరయిన అభిప్రాయం కాదు. యూరపు మరియు ఇతర దేశాల్లో జరిగిన అన్యాయాలకు అసలు కారణం, ఆ దేశాల్లో చట్ట నిర్మాణ అధికారాలన్నీ సంపన్న వర్గం చేతుల్లో ఉండటం మాత్రమే. ఈ అధికారాలను వినియోగించుకుని వారు పెట్టుబడిదారుల ప్రయోజనాలను రక్షించే ఉద్దేశ్యంతో చట్టాలు చేశారు. దానివల్ల ఇతర వర్గాల పట్ల అన్యాయం అక్రమం చెయ్యవలసి వచ్చినా, ఇతరుల ప్రయోజనాలు దెబ్బతిన్నా వారు ఖాతరు చెయ్యలేదు.

ఇస్లాం 'అధికారవర్గం' అనేదాన్ని అసలు ఒప్పుకోదు. ఇస్లామీయ వ్యవస్థలో చట్టనిర్మాణకార్యం ఏ ప్రత్యేక ఉన్నతవర్గం బాధ్యతా కాదు. ఆ

అధికారాలన్నీ దేవుని హస్తగతమయి ఉంటాయి. ఆయన మానవ వర్గాలన్నింటికీ కర్త, ఆయన దృష్టిలో మానవులందరూ సమానమే. ఆయనకు ఏ మనిషీ, ఏ వర్గమూ ప్రత్యేకంగా ఇష్టమయినవారు కారు వారికోసం ఇతరులకు అన్యాయం చెయ్యడానికి. ఇస్లామీయ వ్యవస్థలో పౌరులందరూ స్వేచ్ఛాయుత ఎన్నికలద్వారా తమ పాలకుల్ని ఎన్నుకుంటారు. ఏదో ఒక వర్గానికి చెందిన కారణంగా ఎవరినీ నాయకత్వపు పట్టాకట్టడం జరగదు. పాలనాధికారాలు గ్రహించినప్పటికీ ఓ ముస్లిం అధినేతకు తాను నిర్మించిన చట్టాలను అమలు జరిపే హక్కులేదు. అతడు దైవం పంపిన పవిత్ర శాసనాన్ని అనుసరిస్తాడు. దాన్నే అమలు జరుపుతాడు. అతను ఆవిధంగా ఆచరించేవరకు మాత్రమే ముస్లిం ప్రజలు అతనికి విధేయులయి ఉంటారు. ఈ సందర్భంలో తొలి ఖలీఫా హజ్రత్ అబూబక్ర్ (రజిఅన్) చెప్పిన మాట ఎంత స్పష్టంగా ఉందో గమనించండి:

> "నేను పరిపాలనా విషయంలో దైవ విధేయత కనబరచినంతకాలం మీరు నా ఆజ్ఞల్ని పాలించండి. నేను దేవునిపట్ల అవిధేయత చూపితే నాకు విధేయత చూపే బాధ్యత మీపై ఏ మాత్రం ఉండదు".

ఇస్లాం, పాలకులకు శాసన నిర్మాణ అధికారాన్నివ్వదు. స్వయంగా వారూ చట్ట నిర్మాణం చెయ్యలేరు, ఇతరులకూ ఆ హక్కును ధారాదత్తం చెయ్యలేరు. చట్టబద్ధంగా, పాలకులకు, ఒక వర్గానికి ఇతర వర్గాలపై ఆధిక్యత నిచ్చేహక్కు కూడా ఉండదు. వారు ధనవంతులకు లోబడి వారికి లాభం చేకూర్చి, ఇతర వర్గాలకు అన్యాయంచేసి నష్టం కలిగించే ఏచట్టాన్నీ చెయ్యలేరు.

## ఇస్లామీయ సమాజంలో – – –

ఇస్లాంలో హక్కులరీత్యా మనుషుల మధ్య ఏ విధమయిన వివక్షత

చూపడం ధర్మ సమ్మతం కాదు. అందరి పట్ల సమమయిన రీతిలో సమానస్థాయిలో వ్యవహరించడమే ఇస్లామీయ శాసనం. ఇస్లామీయ శాసనాంగాన్ని ఏ కోణంలోనయినా వివరించడమో, నిర్వచించడమో జరగవలసి వస్తే, ప్రపంచంలోని ఇతరచట్టాల మాదిరిగానే, షరీఅత్ (న్యాయ) వేత్తల అభిప్రాయానికే అంతిమ నిర్ణాయక స్థానం ఉంటుంది. కాని ఏ ధనిక వర్గానికో లేదా ఊహాజనితమయిన పాలకవర్గానికో ఎలాంటి అధికారం ఉండదు.

ఇస్లామీయ ధర్మవేత్తలు సాధించిన గర్వించదగ్గ విషయమేమిటంటే, వారు సంపన్నవర్గాల స్వప్రయోజనాల కొరకు ఇస్లామీయ శాసనాంగానికి వక్రభాష్యంచెప్పి, దాన్ని ఇతర వర్గాలపై అన్యాయం జరిపే సాధనంగా చెయ్యలేదు. దీనికి భిన్నంగా, శ్రామికవర్గం యొక్క ప్రాథమిక అవసరాల విషయంలో పూర్తి శ్రద్ధచూపడానికే వారు నిత్యం కృషిచేశారు. ఈ విషయంలో కొందరు ధర్మవేత్తలయితే, శ్రామికులూ, రైతుకూలీలను యజమానులకు సమానంగా లాభంలో భాగస్వాములుగా నిర్ణయించారు.

వ్యక్తిగత ఆస్తికి తప్పనిసరి పర్యవసానం అన్యాయం అత్యాచారాల రూపంలోనే వెలువడుతుందనడానికి మానవ ప్రకృతి అంతనీచమయింది కాదని అంటుంది ఇస్లాం. మానవుల శిక్షణ, శీలనిర్మాణం విషయంలో ఇస్లాం అద్వితీయమయిన విజయాన్ని సాధించింది. ధనవంతులూ, ఆస్తిపరులూ అయినప్పటికీ ముస్లిముల స్థితి ఎలా ఉండేదంటే :

> "వారు తమ వద్దకు వలసవచ్చిన వారిని ప్రేమిస్తారు. వారికి ఇచ్చివేసిన దానిపట్ల తమ హృదయాల్లో ఎలాంటి అభిలాష ఉన్నట్టు కూడా భావించరు. తాము స్వయంగా నిరుపేదలయి ఉన్నప్పటికీ తమపై ఇతరులకే ప్రాధాన్యతనిస్తారు". (అల్ హష్ర్ : 9)

ఇంకా వారు, ఇతరులకు తమ సంపదలో భాగం పంచి ఇచ్చి

సంతోషపడేవారు. అదీ ఏదో ప్రాపంచిక ప్రయోజనాన్ని ఆశించేవారుకాదు, దైవం తమకు సాఫల్యాన్నీ మన్నింపునూ ప్రసాదిస్తే చాలని కోరుకునేవారు. ఇలాంటి ఉన్నతమయిన పవిత్రమయిన అపూర్వమయిన ఆదర్శాలను మనం ముందుంచుకోవాలి. ఇవి మనకు వెలుగునిస్తాయి. తద్వారా మన భవిష్యత్తు కాంతిమంతమవుతుంది. మానవత స్థానం, ఔన్నత్యం ఎలాంటిదో అప్పుడు బోధపడుతుంది.

మనం మరువరాని మరో విషయం ఏమిటంటే మనిషి కేవలం ఊహాలోకాల్లో విహరించాలన్నది ఇస్లాం అభిమతం కాదు. అందుచేత అది సామూహిక శ్రేయాన్ని కేవలం 'ఉత్తమ అభిలాషల' దయాదాక్షిణ్యాలపై వదలి వెయ్యదు. ఆత్మ పరిశుద్ధతకు ఇస్లాంలో గల ప్రాముఖ్యం ఎంత గొప్పదయినా జీవితపు క్రియాత్మక సమస్యలను కనుమరుగుకానివ్వదు ఇస్లాం. సమాజంలో న్యాయవంతమయిన ప్రాతిపదికపై సంపద పరిభ్రమించాలని చట్టంద్వారా తగిన ఏర్పాటు చేస్తుంది. ఈ విధంగా ఓ ఆరోగ్యవంతమయిన సమాజస్థాపనకు పునాదులు వేస్తుంది. బహుశా ఈ యదార్థాన్నే మూడవ ఖలీఫా హజ్రత్ ఉస్మాన్ (రజిఅన్) తన మాటల్లో ఈ విధంగా నుడివారు:

> ఏ విషయాలనయితే కేవలం ఖుర్ఆన్ (బోధనల ) ద్వారా వారించడం సాధ్యపడదో వాటిని అల్లాహ్ అధికారశక్తి ద్వారా నిస్సందేహంగా దూరం చేస్తాడు.

ఇంతకు చెప్పవచ్చిందేమిటంటే కేవలం వ్యక్తిగత ఆస్తివల్ల తప్పనిసరిగా అన్యాయం జనిస్తుందనడం సబబుకాదు. ఎందుకంటే వ్యక్తిగత ఆస్తికి స్థానమున్న సమాజాల్లోనూ అది ఎలాంటి అన్యాయానికి కారణభూతం కాలేదనడానికి సాక్ష్యాధారాలున్నాయి. ఇస్లాం భూమిని వ్యక్తిగతాస్తిగా ఉంచుకునే అనుమతినయితే ఇచ్చింది కాని దాని ఆధారంగా భూస్వామ్యవ్యవస్థ రూపొందే అవకాశాన్నివ్వలేదు. ఆ ప్రమాదాన్ని వారించడానికి అది ఆర్థిక, సామాజిక చట్టాలను చేసి జమీందారీ, జాగీర్దారీ

వ్యవస్థలు పెంపొందే అవకాశమే లేకుండా చేసింది. స్థిరాస్తిగా భూమి ఏ మాత్రమూ లేనివారు కూడా ఆ వ్యవస్థలో గౌరవప్రదమయిన జీవితం గడిపేవారు. ఈ భద్రతలవల్లనే సంపన్నులయినవారు ఇస్లామీయ వ్యవస్థలో నిరుపేదలపై ఎలాంటి జులుం చెయ్యడం సాధ్యమయ్యేదికాదు.

## సామాజిక సిద్ధాంతాలు, ఆర్థికవ్యవస్థ

ఒకవేళ ఇస్లాంలో పెట్టుబడిదారి విధానం వృద్ధీవికాసాలు చెందే అవకాశముందని వాదనకై ఒప్పుకున్నా దానితోపాటే మరో యదార్థాన్ని కూడా గుర్తించవలసి ఉంటుంది. ఇస్లాంలో, సామాన్యప్రజల ప్రయోజనాలకై సేవచేసేటటువంటి పెట్టుబడిదారీ వ్యవస్థయే నెలకొనగలిగి ఉండేది. ఒక వైపున ఇస్లాం మానవ ప్రకృతిని పరిశుద్ధపరుస్తుంది. మరోవైపు అది నిర్మించే చట్టాలమూలంగా పెట్టుబడిదారులకు దోపిడీ, దౌర్జన్యం, అన్యాయం, అక్రమాలవైఖరి అవలంబించడం సాధ్యమయ్యేదికాదు. ఇస్లామీయ వ్యవస్థ సక్రమంగా పనిచెయ్యగలిగి ఉంటే, అది తన ఆచరణావిధానం ద్వారా పాశ్చాత్య దేశాల్లో నేడు ప్రబలిపోయిన చెడుల్ని దూరంచేసి ఉండేది.

మరో విషయమేమంటే, ఇస్లాంలో వ్యక్తిగతఆస్తి అనేది కొన్ని నిబంధనలకు లోబడివుంది. ఉదాహరణకు ప్రజాసాధనాలు ప్రజలందరికీ చెందినవి అన్నది ఇస్లాం సూత్రం. అంటే న్యాయం, సమంజసం అవసరం అని తలచిన చోట ఇస్లాం వ్యక్తిగత ఆస్తికి ఆంక్షలు విధించిందన్నమాట. మరెక్కడయితే అనుమతి నిచ్చిందో అక్కడా దానివల్ల ఇతరులపై అన్యాయం అక్రమాలు జరగవన్న తృప్తి కలిగినమీదటే ఇచ్చింది.

ఈ విషయాన్ని విశదపరచడానికి మనం ఓ ముస్లిమేతరదేశాన్ని ఉదాహరణగా తీసుకుందాము. ఇంగ్లీషు ప్రజలు, అమెరికనులు, ఫ్రెంచిప్రజలు – జాతి, వర్ణం ఆధారంగా విచక్షణను సమర్థించే వీరంతా –స్కాండినేవియా ప్రజలు ప్రపంచంలోకెల్లా సౌమ్యస్వభావులు, సంస్కారవంతులు, నాగరిక ప్రజలని ఒప్పుకుంటారు. కాని స్కాండినేవియా

అంటే నార్వే స్వీడన్‌లలో నేటివరకు కూడా వ్యక్తిగతఆస్తిని నిషేధించడం జరగలేదు. దానికి భిన్నంగా సంపదను న్యాయవంతంగా పంపిణీచేసే ఏర్పాట్లు చెయ్యడం జరిగింది. దీనిగ్గాను సామాజిక రక్షణలు కల్పించబడ్డాయి. ఆ రక్షణల్లో విభిన్నవర్గాల మధ్య ఆర్థిక విభేదాన్ని తగ్గించడం, శ్రమ - వేతనాల ప్రమాణాల్లో సముచితమయిన నిష్పత్తి నిలకడగా ఉండేలా చూడటం కూడా ఉన్నాయి. ఇస్లామీయ శాసనాన్ని కొన్ని కోణాల్లో అమలుపరచి ఈ దేశాలు ఇతరదేశాల కంటే అధికంగా ప్రగతిశీలకమయినవిగా రూపొందాయని చెప్పవచ్చు.

ఏ సామాజిక సిద్ధాంతాల ఆధారంగా ఒక ఆర్థికవ్యవస్థ రూపొందుతుందో వాటినుండి దాన్ని వేరుచేసి చూడటం సరయిన పద్ధతికాదు. నేడు ప్రపంచంలో చెలామణీలో ఉన్న ప్రముఖ వ్యవస్థలు - పెట్టుబడిదారీ, కమ్యూనిజం, ఇస్లాం - ఈ మూటినీ స్థూలంగా పరిశీలిస్తే, ఈ మూటిలోనూ, ఆర్థిక వ్యవస్థకు, ఆస్తికి సంబంధించిన వాటి దృక్పథాలకు, అవి ప్రతిపాదించే ప్రత్యేక సామాజిక వ్యవస్థతో అవినాభావ సంబంధంఉన్న యదార్థం ఇట్టే వెల్లడవుతుంది.

## ఇస్లాం - మధ్యేమార్గం

పెట్టుబడిదారీ వ్యవస్థకు పునాది - వ్యక్తి యొక్క వ్యక్తిత్వం పవిత్రమయింది, అతని పవిత్రత ఎట్టి పరిస్థితిలోనూ భంగపడరాదు, దానిపై ఎలాంటి సామాజిక ప్రతిబంధకమూ ఉండరాదు అన్నది. దీని భావమేమిటి ? పెట్టుబడిదారీ వ్యవస్థ విశృంఖల వ్యక్తిగతాస్థిని సమర్థిస్తుందన్నమాట. దానిపై ఎలాంటి నిర్బంధాన్ని విధించడాన్నీ అది ఒప్పుకోదు.

దీనికి పూర్తిగా భిన్నమయినరీతిలో కమ్యూనిజం మౌలిక సిద్ధాంతం ప్రకారం, 'సంఘం' అసలు ప్రాతిపదిక. దాన్ని కాదని, దాన్నుండి వేరుగా, స్వతంత్రంగా వ్యక్తికి ఎలాంటి ఉనికే లేదు. ఈ విధంగా కమ్యూనిజం, సకల

యాజమాన్యపు హక్కులు రాజ్యానికి ధారాదత్తం చేస్తుంది. వ్యక్తులనుండి వ్యక్తిగత ఆస్తి హక్కులన్నీ దోచుకుంటుంది.

ఇస్లాం ప్రతిపాదించే సామాజిక దృక్పథం ఈ విషయంలో పూర్తిగా భిన్నమయింది. దాని కారణంగా దాని ఆర్థిక వ్యవస్థ కూడాఈ రెంటికీ భిన్నమయిన రీతిలోనే ఉంది. ఇస్లాం ప్రకారం వ్యక్తి - సంఘం ఈ రెంటి సంబంధాల విషయంలో వ్యక్తి ఒకేసారి రెండు స్థాయిల్లోనూ బాధ్యతాయుతంగా మెలగాలి. ఈ రెంటిమధ్య సామరస్యం సృష్టించమని కోరుతుంది అతన్ని ఇస్లాం .

ఇస్లాం ప్రతిపాదించే ఈ సామాజిక దృక్పథం వ్యక్తిని సమాజానికి దూరం చెయ్యదు, వ్యక్తీ, సమాజం రెండూ రెండు భిన్న ధృవాలని, అవి రెండూ నిత్యం ఒకదాన్నొకటి లోబరచుకోడానికి కృషిచేసే శక్తులని కూడా చెప్పదు. ఇస్లాం ప్రకారం, వ్యక్తి స్వతంత్రుడు అయినప్పటికీ ఓ సమాజంలో సభ్యుడు కూడాను. ఇస్లాం, ఒకవైపు వ్యక్తి మరియు సమాజాల మధ్య, రెండవవైపు వ్యక్తి మరియు సమాజంలోని ఇతరవ్యక్తుల ప్రయోజనాలమధ్య సామరస్యాన్ని సాధించాలని అభిలషిస్తుంది. కాని ఈ సామరస్యం కొరకు అది వ్యక్తి ప్రయోజనాన్నీ ఉపేక్షించదు,సమాజ సంక్షేమాన్నీ కాదనదు. దాని నియమాలు సమాజం కొరకు వ్యక్తిని బలిచెయ్యడానికిగాని, ఒక వ్యక్తి లేక కొందరు వ్యక్తుల ప్రయోజనాల నిమిత్తం సమాజంలో కలతల్ని సృష్టించడానికి గాని అనుమతించవు. అది వ్యక్తిని పరిరక్షిస్తే సమాజాన్ని కూడా విచ్ఛిన్నం కాకుండా కాపాడుతుంది.

ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థ, పెట్టుబడిదారీ మరియు కమ్యూనిజం - రెండు అతివాదాల మధ్య సుహృద్భావ పూర్వకమయిన మధ్యేమార్గంపై సమన్వయం, సామరస్యాల భావనల ఆధారంగా రూపొందుతుంది. ఇందులో రెండు వ్యవస్థల మంచి అంశాలయితే ఉన్నాయి కాని వాటిలోని చెడులూ లోపాలకు అది దూరంగా ఉంది. ఇది సూత్రప్రాయంగా వ్యక్తిగత ఆస్తిని అనుమతినిస్తుంది. కాని దాన్నిఅనేక కట్టుదిట్టాలతో పరిమితంచేసి, అది

హానికరమవకుండా చేస్తుంది. మరోవైపు ఇస్లాం పరిపాలనా వ్యవస్థకు సామూహిక ప్రాతినిధ్యస్థానమిచ్చి, వ్యక్తిగత ఆస్తి వ్యవస్థీకరణ కొరకు కావలసిన శాసననిర్మాణం చేసేందుకు, ఇంకా సామాజిక సంక్షేమం దృష్ట్యా వాటిలో మార్పులూ చేర్పులూ చేసేందుకు దానికి పరిపూర్ణ అధికారాలనిస్తుంది.

## సంస్కరణే - అసలు ధ్యేయం కావాలి

ఇస్లాం వ్యక్తిగత ఆస్తిని బలపరుస్తుంది. ఎందుకంటే, దానివల్ల జనించే చెడులను నివారించే సామర్థ్యం కూడా దానికి ఉంది. ఈ లక్ష్యం కొరకు అది అనేక సాధనాలను, మార్గాలను అవలంబిస్తుంది. వ్యక్తిగత ఆస్తికి సూత్రప్రాయంగా అనుమతినిచ్చి దాన్ని అదుపులో ఉంచడానికీ, క్రమబద్ధం చెయ్యడానికీ సామూహిక వ్యవస్థకు అధికారాల నివ్వడం, దాన్ని పూర్తిగా అంతమొందించడం కన్నా ఉత్తమమయిన మార్గమనడంలో సందేహామేముంది? ముఖ్యంగా, వ్యక్తిగత ఆస్తి భావన మనిషినైజంలోనే లేదని, మానవ జీవితంలో దాని ఆవశ్యకత కూడా లేదని కేవలం నిర్మించుకున్న సిద్ధాంతం ఆధారంగా దాన్ని తిరస్కరించే పరిస్థితుల్లో దీని ఔచిత్యం ద్విగుణీకృతమవుతుంది. స్వయంగా రష్యాలోనూ వ్యక్తిగత ఆస్తిని పరిమితస్థాయిలో అనుమతించవలసి వచ్చిందన్న యదార్థం* దేన్ని సూచిస్తోంది ? మానవ ప్రకృతితో సామరస్యం పొందే మార్గాన్నను సరించడమే వ్యక్తి ప్రగతి మరియు సమాజశ్రేయానికి ఉత్తమమయిన విధానం అన్నది ప్రస్ఫుటం కావడంలేదా?

వ్యక్తిగత ఆస్తిని ఏ కారణాలవల్ల నిషేధించాలి? ఏ కారణాల ఆధారంగా దాన్ని నిషేధించవలసిందని ఇస్లాంను కోరుతున్నారు? ఇదీ నేటి ముఖ్యమయిన ప్రశ్న.

---

* నేడు అది ఇంకా విస్తృత మవుతుంది.వ్యక్తిగత స్థాయిలో వ్యాపారం చెయ్యడానికి, అద్దెబళ్ళు నడపడానికి అక్కడ ఇటీవలే వీలు కల్పించడం జరిగింది.

మనుషుల మధ్య సమానతను నెలకొల్పడానికి వ్యక్తిగత ఆస్తిని అంతమొందించడం తప్ప గత్యంతరం లేదని వాదిస్తుంది కమ్యూనిజం. ఎందుకంటే, ఆ విధంగానే మనిషిని తనలాంటి మనిషి బానిసత్వం నుండి విముక్తిని ప్రసాదించడం సాధ్యమవుతుంది. రష్యాలో ఉత్పత్తి సాధనాలను వ్యక్తిగత ఆస్తి పరిధినుండి తీసి ఉమ్మడి ఆస్తిగా చెయ్యడం జరిగింది. అయితే వ్యక్తిగత ఆస్తిని అంతం చేసేటప్పుడు ఏ ఆశయాల దృష్ట్యా అలా చెయ్యడం జరిగిందో అవన్నీ నెరవేరాయా? స్టాలిన్ పాలనాకాలంలో కార్మికులచేత అధికంగా పనిచేయించుకోడానికి అధిక వేతనాల ఆశ చూపవలసి వచ్చింది. ఈ విధంగా కార్మికుల వేతనాల్లో సమానతాభావాన్ని స్వయంగా కమ్యూనిస్టు ప్రభుత్వమే చేతులారా రద్దుచేసింది. ఇది మరువరాని విషయం.

నేడు రష్యాలో కార్మికులందరికీ ఒకేలా వేతనాలు ఇవ్వడం జరుగుతోందా? అక్కడ డాక్టర్లకు, నర్సులకూ ఒకే మాదిరి జీతభత్యాలున్నాయా? స్వయంగా కమ్యూనిస్టులే మనకు చెబుతారు - అక్కడ ఇంజనీర్లకు, వృత్తిపనుల నిపుణులకు దొరికే ఆదాయం అందరికంటే అధికమని. అంటే, రష్యాలోని వివిధవర్గాల్లో నేటికీ వేతనాల వ్యత్యాసం అలాగే ఉందన్న సత్యాన్ని వారు ఒప్పుకుంటున్నారన్నమాట. ఈ వ్యత్యాసాలు కేవలం విభిన్నవర్గాల ప్రజల్లోనే కాదు ఒకేవర్గంలోని వ్యక్తుల్లోకూడా ఈ వివక్షతలు బహిరంగంగా అగుపిస్తాయి.

వ్యక్తిగత ఆస్తిని రద్దుచెయ్యడం వల్ల రష్యాప్రజల్లో పోటీభావం, ఎదుటి వారిని మించిపోయి వ్యక్తిగత ప్రత్యేకతను నిలబెట్టుకోవాలన్న ఆసక్తి క్షీణించి పోయిందా? ఒకవేళ ఈ విభేదాలు, అంతరాలు అన్నీ సమసిపోతే అక్కడ ట్రేడ్ యూనియన్ నాయకుల్ని, కార్ఖానాల మేనేజర్లను, ఉన్నత నిర్వహణాధికారుల్ని, వివిధ శాఖల అధిపతుల్ని దేని ఆధారంగా ఎన్నుకుంటున్నారు? ఖుద్దుగా కమ్యూనిస్టుపార్టీలో చురుగ్గా పాల్గొనే కార్యకర్తల్లోనూ పనిచెయ్యలేని కార్యకర్తల్లోనూ ఏ ప్రాతిపదికపై వ్యత్యాసాన్ని పాటిస్తున్నారు ?

వ్యక్తిగత ఆస్తిని అనుమతించడమో అనుమతించకపోవడమో తరువాత సంగతి, ముందు ఇతరులపై ఆధిక్యత సాధించాలన్న అభిలాష, ఇతరులకన్నా ప్రత్యేకతను పొందాలన్న భావం మానవ సహజం కాదా ? కమ్యూనిజమయితే వ్యక్తిగత ఆస్తిని రద్దుచేసి వేసిందికాని ఏ చెడు కేవలం వ్యక్తిగత ఆస్తివల్ల జనిస్తుందని అది వారించిందో దాన్నుండి మానవాళిని కాపాడలేక పోయింది. ఈ విషయంలో కమ్యూనిజం పరాజయం 'సాధించిన' తరువాత, ఆ భ్రష్టమార్గాన్ని అనుసరించడం మనకనవసరం. అది నిజానికి మానవప్రకృతికి పూర్తిగా విరుద్ధమయింది. ఆ లక్ష్యం కోసం కృషి జరపడమంటే కేవలం ఉనికిలేని, అందని గమ్యం కొరకు ప్రాకులాడటం అన్నమాట.

రష్యాలో ఉన్న విభేదాలు, వ్యత్యాసాలనుగురించి కమ్యూనిస్టు సోదరులు చెప్పేదేమంటే, అవన్నీ బహుస్వల్పమయినవి, వాటివల్ల సంపన్నవర్గం భోగవిలాసాల్లో మదపుటేనుగులా బలిసిపొయ్యే అవకాశమూలేదు, ఇంకా క్రింది తరగతివారు పూర్తిగా నిరాధారులయి పొయ్యే ప్రమాదమూలేదు. సరే, అయితే వ్యక్తిగత ఆస్తిని తుదముట్టించిన తరువాత కూడా ప్రాప్తమయ్యేది ఇదే అయితే అంతమాత్రానికి ఇంత హంగామా దేనికి ? నేటికి 13 వందల ఏళ్ళక్రితం, కమ్యూనిజం ఛాయలు కూడా ప్రపంచాన కానరానినాడు, ఇస్లాంప్రపంచానికి అందజేసిన ప్రబోధాల్లో ఒకటేమంటే, సమాజంలోని వ్యక్తుల మధ్యనెలకొని ఉన్న ఆర్థిక వ్యత్యాసాన్ని వీలయినంత మేరకు తగ్గించాలన్నది. తద్వారా కొందరువ్యక్తులు, ఇతరుల హక్కుల్ని కాజేసి తాము మాత్రం సుఖభోగాల్లో తేలియాడాలనుకుంటే అవకాశం లేకుండా చెయ్యాలన్నదే అసలు ఆశయం. కాని ఈ ఆశయసిద్ధికై ఇస్లాం చట్టం కర్రచేతబూనడమే కాదు, ప్రజల్లో దైవభక్తి, సదాచరణ, మానవాళిపట్ల ప్రేమభావాలను కూడా సృజించింది. ఆ తరువాత చట్టాన్ని పాటింపచేసేందుకు బాహ్యశక్తి ఏదీ అవసరంలేకుండా పోయింది.

# 6. వర్గ వ్యవస్థ

"అల్లాహ్ మీలో కొందరికి కొందరిపై ఉపాధికల్పనలో ఆధిక్యతను ప్రసాదించాడు". (అన్ నహ్ల్ - 71)

'మేము ఒకరిపై ఒకరికి స్థాయి స్థితుల దృష్ట్యా ఉన్నతినిచ్చాము"
(అజ్ జుఖ్రుఫ్ : 32)

కమ్యూనిస్టు విమర్శకులు, ఈ ఆయత్‌ల దృష్ట్యా ఇస్లాంలో వర్గ వ్యవస్థలేదని వాదించడానికి ఆస్కారమేముందీ ? అని అంటారు. ఈ ప్రశ్నకు సమాధానం వెదకాలంటే ముందు వర్గ వ్యవస్థ అంటే ఏమిటో అర్థం చేసుకోవాలి. ఆ తరువాతనే దాని గురించి ఇస్లామీయ దృక్కోణం ఏమిటో లేక అది ఇస్లాంలో ధర్మబద్ధమయినదా కాదా అన్న విషయాలు పరిశీలించగలం.

## వర్గ విభేదానికి మూలం

మధ్యయుగంలో యూరపు స్పష్టంగా మూడు వర్గాల్లో విభజించబడి ఉండింది. శ్రేష్ఠులు (NOBLES), చర్చ్ పాదరీలు (CLERGES), సామాన్యప్రజలు (COMMON PEOPLE).

పాదరీల దుస్తులే వారి ప్రత్యేకత. అధికారం, శక్తి దృష్ట్యా ఈ వర్గం గొప్పగొప్ప రాజులు చక్రవర్తులకు పోటీగా నిలిచేది. చర్చ్ అధినేత పోపు (POPE) రాజుల్ని నియమించడమో వారిని తొలగించడమో తన హక్కుగా భావించేవాడు. ఈ పరిస్థితిని రాజులు ఎలా సమ్మతిస్తారు ? వారు చర్చ్ మరియు పోపు అధికారపు పిడికిలినుండి విముక్తిని పొందేందుకు వీలయినన్ని విధాలుగా ప్రయత్నించేవారు. చర్చ్ రాబడి ఏ మేరకు ఉండిందంటే దాని ఆధారంగా అది తనకు స్వంతంగా ప్రత్యేక సేవను కూడా నియమించుకున్నది.

శ్రేష్టుల (NOBLES)కు శ్రేష్ఠత, ఔన్నత్యాలు వారి తల్లిదండ్రుల ద్వారా వంశపారంపర్యంగా లభ్యమయ్యేవి. వారికి ఉన్నతస్థానం, వారి వ్యక్తిగత బుద్ధికుశలతలు, శక్తి సామర్థ్యాలు, గుణగణాల ద్వారా ప్రాప్తమయింది కాదు. వారి ప్రకారం అగ్రవర్ణం వారు జన్మతః అగ్రవర్ణులయి ఉంటారు. నీచాతినీచమయిన చేష్టలు, హీనాతి హీనమయిన పనులు చేసినప్పటికీ వారు ఉన్నతులుగానే ఉంటారు. ఈ చేష్టలవల్ల వారి పుట్టుకతో వచ్చిన శ్రేష్ఠతలో ఎలాంటి లోపం వాటిల్లదు.

భూస్వామ్యయుగంలో ఈ అగ్రవర్గంవారికి తమ జాగీరుల్లోనివసించే ప్రజలపై అవధుల్లేని అధికారాలుండేవి. వారు నియంతల మాదిరిగా న్యాయసంబంధమయిన, పరిపాలనా సంబంధమయిన సకల కార్యకలాపాలు తామే నిర్వహించేవారు. వారి ఇష్టమే చట్టం, వారి మాటలే శాసనం. వారి చేతలే నియమం. ఆ కాలంలో ఏవయినా ప్రాతినిధ్యత్వపు మండలులు, సంఘాలు ఉన్నా వాటిలో వీరు మాత్రమే సభ్యులుగా ఉండేవారు. దాని సహజపరిణామంగా, చట్టనిర్మాణంలో వారి స్వార్థానికి, వారి రాయితీలకు, వారి ప్రయోజనాల పరిరక్షణకు ప్రాధాన్యత ఉండేది. అలా తయారయిన ఆ నియమాలు, చట్టాలు పరమ పవిత్రమయినవిగా వాటిని కాదనే లేక రద్దు చేసే మాటను ఆలోచించడం కూడా మహాపరాధంగా పరిగణించబడేది.

## సామాన్యుల వారసత్వం

సామాన్యప్రజల విషయానికి వస్తేవారికి ఎలాంటి రాయితీలు లేవు. ఎలాంటి హక్కులూ లేవు. బీదరికం, బానిసత్వం, అవమానం, అగౌరవం వారికి తల్లిదండ్రులనుంచి సంక్రమించిన వారసత్వాలు. ఆ వారసత్వాన్నే వారూ తిరిగి తమ సంతానానికి అప్పజెప్పేవారు.

తరువాత కాలంలో కలిగిన ఆర్థిక ప్రగతి మూలంగా 'బూర్జువా' వర్గం ఉనికిలోకి వచ్చింది. అది కూడా క్రమంగా ప్రాచీన కాలంలో శ్రేష్ఠులకు ప్రాప్తమయిన ప్రత్యేకతల్ని, ప్రాముఖ్యాన్ని, స్థానాన్నీ పుణికి

పుచ్చుకుని ముందుకు వచ్చింది. ఈ వర్గం ఆధ్వర్యాన్నే సామాన్య ప్రజలు ఫ్రెంచి విప్లవాన్ని తీసుకువాచ్చరు. ఫ్రెంచి విప్లవం వర్గవిభేదాన్ని అంతమొందించినట్లే అగుపించింది. అయితే అది ప్రపంచానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, సౌభ్రాత్రత, సమానతల నినాదాలను మాత్రం ప్రసాదించింది.

ప్రాచీన కాలంలోని శ్రేష్ఠుల వర్గం స్థానే ఇప్పుడు ఆధునిక కాలంలో ధనిక వర్గం వచ్చేసింది. ఈ మార్పు గుట్టు చప్పుడు లేకుండా జరిగిపోయింది. దానికితోడుగా ఆర్థిక ప్రగతికి పర్యవసానంగా కలిగే అనేక మార్పులూ వచ్చాయి. ఇంతగా మార్పులూ చేర్పులూ తలక్రిందులూ అయినా సామాజిక వ్యవస్థలో మౌలిక సూత్రంరీత్యా ఎలాంటి మార్పు జరగలేదు. అందువల్ల ఇప్పటికీ ధనం, సంపద, శక్తి, అధికారం - అన్నీ పెట్టుబడిదారులకే హస్తగతమయిఉన్నాయి. అది తనకు నచ్చిన రీతిలో ప్రభుత్వ యంత్రాంగాన్ని వినియోగించుకుంటుంది. ప్రజాస్వామిక దేశాల్లో బయటికయితే సామాన్యప్రజలకే సకలస్వేచ్ఛలు ఉన్నట్లు గోచరిస్తుంది. కాని ఇక్కడ సయితం ధనికవర్గం, దొంగచాటుగా పార్లమెంటు, ప్రభుత్వ కార్యాలయాలను తన చెప్పుచేతుల్లో ఉంచుకుని ధర్మాధర్మ మార్గాల ద్వారా తన దుష్ట లక్ష్యాలను నెరవేర్చుకుంటూ ఉంటుంది.

ఈ సందర్భంలో మరువరాని మరో అంశం ఏమిటంటే నేడు ప్రజాస్వామ్యానికి పెద్ద దిక్కుగా నిల్చున్న బ్రిటిష్ రాజకీయ వ్యవస్థలో ఇప్పటికీ ప్రభువుల మండలి ( HOUSE OF LORDS) అనే పెద్దల సభ ఒకటి ఉండనే ఉంది. అక్కడ నేటికీ భూస్వామ్య వ్యవ్యస్థకు ప్రతీకలా ఒక పాత చట్టం అమల్లో ఉంది. దాని ప్రకారం జాగీర్దారు ఒకడు మరణిస్తే అతని ఆస్తి అంతా అతని పెద్ద కొడుకుకే చెల్లుతుంది. ఈ చట్టంలోని స్పష్ట మయిన ఉద్దేశ్యం, జాగీరును, ఆస్తిని కేవలం కొన్ని ప్రత్యేక హస్తాల్లో మటుకు పరిమితం చెయ్యడం, వంశపారంపర్యంగా వచ్చే జాగీరు పంపకమయి చెదిరిపోకుండా ఒకేచోట కేంద్రీకృతమయి ఉండేలా చూడటం, తద్వారా మధ్య యుగాల్లో జాగీర్దార్లకు లభించిన సామాజిక స్థానం వంశంలో చిర స్థాయిగా నిలబెట్టడం తప్ప మరేదీకాదు.

## వర్గ వ్యవస్థకు మూలభావన

ధనమే బలమన్న తప్పుడు భావన ఆధారంగా వర్గవ్యవస్థ ఏర్పడింది. దాని ప్రకారం ఏ వర్గం చేతుల్లో సిరిసంపదలుంటాయో తప్పనిసరిగా ఆ వర్గమే రాజకీయ అధికారాన్నీ కలిగి ఉంటుంది. చట్ట నిర్మాణంలో దానికే ప్రాధాన్యత ఉంటుంది. తన ప్రయోజనాలను రక్షించుకోవడానికి అది, ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఇతర వర్గాలను చట్టపరమయిన హక్కులనుండి దూరంచేసి వాటిని తన చెప్పు చేతుల్లో ఉంచుకోవడానికి ఉద్దేశించిన చట్టాలను చేస్తుంది. వర్గవ్యవస్థయొక్క ఈ నిర్వచనం ప్రకారం చూస్తే ఇస్లాంలో ఎలాంటి వర్గవ్యవస్థకూ చోటు లేదని ఘంటా పథంగా చెప్పవచ్చు. ఈ సత్యాన్ని క్రింది యదార్థాలూ బలపరుస్తాయి.

## ఆస్తి వికేంద్రీకరణ

ఇస్లాంలో, సిరిసంపదలు కొన్ని ప్రత్యేక వ్యక్తులమధ్యనే నిలువ ఉండేందుకు వీలు కల్పించే ఎలాంటి చట్టమూ లేదు. దివ్యఖుర్‌ఆన్‌లో ప్రస్ఫుటమయిన మాటల్లో ఈ ఆదేశం కానవస్తుంది :

> "ధనం మీలోని శ్రీమంతుల మధ్యనే పరిభ్రమిస్తూ ఉండరాదన్నదే దీని ఉద్దేశ్యం" (59 : 7)

ఈ కారణంగానే ఇస్లాం చేసిన చట్టాల్లో ధనాన్ని నిత్యం ప్రజల్లో తిరుగాడేలా చెయ్యడమన్న ఉద్దేశ్యం విస్పష్టంగా అగుపిస్తుంది. ఇస్లాం నిర్దేశించే వారసత్వపు చట్టం ప్రకారం, చనిపోయే ప్రతివ్యక్తి ఆస్తి అతని వారసులందరి మధ్యన – వారు ఎందరయినా సరే – పంపకం జరగవలసిందే. ఇస్లాంలో వారసత్వపు హక్కు పొందడానికి ఏ ఒక్క వ్యక్తికీ ప్రత్యేకతలేదు – మృతుని సోదర సోదరీలు మరే బంధువులూ లేని పరిస్థితిలో తప్ప. ఇలాంటి వినాయింపులో సయితం ఇస్లాం ఏర్పరచిన వ్యవస్థ ప్రకారం

మొత్తం ఆస్తికి ఒకే వ్యక్తి వారసుడు కాకుండా జాగ్రత్తలు తీసుకోవడం జరిగింది. ఇతర హక్కుదారులకూ అందులో వాటా లభించేలా చూడటం జరిగింది – వారు మృతుని బంధువర్గంలో లేకపోయినప్పటికీ వారికి కొంత లభించే ఏర్పాట్లు ఉన్నాయి.

"ఇంకా, (వారసుల్లో ఆస్తి) పంపకం జరిగేటప్పుడు (దూరపు) బంధువులు, అనాధలు, అగత్యపరులూ అక్కడ హాజరయితే వారికీ ఆ వారసత్వంలోనుంచి కొంత ఇవ్వండి. వారితో మంచిగా, మర్యాదగా మాట్లాడండి." (4 : 8)

ధనం కేంద్రీకృతమవడంవల్ల ఉత్పన్నమయ్యే సమస్యల్ని ఇస్లామీయ షరీఅత్‌లో ఈ విధంగా పరిష్కరించడం జరిగింది. ఇస్లామీయ వారసత్వపు చట్టం ప్రకారం ఆస్తి మృతుని వారసులందరి మధ్య పంపకమవుతుంది. అది తిరిగి వారివారి వారసుల్లో పంపకమవుతుంది. ఈ విధంగా ఇస్లామీయ సమాజంలో ధనం ఎన్నడూ కొందరు వ్యక్తుల మధ్యనే నిలువ ఉండదు. సమాజం మొత్తాన పరిభ్రమిస్తూ ఉంటుంది. దీనికి చరిత్ర పలికే సాక్ష్యంకన్నా వేరొకటి అవసరం లేదు.

దీని ద్వారా మరో ముఖ్య అంశం మన ముందుకు వస్తుంది. అదేమంటే ఇస్లామీయ వ్యవస్థలో ఏ వ్యక్తికీ తనకు ఇష్టమయిన రీతిలో ఏ చట్టాన్నీ చేసే అధికారం లేదు. ఇస్లాం అందరినీ ఒకే దైవికమయిన చట్టానికి కట్టుబడి ఉండాలని కోరుతుంది. ఆ దైవ శాసనం మానవుల మధ్య ఎలాంటి వ్యత్యాసాన్నీ సహించదు. అంటే ఇస్లామీయ సమాజం వర్గరహితమయిన సమాజమన్నమాట. వర్గాలున్నాయంటే చట్టంలో ప్రాధాన్యతలు వాటంతట అవే వచ్చేస్తాయి. వర్గాలకూ చట్టంలో ప్రాధాన్యతలకూ గట్టి సంబంధముంది. చట్టంలో ప్రాధాన్యతలు లేనిచోట, ఏ వర్గమూ తనకు ఇష్టమయిన చట్టాలు చేసి తన స్వప్రయోజనాలకై ఇతరులకు నష్టం కలిగించే అవకాశాల్లేని చోట వర్గ విభేదాలు కూడా ఉండటానికి అవకాశముండదు.

## యదార్థాన్ని ప్రకటించిన ఖుర్ఆన్

ఇక, ఈ అధ్యాయం ప్రారంభంలో ఉదహరించిన రెండు కుర్ఆన్ ప్రవచనాలను అర్థంచేసుకోడానికి ప్రయత్నిద్దాము. వాటి అవగాహనలో పొరపాటు జరిగితే అనేక అపోహలు అపార్థాలు జనించే అవకాశముంది. దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉంది :

> "అల్లాహ్ మీలో కొందరికి, కొందరిపై ఉపాధి కల్పనలో అధిక్యతను ప్రసాదించాడు. మేము ఒకరిపై ఒకరికి స్థాయి స్థితుల దృష్ట్యా ఉన్నతినిచ్చాము".

ఈ ఆయత్‌లలో కేవలం ఓ యదార్థాన్ని ఉటంకించటం జరిగింది. ఈ పరిస్థితి ఇస్లామీయ సమాజంలోనయినా ఇస్లామేతర సమాజంలోనయినా ఏర్పడటం సంభవమే. వీటిలో ప్రస్తావించిన విషయం కేవలం, మానవుల్లో ఉపాధి సంపాదన అంతస్థుల ప్రాప్తి రీత్యా వ్యత్యాసాలున్నాయి అన్న వాస్తవం మాత్రమే. రష్యా ఉదాహరణనే తీసుకోండి. అక్కడ అందరికీ ఒకే విధమయిన వేతనాలు ఇవ్వడం జరుగుతోందా? సైన్యంలో చేరే సైనికులందరికీ ఒకే విధమయిన హొదాలు, పదవులు ఇవ్వడం జరుగుతోందా ? ఈ అంతస్థుల తేడా అక్కడ కూడా ఉన్నట్లయితే దానికి కారణం ఏమిటి - మానవుల్లో సహజంగానే ఉన్న అనివార్యమయిన వ్యత్యాసాలు తప్ప ? పైన ప్రస్తావించిన ఆయత్‌లలో ఈ వ్యత్యాసాలకు ప్రత్యేకకారణం ఏదీ ఉన్నట్లు చెప్పడం జరగలేదు. వీటికి మూలం ధనమే అనీ, లేక కమ్యూనిజం వల్లనే ఇస్లాం వల్లనే ఇలా జరుగుతోందని కూడా చెప్పడం జరగలేదు. అదే విధంగా, ఈ హెచ్చుతగ్గులు ఇస్లామీయ దృక్పథం దృష్ట్యా న్యాయవంతమయినవా కావా అన్న విషయం కూడా ఇందులో చర్చించడం జరగలేదు. ఈ విషయాలజోలికి పోకుండా ఈ ఆయత్‌లలో ఇలాంటి వ్యత్యాసాలు ప్రపంచంలో ప్రతిచోటా ఉంటాయన్న వాస్తవాన్ని మాత్రమే ప్రస్తావించడం జరిగింది. ప్రపంచంలో జరిగేదంతా దైవానికి తెలిసిన విషయం. వేరుగా చెప్పనవసరం లేదు.

## ఇస్లాంలో వర్గవిభజన

ఇంతవరకు జరిగిన చర్చద్వారా, ఇస్లామీయ సమాజంలో వర్గవిభజన లేదని, చట్టపరమయిన వ్యత్యాసాలు ఇక్కడ కానరావని అర్థమయ్యేవుంటుంది. ధనం, సంపదల రీత్యా ప్రజల్లో ఉండే వ్యత్యాసాన్ని వర్గవ్యవస్థతో పోల్చడం భావ్యంకాదు. ఎందుకంటే ప్రాపంచిక వస్తుసామగ్రి, ఆస్తుల వ్యత్యాసం చట్టపరమయిన లేక వ్యక్తిగతమయిన ప్రాధాన్యతల రూపంలో వ్యక్తం కానంతవరకు దాని కారణంగా ఏ విధమయిన వర్గాలూ ఉనికిలోకి రాలేవు. చట్టం దృష్టిలో మానవులందరూ, కేవలం సైద్ధాంతికంగానే కాకుండా క్రియాత్మకంగానూ సమానమే అయినపక్షంలో ధనసంపదల వ్యత్యాసం ఏనాడూ వర్గ విభేదాల రూపు దాల్చజాలదు.

ఇక్కడ మరోవిషయం కూడా గుర్తుంచుకోవాలి. ఇస్లాం వ్యక్తులకు భూస్వామ్యపు హక్కును ఇచ్చిందంటే, దాని కారణంగా, భూస్వాములకు, ఇతరుల్ని బానిసలుగా చేసుకునే హక్కుగాని, లేక వారిని తమ స్వప్రయోజనాలకు వాడుకునే హక్కుగాని, మరేవిధమయిన రాయితీలు గాని లభించవు. నిజమయిన ఇస్లామీయ వ్యవస్థలో పెట్టుబడిదారీ వ్యవస్థకు స్థానముండి ఉంటే అప్పుడు కూడా ఇదే పరిస్థితి ఏర్పడేది. ఇస్లాంలో పాలకులకు పాలనాధికారాలు, పెట్టుబడిదారుల సమర్థన ఆధారంగా ప్రాప్తంకావు. అవి జాతి మొత్తం సమర్థించడంవల్ల, ఎన్నుకోవడం వల్లనే సంక్రమిస్తాయి. పైగా, దైవాదేశాలను పాటించడమే ఇస్లామీయ పాలకుని విధ్యుక్త ధర్మం.

వాస్తవమేమంటే, ధనసంపదలరీత్యా వ్యక్తులందరూ సమానులుగా ఉండే ఏ సమాజమూ ప్రపంచంలో లేదు. కమ్యూనిస్టు సమాజంలోనూ ఈ సమానతలు అగోచరం. కమ్యూనిజం, సకల వర్గాలను రూపుమాపినట్లు ఎన్ని ప్రగల్భాలు పలికినా నిజానికి అది సాధించింది, చిన్న చిన్న పెట్టుబడిదారుల్ని అంతమొందించి పాలకుల ఓ కొత్తవర్గాన్ని సృష్టించడం మాత్రమే. ఆ వర్గం ఇతర వర్గాలనన్నింటినీ రూపుమాపుతుంది.

# 7. దానధర్మాలు

కమ్యూనిస్టులు, సామ్రాజ్యవాదులు ఇస్లాంపై మరో నింద మోపుతారు. 'ఇస్లాం, సామాన్య ప్రజలకు ధనవంతులిచ్చే దానధర్మాల ఆధారంగా జీవించడం అలవరచుతుంది, తద్వారా వారు స్వయం కృషితో బ్రతికే ఆత్మ విశ్వాసాన్ని కోల్పోతారు' అనంటారు. ఈ ఆరోపణకు మూలం ఓ అపోహ. వారు జకాత్ విషయంలో అది, ధనవంతులు ఉపకారబుద్ధితో నిరుపేదలకు పంచి పెట్టే దానంగా అపార్థం చేసుకున్నారు. దాన్ని సరిగ్గా అర్థం చేసుకోడానికి దాన ధర్మాలకు జకాత్‌కుగల వ్యత్యాసం ఏమిటో ముందు బోధపడాలి. దాన ధర్మాలు స్వచ్ఛందంగా చేసే కార్యం. ఏ ప్రభుత్వమూ దానికై నిర్బంధించ జాలదు. దీనికి భిన్నంగా జకాత్ చట్టపరమయిన ఆదేశం. ఎవరయితే దాన్ని చెల్లించేందుకు నిరాకరిస్తారో వారి విషయంలో ఇస్లామీయ ప్రభుత్వం చట్టపరమయిన చర్య తీసుకుంటుంది, అవసరమయితే పోరాడుతుంది, కొన్ని సందర్భాల్లో మరణదండన కూడా విధిస్తుంది. ఎందుకంటే వారు జకాత్‌ను నిరాకరించి మతభ్రష్టతకు లోనవుతారు - ఇస్లామీయ శాసనానికి ద్రోహులుగా పరిగణించబడతారు. దానధర్మాల విషయంలో ఇస్లామీయ ప్రభుత్వం ఏ మాత్రం కఠిన వైఖరి అవలంబించ జాలదని వేరే చెప్పనక్కరలేదు. ఇది ఆయా వ్యక్తుల ధర్మబుద్ధికి, సదాచార దృష్టికి వదలి వేస్తుంది.

ఆర్థికంగా మాట్లాడితే జకాత్, ఒక జాతిపై నియమబద్ధంగా విధించబడిన తొలి పన్ను అని చెప్పవచ్చు. దానికి పూర్వం పన్నులు విధించడంలో ఎలాంటి నియమం పాటించడం జరిగేదికాదు. పాలకులు తమకు నచ్చినరీతిలో దాన్ని నిర్ణయించేవారు. దాన్ని వసూలు చెయ్యడం కూడా పాలకుల వ్యక్తిగత అభిరుచి, ఇష్టాయిష్టాలు, వివేచన, విచక్షణ, ఆవశ్యకతల ఆధారంగా జరిగేది. ఈ పన్నుల భారమంతా నిజానికి ధనవంతులపై కన్నా నిరుపేదలపై అధికంగా పడేది. ఇస్లాం, పన్నుల వసూలుకు నియమబద్ధంగా ఓ వ్యవస్థ నెలకొల్పింది. సాధారణ పరిస్థితులకు గాను గరిష్ఠ శాతాన్ని నిర్ణయించింది. ఈ పన్ను ధనవంతుల పైనా

మధ్యతరగతి వారిపైనా విధించి, నిరుపేదలకు మినహాయింపు నిచ్చింది.

## భిక్షకాదు బాధ్యత

ఇస్లాం ఆదేశాలకనుగుణంగా జకాత్ నిరుపేదల్లో పంపకం జరగాలి. ఆ పంచే బాధ్యత ఇస్లామీయ ప్రభుత్వంపై పడుతుందేకాని, ధనవంతులు స్వయంగా పంచడానికి వీల్లేదు. అంటే జకాత్ ప్రభుత్వం వసూలు చేసి ప్రభుత్వమే సామాన్యప్రజల్లో పంచే పన్ను అన్నమాట. ఇస్లామీయ వ్యవస్థలో 'రాజ్య ధనాగారం' నేటి ఆర్థిక మంత్రిత్వశాఖ లాంటిదే. అది ఒకవైపున ప్రజల నుండి పన్నుల మూలంగా ధనం వసూలు చేసి మరో వైపున ప్రజల సౌకర్యాలు, సౌలభ్యాలను సమకూర్చుతుంది. ఇంకా దాని ద్వారా తమ ఉపాధి సంపాదించుకోలేని వారిని లేక చాలినంత ఆదాయం లేనివారిని పోషిస్తుంది. నిజానికి ప్రభుత్వం ఈ వికలాంగుల్ని, అగత్యపరుల్ని ఆదుకోవడమనేది వారిపై ఏ మాత్రం ఉపకారంగా కాదు. ఇలాంటి ప్రభుత్వ సహాయాన్ని స్వీకరించడమనేది దాన్ని స్వీకరించే వారిపట్ల ఏదో ఓ రీతిలో ఏహ్యాభావాన్ని హీనభావాన్ని జనింప జేస్తుందనడానికి వీల్లేదు. ప్రభుత్వోద్యోగులు రిటైరయినప్పటికీ ప్రభుత్వం ద్వారా పెన్షన్ పొందడమయినా, లేక సోషియల్ వెల్‌ఫేర్ స్కీముల ద్వారా అర్హులయిన వారు ప్రయోజనం పొందడమయినా ధనవంతుల దాన ధర్మాలపై బ్రతకడమని ఎత్తిపొడవడం ఏ విధంగా భావ్యం కాదో అదే విధంగా అనాధలయిన వారు, ఉపాధి సంపాయించుకోలేని వికలాంగులు, వృద్ధులు ప్రభుత్వం నుండి భిక్ష పొందుతున్నారని అనడం సబబు కాదు. ప్రభుత్వం వారి అశక్తత కారణంగా వారికి ధన సహాయం చేస్తే అది వారిపట్ల అవమానం, అగౌరవం, పరాభవం కాదు. నిజానికి వారికి సహాయ సహకారాలు అందజెయ్యడం ప్రభుత్వ బాధ్యతల్లో భాగమే.

నేడు రివాజు పొందిన సమాజ సంక్షేమ వ్యవస్థ రూప కల్పన మానవాళి శతాబ్దాల తరబడి గడించిన చేదు అనుభవాల, సామాజిక అన్యాయాల సుదీర్ఘ చరిత్రతో ముడిపడి ఉంది. ఇస్లాం ఔన్నత్యానికి, గొప్పదనానికీ తార్కాణమేమంటే, యూరపు కూడా సామాజికంగా చీకటి గుహల్లో అగమ్య గోచరంగా తచ్చాడుతున్న కాలంలో, అది సామాజిక

సంక్షేమ వ్యవస్థను నెలకొల్పింది. కాని పాశ్చాత్యుల నుండి అరువు తెచ్చుకున్న వ్యవస్థల ప్రశంసల్లో భూమ్యాకాశాల మధ్య వంతెనలు కట్టే వారి భావ దాస్యం ఏ స్థాయికి చేరుకుందంటే, వారికి ఇష్టమయిన వ్యవస్థ అయినా సరే అది ఇస్లాంలో కానవస్తే మూఢత్వమని, తిరోగమన వైఖరినుండి జనించిందని చెప్పడానికి వెనుకాడరు !

## జకాత్ – ఇస్లామీయ వ్యవస్థలో

ఇస్లాం, ప్రారంభకాలంలో, ఆనాటి ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా అగత్యపరులు స్వయంగా వెళ్ళి నగదుగాగాని వస్తురూపేణగాని జకాత్‌ను వసూలు చెయ్యడాన్ని అనుమతించింది. కాని జకాత్ వసూలు చేసే ఈ పద్ధతినే ఇస్లాం గుర్తించిందనడంలో అర్థంలేదు. జకాత్ ధనం ద్వారా ప్రజోపయోగ కార్యాలెన్నో చేపట్టడాన్ని ఇస్లాం కాదనలేదు. లేక ఈ రొఖ్ఖంతో సహకార సంస్థల్ని, కార్ఖానాలను ప్రారంభించడాన్ని కూడదనలేదు. అంటే జకాత్ ధనం ప్రజాశ్రేయంగల పనులన్నింటిలోనూ వినియోగించవచ్చు. జకాత్‌నుండి నగదు రూపేణ ఇచ్చే సహాయం, వ్యాధిగ్రస్తులకు, వృద్ధులకు, బాలలకు వర్తిస్తుంది. ఇతర ప్రజలందరికీ, ఉపాధి కల్పనకయినా, వారి శ్రేయానికై ఇతర ప్రణాళికలకయినా ఈ ధనాన్ని వెచ్చించవచ్చు. ఇస్లామీయ సమాజంలో కేవలం జకాత్ ఆధారంగా బ్రతుకు వెళ్ళదీసే ఏ వర్గానికీ తావులేదు.

హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (హి.శ.105-144 & క్రీ.శ. 682-720) కాలం కూడా ఇస్లామీయ సమాజానికి ఆదర్శ ప్రాయమయినదిగా పేర్కొనవచ్చు. ఆ కాలంలో పరిస్థితి ఎలా ఉండేదంటే ప్రజలు సంపన్నులయి పోగా – వసూలుచేసిన జకాత్‌ను పంచడానికి అర్హులయిన వారి కోసం వెదకవలసి వచ్చేది. ఆ కాలంలో జకాత్ వసూలు చేసే అధికారి ఒకాయన యహ్యాబిన్ సయీద్ ఇలా అంటున్నారు, "ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ నన్ను జకాత్ వసూళ్ళ కొరకు నియమించి ఆఫ్రికాకు పంపారు. నేను జకాత్ ప్రోగు చేసి అర్హులయిన వారి కొరకు వెదికాను. నాకు దాన్ని తీసుకునే నిరుపేదగాని, అర్హుడుగాని ఎవరూ

కానరాలేదు. ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ ప్రజల్ని అంతగా సుసంపన్నులు చేశారు!"

ఏ సమాజంలో నయినా బీదవారు, అగత్యపరులూ ఉండనే ఉంటారు. అందువల్ల వారి సమస్యల్ని పరిష్కరించడానికి చట్టంలో అవసరమయిన వీలు కల్పించడం కూడా అవసరమే. ఇస్లాంను ఆశ్రయించిన అనేక జాతులు భౌతిక ప్రగతి రీత్యా విభిన్న దశల్లో ఉండేవి. అందువల్ల అది నిర్మించే నియమాలు క్రమంగా ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ కాలంనాటి ఆదర్శ ప్రాయమయిన పరిస్థితులకు సమాజాన్ని తీసుకు వెళ్ళేందుకు అనువుగా ఉండాలన్నది సబబే. ఇదీ జకాత్‌లోని పరమార్థం.

## దాన ధర్మాలు

ఇక దానధర్మాల విషయానికి వస్తే ధనవంతులు, శ్రీమంతులు సంతోషంగా స్వచ్ఛందంగా తమ ఆప్తులకు సహాయ సహకారాలు అందజెయ్యడం ద్వారా, ఇతర సామాన్య అగత్యపరులను ఆదుకోవడం ద్వారా ఇది నెరవేరుతుంది. ఇంతేకాదు, చిన్నచిన్న ఉపకారాలు, ప్రేమప్రదమయిన మాటలు కూడ దానధర్మాల రూపు ధరిస్తాయి ఒక్కోసారి!

మనం మన ఆప్తబంధువుల పట్ల ఆత్మీయుల పట్ల సానుభూతితో ఉదారంగా వ్యవహరిస్తే, వారికి సహాయాన్నందజేస్తే వారి భావోద్రేకాలయినా, ఆత్మగౌరవమయినా గాయపడవు. ఆత్మీయుల పట్ల ప్రేమ, అనురాగం, వాత్సల్యాల కారణంగానే కదా మనిషి ఇలా విశాల హృదయంతో వ్యవహరిస్తాడు ! అలాగే ఎవరయినా తన ఆప్తమిత్రునికో సోదరునికో కానుక నిస్తే లేదా విందుకు ఆహ్వానిస్తే అది వారిపట్ల అగౌరవమూ కాదు అవమానమూ కాదు.

అగత్యపరులకు వస్తురూపేణ, ధాన్యరూపేణ ఇచ్చే కానుకల విషయంలోనూ ఇస్లాం ప్రారంభకాలంలో జకాత్‌కై నిర్ణయించిన విధానమే అమల్లో ఉండింది. ఆనాటి పరిస్థితుల్లో దినుసు రూపంలో కానుక ఇవ్వడాన్ని అగత్యపరుల అవసరాలు తీర్చే ఓ మార్గంగా భావించడం జరిగింది. దానం అంటే ఆ రూపంలోనే ఇవ్వాలన్న నియమం ఏదీలేదు.

సాంఘిక సేవా సంస్థలు,సంఘాలు కూడా ఈ దానాలు వసూలు చేసి సమాజ సేవలో వాటిని వినియోగించవచ్చు. అలాగే జకాత్‌ను ఇస్లామీయ ప్రభుత్వం, విభిన్న సామాజిక ప్రణాళికల పరిపూర్తి కొరకు వినియోగించవచ్చు. ఇస్లాం దృక్పథం ఏమిటంటే సమాజంలో పేదరికం ఉన్నంత కాలం, ప్రభుత్వం సాధ్యమయిన ప్రతి మార్గాన్ని వినియోగించి ప్రజల ప్రాథమిక అవసరాలు తీర్చేందుకు అధికంగా కృషిచెయ్యాలి. పేదలు, అగత్యపరుల వర్గం సమాజంలో కానవస్తూ ఉండాలన్నది ఇస్లాం అభిమతం ఏ మాత్రం కాదు. దానికి బదులుగా అది సమాజంలో నిరుపేదలు, అగత్యపరులూ అంటూ ఎవరూ ఉండరాదని కోరుకుంటుంది. ఇలాంటి ఆదర్శవంతమయిన పరిస్థితి ఏర్పడితే జకాత్ మరియు ఇతర దాన ధర్మాల ద్వారా ప్రాప్తమయిన నిధుల్ని ఇతర సమాజ సంక్షేమ కార్యక్రమాలకై వినియోగించడం జరుగుతుంది. సమాజంలో ఏ కారణం చేతనయినా తమ బ్రతుకు తెరువును సంపాయించుకోలేని వారి అవసరాలను తీర్చడానికీ దాన్ని వినియోగించడం జరుగుతుంది. ఇస్లామీయ ప్రభుత్వం అగత్యపరులకు ఈ సహాయం అందచేసి వారిపై చేసిన ఉపకారం ఏదీలేదు. నిజానికి వారికి గౌరవప్రదమయిన ఉపాధిని కల్పించడం ఇస్లామీయ ప్రభుత్వపు బాధ్యతల్లో ఒకటి.

## గౌరవప్రదమయిన సంపాదన

పని చెయ్యగలిగే ప్రతివ్యక్తికీ ఉపాధిని కల్పించడం ఇస్లామీయ రాజ్యపు బాధ్యతగా నిర్ణయమయింది. ఇస్లామీయ రాజ్యం యొక్క ఈ బాధ్యత ఈ హదీసు ద్వారా తేటతెల్లమవుతుంది: "ఒక వ్యక్తి ప్రవక్త మహనీయుల (సఅసం) వద్దకు వచ్చి తన వెసలుబాటుకై ఏదయినా సహాయం చెయ్యమని అర్థించాడు. మహాప్రవక్త అతనికి ఓ గొడ్డలి, త్రాడూ ఇచ్చి అడవికి వెళ్ళి కట్టెలు కొట్టుకు రమ్మని, వాటిని అమ్ముకుని ఉపాధిని సంపాయించుకొమ్మనీ ఆదేశించారు. ఇంకా అతను కొన్నాళ్ళ తరువాత తన పరిస్థితిని వివరించాలని కూడా ఆయన అతన్ని ఆజ్ఞాపించారు."

ఎవరయినా దీన్ని ఆనాటి ఒక వ్యక్తిగత విషయమని, నేడు మనం పెద్ద పెద్ద కర్మాగారాలను, లక్షలాది నిరుద్యోగుల్ని, పటిష్ఠమయిన ప్రభుత్వాలను, అనేక ప్రభుత్వ శాఖల్ని పరిగణనలోకి తీసుకోవలసి వస్తోందని ఆలోచించవచ్చు. ఈ హదీసులో దైవ సందేశహరులు జీవన సమస్యలకు ప్రాతిపదికగాగల సూత్రాలను నిర్దిష్టపరిచారు. ఆచరణాత్మక సమస్యల్లో దాన్ని అన్వయింప జేసుకునే విషయాన్ని ఆయన భావితరాలకు వదలి వేశారు. ఆయా కాలాల్లో ఈ మౌలిక సూత్రాలను అనుసరించి సమస్యలకు అనువయిన పరిష్కారాలను కనుగొనే స్వేచ్ఛను కల్పించారు.

పైన పేర్కొన్న హదీసుద్వారా ఇస్లామీయ రాజ్యం యొక్క దిగువ పేర్కొన్న మౌలిక విధులు వ్యక్తమవుతున్నాయి:

(1). పరిపాలనాధికారి (దైవప్రవక్త)లో నిరుద్యోగికి ఉపాధిని కల్పించే బాధ్యత తనదే అన్న భావం స్పష్టంగా గోచరిస్తుంది.
(2). ఆయన పరిస్థితుల కనుగుణంగా ఆ వ్యక్తికి ఉపాధి మార్గం చూపారు.
(3) ఆ వ్యక్తి తిరిగి వచ్చి తనకు పరిస్థితుల్ని వివరించాలని ఆయన కోరడం కూడా ఆ బాధ్యతా భావనను మరింత గట్టిగా ప్రతిబింబింప జేస్తుంది.

ప్రభుత్వాధికారంలో ఉన్న వారికి ఉండవలసిన బాధ్యతా భావాన్ని 13 వందల ఏళ్ళ క్రితం ఇస్లాం ప్రతిపాదించగా ఆధునిక ఆర్థిక, రాజకీయ సిద్ధాంతాలు నేటికిగాని కనుగొనలేక పొయ్యాయి. ఇస్లామీయ వ్యవస్థలో ఒకవేళ ప్రభుత్వం నిరుద్యోగుల ఉపాధి కల్పనలో విఫలమయితే, వారి ఆర్థిక పరిస్థితులు మెరుగు పడేవరకు ప్రభుత్వ ధనాగారం వారిని పోషించవలసి ఉంటుంది. ముస్లిములు స్వతహాగా తమ విషయంలోనయినా, రాజ్య విషయంలో నయినా, ఇతర పౌరుల విషయంలోనయినా ఎంతో విశాల హృదయంతో వ్యవహరిస్తారు. గనుక ఇలా చెయ్యడంలో తప్పుగాని, ఆశ్చర్యంగాని ఏముందని ?

# 8. స్త్రీ స్థానం

ప్రాచ్యదేశాల్లో నేడు స్త్రీల హక్కులు, స్త్రీలకు పురుషులతో పాటు సంపూర్ణ సమానత్వంలాంటి విషయాలపై ముమ్మరంగా చర్చలు జరుగుతున్నాయి. ఈ చర్చల్లో స్త్రీల హక్కులకై ఎంతో చురుగ్గా పోరాడే వారిలో ఇస్లాం పేరిట వివేక శూన్యమయిన మాటలు పలికే, వ్రాసే వారు ప్రముఖంగా ఉన్నారు. వీరిలో కొందరు కేవలం ఇష్టపూర్వకంగా ఇస్లాం స్త్రీ పురుషుల మధ్య సకల విధాలా పూర్ణ సమానత్వాన్ని నెలకొలిపిందని అంటారు. ఇంకా కొందరు కేవలం తమ అజ్ఞానం మూలంగా లేక అవగాహనా లోపం వల్ల, ఇస్లాం స్త్రీ పాలిట శత్రువని, అది స్త్రీని అధమ జాతిగా పరిగణిస్తుందని, బుద్ధిపరంగా స్త్రీని హీనమయినదిగా భావించి సమాజంలో ఆమెకు నీచమయిన స్థానంలో పశువుకన్నా హీనంగా చూస్తుందని ఆరోపిస్తారు. ఆ తరువాత స్త్రీ, పురుషుని పాశ్విక వాంఛల్ని తీర్చే సాధనంగా పిల్లల్ని పుట్టించే యంత్రంగా తయారవుతుందని కూడా వారంటారు. పర్యవసానంగా, ఇస్లాం ప్రకారం స్త్రీ పురుషుని కన్నా హీనమయినదిగా పురుషుడు స్త్రీ పై అధికారం చెలాయించి, జీవితపు ప్రతి రంగంలోనూ ఆమెపై తన ఆధిక్యతను పెద్దరికాన్నీ చెలాయించే వాడుగా తయారయ్యాడని వాదిస్తారు.

నిజానికి ఈ ఉభయవర్గాలూ ఇస్లాం అవగాహన విషయంలో సమానంగానే అవజ్ఞతకు లోనయి ఉన్నారు. లేదా వీరు ఇష్టపూర్వకంగా ఇతరుల్ని పెడ త్రోవ పట్టించేందుకు సత్యాసత్యాలను సమ్మిశ్రమం చేసి మాట్లాడుతున్నారని అనవలసి వస్తుంది. తద్వారా వీరు సమాజంలో అలజడి రేపి తమ నీచమయిన ఆశయాలు నెరవేరేందుకు మార్గం సుగమం చేసుకోవాలని వారు కోరుకుంటున్నారు.

## పూర్వరంగం

ఇస్లాంలో స్త్రీ స్థానాన్ని వివరంగా చర్చించేముందు యూరపులో వెలిసిన స్త్రీ విమోచనోద్యమం (EMANCIPATION MOVEMENT) యొక్క చారిత్రక పరిశీలన చెయ్యడం అవసరం. ఎందుకంటే ఆధునిక ప్రాచ్య దేశాల్లో ఉత్పన్నమవుతున్న సకల అప్రాచ్యపు భావాలకు మూల సరోవరం ఈ ఉద్యమమే. ప్రాచీన కాలంలో ఒక్క యూరపులోనే కాదు ప్రపంచమంతటా ఎక్కడా స్త్రీకు గౌరవస్థానం లభించలేదు. పూర్వపు 'పండితులు' 'తత్వ వేత్తలు' తమ చింతనా వాహినిని ఈ విధమయిన విషయాల్లో చాలా కాలంవరకు మహాజోరుగా పరుగెత్తించారు: 'స్త్రీలో సయితం ఆత్మ అంటూ ఉంటుందా ? ఆత్మ ఉంటే అది మానవ ఆత్మనా లేక పశువాత్మనా? ఒక వేళ అది మానవ ఆత్మే అయితే పురుషుని సమక్షంలో స్త్రీ సామాజిక స్థానం ఏది? స్త్రీ పురుషునికి ఆజన్మ బానిస కాదా ? లేక ఆమెకు బానిస కంటే ఒక మెట్టు ఉన్నత స్థానం ఉందా'?

చరిత్రలో అప్పుడప్పుడు కొంత మెరుగ్గా కానవచ్చే బహుస్వల్ప కాల వ్యవధుల్లోనూ ఈ పరిస్థితి అలాగే కానవస్తుంది. ఈ వ్యవధుల్లో చూడటానికయితే స్త్రీలకు సమాజంలో కేంద్ర స్థానముండేది - ప్రాచీన గ్రీకు, రోమన్ సామ్రాజ్యాల్లో మాదిరిగా. కాని స్త్రీకు లభించిన ఈ స్థానం, గౌరవ ప్రతిపత్తులు ఆమె స్త్రీత్వానికి లభించినవి ఎంత మాత్రం కావు,లేక అది మొత్తం స్త్రీ జన గౌరవానికి సమానమని కూడా చెప్పలేము. నిజానికి ఈ గౌరవ మర్యాదలు మహా నగరాల్లో నివసించే కొందరు ప్రత్యేక స్త్రీ మూర్తుల వరకే పరిమితం. వీరు తమ వ్యక్తిగత ప్రత్యేకతలవల్ల సామాజిక ఉత్సవాలకు ఊపిరిగా మెలిగేవారు. వారి స్థితి, భ్రష్టులయిన విలాస పురుషులవర్గంలో కేవలం కాలక్షేపానికి పనికివచ్చే పనిముట్టు లాంటిదే తప్ప మరేమీకాదు. అందువల్ల ఆ వర్గం ఆ స్త్రీలను నిండు హృదయంతో ప్రోత్సహించేది. కాని అది స్త్రీని మనిషిగా చూపిన గౌరవాదరణలు మాత్రం కావు. పురుషుని భోగ విలాసాల్లో స్త్రీ ఏ మేరకు తోడవుతుందో దాని

ఆధారంగానే ఆ ఆదరణ, స్థానమూ ప్రాప్తమయ్యేవి.

## మనిషి కాదు, మెషీను

యూరపులో స్త్రీకు లభించిన ఈ 'స్థానం' కట్టు బానిసత్వం (SERFDOM) కాలంలోను, భూస్వామ్య యుగంలోను మారలేదు. తన హ్రస్వ దృష్టి కారణంగా స్త్రీ, జీవితపు జిగేల్ మనిపించే పై మెరుగులకే భ్రమకు లోనయి వంచితురాలయ్యింది. తిని, త్రాగి, సంతానోత్పత్తి చేసి రేయింబవళ్ళు పశువులా చాకిరి చెయ్యడమే తన జీవన పరమార్థంగా భావించింది. ఆ తరువాత యూరపులో వచ్చిన పారిశ్రామిక విప్లవం స్త్రీల పాలిటి విపత్తుగా, అంతులేని ఆపదల సందేశంగా పరిణమించింది. ఈ సారి ఆమెపై విరుచుకు పడ్డ కష్టాలూ బాధలు గత కాలంలోని వ్యధా భరిత గాధలన్నింటినీ వెనక్కి నెట్టేసి కొత్త రికార్డులు స్థాపించాయి !

ఇంతవరకు యూరపు నైజం మొత్తం మీద ఎలా ఉందంటే అందులో ఏదో వక్రత, కాఠిన్యం మిశ్రమమయి గోచరిస్తాయి. ఆ కారణంగా అది దయార్ద్రతకు, ఉదారతకు, సానుభూతి అనురాగాలకు, బహుదూరంగా ఉన్నట్లు కానవస్తుంది. ప్రతిచోటా మానవుల్ని అది తీవ్రమయిన కష్టాలకు బాధలకే గురిచేసింది. ప్రతిఫలంగా తాత్కాలికమయినదో, దీర్ఘకాలిక మయినదో ఎలాంటి ప్రయోజనాన్నీ ప్రసాదించలేకపోయింది. కట్టు బానిసత్వం, భూస్వామ్య యుగాల్లో ఉన్న పరిస్థితుల దృష్ట్యా అప్పట్లో చెలామణిలో ఉన్న వ్యావసాయిక వ్యవస్థలో పురుషుడే స్త్రీ ఖర్చులు భరించేవాడు. అది ఆనాటి పరిస్థితులకు సరిగ్గా ఇమిడి పోయింది. కాని ఆనాడు కూడా స్త్రీ కొన్ని గృహ పరిశ్రమల్లో పాల్గొనేది. ఆ పనులు వ్యావసాయిక సమాజమున్న చోటల్లా సాధారణతః ఉండేవే. ఈ గృహ పరిశ్రమల ద్వారా స్త్రీ, తనకై పురుషుడు ఖర్చుపెట్టే ధనానికి మరో రూపంలో ప్రతిమూల్యం చెల్లించేదన్నమాట.

## అరుదయిన ఆత్మీయత

కాని పారిశ్రామిక విప్లవం సాక్షాత్కరించగానే పల్లెల్లోనూ, పట్టణాల్లోనూ పరిస్థితులు పూర్తిగా తలక్రిందులయ్యాయి. కుటుంబ జీవితం నాశనమయిపోయింది. కుటుంబ సభ్యుల్ని పరస్పరం దగ్గర చేర్చే బంధమే తెగిపోయింది. ఎందుకంటే పారిశ్రామిక విప్లవం తెచ్చిన మార్పు కారణంగా పురుషులు, స్త్రీలు, పిల్లలు కూడా ఇళ్ళు వదలి ఫ్యాక్టరీల దారి పట్టారు - ఉద్యోగం చేసి ఉదర పోషణ చేసుకునేందుకు కూలీ జనం క్రమంగా పల్లెలకు వీడ్కోలు చెప్పి పట్టణాలకు చేరసాగింది. పల్లె జీవితంలో ఉమ్మడి బాధ్యతాభావం, సహాయ సహకారాల వాతావరణం నలువైపులా కానవచ్చేది. కాని ఇప్పుడు ఎదురయిన నగర జీవితంలో ఎవరికి వారే 'కోన్ కిస్కా' వాతావరణం నెలకొన్నది. చివరికి పొరుగు వారెవరో కూడా తెలియని నిరాసక్తత ఆవరించి అంతా స్వార్థమయిపోయింది. ప్రతివ్యక్తి జీవితానికి అతని వ్యక్తిత్వమే కేంద్రమయింది. తాను తప్ప ఇతరుల పట్ల అతనికి ఆసక్తి లేకపోయింది, ఇతరుల భారం మోసేందుకు అతను ఏ మాత్రం సిద్ధంగానూ లేకపొయ్యాడు. పట్టణాల్లో నైతిక నియమాలే కరువయ్యాయి. నైతిక విషయాలను పాటించాలన్న ధ్యాసకూడా అందరిలో సన్నగిల్లింది. ఫలితంగా లైంగిక విశృంఖలత్వం జాడ్యంలా వ్యాపించింది. స్త్రీ పురుషులు తమ లైంగిక వాంఛల పరిపూర్తికై లభించే ప్రతి అవకాశాన్నీ నిర్లజ్జగా 'సద్వినియోగం' చేసుకునేవారు. నైతిక నిబంధనలన్నీ నోళ్ళు వెళ్ళదీసి చూస్తూ ఉండేవి. ఈ పరిస్థితుల మరో పర్యవసానం ఏమిటంటే జనుల్లో, పెళ్ళి పెటాకుల బాదరబందీ నుండి విముక్తి పొందే వాంఛ ప్రబలింది. ఎవరయినా పెళ్ళి బంధంలో ఇరుక్కోవాలని కోరుకున్నా ఈ బాధను ఎన్నేళ్ళు వాయిదా వెయ్యగలిగితే అంతమంచిదిగా తలపోయసాగారు. *

---

* ఇలాంటి పరిస్థితుల ఆధారంగా భౌతికవాదులూ మార్క్సిస్టులూ ఆర్థిక పరిస్థితులే సామాజిక పరిస్థితుల్ని ఉత్పన్నం చేస్తాయని, మానవ సంబంధాలను నిర్ణయిస్తాయని అంటారు. జీవితంలో ఆర్థిక పరిస్థితులకు ఉన్న ప్రాముఖ్యాన్ని మేము కాదనము.

## నిరంతర వంచన

ఈ పంక్తుల్లో యూరపు చరిత్రను వివరంగా సమీక్షించడం మా ధ్యేయం కాదు. మేము కేవలం, యూరపులో స్త్రీ భవితవ్య నిర్మాణంలో పాలుపంచుకున్న అంశాలను మాత్రమే స్పర్శించదలిచాము. మేము ఇంతకు ముందే పేర్కొన్నట్లు పారిశ్రామిక విప్లవం కారణంగా పిల్లలపై మహిళలపై వచ్చిపడిన ఆర్థిక బాధ్యతలవల్ల కుటుంబ సంబంధాలు బలహీన పడ్డాయి. కుటుంబ జీవితం పూర్తిగా విచ్ఛిన్నమయి పోయింది. ఈ విప్లవంలో అధికంగా అన్యాయానికి గురయినది స్త్రీ జాతి. ఇప్పుడు అది మునుపటికన్నా అధికంగా కష్టపడవలసి వచ్చింది. ఆమెకు గల కొద్దిపాటి గౌరవ ప్రతిపత్తులు కూడా మాయమయ్యాయి. ఇంత జరిగీ ఆమె మానసికంగానూ తృప్తి జెందలేదు, ఆర్థికంగానూ సుఖం పొందలేదు. పురుషుడు స్త్రీని – ఆమె అతని తల్లి అయినా భార్య అయినా – ఆర్థికంగా ఆదుకునేందుకు నిరాకరించాడు. పైగా తన ఉపాధిని సంపాయించుకునే బాధ్యత ఆమె తలపైనే మోపాడు. అటు ఫ్యాక్టరీ యజమానుల అన్యాయాలకు కూడా గురవుతూ ఉండింది స్త్రీ. అధికంగా కష్టపడినా పురుషుని కన్నా తక్కువ వేతనమే పొందగలిగేది.

## బాలలకన్నా హీనం స్త్రీల గతి

యూరపు నైజంలోని పిసినారితనం, హృదయ కాఠిన్యం, కృతఘ్నతా

---

కాని మానవ ఆలోచనలు, అనుభూతులు, భావోద్రేకాలు, వైఖరులు – అన్నీ కేవలం ఆర్థిక అంశాల ద్వారానే నిర్ణయమవుతాయనడం ఎంతమాత్రం నిజంకాదు. యూరపులో ఆర్థికతకు ప్రాధాన్యం కానవస్తోందంటే అక్కడ మరో ఉన్నత ఆశయమంటూ ఏదీ లేదు. ఇస్లామీయ జగత్తులో మాదిరిగా యూరపు ప్రజలకు ఆధ్యాత్మికతా మహాత్తును పరిచయంచేసి అక్కడి ఆర్థిక సంబంధాలను స్వచ్ఛమయిన మానవీయ ప్రాతిపదికలపై నిర్మించగల ఏ అంశమూ అక్కడ కానరాదు. ఇలా జరిగి ఉంటే కేవలం యూరపు సమస్యలు తీరిపోవడమేకాక మిగతా ప్రపంచ మానవాళి కూడా అది జరిపిన దోపిడి (EXPLOITATION) కి, దాని మితిమీరిన భౌతికతా దాహానికి గురి కాకుండా ఉండేది.

భావాలను దృష్టిలో ఉంచుకుని చూస్తే స్త్రీ పట్ల అది అవలంబించిన ఈ వైఖరికి హేతువు ఏమిటో కనిపెట్టడం అంత కష్టం కాదు. యూరపు ఎన్నడూ మానవుణ్ణి మానవునిగా గౌరవించలేదు. అది ఎన్నడూ ఇతరుల మంచికై ప్రయత్నం చెయ్యలేదు. దాని గత చరిత్ర పలికే మూగ సాక్ష్యం ఏమంటే అది సదా ఇతరులకు నష్టం కలగజెయ్యడంలోనే శ్రద్ధ వహించింది – అయితే అందువల్ల తనకు నష్టం వాటిల్లకుండా మాత్రం జాగ్రత్తపడుతూ వచ్చింది. యూరపు నైజంలో భావాల్లోనూ ఏదయినా మార్పు కలుగుతుందన్న అవకాశమూ కనిపించడం లేదు. కాని దైవం దానిపై దయదలచి దాన్ని సన్మార్గం అవలంబించే బుద్ధిని ప్రసాదిస్తే దానికి ఆధ్యాత్మిక పవిత్రతను అనుగ్రహిస్తే తద్వారా అక్కడ మంచి అన్నది పెరిగే ఆశ చిగురిస్తుంది. ఇంతకు మన ప్రస్తావనలో ఉన్నకాలంలో పారిశ్రామికులు బాలలపై మహిళలపై జరిపిన జులుం ఇంతా అంతా కాదు, అంతులేని ఆగడాలకు వారిని గురిచేశారు.

ఈ బలహీన ప్రజలపై జరిగే అన్యాయం దౌర్జన్యాలను సమాజంలోని కొందరు – అంతరాత్మ సజీవంగా ఉన్నవారు – సహించలేక పొయ్యారు. వారు బాలలపై (అవును బాలలపైనే, మహిళలపైకాదు) జరిగే ఈ అన్యాయాన్ని నిరసించారు. వారు చిన్న పిల్లలచేత ఫ్యాక్టరీల్లో పని చేయించడాన్ని వ్యతిరేకించారు. ఎందువల్లనంటే ఈ పనులవల్ల పిల్లల సహజమయిన పెరుగుదల నిలిచిపోతుంది. ఇంకా వారికి లభించే స్వల్పమయిన వేతనం పసిపిల్లలుపడే అనుచితమయిన కష్టం దృష్ట్యా ఏ విధంగానూ సమంజసమయింది కాదు. ఈ నిరసన ఫలప్రదమయింది. పర్యవసానంగా ఉద్యోగ వయోపరిమితి క్రమంగా పెంచారు. వేతనమూ పెరిగింది. పనివేళల్లోనూ తగ్గుదల జరిగింది. అయితే అప్పటికీ స్త్రీ బాధితగానే ఉండి పోయింది. ఆమె హక్కులకై నిలబడ్డవాడే లేడు. ఆమె హక్కుల పరిరక్షణకై యోచించేవాడు కూడా కరువయ్యాడు. దానిగ్గాను కావలసిన చిత్తశుద్ధి, నైతిక ఉన్నతి యూరపు వద్ద ఏ కోశానా లేవు. అందువల్ల ఆ దశలోనూ స్త్రీ జాతి కష్టాలు కడతేరే రోజులు ఆసన్నమవలేదు. రేయింబవళ్ళు కష్టపడితేగాని ఆమె కడుపు నిండేదికాదు. ఆమెకు

లభించే వేతనం ఆ పని చేసే పురుషుల వేతనం కన్నా ఎంతో తక్కువగా ఉండేది.

## గోరుచుట్టుపై ......

తొలి ప్రపంచ సంగ్రామంలో యూరపు, అమెరికాలకు చెందిన లక్షలాది పురుషులు హతమయ్యారు. వారు అసంఖ్యాకమయిన విధవల్ని వదలి వెళ్ళారు. ఈ విధవలు కష్టభూయిష్టమయిన పరిస్థితుల్ని ఎదుర్కోవలసి వచ్చింది. వారి జీవితాలకు ఆధారమయినవారు కొందరు హతమయ్యారు, కొందరు శాశ్వతంగా వికలాంగులయ్యారు, కొందరు భయ భ్రాంతులకు లోనయి, మానసిక ఉద్రిక్తతల కారణంగా, లేక విషవాయువుల ప్రభావం చేత ఎన్నడూ తేరుకోలేని విధంగా మూలన పడ్డారు. ఇంకా కొందరైతే సంవత్సరాల తరబడి ఖైదీలుగా గడిపి అప్పుడప్పుడే విడుదలయి వచ్చారు. వారు తాము కోల్పోయిన మానసిక సమతూకాన్ని పునరుద్ధరించుకునేందుకు ప్రాపంచిక విలాస విహారాల్లో తేలియాడాలని కోరుకోసాగారు. ఇలాంటి వారిలో పెళ్ళి చేసుకోవాలన్న కోరికే ఉత్పన్నమయ్యేది కాదు. పెళ్ళి చేసుకుని శారీరకంగా, ప్రాపంచికంగా గొడవలకు లోనవడానికి వారు సుతరామూ సిద్ధంగా లేరు.

యుద్ధం కారణంగా పురుషుల సంఖ్య అమాంతం తగ్గిపోయినందు వల్ల ఏర్పడిన వెలితిని పూడ్చడం బ్రతికి ఉన్న వాళ్ళ శక్తికి మించిన పనే. కార్మికులు తగ్గిపోవడంచేత కార్ఖానాలు బాగా దెబ్బతిన్నాయి. యుద్ధంలో జరిగిన నష్టాలను పూరించడం కూడా కష్టసాధ్యమయిపోయింది. ఇక స్త్రీలు గత్యంతరం లేక ఇంటి బయటికి వచ్చి పురుషుల స్థానాన్ని ఆక్రమించుకోవలసి వచ్చింది. వారలా చెయ్యకపోతే వారితో పాటున్న వృద్ధ స్త్రీలు, చిన్న పిల్లలు ఆకలితో అలమటించి చచ్చిపొయ్యేవారు. కాని కర్మాగారాల్లో పనిచెయ్యడం మూలంగా స్త్రీ తన స్త్రీత్వాన్ని, స్వరూప స్వభావాలను, శీలాన్నీ త్యాగం చెయ్యవలసి వచ్చింది. ఆమె

సహజగుణాలయిన ఇవన్నీ ఇప్పుడు ఆమె 'ప్రగతి'కి అవరోధాలుగా రూపుదాల్చాయి. వీటిని కాపాడుకుంటూ ఆమె స్వేచ్ఛగా పొట్టపోసుకోవడం కష్టమయిపోయింది. మరోవైపు కార్ఖానాల యజమానుల్ని చూస్తే వారికి కేవలం తమ పనులు వెళ్ళదీసుకోవటమే కాదు తమ తుచ్ఛమయిన కోరికల సంతృప్తికి సాధనాలు కూడా కావలసి వచ్చింది. ఇప్పుడు స్త్రీ లోనయి ఉన్న నిస్సహాయ స్థితిలో వారికి తమ పాశ్వక వాంఛల పరిపూర్తికి స్వర్ణావకాశం గోచరించింది. దాన్ని వారు బాగా వినియోగించుకున్నారు. ఈ విధంగా పాపం అభ్యుదయ మహిళ ఇప్పుడు ద్వివిధ విధుల్ని నిర్వర్తించ వలసి వచ్చింది: ఫ్యాక్టరీల్లో పనిచెయ్యడం, యజమానుల మనసుల రంజింప జెయ్యడం ! మరోవైపున స్త్రీకి కేవలం ఆకలి ఒక్కటే కాదు లైంగిక తృష్ణ కూడా గడ్డు సమస్యగా పరిణమించింది. యుద్ధంలో పురుషులు అధిక సంఖ్యలో అంతమవడం చేత ప్రతి స్త్రీ పెళ్ళి చేసుకుని ధర్మ బద్ధంగా లైంగిక తృప్తిని పొందే మార్గం కూడా లేకుండా పోయింది. దానికి తోడుగా యూరపులో ఉన్న ఆనాటి మతంలో బహుభార్యాత్వానికీ చోటులేదు. ఫలితంగా, పాపం యూరపు స్త్రీ తన కరుణలేని కోరికలకు, అదుపులేని భావోద్రేకాలకు లొంగి, వాటి దయాదాక్షిణ్యాలపై బ్రతక వలసి వచ్చింది. ఒకవైపు ఉపాధి సముపార్జన భారం, మరో వైపు లైంగిక అసంతృప్తి ఇంకోవైపు వీటికొరకు విలువయిన వేషధారణ, అలంకరణలు, మేకప్పులు వగైరా – వీటన్నింటికీ బానిసయి ఆమె ఓ ప్రత్యేకమయిన బాటను త్రొక్క నారంభించింది.

అప్పట్లో యూరపు స్త్రీ చేసేపని ఏమంటే, పురుషుల్ని రంజింప జెయ్యడం, కర్మాగారాల్లో, అంగడుల్లో ఉద్యోగం జెయ్యడం, తన కోరికల్ని ధర్మా ధర్మాల విచక్షణ లేకుండా అన్ని మార్గాల ద్వారా తీర్చుకోవడం. ఆమె వద్ద విలాస సామగ్రి పెరిగిన కొద్దీ వాటి తృష్ణ కూడా అధికమయ్యేది. దాన్ని తీర్చుకోవాలంటే ఇతోధికంగా పనిచెయ్యడం తప్ప మరో మార్గం లేకుండా పోయింది. యజమానులు స్త్రీల ఈ దౌర్బల్యాన్ని బాగా వినియోగించుకున్నారు. ఘోరమయిన అన్యాయానికి పాల్పడుతూ పురుషుల కన్నా ఎంతో తక్కువ వేతనం ఇచ్చేవారు. ఈ పరిస్థితుల పర్యవసానం, ఆ

మహోన్నత విప్లవం రూపంలో ప్రత్యక్షమవడం సహజ పరిణామమే. ఆ విప్లవం శతాబ్దాల తరబడి అన్యాయం దోపిడీల ఆధారంగా సాగుతూ వచ్చిన ఆ దుష్ట వ్యవస్థను అంతమొందించింది.

## కొండను త్రవ్వి తీసిన ఎలుక

ఈ విప్లవం ద్వారా స్త్రీకు లభించిందేమిటి? విప్లవం తరువాత స్త్రీ శారీరకంగా పూర్వంకన్నా అధికంగానే అలసిపోయింది. సమాజంలో గౌరవం కోల్పోయింది; స్త్రీత్వం ధారబోసుకుంది. ఆమెకు కుటుంబమూ లేదు, పిల్లలూ లేరు - వారి కోసమన్నా త్యాగాలు చేసి తన వ్యక్తిత్వానికి అర్థం, గమ్యం, సంతృప్తి, ప్రత్యేకతల అనుభూతిని పొందడానికి. కాని ఈ విప్లవం వల్ల ఒకే ఒక ప్రయోజనం ఒనగూడింది. ఇప్పుడు స్త్రీకి సయితం పురుషునికి సమానంగా వేతనం ఇవ్వాలన్న హక్కును గుర్తించారు. యూరపు వరకు స్త్రీకి ఇవ్వగలిగింది ఈ ఒక్క సహజమయిన హక్కు మాత్రమే. అయితే యూరపు మగ మహారాజు ఇంత సునాయాసంగా స్త్రీపై గల తన ఆధిక్యతను వదులుకుంటాడా? లేక స్త్రీ సమక్షంలో తన అహం దెబ్బతింటూ ఉంటే సహిస్తాడా? స్త్రీ సమానత్వపు సూత్రాన్ని అతను ఇట్టే స్వీకరించలేదు. దాని వెనక సుదీర్ఘమయిన అతి తీవ్రమయిన సంఘర్షణ గాథ ఉంది.

తన హక్కులకై జరిపిన ఈ పోరాటంలో స్త్రీ సమ్మెలూ చేసింది, సహాయ నిరాకరణనూ ప్రదర్శించింది, బహిరంగ సభలూ చేసింది, పత్రికల్నీ వినియోగించుకుంది. ఆ తరువాత, పరిస్థితుల్ని చక్క దిద్దాలంటే పురుషులతో పాటు చట్ట నిర్మాణంలో పాల్గొనే అవసరాన్నీ గుర్తించింది. అందువల్ల ముందు ఓటుహక్కును కోరడం జరిగింది. ఆ తరువాత ఈ విషయం శ్రుతి మించి రాగాన పడి, స్త్రీలకు కూడా పార్లమెంటులో సభ్యత్వం పొందే హక్కు కావాలన్న నినాదంగా ప్రతిధ్వనించ సాగింది. యూరపు స్త్రీ ఏ వ్యవస్థలోనయితే తర్ఫీదు పొందిందోఅందులో స్త్రీ పురుషుల మధ్య

ఎలాంటి తారతమ్యాన్నీ పాటించడం జరగలేదు. తత్కారణంగా స్త్రీ క్రమేణ ప్రభుత్వ నిర్వహణలోనూ పురుషులతో బాటు సమానస్థాయి కావాలని కోరసాగింది.

ఇదీ యూరపులో స్త్రీ తన హక్కుల కోసం జరిపిన పోరాటపు సంక్షిప్త గాధ. పురుషులకు ఈ పరిస్థితి ఇష్టమయినా కాకపోయినా ఏ భ్రష్ట సమాజంలో నాయకత్వపు హోదానుండి పురుషుణ్ణి స్త్రీ విజయవంతంగా తొలగించిందో అందులో ఆమె కూడా పురుషుని మాదిరిగానే నిస్సహాయ స్థితిలో ఉండి పోయింది. * కాని ఇది విని మా పాఠకులు ఆశ్చర్యపోతారేమో! ఇంగ్లండులో - స్వయంగా ప్రజాస్వామ్యానికి పుట్టిల్లయిన ఇంగ్లండులో - ప్రభుత్వ కార్యాలయాల్లో నేడు కూడా స్త్రీలకు పురుషులకన్నా తక్కువ వేతనమే లభిస్తుంది. వాస్తవానికి అనేక మహిళామణులు బ్రిటన్ పార్లమెంటులో సభ్యులయ్యే స్థాయికి "ప్రగతి" సాధించారు.

## మహిళ - మానవాళిలో సగభాగం

ఇస్లాం మహిళలకు ఇచ్చిన స్థానమేదో పరిశీలిద్దాము. ఆ తరువాత, ఈ

---

* ఇలాంటి సంఘటనల కారణంగానే మార్క్సిస్టులు జీవితంలో కేవలం ఆర్థిక అంశమే మౌలికమయిందని అంటారు. దీనికి స్త్రీ విమోచనోద్యమాన్ని ఉదాహరణగా పేర్కొంటారు. లోగడ మేము చెప్పినట్లు, జీవితంలో ఆర్థిక విషయాలకు ప్రాముఖ్యంలేదని కాదు. కాని మా అభిప్రాయమేమంటే యూరపు వద్ద ఇస్లాం లాంటి జీవన వ్యవస్థ ఒకటి ఉండి ఉంటే పరిస్థితులు ఇలా ఉండేవికావు. ఇస్లాం అన్ని పరిస్థితుల్లోనూ స్త్రీని పోషించే అసలు బాధ్యత పురుషునిపై మోపుతుంది. గత్యంతరం లేక ఆమె ఉపాధికై ప్రయత్నించవలసి వచ్చినా మహిళల పట్ల వేతనం విషయంలో వివక్షతను పాటించ నివ్వదు ఇస్లాం. అత్యవసర పరిస్థితుల్లో బహుభార్యాత్వాన్ని అనుమతిస్తుంది. తద్వారా స్త్రీకి ఆర్థిక రక్షణే కాక, దుర్ఘటనల వల్ల ఉత్పన్నమయ్యే పరిస్థితుల్లో లైంగిక అవసరాలకై చట్టబద్ధమయిన మార్గమూ ఏర్పడుతుంది. ఇలాంటి వ్యవస్థ ఒకటి యూరపు వద్ద ఉండి ఉంటే స్త్రీల సమస్య ఈ విధంగా అస్తవ్యస్తంగా తయారయ్యేదికాదు.

సామాజిక స్థానం కలిగి ఉన్న ముస్లిం స్త్రీలు తమ యూరపు సోదరీమణుల అడుగుజాడల్లో తమ హక్కులకై పోరాడటం అవసరమా? ఇక్కడి చారిత్రక, భౌగోళిక, ఆర్థిక, సైద్ధాంతిక, న్యాయపరమయిన అంశాల దృష్ట్యా ఇలాంటి పోరాటానికి అవకాశముందా ? అన్న విషయాలనూ పరిశీలిద్దాము. అప్పుడే మనం, మన స్త్రీ విమోచనోద్యమ ధ్వజ వాహకులు జరుపుతున్న అలజడి ప్రజా ఆందోళనలన్నీ వాస్తవిక దృష్టితో జరుగుతున్నాయా లేక వారి న్యూనతాభావం వల్ల జనించాయా అన్న ప్రశ్నను సరిగ్గా అర్థంచేసుకోగలము.

ఇస్లామీయ జీవన వ్యవస్థలోని ప్రాథమిక విశేషమేమంటే అది స్త్రీని మానవాళిలో ప్రముఖ భాగంగా – పురుషుని మాదిరిగానే – భావిస్తుంది. పురుషునిలో ఉన్నటువంటి ఆత్మే స్త్రీలోనూ ఉన్నదని అంటుంది. దివ్య ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది :

> జనులారా ! మీ ప్రభువుకు భయపడండి. ఆయన
> మిమ్మల్ని ఒకే ప్రాణం ద్వారా సృష్టించాడు. దాన్నుండే
> దాని జతను సృజించాడు. వారిరువురిద్వారా అనేక
> పురుషుల్ని స్త్రీలనూ పుట్టించాడు. (4 : 1)

అంటే స్త్రీ పురుషులు తమ ప్రారంభ ప్రకరణం నుండి, తమ సుస్థిర స్థితి, పరిణామాలవరకు అన్నిటా ఒకరికొకరు సమ ఉజ్జీలని, సమాన హక్కులు గలవారని ద్యోతకమవుతుంది. ఇస్లాం పురుషుడి మాదిరిగానే స్త్రీలకు కూడా ప్రాణం, మానం, ధనం, ఆస్తులకు సంబంధించిన హక్కుల నిచ్చింది. అది స్త్రీ వ్యక్తిత్వాన్ని గౌరవప్రదమయిందిగా పరిగణించింది. స్త్రీలో లోపాలు వెదకడం గాని, ఆమె లేనపుడు ఆమెను గురించి చెడుగా పలకడంగాని అనుమతించలేదు. ఆమె వెంట పడి ఆమె చేసే చర్యల్ని అనుమానాస్పదమయినవిగా పరిశీలించడాన్ని, ఆమె తన స్త్రీత్వపు బాధ్యతల్ని నిర్వర్తించడం చేత ఆమెను నీచంగా భావించడాన్ని

నిషేధించింది. ఈ హక్కులన్నీ స్త్రీకి కూడా పురుషునికి సమానంగా సంక్రమిస్తాయి. వీటి విషయంలో స్త్రీ పురుషుల మధ్య ఎలాంటి తారతమ్యం పాటించడం జరగదు. ఈ సందర్భంలో చెయ్యబడిన చట్టాలు ఉభయులపై సమంగా వర్తిస్తాయి.

> విశ్వసించే వారలారా ! పురుషులు పురుషులను
> పరిహసించరాదు (ఎవరిని మీరు పరిహసిస్తున్నారో)
> వారు వీరికంటే (దైవ దృష్టిలో) ఉత్తములు కాగలరేమో,
> ఎవరికి తెలుసు ! అలాగే స్త్రీలు స్త్రీలను పరిహసించరాదు.
> వారు వీరికంటే మంచి వారేమో ఎవరికెరుక !! ఒకరినొకరు
> దెప్పి పొడవకండి, ఇంకా ఒకరి నొకరు చెడ్డ పేర్లతో
> పిలుచుకోకండి. తప్పులెన్నే సంకల్పంతో, ఒకరిపట్ల
> మరొకరు అన్వేషణలో పడకండి. మీలో ఎవ్వరూ ఇతరుని
> వెనక అతని ఎడల చెడుగా మట్లాడకండి. (49 : 11)

> విశ్వసించిన వారలారా ! మీరు మీ ఇండ్లల్లో తప్ప ఇతరుల
> ఇండ్లల్లో, వారి అనుమతి పొందనంత వరకు, వారికి సలాము
> చెప్పుకోనంతవరకు లోనికి ప్రవేశించకండి . (24 : 27)

> ఒక ముస్లిం యొక్క ప్రాణ మాన ధనాదులు మరొక ముస్లిం
> కొరకు 'హరామ్' (హాని తలపెట్ట నలవికానివి) గా
> చెయ్యబడ్డాయి. (బుఖారి, ముస్లిం)

ఇలాగే పరలోకంలో ప్రాప్తమయ్యే ప్రతిఫలం దృష్ట్యా కూడా ఇస్లాం స్త్రీ పురుషులిద్దరినీ సమానంగా పరిగణిస్తుంది. దైవ వచనం గమనించండి.

> అప్పుడు వారి ప్రభువు వారి ప్రార్థనను స్వీకరించాడు.
> నేను మీలో ఏ ఒక్కరి కర్మనూ వ్యర్థం చెయ్యను -

> పురుషుడయినా స్త్రీ అయినా – మీరంతా పరస్పరం,
> ఒకరు మరొకరికి చెందిన వారే. (3 : 195)

ధనం,ఆస్తి విషయాల్లోనూ ఇస్లాం స్త్రీ పురుషుల మధ్య సమానతను పాటిస్తుంది. స్త్రీ కయినా పురుషుని కయినా ఆస్తిని కొనడానికీ అమ్మడానికీ పూర్తి స్వేచ్ఛ ఉంది. ఆస్తిని కుదువ పెట్టడం, లీజుకివ్వడం, వారసుల్లో పంచి ఇవ్వడం, అమ్మడం, మరేదయినా ప్రయోజనం కొరకు వినియోగించుకోవడం లేక తన అవసరాలకై వాడు కోవడం – ఈ వ్యవహారాలన్నింటి లోనూ పురుషునితో సమానమయిన హక్కులున్నాయి.

> పురుషులకు కూడా వారి తల్లి దండ్రులు, వారి ఆప్త బంధువులు వదలి వెళ్ళిన దానిలో భాగముంది. స్త్రీలకూ వారి తల్లిదండ్రులు, వారి ఆప్త బంధువులు వదలి వెళ్ళిన దానిలో భాగముంది. (4 : 7)

> పురుషులకూ లభిస్తుంది వారి కర్మలఫలం. మరియు స్తీలకూ లభిస్తుంది వారి కర్మలఫలం. (4 : 32)

## హక్కుల్లో పరిపూర్ణత

స్త్రీ ఆస్తిహక్కు, దాన్ని స్వేచ్ఛగా వినియోగించుకునే అధికారం విషయానికి వస్తే మనం రెండు విషయాలు మరువరాదు. నాగరిక యూరపు న్యాయశాస్త్రంలో ఇటీవలి కాలం వరకు స్త్రీకు ఈ హక్కుల్లో ఏ ఒక్కటీ ప్రాప్తం కాలేదు. చట్టరీత్యా ఆమె ఇలాంటి హక్కుల్ని ప్రత్యక్షంగా వినియోగించుకునే అధికారమే ఉండేదికాదు. వాటిని ఒక పురుషుని ద్వారా – భర్త, తండ్రి లేక సంరక్షకుడు వీరి ద్వారానే వినియోగించుకోవాలి. మరో విధంగా చెప్పాలంటే ఇస్లాం స్త్రీకి ఈ హక్కులన్నీ ప్రసాదించిన 11శతాబ్దాల వరకు యూరపు మహిళ ఈ హక్కులకు నోచుకోలేదన్నమాట. వాటిని

పొందడానికి తీవ్రమయిన పోరాటం అవసరమయింది. ఈ పోరాటంలో ఆమె స్త్రీత్వం, సౌశీల్యం అన్నీ మంటగలిశాయి. ఆమె ఆత్మగౌరవం, వ్యక్తిత్వపు ఔన్నత్యం అన్నీ నేలమట్టమయ్యాయి. వీటినన్నింటినీ త్యాగం చెయ్యడంతో పాటు కష్టాలు, బాధలు, హత్యలు, పలు విధాల దౌర్భాగ్యాలతో నిండిన దుఃఖదాయకమయిన మార్గాన పయనించవలసి వచ్చింది. ఇంత జరిగినా స్త్రీకు లభించిందేమిటి? శతాబ్దాల క్రితం ఇస్లాం ప్రసాదించిన హక్కుల్లోని ఓ అతిస్వల్పమయిన భాగం మాత్రమే. ఇస్లాం ప్రసాదించిన ఈ హక్కులు ఆర్థిక పరిస్థితుల వత్తిడి వల్లగాని, వర్గపోరాటం కారణంగా కాని ప్రాప్తంకాలేదు స్త్రీకి; నిజానికి దాని అసలు కారణం మానవ జీవితపు రెండు మౌలిక అంశాలు క్రియా జీవితంలో ప్రతిబింబించాలన్న ఇస్లాం ప్రబల కోరిక మాత్రమే. 'సత్యం' 'న్యాయం' అన్నవి కేవలం ఊహాలోకాల్లో పరిమితం కాకుండా మానవ జీవితాల్లో ఆచరణాత్మకంగా అగుపించాలన్నదే ఇస్లాం అభిలాష.

రెండవ విషయం ఏమిటంటే, సాధారణంగా పాశ్చాత్య నాగరికత, ప్రత్యేకంగా కమ్యూనిజం ప్రతిపాదించే దృక్పథం ప్రకారం మానవజీవితం వాస్తవానికి మానవ ఆర్థిక పరిస్థితికే మారు పేరు. అందువల్ల ఆ దృక్పథం ప్రకారం స్త్రీకి యాజమాన్యపు హక్కు లభించనంతవరకు, ఆమెకు తన ఆస్తిని స్వేచ్ఛగా వెచ్చించే అధికారం ప్రాప్తం కానంతవరకు ఆమె ఏ మాత్రం స్వతంత్ర ప్రతిపత్తిని పొందలేదు; ఆర్థికంగా స్వతంత్రురాలయినప్పుడే తన ఆస్తిని ఏ పురుషుని జోక్యం లేకుండా నేరుగా స్వేచ్ఛగా ఆమె వాడుకునే అర్హతను పొందినప్పుడే ఆమెకు స్వతంత్ర మానవస్థానం ప్రాప్తమవుతుంది.

మానవ జీవితం పట్ల కమ్యూనిజం మరియు పెట్టుబడిదారీ వ్యవస్థల ఈ సంకుచిత దృక్పథాన్ని మేము ఏ మాత్రం సమర్థించలేము. దీని ద్వారా మనిషి కేవలం పశువుల స్థాయికి దిగజారి పోతాడని మేము భావిస్తాము. అయితే మేము కమ్యూనిస్టులు, పాశ్చాత్య తత్వవేత్తల అభిప్రాయంతో

సూత్రప్రాయంగా ఏకీభవించగలము. అంటే మానవ సమాజంలో మానవ భావోద్రేకాలు, ఆత్మ విశ్వాసం, ఆత్మాభిమానాలపై ఆర్థిక పరిస్థితులు గట్టి ప్రభావాన్ని వేస్తాయన్న అంశాన్ని మేమూ అంగీకరిస్తాము. స్త్రీకి స్వతంత్ర ఆర్థిక స్థానాన్నిచ్చి, ఆమె తన ఆస్తిని ఎలాంటి మధ్యవర్తిత్వమూ లేకుండా వాడుకునే స్వేచ్ఛను కల్పించి ఇస్లాం ఓ ప్రత్యేకతను సంతరించుకున్నది. ఇంతే కాదు, ఇస్లాం స్త్రీ జీవితంలోని అతి ముఖ్యమయిన సమస్య - పెళ్ళి విషయంలోనూ స్త్రీ స్వేచ్ఛను స్థిరపరచింది. ఆమె ఇష్టానికి వ్యతిరేక గా పెళ్ళి చెయ్యడం సాధ్యంకాదని ప్రకటించింది. 'నికాహ్' సరయినదిగా చెలామణీ కావాలంటే ఆమె అంగీకారం అనివార్యమయిన షరతు. దైవ సందేశ హరులు (స అ సం) ఇలా ప్రవచించారు : "ఏ వితంతువు వివాహమయినా ఆమె సలహా లేకుండా చెయ్యరాదు. ఏ కన్య పెళ్ళి అయినా ఆమె అంగీకారం పొందకుండా జరపరాదు. కన్య మౌనం అంగీకారమే " * (బుఖారి, ముస్లిం). ఇస్లాం స్త్రీ అంగీకారానికి ఎంత ప్రాముఖ్యాన్నిచ్చిందంటే నికాహ్ జరిగిన తరువాత కూడా ఏ స్త్రీ అయినా సరే తనపెళ్ళి తనఅంగీకారం లేకుండా జరిగిందని ప్రకటిస్తే ఆ పెళ్ళి చట్టపరంగా రద్దవుతుంది.

## స్వేచ్ఛ, సమానత

ఇస్లాంకు పూర్వం ఏ స్త్రీ అయినా తన భర్తనుండి విముక్తిని పొందాలంటే, అధర్మమయిన అక్రమమయిన మార్గాలు అవలంబించడం తప్ప గత్యంతరం లేకపోయింది. భర్తకు ఆమెపై సర్వాధికారాలు ఉండేవి. ఆమె పూర్తిగా అతని అధికారానికి లొంగి ఉండేది. ఎందుకంటే చట్టంలోనూ విడాకులకు అవకాశముండేదికాదు, అటు చెలామణీలో ఉన్న నియమాలయినా ఆమెకు భర్తనుండి విముక్తి నిచ్చేవికావు. స్త్రీకి ఈ హక్కును కూడా వివరంగా స్పష్టంగా ప్రసాదించింది ఇస్లాం. ఆమె హక్కును

---

* కన్య సిగ్గువల్ల తన అంగీకారాన్ని తెలుపలేకపోవచ్చు అన్న భావం ఈ హదీసులో ద్యోతకమవుతుంది. మౌనం అర్థాంగీకారం అనీ అనుకోవడం పరిపాటేకదా (అను)

తాను కోరినప్పుడు స్వేచ్ఛగా వినియోగించుకోగలదు. * అంతే కాదు, తనకు ఇష్టమయిన వ్యక్తితో పెళ్ళి చేసుకోడానికి, తనకు ఇష్టమయిన వ్యక్తికి పెళ్ళి సందేశాన్ని పంపడానికీ స్త్రీకి అధికారమిచ్చింది ఇస్లాం. యూరపులో స్త్రీకి ఈ హక్కు చాలా కాలం తరువాత, ఈ మధ్యనే అంటే 18వ శతాబ్దంలో ప్రాప్తమయ్యింది. అప్పుడు దాన్ని పురాతన సంప్రదాయాలపై స్త్రీ సాధించిన ఘన విజయంగా పేర్కొన్నారు !

ప్రపంచం నలుమూలలా అజ్ఞానాంధకారం రాజ్యమేలుతున్న కాలంలో ఇస్లాం మానవాళి అంతటికీ విజ్ఞానం, విద్యల ప్రాముఖ్యాన్ని నొక్కి చెప్పింది. విద్య అన్నది ఏ ప్రత్యేక వర్గానికి చెందిన హక్కు కాదని ప్రకటించింది. మానవాళి అంతటికీ ఇది అనివార్యమయిన అవసరంగా తెలిపింది. ముస్లిములందరూ దాన్ని పొందడం వారి ధార్మికతకు షరతుగా నిర్ణయించింది. స్త్రీని స్వతంత్ర వ్యక్తిత్వంగల మనిషిగా భావించి విద్య లేకుండా ఆమె వ్యక్తిత్వం పరిపూర్ణం కాదని ప్రకటించిన ఘనత కూడా ఇస్లాంకే దక్కుతుంది. విద్యాసముపార్జన పురుషులకు స్త్రీలకు సమంగా విధి అని నిర్ణయించడం జరిగింది. మహిళలు తమ శారీరక ప్రగతితో పాటు మానసిక, ఆధ్యాత్మిక వికాసాన్నీ సాధించాలని తద్వారా ఉత్తమ

---

* ప్రాచ్య (ముస్లిం) దేశాల్లో ప్రబలి ఉన్న సామాజిక ఆర్థిక పరిస్థితుల్ని చూస్తూ ఉంటే స్త్రీకి లభించిన ఈ హక్కు, చూడటానికి ఓ ప్రహసనంలా, భ్రమలానే అగుపిస్తుంది. కాని ప్రాచ్యదేశాల్లో ఉత్పన్నమయిన ఈ పరిస్థితులు ఇస్లాం సృజించినవికావు, ఇస్లాంను త్యజించడం వల్ల ఉత్పన్నమయినటువంటివి. పైగా ఈ పరిస్థితులు ఇస్లామీయ శాసనాంగాన్ని పూర్తిగా ప్రవేశపెట్టే మార్గంలో అవాంతరాలుగా నిల్చున్నాయి. ఇస్లాం ప్రారంభకాలంలో స్త్రీ తన ఈ హక్కును వినియోగించుకునేది. దాన్ని మహాప్రవక్త (సఅసం) శాసన నిర్మాతగా, ఆయన తరువాత ఆయన ప్రాతినిధ్య పాలకులు కూడా ఈ స్త్రీ హక్కును పూర్తిగా ఆమోదించారు. నేడు కూడా ఈ ఇస్లామీయ శాసనాంగాన్ని పూర్తిగా అమలు జరపడం, ఆ మార్గంలో ఏర్పడుతున్న అవాంతరాలను తొలగించడం అవసరం. ఈ అవాంతరాలు ప్రాచ్య (ఇస్లామీయ) రాజ్యాల ఆర్థిక, పరిస్థితుల కారణంగా ఉత్పన్నమయినవయినా లేక ఇతరుల్ని చూసి ఇస్లామేతర విధానాలను గుడ్డిగా అనుకరించడం వల్ల ఉత్పన్నమయినవయినా వాటిని తొలిగించడం ముఖ్యం.

జీవితాన్ని గడపాలని ఇస్లాం కాంక్షిస్తుంది. దీనికి భిన్నంగా ఆర్థిక వత్తిడికి లొంగిపోవడం తప్ప మరోమార్గం కానరాని పరిస్థితుల్లో ఈ హక్కును ఇటీవలే స్త్రీకి ప్రసాదించింది యూరపు. ఇస్లాం స్త్రీకి రెండో స్థాయి సృష్టిగా భావిస్తుందని లేక స్త్రీ పురుషునికి లొంగి ఉండాలని కోరుతుందని లేక ఇస్లాం దృష్టిలో స్త్రీ జీవితానికి ఎలాంటి ప్రాముఖ్యం లేదని చేసే అబద్ధపు ప్రచారాల భండారం బద్దలు చేసేందుకు పైన చూపిన విషయాలు చాలని భావిస్తున్నాము.

## సహజమయిన తారతమ్యం

స్త్రీ పురుషుల మధ్య మానవ స్థాయిలో పరిపూర్ణ సమత్వాన్నీ సమాన హక్కుల్ని అంగీకరించినప్పటికీ యదార్ధ జీవితంలో ఉభయ వర్గాల కార్య రంగాన్ని అందులో గల వ్యత్యాసాన్నీ ఇస్లాం ఉపేక్షించలేదు. ఇస్లాంకు వ్యతిరేకంగా కొన్ని మహిళా సంస్థలు, సంఘాలు, వారిని సమర్థించే సాహితీకారులు, "సంఘ సంస్కర్తలు", యువకులు చేసే హంగామాకు, వారు సృష్టించే గందరగోళానికి అసలు మూలం ఇస్లాం ప్రతిపాదించే ఈ భావనే. ఉభయవర్గాల (స్త్రీ పురుషుల) మధ్య ఇస్లాం ఏ కోణాల్లో విచక్షణ కనబరుస్తుందో వాటిని పరిశీలించే ముందు, వైద్య, జీవ, మానసిక శాస్త్రాల దృష్ట్యా మౌలిక సమస్యను అధ్యయనం చెయ్యడం అవసరం. ఆ తరువాత ఇస్లామీయ దృక్పథాన్ని పరిశీలిద్దాము.

స్త్రీ పురుషులు ఒకే రాసికి చెందిన వారా, లేక వేర్వేరు రాసులకు చెందిన వారా? వీరిరువురి జీవనధర్మం ఒకటేనా లేక స్త్రీ పురుషులవడం చేత వీరి జీవనధర్మాలు వేర్వేరుగా ఉన్నయ్యా? ఈ ప్రశ్నలు చిక్కుతో కూడుకున్నవే. కాని వీటి పరిష్కారం పైనే స్త్రీ పురుషుల సమస్యల పరిష్కారం ఆధారపడి ఉంది. ఎవరయితే స్త్రీ పురుషుల శారీరక మానసిక నిర్మాణంలో ఎలాంటి వ్యత్యాసంలేదని అంటారో ఇంకా వీరుభయుల జీవన సంబంధమయిన విధులూ బాధ్యతలు కూడా సమానమయినవే

అని వాదిస్తారో వారితో మాట్లాడటమే వ్యర్థం. కాని ఎవరయితే స్త్రీ పురుషుల శారీరక నిర్మాణం, జీవన ధర్మాల్లో వ్యత్యాసాన్ని అంగీకరిస్తారో వారితో ఈ విషయంలో ఫలప్రదమయిన చర్చ జరపడానికి అవకాశం ఉంది. స్త్రీ పురుషులకు మధ్య సమానత్వం గురించి నేను, నా పుస్తకం "ఇస్లాం మరియు భౌతికవాదాల మధ్య మనిషి" * లో సవివరంగా చర్చించాను. ప్రస్తుతం అందులోనుంచే కొన్ని భాగాలు ఉటంకిస్తున్నాను:

"స్త్రీ పురుషులు తమ నైజం, నిర్మాణాల రీత్యా ఎంతో భిన్నంగా ఉండటం మూలానే వీరుభయులూ కేవలం తమ తమ మౌలిక జీవన రంగాల్లో మనుగడ సాగించగలుగుతారు. ఇది, ఈ ఉభయవర్గాల జీవన ధర్మాలు లక్ష్యాల్లో ఉన్న మౌలికమయిన వ్యత్యాసానికి పర్యవసానమే. ఈ కారణంగానే నాకు ఇంతవరకూ అంతుపట్టలేకుండా ఉంది – స్త్రీ పురుషుల మధ్య పరిపూర్ణ సమానత్వంపై జరిగే ఊకదంపుడు ఉపన్యాసాల ఆధారంగా వాస్తవ జగత్తులో ఈ సమానతను అమలు జరపడం ఎలా సాధ్యమవుతుంది అని. మానవులవడం చేత స్త్రీ పురుషుల మధ్య సమానత కావాలన్నది ఎంతో సహజమయిన, సమంజసమయిన కోరికే అనడంలో సందేహం లేదు. స్త్రీ పురుషులు మానవ కుటుంబంలోని రెండు సమాన ప్రాముఖ్యంగల సభ్యులు. ఒకే తండ్రి సంతానం. అయితే తమ జీవన ధర్మాల్లోనూ వాటి నిర్వహణారీతుల్లోనూ వీరిరువురూ సమానులు కాగలరా ? ఇలాంటి సమానత సాధించడం సంభవమా ? ప్రపంచ మహిళలందరూ ముక్తకంఠంతో దీన్ని కోరినా, ఈ కోరికను సమర్థిస్తూ బ్రహ్మాండమయిన సభలు నిర్వహించినా, తీర్మానాలు ఆమోదించినా ఈ సమానతా స్వప్నం నిజం కాగలదా ? ఈ సభలూ, సమావేశాలూ, ఇవి ఆమోదించిన తీర్మానాలు ఇటు స్త్రీల నైజాన్నీ మార్చలేవు అటు పురుషుల ప్రకృతినీ పరివర్తింపజెయ్యలేవు. లేక వీటివల్ల వీరుభయుల జీవన ధర్మాల్లో ఎలాంటి మార్పూ వాటిల్లబోదు. స్త్రీలు పురుషుల విధుల్ని నిర్వహించడమో, పురుషులు స్త్రీల బాధ్యతలు నెత్తిన వేసుకుని గర్భం ధరించడం, పిల్లల్ని కనడం, పిల్లలకు పాలిచ్చి పోషించే కార్యాలు నెరవేర్చడమో జరగదు.

---

* ఇది అరబీలో ఉంది. పేరు "అల్ ఇన్సాను బైనల్ మాద్దియతి వల్ ఇస్లాం"

" ఏ ప్రత్యేక జీవనధర్మమయినా ప్రత్యేక శారీరక, మానసిక నైజం నిర్మాణాలు లేనిదే నిర్వర్తించడం సాధ్యం కాదు. మరో మాటలో చెప్పాలంటే స్త్రీ తన ప్రత్యేక విధులయిన గర్భం ధరించడం, శిశువుకు పాలు పట్టడం లాంటి వాటిని నిర్వర్తించాలంటే ఆమెకు ప్రత్యేకమయిన భావోద్రేకాలు, మానసిక సామర్థ్యాలు అనివార్యం. వీటి సహాయంతోనే స్త్రీ తన ఈ అతిక్లిష్టమయిన విధుల్ని నిర్వహిస్తుంది. వాస్తవానికి మాతృమూర్తిలోని మమతానురాగాలు, సున్నిత పవిత్రభావాలు, ఉన్నత శీలం, కష్ట నష్టాలలో ఆమె సహనస్థయిర్యాలు, ప్రేమావాత్సల్యాలు వీటన్నింటితో పాటు కార్య నిర్వహణలో ఆమె కనబరిచే నైపుణ్యం - ఇవన్నీ , స్త్రీని గర్భం ధరించేందుకు పాలుపట్టేందుకు అర్హురాలుగా చేసే ఆ ప్రత్యేక శరీర నిర్మాణం లేకుండా సాధ్యపడవు. ఈ శారీరక ధర్మం ఆమె మనోమయమయిన, వివేచనా పరమయిన, మేధా విశేషమయిన వ్యవస్థ అంతా కలసి ఓ ప్రత్యేక స్వరూపం - స్త్రీగా ఏర్పడుతాయి. స్త్రీలో ఈ విశేషాలన్నీ సమానంగా ప్రక్క ప్రక్కనే గోచరిస్తాయి. ఇవి పరస్పర పరిపూర్ణకాలే కావు వీటిమధ్య సంపూర్ణ సమన్వయం, సామరస్యం కూడా ఉన్నాయి. అందువల్ల ఏదో చాలా అరుదుగానో లేక ఏదో వినాయింపు పరిస్థితిలోనో తప్ప వీటిలో ఏ ఒక్క ప్రత్యేకత అయినా సరే ఇతర ప్రత్యేకతలు లేకుండా ఎవరిలోనయినా చోటు చేసుకోవడం అనేది అసంభవం.

"భావోద్రేకాల్లో లాలిత్యం, అంతః ప్రేరణలో సున్నితత్వం మనోస్పందనలో, సంచలనంలో సూక్ష్మత్వం లాంటి స్త్రీ ప్రత్యేకతల్ని పరిశీలిస్తే స్త్రీ నిర్మాణం, బుద్ధి ప్రధానంగా కాక భావ ప్రధానంగా జరిగినట్లు ద్యోతకమవుతుంది. ఆమెలోని ఈ భావుకతే మమతానురాగాల సజీవ శాశ్వత గుణాలకు మూలాంకురం. ఎందుకంటే శిశుపోషణకు కావలసిన యోగ్యతలు బుద్ధిపరమయినవికావు, దానికి ఎంతోవేగంగా, వాడిగా ప్రతిస్పందించే భావుక హృదయం అవసరం. అప్పుడే ఆమె తాపీగా ఆలోచించుకుంటూ కూర్చోకుండా శిశువు అవసరానికి తగ్గట్టుగా చలించి ఆలసించక వెనువెంటనే ఆ పిలుపును అందుకోగలుగుతుంది. ఇదీ జీవితంలో స్త్రీ యొక్క నిజమయిన స్థానం, స్వరూపస్వభావాలు. ఈ

స్వరూప స్వభావాలు ఆమెని తన జీవన ధర్మాన్ని నిర్వర్తించడంలో సహాయపడతాయి. ఆమె సృష్టికి గల లక్ష్యాన్ని సులభ సాధ్యం చేస్తాయి.

"దీనికి భిన్నంగా పురుషునిపై మోపబడ్డ బాధ్యతల తీరు పూర్తిగా భిన్నమయింది. వాటిని నిర్వర్తించేందుకు కావలసిన అన్ని యోగ్యతలూ - స్త్రీకి పూర్తిగా భిన్నమయినవి - అతను కలిగి ఉన్నాడు. అతని అసలు బాధ్యత జీవన రణరంగంలో నిత్య సమరంలో నిమగ్నుడయి ఉండటం. అతను ఆటవిక మృగాలను లోబరచుకుంటాడు. భూమ్యాకాశాల్లోని ప్రకృతి శక్తుల్ని ఎదుర్కొంటాడు. ప్రభుత్వాన్ని రూపొందిస్తాడు. దేశ ఆర్థిక వ్యవస్థకై, సామాజిక వ్యవస్థకై చట్ట నిర్మాణం చేస్తాడు. పురుషుడు తన జీవనోపాధి కొరకు, తన్ను తన భార్యా పిల్లల్ని అన్యాయాలనుండి కాపాడు కోగలగటానికి జీవితంలో ఈ సమస్యలన్నింటినీ పరిష్కరించవలసి ఉంటుంది.

"అందువల్ల పురుషునికి తన జీవనధర్మాన్ని నిర్వర్తించటానికి స్త్రీలా తీవ్రమయిన భావుకత అవసరముండదు. ఇతడు నిర్వర్తించే బాధ్యతల విషయంలో భావోద్రేకాలు ప్రయోజనకరం కావడానికి బదులు నష్టదాయకమవుతాయి. ఎందుకంటే భావుకతకు స్థిరత్వం అంటూ ఉండదు - సతతం హెచ్చుతూ తగ్గుతూ ఉంటుంది. తత్ఫలితంగా విభిన్న, విరుద్ధ మానసిక స్థితులు ఉత్పన్నమవుతూ ఉంటాయి. భావోద్రేకాలు మనిషిని నిర్ణీత పంథాపై స్థిరంగా నిలువ నివ్వవు. భావోద్రేకాల వల్ల ఇష్టాయిష్టాల ప్రమాణాలు కూడా అనునిత్యం మారుతూ ఉంటాయి. ప్రతి క్షణం మారే భావుకతా నైజం, భిన్నమయిన, నిత్యం పరివర్తన చెందే "తల్లి" అవసరాలకయితే ఉపకరిస్తుంది, సహకరిస్తుందికాని, పురుషునికి ఏ మాత్రం ఇది ఉపయోగపడదు. అతని బాధ్యతల తీరే అలాంటిది. అతను స్థిర చిత్తంతో, దృఢ సంకల్పంతో, ధైర్య సాహసాలతో నిలకడగా తన విధుల్ని నిర్వహించవలసి ఉంటుంది. అతని క్రియా జీవితంలో, అసంఖ్యాక వ్యతిరేక శక్తుల్ని ఎదుర్కోవలసి ఉంటుంది. అలాంటి పరిస్థితుల్లో బుద్ధీ, వివేకాలే అతనికి సహాయ సహకారాలు అందజెయ్యగలవు. అతని ఈ

నైజం అతనిలో భావి పథకాల నిర్మాణానికి, వర్తమాన పరిస్థితుల అధ్యయనానికి, కొత్త చర్యగైకొనేముందు ఎదురు కాగలపరిణామాలను దర్శించగలగడానికి యోగ్యతలు జనింపజేస్తుంది. బుద్ధి మందగమనం కలదేకాని అందులో స్థిరత్వం ఉంటుంది. బుద్ధి ఆత్రుత ప్రదర్శించదు. స్త్రీ వ్యక్తిత్వంలో వన్నెను, వెలుగును నింపే భావోద్రేకతలోని ప్రత్యేకత ఈ ఆత్రుత. బుద్ధి ఏ లక్ష్యానికయినా కావలసిన సముచిత మార్గాన్ని సూచిస్తుంది. మనం ఓ అడవి మృగాన్ని వేటాడదలచినా, కొత్త యంత్రాన్ని కనిపెడుతున్నా, ఆర్థిక వ్యవస్థను నెలకొల్పుతున్నా, కొత్త ప్రభుత్వాన్ని స్థాపిస్తున్నా, విదేశీ శక్తితో యుద్ధంలోనో, సంధి కుదుర్చుకోవడంలోనో నిమగ్నమయి ఉన్నా - అన్ని పరిస్థితుల్లోనూ బుద్ధే సహాయపడుతుంది. పురుషుడు చేసే ఈ కార్యకలాపాలన్నీ అతని మేధ, శక్తి సామర్థ్యాలపై ఆధారపడి ఉన్నాయి. వీటిలో భావోద్రేకాలు జోక్యం చేసుకుంటే పనులు మరీ చిక్కుబడతాయే కాని చక్కబడవు.

“అందువల్ల ఒక పురుషుడు తన జీవితంలో సఫలీకృతుడవ్వాలంటే అతను తన పురుష జీవనధర్మాన్ని నిర్వర్తించడంలో నిమగ్నుడవ్వాలని అర్థం. ఈ చర్చ ద్వారా స్త్రీ పురుషుల మధ్య ఉండే వ్యత్యాసానికి మూలకారణం బోధపడుతుంది. ఇంకా పురుషుడు శారీరక, మేధాపరమయిన శక్తి సామర్థ్యాలను వినియోగించే పనులపట్ల ఆసక్తి ఎందుకు వ్యక్తం చేస్తాడో కూడా అర్థమవుతుంది. అతను భావోద్రేకాల విషయంలో చిన్న పిల్లవానిలా ఎందుకు ప్రవర్తిస్తాడో కూడా తేటతెల్లమవుతుంది. అలాగే స్త్రీ భావోద్రేకాల ప్రదర్శన గల కార్యపరిధిలో మహదానంద అనుభూతిని పొందుతుంది. ఈ పరిధిలోనే ఆమె తన విధుల్ని ఉత్తమరీతిలో నిర్వర్తించగలుగుతుంది. నర్సింగ్, విద్యాబోధన, శిక్షణ, శిశుపోషణ లాంటి వృత్తుల్లో ఆమెకు ఆకర్షణా ఉంటుంది, ఆనందమూ లభిస్తుంది. అలాగే సేల్స్ సెక్షన్‌లో పని చేస్తున్నప్పుడు కూడా ఆమెకు ఓ విధమయిన భావతృప్తి ప్రాప్తమవుతుంది. ఈ వృత్తిలో తనకు కావలసిన పురుషుని అన్వేషించడం ఆమెకు సులువయిపోతుంది. కాని ఈ పనులన్నీ ఆమె అసలు బాధ్యత నిర్వహణలో కేవలం రెండవ ప్రాముఖ్యాన్ని మాత్రమే కలిగి ఉంటాయి. వీటివల్ల ఆమె

నైజంలోని వాంఛ, భర్త, ఇల్లు, కుటుంబం, పిల్లల్ని పొందడం – ఎన్నడూ పూర్తి కాజాలదు. అందువల్లనే, సహజంగానే, తన సహజ జీవన ధర్మాన్ని నిర్వర్తించే అవకాశం లభించగానే ఆమె ఉద్యోగానికి స్వస్తి చెప్పి తాను గృహస్థ బాధ్యతలకు అంకితమయిపోతుంది. తిరిగి ఇంటి బయటకు అడుగు పెట్టడమన్నది – అత్యవసర పరిస్థితుల్లో ఆదాయాన్ని పెంచడానికి తప్ప – జరగదు.

"స్త్రీ పురుషుల మధ్య మౌలికంగా ఏదో వ్యతిరేకత ఉందని, వీరిరువురూ ఎన్నడూ కలువజాలరని దీనికి భావం కాదు. స్త్రీ పురుషుల్లో ఎవరికయినా, ఎదుటి వర్గం వారు చేసే పనులు అసలు చేసే యోగ్యతే ఉండదని కూడా దీనికి అర్థం కాదు. ఈ ఉభయ వర్గాల్లోనూ అన్ని గుణగణాలు కలగలసి అగుపిస్తాయి. కొందరు స్త్రీల్లో పరిపాలనా దక్షత, న్యాయ నిర్ణాయకశక్తి, కాయకష్టం చేసే సామర్థ్యం, యుద్ధ రంగంలో నిలబడగలిగే గుణం కానరావడమయినా, అటు పురుషుల్లో వంట చెయ్యడం, ఇంటిపనులు చక్కబెట్టుకోవడం, పిల్లలకై తల్లి మాదిరిగా ప్రేమానురాగాలు చిలకరించడం, భావోద్రేకాలకు లోనవడం, భావాల్లో నిలకడ లేకపోవడం లాంటి గుణాలు కనిపించడమయినా – ఇదంతా సహజమయినదే. ఇందులో ఏదీ ప్రకృతికి విరుద్ధమయింది కాదు. ప్రతి లింగంలోను ఎదుటి లింగం గుణగణాలుంటాయన్న తార్కిక పరిణామాన్నే ఇవి సూచిస్తాయి తప్ప మరేమీకాదు. దీని కారణంగా స్త్రీ పురుషుల జీవన ధర్మాల్లో సమానత కావాలని పాశ్చాత్య తత్వవేత్తలూ వారి ప్రాచ్య శిష్యగణం కలసి చేస్తున్న వక్ర వాదనకు ఏ మాత్రం బలం చేకూరదు. పైగా ఇలాంటి వినాయింపు దృష్టాంతాలను చూస్తే కొన్ని ప్రశ్నలు తలెత్తుతాయి. స్త్రీ చెయ్యగలిగే ఈ అదనపు పనులు ఆమె అసలు జీవన ధర్మానికి సమానం కాగలవా? వీటిని నిర్వర్తించే స్త్రీకి ఇల్లు, పిల్లలు, కుటుంబం అవసరముండవా? ఈ అవసరం ఏ విధంగానయినా తీరే మార్గముందా? ఈ పనుల్ని చేస్తూ ఆమె తన సహజ భావోద్రేకాల తృప్తి పొందగలదా? ఈ తృప్తికై ఓ పురుషుని సహచర్యం ఆమెకు అవసరం లేకుండా పోతుందా?"

## జీవిత పరమార్థం

ఈ ప్రశ్నలకు సమాధానంలోనే ఉంది ఉభయవర్గాల మధ్య గల వ్యత్యాసానికి మూలకారణం. స్త్రీ పురుషుల మధ్యగల సహజ వ్యత్యాసం ఎలాంటిదో అర్థం చేసుకున్న తరువాత ఇస్లాం స్త్రీ పురుషుల మధ్య ఏ ఆ కారణాల ఆధారంగా విచక్షణను పాటిస్తుందో చూద్దాము, ఎందువల్ల ఈ ఉభయులకై వేర్వేరు కార్యపరిధుల్ని ప్రతిపాదిస్తుందో పరిశీలిద్దాము.

ఇస్లాం ప్రత్యేకత ఏమిటంటే, అది జీవితానికి కావలసిన ఆచరణాత్మక వ్యవస్థ. అది మనిషి నైజంతో పోరాడదు, అందులో మార్పులూ చేర్పులు కూడా ప్రతిపాదించదు. మానవ నైజానికి అనుకూలమయిన దాన్ని దానితో పూర్తిగా సామరస్యం పొందిన దాన్ని అది ప్రతిపాదిస్తుంది. అది మానవునికి ఆధ్యాత్మిక పవిత్రతను ప్రసాదిస్తుంది. అది కేవలం ఆదర్శవాదమూ (IDEALISM) అనిపించే విధంగా మానవ అభ్యున్నతిని కాంక్షిస్తుంది. కాని మానవ ప్రగతీ పవిత్రతల ఈ ప్రక్రియలో అది ఎక్కడా మానవ ప్రకృతికి విరుద్ధంగా మెలగదు. దాని ప్రకారం, మానవ నైజంలో మార్పు చెయ్యడం సులభ సాధ్యమూ కాదు, శ్రేయస్కరమూ కాదు. దాని దృష్టిలో మానవత ప్రామాణిక సాఫల్యానికి నిర్వచనం ఏమిటంటే మనిషి తన ప్రకృతితో పోరాడకుండా, దాని అవసరాలను తీర్చుకుంటూ, దానికి మెరుగులు దిద్దుతూ మంచి అన్నదానికి, పరిపూర్ణత అన్నదానికి చేరువయ్యే అత్యున్నత సోపానాలను అధిరోహించాలి. మంచి అన్నది అతని దృష్టిలో ప్రియాతి ప్రియమయినదిగా మారాలి. అతను కేవలం మనోవాంఛలకు దాసుడుగా మాత్రం మారరాదు.

స్త్రీ పురుషుల విషయంలో ఇస్లాం అవలంబించిన దృక్పథం కూడా మానవ నైజానికి పూర్తిగా అనుగుణ్యం కలది. అందువల్ల ఎక్కడయితే సహజమయిన ఆలంబన లభిస్తుందో అక్కడల్లా అది ఉభయుల మధ్య సమానతను స్థాపిస్తుంది. మరెక్కడయితే ప్రకృతే వ్యత్యాసాన్ని పాటించ

గోరుతుందో అక్కడ ఇస్లాం కూడా తారతమ్యాన్ని పాటిస్తుంది. స్త్రీ పురుషుల మధ్య ఇస్లాం వ్యత్యాసాన్ని పాటించే రెండు సందర్భాలు ఎంతో ప్రముఖమయినవి. ఒకటి, వారసత్వపు పంపకం, రెండు, కుటుంబంలో పెద్దరికం.

## వారసత్వం

వారసత్వం విషయంలో ఇస్లాం చట్టం ఇది : పురుషుని వాటా ఇద్దరు స్త్రీల వాటాకు సమానం (4 : 11)

ఇది పూర్తిగా సహజమయిన న్యాయవంతమయిన పంపకం. ఎందుకంటే ఆర్థిక భారమంతా పురుషుడి పైనే ఉంటుంది. స్త్రీ పై తన సొంత ఖర్చులు తప్ప మరెవరి ఖర్చుల భారమూ ఉండదు. కాని స్త్రీయే కుటుంబ పెద్దగా ఉన్నట్లయితే పరిస్థితి మారిపోతుంది. ఆ సందర్భంలో స్త్రీయే కుటుంబ అవసరాలన్నింటినీ పూర్తి చేస్తుంది. కాని ఇది ఓ అసాధారణ పరిస్థితి అని చెప్పవచ్చు. ఇస్లామీయ సమాజంలో ఇలాంటి పరిస్థితి బహు అరుదుగానే ఎదురవుతుంది. ఎందుకంటే స్త్రీ బంధువుల్లో – ఎంత దూరపు బంధువయినా సరే – పురుషుడు ఉన్నంత వరకు స్త్రీయే స్వయంగా తన బ్రతుకు తెరువుకై ఇంటిని వదలి వెళ్ళవలసిన అవసరం ఏర్పడదు. స్త్రీ హక్కుల ధ్వజవాహకుల దృష్టిలో ఈ ఏర్పాటు జరగడం ఆమెపై అన్యాయం,దౌర్జన్యాలతో సమానమా ? ఇలాంటి ఉత్తుత్తి నినాదాలు చేసేవారిని కాస్సేపు అలా ఉంచి చూసినట్లయితే ఇది గణిత శాస్త్రానికి సంబంధించిన ఎంతో సామాన్యమయిన సమస్య. మొత్తం వారసత్వంలో స్త్రీకి మూడోవంతు లభిస్తే పురుషునికి మిగతా రెండు వంతులు లభిస్తాయి. దాని ద్వారా అతను తన భార్య (అంటే మూడో వంతు పొందిన స్త్రీ కూడా అన్నమాట) పిల్లలు, కుటుంబ - అవసరాలను తీర్చాలి. దీనిద్వారా వ్యక్తమవుతూనే ఉంది వారసత్వంలో అధికభాగం ఎవరికి లభిస్తుందో – స్త్రీకా? పురుషునికా? కొందరు పురుషులు తమ సంపదనంతా తమ వ్యక్తి గత సుఖభోగాలకే వినియోగించడం సాధ్యమే. వారు పెళ్ళి పెటాకుల

జోలికే పోకపోవచ్చు. కాని ఇలాంటి దృష్టాంతాలు దీపం పట్టుకుని వెదికినా కానరావు. సాధారణంగా పురుషుడే తన కుటుంబ ఖర్చుల్ని భరిస్తాడు. అతడే తన కుటుంబంలోని వారి - తన భార్యతో సహా - అందరి అవసరాలను సమకూర్చుతాడు. కాని ఇలాచేసి అతను ఒకరిపై చేసే ఉపకారమేమీలేదు. కేవలం తన నైతిక బాధ్యతను నెరవేర్చడం తప్ప. స్త్రీ ఆమోదంలేనిదే పురుషుడు ఆమె ఆస్తిని ముట్టుకోనూలేడు. పైగా ఆమె ఖర్చులన్నీ అతనే భరించాలి. భర్త భార్యకు భరణం ఇవ్వకపోయినా, లేదా తన ఆదాయానికి తగినట్టుగా కాక తక్కువగా ఇచ్చినా ఆమె కోర్టుకు వెళ్ళి తన భరణాన్ని వసూలు చేసుకోగలదు. అలా వీలుపడక పోతే, తాను కోరితే ఆమె అతన్నుండి వేరు పడగలదు. ఇస్లాం ప్రకారం వారసత్వంలో స్త్రీకి పురుషుని కన్నా తక్కువ లభిస్తుందని లేక చాలినంతగా లభించదని అనడం కేవలం ఓ అపవాదు మాత్రమే. నిజానికి పురుషుని ఆర్థిక బాధ్యతలే ఆ మాదిరిగా ఉన్నాయి. అతనికి స్త్రీకి లభించేదానికి రెండింతలు లభించడమే న్యాయం.

ఇస్లామీయ వారసత్వపు చట్టంలో మౌలికమయిన సూత్రమేమిటంటే, ప్రతి వ్యక్తికి అతని అవసరంకొద్ది ఇవ్వాలి. 'అవసరం' అంటే వ్యక్తియొక్క సామాజిక బాధ్యతలు అని అర్థం. ఇంతకంటే న్యాయ వంతమయిన చట్టం మానవాళి నేటివరకు కనుగొనలేదంటే అందులో అతిశయోక్తి ఏ మాత్రం లేదు. కాని ధన సముపార్జనలో ఇస్లాం స్త్రీ పురుషుల మధ్య ఎలాంటి తేడాను పాటించదు. వేతనంలో, వ్యాపారం చేస్తే లాభాల పంపకంలో, పంటల వల్ల వచ్చే రాబడిలో ఎక్కడా ఇస్లాం వీరిరువురి మధ్య తారతమ్యాన్ని పాటించడాన్ని ఒప్పుకోదు. ఎవరికీ ప్రాధాన్యత నివ్వదు. ఎందుకంటే ఈ విషయాల్లో ఇస్లాం ఉభయవర్గాల మధ్య సంపూర్ణ సమానత్వాన్ని అమలు పరుస్తుంది. వారి కష్టానికనుగుణంగా సమానమయిన వేతనం ఇవ్వాలని అంటుంది. ఈ విషయంలో ఎవరికీ అన్యాయం జరగడాన్ని అది సహించదు. స్త్రీ వేతనం పురుషుని వేతనానికి సగం మాత్రమే ఉండాలని ఇస్లాం అంటుందన్న దురభిప్రాయాన్ని ఇస్లాం విరోధులు ముస్లిముల్లో కూడా ఓ పథకం ప్రకారం, బాగా వ్యాప్తిలోకి తీసుకువచ్చారు. ఇది పూర్తిగా అబద్ధం.

## సాక్ష్యానికి సంబంధించిన చట్టం

ఇస్లాంలో ఇద్దరు స్త్రీల సాక్ష్యం ఒక పురుషుని సాక్ష్యానికి సమానం. నిజమే. దీనిద్వారా ఇస్లాం దృష్టిలో ఒక స్త్రీ విలువ పురుషుని విలువలో సగం అని రుజువు కాదు. నిజానికి ఇది ఎంతో వివేచనతో కూడుకున్న చటం; వీలయినన్ని మార్గాలా సాక్ష్యానికి సంబంధించిన చట్టాన్ని లోప భూయిష్టం కాకుండా చూడటమే అసలు లక్ష్యం. తన ప్రకృతి రీత్యా స్త్రీ భావోద్రేకాలకు తీవ్రంగా లోనవుతుంది. బాహ్య విషయాలకు సునాయాసంగా ప్రభావితురాలవుతుంది. తన ఈ గుణం కారణంగా ఆమె కేసులోని వివరాలను క్రిందా మీదా చేసే ప్రమాదం లేకపోలేదు. అందువల్ల ఆమె సాక్ష్యం విషయంలో మరో స్త్రీని కూడా జోడించడం జరిగింది. దీనిలో గల మర్మ హేతువును ఈ విధంగా సెలవియ్యటం జరిగింది.

> వారిద్దరిలో ఒకామె ఏదయినా మరచిపోతే మరోకామె
> దాన్ని ఆమెకు జ్ఞాపకం చెయ్యాలని. (2 : 282)

ఎందుకంటే ఎవరికయితే ప్రతికూలంగానో లేక అనుకూలంగానో ఆమె సాక్ష్యమిస్తున్నదో ఆ వ్యక్తి పట్ల ఈర్ష్యాద్వేషాలకు లోనయి చిత్తశుద్ధితోనే ప్రతికూలంగా సాక్ష్యమివ్వవచ్చు. లేదా ఆ వ్యక్తి పట్ల అభిమానం కొద్దీ సంకల్పితంగానో అసంకల్పితంగానో సత్యదూరమయిన రీతిలో సాక్ష్య మివ్వడం కూడా సాధ్యమే. కాని ఇద్దరు స్త్రీలు సాక్ష్యం పలుకుతున్నప్పుడు ఒకేసారి ఇద్దరూ ఇలాంటి పొరపాటుకు లోనవడం, తప్పుడు సాక్ష్యమివ్వడం అన్నది ఊహాతీతమయిన విషయం. ఇలాంటి పరిస్థితిలో, వీరిరువురిలో ఒకామె భావోద్రేకాల ప్రభావంలో యదార్థం పట్ల అపార్థానికి గురయితే రెండో స్త్రీ ఆమెను సరిదిద్దవచ్చు. ఈ సందర్భంలో ఓ విషయం విశదపరచడం సబబుగా తోస్తుంది. ఒకవేళ ఓ మహిళా సాక్షి స్త్రీల వ్యాధుల నిపుణురాలుగా సాక్ష్యం పలికే మాటయితే, ఇలాంటి సందర్భంలో మరో సాక్ష్యం అవసరం ఉండదు.

## కుటుంబం పెద్ద

ఇకపోతే కుటుంబ పెద్ద విషయానికి వస్తే, ఆ బాధ్యత నిర్వర్తించే వ్యక్తిలో నిర్వహణ కుశలత ఉండటం ఎంతో అవసరం. ఇంకా ఆ వ్యక్తి కుటుంబ వ్యవహారాల పర్యవేక్షణ, వాటికై ఏర్పాట్లు చెయ్యగలగాలి. కుటుంబం అంటే ఏమిటి? ఒక స్త్రీ, ఒక పురుషుడు, వారి పిల్లలతో కూడిన వ్యవస్థ, దాని బాధ్యతలకు మారుపేరు. ఇతర సామాజిక వ్యవస్థల్లానే కుటుంబానికి ఓ నాయకత్వం అవసరం. అదే లేకపోతే కుటుంబ జీవితం విచ్ఛిన్నమయి చివరికి వినాశానికి గురయ్యే ప్రమాదముంది. కుటుంబ పెద్దరికం విషయంలో మూడు మార్గాలు సాధ్యం. ఒకటి, పురుషుడు కుటుంబానికి పెద్దరికం వహించడం; రెండు, స్త్రీ నాయకత్వం వహించడం; మూడు, స్త్రీ పురుషులు ఇద్దరూ ఒకే సమయాన కుటుంబ నాయకత్వపు హోదాను కలిగి ఉండటం.

మూడవ రూపం ఆలోచించదగ్గదికాదు. ఎందుకంటే మన అనుభవం నేర్పేదేమంటే ఇద్దరు పెద్దలున్న చోటు, పెద్దలే లేని చోటికన్నా అధ్వాన్నంగా తయారవుతుంది. భూమ్యాకాశాల సృష్టి క్రియవైపుకు దృష్టిని మళ్ళిస్తూ దివ్య ఖుర్ఆన్ ప్రవచిస్తుంది.

> భూమ్యాకాశాల్లో అల్లాహ్ తప్ప ఇతర దైవం ఉండి
> ఉన్నట్లయితే భూమ్యాకాశాలు రెండూ ఛిన్నా భిన్న మయిపొయ్యేవి.
> (అన్బియా : 21)
> ప్రతి దైవం తన సృష్టితాలను ముఠాగా చేసుకుని ఒకరిపై
> మరొకరు దండెత్తేవారు. (అల్ మోమినూన్ : 91)

ఈ ఊహాదైవాల పరిస్థితే ఇలా ఉంటే కాస్త ఊహించుకోండి, అన్యాయానికి, అత్యాచారానికి ఒడిగట్టే మానవుని పరిస్థితి ఎలా ఉంటుందో!*

---

* చరిత్రచేసిన తీర్పు ఏమిటంటే ఏ శాఖకయినా, ఏ వ్యవస్థకయినా, ఏ సంస్థకయినా

## సహజమయిన ఎన్నిక

ఈ విధంగా మనముందు మిగిలిన విధానాలు రెండే. వాటిని చర్చించడం కన్నా ముందు మేము ఒక ప్రశ్న మీ ముందు ఉంచదలిచాము. తమ శక్తి సామర్ధ్యాల దృష్ట్యా స్త్రీ పురుషుల్లో కుటుంబ పెద్దరికానికి ఎవరు అధికంగా యోగ్యులు కాగలరు? ఈ సమస్య గురించి ఆలోచించడం మొదలెట్టగానే మన ముందుకు వచ్చేవి ఒకటి, బుద్ధిబలం, శారీరక దౌర్ధ్యం గల పురుషుని వ్యక్తిత్వం, రెండు, తన నైజం రీత్యానే భావుకతకు లోనయ్యే, సహజంగానే ఇతరులకు లొంగిపొయ్యే, స్వతహాగా ముందంజ వేసే క్రియాశీలతలేని స్త్రీ మనస్తత్వం. అప్పుడే సమస్య తీరిపోతుంది. స్వయంగా స్త్రీ కూడా బలహీనుడు, తనకు సులభంగా లొంగిపొయ్యే పురుషుణ్ణి ఇష్టపడదు. అతన్ని నమ్మదు. స్త్రీ యొక్క ఈ వైఖరి, కొందరు భావించినట్లు, శతాబ్దాల తరబడి జరిగిన ఆమె మానసిక శిక్షణకు ప్రతి బింబిస్తుందనడం నిజమే కావచ్చు. పరంపరాగతంగా ఆమెలో వస్తున్న మనోమయ వారసత్వానికి నిదర్శనమే కావచ్చు. కాని, స్త్రీ నేడుకూడా శారీరకంగా ఆరోగ్యవంతుడు, శక్తిమంతుడు, ధీశాలి అయిన పురుషునికే ఆకర్షితురాలవుతుందన్నది ఎవ్వరూ కాదనలేని యదార్థం. ఈ వాస్తవం మనకు అమెరికా మహిళల జీవితాల్లో ప్రస్ఫుటంగా ప్రతిఫలిస్తూ దర్శనమిస్తుంది. అమెరికా స్త్రీకి, పురుషునితో పాటు సమానమయిన హక్కులున్నాయి. ఆ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనూ అక్కడ ఆమోదించడం జరిగింది. అయినప్పటికీ పురుషుని బలానికి లొంగి పోవడంలోనే ఆమె ఆనందం అనుభవిస్తుంది. ఆమె అలాంటి పురుషుణ్ణే ప్రేమిస్తుంది, అలాటి వ్యక్తి హృదయాన్ని గెలుచుకునేందుకు ప్రయత్నిస్తుంది. ఆమె పురుషుని దృఢమయిన, విశాలమయిన ఛాతిని చూసి సంబరపడుతుంది. శారీరకంగా అతను ఆమె కన్నా బలవంతుడు, ధీమంతుడు అని గ్రహించగానే

---

నాయకత్వం అనేది ఒక్కటే కాగలదు. ఏ దేశానికయినా ఇద్దరు అధ్యక్షులు, ఇద్దరు ప్రధానమంత్రులు-ఆలోచించడం కూడా అవివేకమే. ఇదే పరిస్థితి కుటుంబానికి వర్తిస్తుంది. ఇందులోనూ నాయకుడు ఒక్కడే కాగలడు.

తన్ను తాను అతనికి అర్పించుకుంటుంది. స్త్రీకి కుటుంబంలో పెద్దరికానికి ప్రాకులాడే ఆసక్తి కొంతకాలమే ఉండేది. పిల్లలు కలిగి వారి విద్యాబుద్ధుల సమస్య వచ్చి పడగానే ఆమె అన్నీ మరచిపోతుంది. ఆ తరువాత ఈ కొత్త విషయాలు ఆమెను ఆక్రమించుకుంటాయి. పిల్లల ఈ సమస్యలుండగా ఇతర బాధ్యతల్ని మోసేందుకు ఆమెకు సమయమే లభించదు. ఎందుకంటే తల్లిగా ఆమె బాధ్యతలు శ్రమతో కూడుకున్నవే కాక ఎంతో శ్రద్ధ,సమయాలనూ కోరుతాయనడంలో సందేహం లేదు.

## దాసికాదు, జీవన సహచరిణి

అయితే, ఇంటిలో స్త్రీ, పురుషునికి బానిసగాను, పురుషుడు ఆమెపట్ల నిరంకుశ ప్రభువుగాను మెలగాలని దీనికి ఎంతమాత్రం భావంకాదు. ఇంటి యాజమాన్యం అన్నది కొన్ని విధులు బాధ్యతలతో కూడుకున్నదే. వాటిని నిర్వర్తించడానికి భార్యా భర్తల్లో ప్రేమానురాగాలు, సహాయసహకారాల వాతావరణం నెలకొనడం తప్పనిసరి. గృహస్త జీవితం విజయవంతంగా సాగాలంటే పరస్పర సదవగాహన, శాశ్వత సహానుభూతి అనివార్యమయిన అవసరాలు. ఇస్లాం, పరస్పర ఘర్షణ, పోటీలకు బదులుగా స్త్రీ పురుషుల మధ్య అనురాగం విలసిల్లాలని, అవగాహన వెల్లి విరియాలని, సానుభూతి సుస్థిరంగా విరాజిల్లాలని, ఇవే కుటుంబ జీవితానికి ప్రాతిపదికలు కాగలగాలని కాంక్షిస్తుంది. దివ్యఖుర్ఆన్ బోధిస్తుంది:

> ఈ స్త్రీలపట్ల మంచితనంతో మెలగండి. (4:19)

మహనీయ ముహమ్మద్ (సఅసం) ప్రవచించారు:

> తన ఇంటివారిపట్ల మంచివాడుగా ఉండేవాడే మీలో ఉత్తముడయినవాడు. (తిర్మిజి)

అంటే, భార్యపట్ల పురుషుని నడవడిని మనిషి యొక్క నైతికతను

కొలిచే ప్రమాణంగా నిర్ణయించారన్నమాట ప్రవక్త మహనీయులు (సఅసం). వాస్తవంగా ఇది ఎంతో సరయిన ప్రమాణం. ఎందుకంటే మనిషి తన భార్య ఎడల సవ్యంగా ప్రవర్తించకపోతే దానిక్కారణం, అతను ఆధ్యాత్మిక రుగ్మతకు లోనయి ఉండాలి లేదా అతనిలో 'మంచి' అన్నదే నశించి ఉండాలి లేదా అతను ఏదో మానసిక సంక్షోభానికయినా గురయి ఉండాలి. ఇంతకు కుటుంబ జీవితంలో భార్యాభర్తల సంబంధాల పట్ల అనేక అపార్థాలు వ్యాపించి ఉన్నాయి. కొన్ని అపార్థాలు, భర్త విషయంలో భార్య యొక్క బాధ్యతలకు సంబంధించినవి. ఇంకా కొన్ని అపోహాలు విడాకులు, బహుభార్యాత్వపు సమస్యలకు సంబంధించినవి. వీటిని సరిగ్గా అర్థంచేసుకోవడం అవసరం.

## సహజం, సమంజసమయిన మార్గం

దాంపత్యం మౌలికంగా వ్యక్తిగతమయిన సంబంధం. ఇద్దరు వ్యక్తుల మధ్య ఏర్పడే ఇతర సంబంధాలు మాదిరిగానే ఇది కూడా ఆయా వ్యక్తుల వైయక్తిక, మానసిక, శారీరక సామరస్యంపై ఆధారభూతమయి ఉంటుంది. వీటిలో ఒక్కటి కూడా చట్టం ద్వారా సృజించడం సాధ్యపడదు. అందువల్ల ఒకవేళ దంపతులెవరయినా సుఖసంతోషాలతో జీవితం గడుపుతున్నారంటే, వారి మధ్య తృప్తి, సామరస్యాలు నెలకొన్నాయంటే వారు వైవాహిక జీవితపు నియమ నిబంధనల్ని కట్టుదిట్టంగా అనుసరించడం వల్లనే ఇది సాధ్యమయింది అని చెప్పలేము. ఎందుకంటే దాపంత్య జీవితంలో తలెత్తిన తీవ్రమయిన వైరుధ్యం చివరికి ఆ దంపతుల మధ్య పటిష్ఠమయిన బాంధవ్యానికి కారణభూతమయిన సందర్భాలు అనేకం. అలాగే ఒక జంటకు వైవాహిక జీవితంలో తీవ్రమయిన విభేదాలు, సంఘర్షణలు ఎదురయితే దానికి కారణం భర్తచేసిన పొరపాటో, భార్య దురుసుతనమో కానవసరంలేదు. భార్యాభర్తలిరువురూ ఎంతో ఉత్తములు, ఉన్నత నైతికతగల వారేకావచ్చు. కాని వారి నైజం భిన్నమయినది కావడంచేత, వారిమధ్య మానసిక సామరస్యం కుదరక పోవడం చేత

వారుభయులూ మనస్ఫూర్తిగా కోరుకున్నా వారి మధ్య సయోధ్య కుదరక పోవచ్చు.

ఈ కారణాలవల్ల చట్టంలోనే, వైవాహిక జీవితానికి సంబంధించిన నియమాలూ, నిబంధనలూ ఉండటం అవసరం. ఎందుకంటే మానవ జీవితపు అతి సున్నితమయిన ఈ సమస్యను పరిష్కరించే మార్గం చూపెట్టకుండా ఏ జీవన వ్యవస్థ కూడా సమగ్రమయింది అనిపించుకో జాలదు. అందువల్ల కావలసిందేమంటే, కనీసపు సాధారణమయిన అతిక్రమించకూడని హద్దుల్ని నిర్ణయించి స్త్రీ పురుషుల్ని అందులో స్వేచ్ఛగా వదిలేసే ఓ చట్టం. ఇక ఆ చట్టం పరిధిలో ఉంటూ ఆలుమగలు మిగతా వివరాలు తామే స్వేచ్ఛగా నిర్ణయించుకోవాలి. ఇవి అనివార్యం. ఆలుమగల మధ్య ప్రేమానురాగాలు విలసిల్లి వారు సుఖశాంతులతో జీవిస్తూ ఉంటే తమ హక్కుల పరిరక్షణ కొరకు వారు న్యాయస్థానం మెట్లెక్కవలసిన అవసరమే ఏర్పడదు. వారు ఎడ ముఖం పెడముఖంగా తయారయి తమ వివాదాలను స్వయంగా తీర్మానించుకోలేని పక్షంలోనే వారు న్యాయస్థానం తలుపు తడతారు.

అయితే ఇలాంటి అవసరానికిగాను ఏర్పడే చట్టం కూడా న్యాయవంతమయిందయి ఉండాలి. అందులో ఒకరిపట్ల అసమంజస మయిన పక్షపాతంగాని, మరొకరిపట్ల అసంబద్ధమయిన వ్యతిరేకతగాని పొడసూపరాదు. అలాగే అది ఎంతో సమగ్రంగా కూడా ఉండాలి. అత్యధిక సందర్భాలకు వర్తించేలా ఉండాలి. ఈ సందర్భంలో ఒకమాట మేము మళ్ళీ గుర్తు చేయదలిచాము. మానవులు నిర్మించిన ఏ చట్టమయినా సరే, ఏ నియమమయినాసరే మానవ జీవితంలో సంభవించే అన్ని పరిస్థితుల్ని, సందర్భాలను ఒకేసారి పరివేష్టించగలగడం సాధ్యమయ్యే విషయం కాదు. అలాగే చట్టాన్ని తు.చ. తప్పకుండా అక్షరాలా అన్నిటా వర్తింప జెయ్యడమే న్యాయమని పేర్కొనలేము, ఆ విధానం పరిపూర్ణమయిందిగా చెప్పలేము.

## ఇది అన్యాయమా?

ఇప్పుడు ఇస్లామీయ చట్టంలో భార్యపైగల బాధ్యతలేమిటో పరిశీలిద్దాము. నేడు జరుగుతున్న ఈ గోల అంతా చట్టంలోని ఈ భాగానికి వ్యతిరేకంగానే కదా. ఇస్లామీయ శాసనాంగం ప్రకారం భార్య యొక్క బాధ్యతల విషయంలో మూడు అంశాలు గమనార్హమయినవి.

(1) ఈ బాధ్యతలు స్త్రీపై దౌర్జన్యానికి ప్రతీకలా?

(2) ఈ బాధ్యతలు ఏక పక్షంగా ఉన్నాయా? వీటికి మారుగా స్త్రీకి ఎలాంటి హక్కులూ లేవా?

(3) ఈ బాధ్యతలు (PERPETUAL) శాశ్వతమయినవా? స్త్రీ వీటినుండి విముక్తం కాదలిస్తే సాధ్యపడదా?

భర్త పక్షంగా స్త్రీపై మూడు అతి ముఖ్యమయిన బాధ్యతలు మోపబడ్డాయి. ఈ బాధ్యతల్ని పై మూడు అంశాల దృష్ట్యా పరిశీలించాలి.

(1) అతడు పడకపైకి ఆహ్వానిస్తే ఆమె అతని కోరికను మన్నించాలి.

(2) భర్త యిష్టపడని ఏ వ్యక్తినీ తన ఇంట్లోకి రానివ్వరాదు.

(3) అతను లేనప్పుడు, అతని పట్ల తన విధేయతపై మచ్చ వచ్చే ఏ పనీ చెయ్యరాదు; అతనిపట్ల నమ్మక ద్రోహాన్ని తలపెట్టరాదు.

ఈ బాధ్యతల్లో మొదటి బాధ్యతను ఎక్కువగా విశదీకరించనవసరం లేదనుకుంటాను. అందులో ఉన్న హేతువు తేటతెల్లంగా ఉంది. పురుషుని శారీరకతత్వమే లైంగిక తృప్తిని స్త్రీకన్నా అధికంగా కాంక్షించే విధంగా రూపొందింది. ఆ తృప్తిని పొందినప్పుడే అతను లైంగిక ఒత్తిడికి దూరమయి జీవనరంగంలో తన బాధ్యతల్ని అధికోత్సాహంతో చురుగ్గా నిర్వర్తించ గలుగుతాడు. ముఖ్యంగా యవ్వనంలో పురుషునిపై కామవాంఛ ప్రాబల్యం వహించి ఉంటుంది. అతనికి స్త్రీ కన్నా అధికంగానే లైంగిక తృప్తి అవసరమవుతుంది. నిజానికి శృంగార పరంగా స్త్రీ పురుషుని కన్నా ఎంతో నర్మగర్భితమయినది. మానసికంగా శారీరకంగానూ ఆమె ప్రవృత్తి ఆ

వైపుకు తీవ్రంగానే మొగ్గుతుంది. కాని స్త్రీలోని ఈ శృంగార ప్రవృత్తి కేవలం శారీరకంగా, రతి చేష్ట ద్వారానే బహిర్గతం కానవసరంలేదు. పెళ్ళి, పురుషుని ఈ సహజసిద్ధమయిన అవసరాన్ని తీర్చేమార్గం, తద్వారా అతను జీవితంలోని ఆధ్యాత్మిక, మానసిక, సామాజిక ఆర్థిక అవసరాలను కూడా ఎదుర్కొంటాడు. ఇక, భార్య భర్త యొక్క ఈ అవసరాన్ని తీర్చకుండా కటువుగా ప్రవర్తిస్తే పురుషుడు ఏం చెయ్యాలి? అతడు ఇతర స్త్రీలతో అక్రమ సంబంధాలు పెంచుకోవాలా? ఏ సభ్యసమాజమూ ఇలాంటి అక్రమ సంబంధాలను భరించదు. ఇంకా తన భర్త శారీరక, మానసిక సుఖాల కోసం తన్ను వదలి ఇతర స్త్రీల ఆకర్షణలకు లోనవడాన్ని భార్య కూడా ఒప్పుకోదు. భార్యాభర్తల సంబంధాలు ఎంతగా చెడిపోయినా ఏ స్త్రీ అయినాసరే ఇలాంటి పరిస్థితిని చల్లని గుండెలతో సహించదు.

స్త్రీ, భర్త కోరికను కాదని పడక సహచర్యాన్ని తిరస్కరించేందుకు మూడు బలమయిన కారణాలు కావచ్చు.

(1) భార్యకు భర్తంటే ద్వేషం. అతనితో లైంగిక సంబంధం ఆమెకు ఇష్టం లేదు.

(2) భర్తనయితే ప్రేమిస్తుంది కాని రతి అంటే ఇష్టంలేదు. అది అసాధారణమయిన పరిస్థితే అయినా క్రియా జీవితంలో తటస్థపడే విషయమే.

(3) ఆమె భర్తను మనసారా ప్రేమిస్తుంది, రతి అన్నా ఇష్టమే కాని ప్రత్యేకంగా ఆ సమయంలో ఆమె రతి కొరకు సన్నద్ధంగాలేదు.

మొదటిది శాశ్వతమయిన పరిస్థితి. అది కేవలం ఓ ప్రత్యేక చర్య లేక ప్రత్యేక కాలంవరకు పరిమితమని చెప్పడానికి వీల్లేదు. ఇలాంటి సందర్భాల్లో వైవాహిక సంబంధం ఇట్టే కాలం మనజాలదు. దానికి సర్వోత్తమ చికిత్స ఒక్కటే. స్త్రీ పురుషులకు వేర్పడే అనుమతి నివ్వడం. ఈ విషయంలో పురుషుని కన్నా ఇస్లాంలో స్త్రీలకే అధికంగా సౌలభ్యాలున్నాయి. ముమ్ముందు మనం దాన్ని పరిశీలిద్దాము.

రెండవ పరిస్థితిలో కూడా భార్య అనాసక్తత శాశ్వతం అయ్యే అవకాశముంది. ఇలా కేవలం భర్త యొక్క కామవాంఛ వల్లనే జరగదు. అది ఒక వ్యాధి. దానికి సంపూర్ణ చికిత్స జరగాలి. అప్పుడే భార్యాభర్తల మధ్య పరిపూర్ణమయిన అవగాహన, సామరస్యాలు ఉత్పన్నమవుతాయి. భార్యకు ఇష్టం లేకపోతే మొదట భర్తే కాస్తంత త్యాగం చూపాలి. లేకపోతే భార్య భర్త కోరికను తీర్చేందుకు సిద్ధమవాలి. ప్రేమ కోరేది ఇలాంటి త్యాగమేకదా. అప్పుడే వేర్పాటు జరిగే ప్రసక్తిరాదు. భార్యాభర్తలు ఇలాంటి ఓ అవగాహనకు రావడంలో విఫలమయితే అప్పుడు వారు సౌజన్యంతో వేర్పడటమే మంచిది. కాని వారు వైవాహిక బంధంలో సహజీవనం సాగిస్తున్నంతకాలం ఇస్లామీయ చట్టం కోరేదేమంటే రతి విషయంలో భార్య సర్దుబాటు చేసుకుని భర్త కోరికను తీర్చాలి. ఇదే సహజమయిన పద్ధతి కూడా. స్త్రీపై ఎలాంటి బలాత్కారం లేదు. చట్టం యొక్క లక్ష్యం, భర్తను అడ్డదారులు త్రొక్కకుండా లేక రెండో పెళ్ళి చేసుకోకుండా ఆపడమే. ఇవి 'ఇష్టంలేని రతి' కన్నా కష్టదాయకమయిన విషయాలు. కాని వైవాహిక సంబంధాలు ఇలా ఒత్తిడుల మధ్య చిరకాలం ఉండటం ఇస్లాంకు ఇష్టంలేదు. ఈ ఒత్తిడి మూలంగా భార్యకు భర్తపట్ల విరక్తి పెరిగి మాటి మాటికీ బలాత్కారపు రతివల్ల విసుగు జనిస్తుంది. అందువల్ల ఈ సందర్భంలోనూ వారిరువురికీ శ్రేయస్కరమయింది విడిపోవడమేకాని మరొకటి కాదు.

మూడో పరిస్థితి తాత్కాలికమయింది. దాన్ని సులువుగా నివారించవచ్చు. స్త్రీ రతిని కాదన్నదంటే శారీరక అలసట, గ్లాని కావచ్చు, బలహీనత, ఏదయినా పనిలో నిమగ్నత కూడా కావచ్చు. ఏమయినా అది తాత్కాలిక మయినదే. స్త్రీ తన మానసిక, శారీరక తత్వాల రీత్యా ఈ స్థితిపై అదుపు సాధించగలుగుతుంది. స్త్రీలోని ఈ నిరాసక్తతను కానుకల ద్వారా, లాలింపుద్వారా, ఆమెను సంతోషపెట్టి మార్చడానికి వీలుంది. అలాగే రతి క్రీడకు పూర్వం ఉపరతి (FORE PLAY) ద్వారా కూడా ఈ స్థితిని నివారించ వచ్చు. ఉపరతివల్ల రతి కేవలం శారీరకమయింది మాత్రమే కాక మానసిక

మయినదిగా, ఉన్నత ఆత్మవికాసమయిన అనుభవంగా కూడా రూపొందుతుంది. ఈ విధానం ద్వారా స్త్రీలో జనించిన రతిపట్ల విరక్తికి కారణాల్ని దూరం చెయ్యడం కూడా సాధ్యమే.

దీనికి భిన్నంగా ఒక భార్య భర్తతో రతిని కోరగా భర్త ఏ అసాధారణ కారణాలవల్లనే దానికి సిద్ధం కాలేకపోతే (పురుషుల్లో ఇలాంటి పరిస్థితి ఎదురవడం బహు అరుదు) ఇస్లామీయ శాసనాంగం భార్యను నిరాదరంగా వదల్లేదు. ఆమె, వైవాహిక బాధ్యతను నెరవేర్చేందుకు భర్తను నిర్బంధించ గలదు. భార్య, భర్త కోరికను మన్నించాలని అభిలషించే ఇస్లామీయ శాసనం, భార్యయొక్క ధర్మబద్ధమయిన కోరికను భర్త నెరవేర్చాలన్న కట్టు దిట్టం కూడా చేసింది. భార్యను లైంగికంగా సంతృప్త పరచడం భర్త బాధ్యతగా అది నిర్ణయిస్తుంది. ఒక భర్త భార్యకు లైంగిక తృప్తిని ఇవ్వలేకపోతే భార్య కోరికపై వారి నికాహ్ (వివాహబంధం) త్రెంచి వెయ్యటం జరుగుతుంది. దీనివల్ల తెలిసిందేమంటే ఇస్లామీయ శాసనంలో స్త్రీ పురుషుల్లో ఎవరి హక్కులనూ విస్మరించడం జరగలేదు. వారి బాధ్యతల్ని ఉపేక్షించడమూ జరగలేదు. ఇందులో భార్యపట్ల అవమానం కలిగించేదో, ఆమెను కించపరచేదో లేక ఆమెపై దౌర్జన్యానికి ఆస్కారమిచ్చేదో ఏ నియమమూ లేదు.

## కుటుంబంలో సౌమనస్యం కోసం

భర్త తరఫున భార్యపై మోపబడ్డ రెండో బాధ్యత ఏమిటంటే భర్త ఏ వ్యక్తి రాకపోకలనయితే ఇష్టపడడో అలాంటి వ్యక్తిని భార్య తన ఇంటిలోకి రానివ్వరాదు అన్నది. (దీనికి భార్య శీలవతి అనడానికీ ఎలాంటి సంబంధం లేదు. ఎందుకంటే స్వతహాగా అక్రమ సంబంధమే ఇస్లామీయ శాసనం ప్రకారం గొప్ప నేరం. ఒకవేళ పురుషుడు అలాంటి సంబంధాన్ని గర్హించకపోయినా షరీఅత్ ప్రకారం దానికి దూరంగా ఉండటం తప్పనిసరి, లేకపోతే చేసిన అపరాధానికి ఆమె శిక్ష అనుభవించవలసి ఉంటుంది). ఈ ఆదేశానికి అసలు హేతువు ఏమిటో చాలా తేలిగ్గా

బోధపడుతుంది. నిజానికి భార్యా భర్తల మధ్య తలెత్తే అనేక వివాదాలకు మూల కారణం బయటివారి జోక్యమే అన్నది జగమెరిగిన సత్యం. వారు అక్కడి మాటలిక్కడ, ఇక్కడి మాటలక్కడ చేరవేసి కుటుంబం మధ్య చిచ్చుపెడతారు. ఇలాంటి ఏదయినా కారణం చేత భర్త ఫలానా వ్యక్తిని ఇంటిలోకి రానివ్వరాదని ఆంక్షలు విధించినప్పుడు భార్య దాన్ని త్రోసి పుచ్చినట్లయితే పరస్పర సంబంధాలు సవ్యంగా ఉండవు. ఇలాంటి పరిస్థితుల్లో ఇల్లు రణరంగంగా మారుతుంది. వారి మధ్య అవగాహన, అనురాగాల సకల అవకాశాలూ అంతమయి పోతాయి. కుటుంబం, పిల్లల భవిష్యత్తు, వారి బాగోగులు సక్రమంగా ఉండాలంటే భార్య తన ఈ బాధ్యతను సంతోషంగా నిర్వహించాలి. పిల్లలకు సరయిన, సముచితమయిన పోషణ, శిక్షణ, ప్రేమానురాగాలు, సంతోషకరమయిన వాతావరణంలోనే లభించగలుగుతాయన్నది వేరే చెప్పనవసరం లేదు.

ఈ సందర్భంలో ఓ ప్రశ్న తలెత్తవచ్చు. చట్టంరీత్యా భార్య, భర్త ఇష్టపడని వ్యక్తిని ఇంటిలోకి రానివ్వకూడదంటే, భార్యకు ఇష్టంలేని వ్యక్తిని ఇంటిలోకి రానివ్వకుండా చూడటం భర్త బాధ్యత ఎందుకు కాకూడదు? భార్యా భర్తలు సంస్కారవంతులు, బుద్ధిమంతులయితే సుఖసంతోషాలతో వారి జీవితం గడుస్తూ ఉంటే ఇలాంటి ప్రశ్న అసలు ఉత్పన్నం కాకపోవచ్చు. ఒకవేళ ఉత్పన్నమయినా వారు దాన్ని నేర్పుగా పరిష్కరించుకుంటారు కూడా. కాని ఒకవేళ ఇలాంటి ప్రశ్న వల్ల వెగటు చోటుచేసుకుంటే, దాన్ని వారించడం వారికి సాధ్యం కాలేకపోతే వారు న్యాయస్థానానికి పోవలసి ఉంటుంది. ఎందుకంటే ఈ సమస్య కడు సున్నితమయిందీ చిక్కుతో కూడుకున్నదీను. ఒకవేళ భార్యకు, తాను ఇష్టపడని వ్యక్తిని ఇంట్లోకి రానివ్వకుండా చేసే హక్కు గనక ఉన్నట్లయితే వ్యవహారం బెడిసి కొట్టే ప్రమాదముంది. ఎందుకంటే అనేక విషయాల్లో స్త్రీ భావాలు ఉద్రేక పూరితంగా ఉంటాయి, హేతువుకు, బుద్ధి పరిధికీ దూరంగా స్వేచ్ఛా విహారం చేస్తాయి. అవి దూరదృష్టిని, విజ్ఞతను ప్రదర్శించేవిగా కాక ఆమె ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించేవిగా ఉంటాయి. ఒక్కోసారి అవి అత్తింటి వారితో ఏర్పడ్డ మనస్పర్థలకు ప్రతిక్రియగా దర్శనమిస్తాయి. అందువల్ల

ఈ విషయంలో భర్త, భార్య ఇష్టానికి కట్టుబడి ఉండాలని భావించడం వివేకవంతం కాదు. ఇలాంటి ఓ నియమాన్ని ఎక్కువ కాలం పాటించడం కూడా కష్టమే. ఇది మానవ ప్రకృతికే విరుద్ధం.

అంటే, భర్త ఎప్పుడూ తప్పు చెయ్యనే చెయ్యడని దీని భావంకాదు. అతడు కొన్ని పర్యాయాలు పిల్ల చేష్టలు చెయ్యడం, చంచల స్వభావం కనబరచడం కూడా సాధ్యమే. అలాగే, తప్పులు నిత్యం భార్యవల్ల మాత్రమే జరుగుతాయని కూడా దీనికి అర్థంకాదు. ఎందుకంటే ఒక్కోసారి భార్యకు భర్తపట్ల న్యాయంగానే విహ్యాభావం కలగవచ్చు. భార్యాభర్తల సంబంధాలు పాడవడానికి అసలు కారణం భర్తే కావచ్చు. కాని చట్ట నిర్మాణం ఇలాంటి ప్రత్యేక పరిస్థితులను దృష్టిలో ఉంచుకుని చెయ్యడం జరగదు. సాధారణ పరిస్థితులు, సాధారణ మనుషులకు గాను జరుగుతుంది. సాధారణంగా పురుషుడు స్త్రీ కంటే కాస్త ఎక్కువగా సమంజసతను ప్రదర్శిస్తాడు. అందువల్ల పురుషునికి స్త్రీపై ఒకింత ఆధిక్యత ఉంది. కాని స్త్రీ, తన భర్తతో కాపురం చెయ్యడం దుర్లభమని భావిస్తే అతన్నుండి విడిపొయ్యే హక్కు ఆమెకుంది.

ఇక మూడవ బాధ్యత. అంటే, భర్త లేనప్పుడు తన శీలాన్ని, మానాన్ని, అతని సంపదను, ఆస్తిని కాపాడటం అన్నది. ఇది పెళ్ళికి సహజమయిన, తార్కికమయిన పర్యవసానం. ఈ విషయంలో అధికంగా చర్చించే అవసరం కూడా లేదేమో. కాని ఈ బాధ్యత ఏక పక్షమయింది కాదు. ద్వైపాక్షికమయింది. అంటే భార్యాభర్తలిద్దరికీ అవసరమయింది. వారిరువురూ పరస్పరం విశ్వసనీయులుగా, శ్రేయోభిలాషులుగా జీవించాలంటే ఈ నియమాన్ని ఇరువురూ పాటించడం అవసరం.

## చట్టంతోనే సరిపోదు

ఇప్పుడు భార్యాభర్తలు ఏ విధంగా ఒకరికొకరు అన్యాయం

చేసుకుంటారో ఆ విషయాన్ని పరిశీలిద్దాము. పురుషుడు ఇంటి యజమాని, ఇంటి అవసరాలు తీర్చే బాధ్యత గలవాడు. గనక తన భార్య తలబిరుసుతనం, తిరుగుబాటు వైఖరిగలదయితే ఆమెను చక్కదిద్దడానికి అవసరమయితే, శిక్షించే హక్కును దిగువ పేర్కొన్న ఆయత్ లో ఇవ్వడం జరిగింది.

> ఏ మహిళలయినా తలబిరుసు తనంతో వ్యవహరిస్తున్నారని మీరు అనుకుంటే వారికి (తొలుత) నచ్చజెప్పండి, (తర్వాత) పడకల్లో వేరుగా వదిలెయ్యండి, (ఆ తరువాత) కొట్టండి. ఇక ఆపై వారు విధేయత పాటించ నారంభిస్తే వారిపై దౌర్జన్యం చేసేందుకు సాకులు వెదక్కండి. (4:34)

ఈ ఆయత్‌లో తలబిరుసుగా వ్యవహరించే భార్యను సంస్కరించడానికి ఓ ప్రత్యేకమయిన క్రమం ప్రతిపాదించడం జరిగింది. శారీరక శిక్ష అన్నింటికీ చివరన వస్తుంది. కొందరు పురుషులు తమకు లభించిన ఈ అనుమతిని దుర్వినియోగ పరుస్తారన్నది యదార్థమే. కాని ఈ ధోరణి కేవలం ఈ ఒక్క హక్కు విషయంలోనే కాదు ఇతర హక్కుల విషయంలోనూ కానవస్తూ ఉంటుంది. దీనికి నివారణ, మనుషుల్లో ఆధ్యాత్మిక, నైతిక ఔన్నత్యాన్ని సృజించడం ద్వారానే సాధ్యం. నైతికపు విలువల ప్రాముఖ్యాన్ని ఇస్లాం ఎన్నడూ ఉపేక్షించలేదు. కాగా పైన పేర్కొన్న ఆయత్‌లో సూచించిన నియమం యొక్క ఉద్దేశ్యం వైవాహిక జీవితాన్ని పరిరక్షించడం, పటిష్ఠ పరచడమే. ఒక నియమావళి లేక చట్టం ప్రయోజనకరంగా, ప్రభావవంతంగా రూపొందాలంటే దాని వెనక అమలు జరిపే ఓ శక్తి కూడా ఉండాలి. అతిక్రమించేవారిని అది శిక్షించాలి కూడా. ఈ అమలు జరిపే శక్తి లేకున్నట్లయితే చట్టం కేవలం వట్టి మాటల మూటలయి పోతుంది. క్రియా ప్రపంచంలో దాని ప్రభావం శూన్యమే.

## ఉద్దేశ్యం సంస్కరణే

పెళ్ళి ఉద్దేశ్యం స్త్రీ పురుషుల శ్రేయోసుఖాలు. గృహం ప్రేమసీమగా, శాంతినిలయంగా అలరారాలన్నది దాని లక్ష్యం. అప్పుడే భార్యాభర్తలు చట్టంతో పనిలేకుండా ఇతోధికంగా భౌతిక, ఆధ్యాత్మిక ప్రయోజనాలను తమ సొంతం చేసుకోగలుగుతారు. కాని ఆలుమగల మధ్య అభిప్రాయభేదాలు, వివాదాలు తలెత్తితే వాటి చెడు ప్రభావం కేవలం వారి వరకే పరిమితం కాదు. వారి సంతానం అంటే భావితరం వారివరకు కూడా విస్తరిస్తుంది.

ఒకవేళ గృహస్థ జీవితంలో వెగటును వెదజల్లేపాత్ర భార్యదే అయితే ఆమెను సంస్కరించే బాధ్యత ఎవరిది అన్నదే అసలు ప్రశ్న. ఈ బాధ్యత వహించడం న్యాయస్థానానికి సాధ్యమా? వాస్తవమేమంటే, భార్యాభర్తల అంతర్గత వ్యవహారాల్లో న్యాయస్థానం కలగజేసుకుంటే వ్యవహారం మెరుగవడం అలా ఉంచి అది మరీ అధ్వాన్నమే అవుతుంది. వారి వివాదాలు తాత్కాలికమయినవిగా అతి సాధారణమయినవిగా ఉన్నా ఒకసారి అవి న్యాయస్థానం ముఖం చూశాయంటే చిక్కు చిక్కుగా, ప్రమాదకరంగా పరిణమించడం సాధ్యమే. ఎందుకంటే ఆ తరువాత ప్రత్యర్థుల్లో మొండితనం, మంకుపట్టు పెరిగి వారు రాజీకి దిగివచ్చే దారి లేకుండా చేస్తుంది. అందువల్ల అత్యంత సమంజసమయిన పద్ధతి ఏమంటే కుటుంబ జీవితంలోని చిన్న చిన్న తగాదాలను కోర్టులకు ఎక్కించడం భావ్యంకాదు.

బుద్ధి ఉన్న ఏ మనిషీ జీవితంలో చీటికి మాటికి ఎదురయ్యే చిట్టిపొట్టి వ్యవహారాలను కోర్టుల కెక్కించడు. అలా జరిగితే ఇక ఇంటింటా ఓ కోర్టు వెలుస్తుంది. అంటే ప్రతి ఇంట్లో, ఇంటిని చక్కదిద్దే ఓ వ్యవస్థ ఉండటం అవసరం. కుటుంబానికి పెద్ద అవడం చేత పురుషుడు ఇంటిలో ఈ బాధ్యతను నిర్వర్తిస్తాడు. పై ఆయత్‌లో, భార్య ఆత్మగౌరవానికి

భంగం కలగకుండా హితోపదేశం ద్వారా ఆమెను సంస్కరించేందుకు ఆదేశించడం జరిగింది. ఫలితంగా భార్య తన్ను తాను చక్కదిద్దు కుంటే విషయం అంతటితో ముగుస్తుంది. కాని ఆమె తన తప్పును సమర్థించుకుంటూ మొండిగా వ్యవహరిస్తే భర్త భార్యను తన పడకనుండి వేరు చెయ్యాలి. ఈ శిక్ష, మొదటి శిక్ష (నోటి ప్రబోధం) కంటే కాస్త కఠినమయింది. స్త్రీ, మనస్తత్వం పట్ల ఏ మాత్రమయినా అవగాహన ఉన్నవారు, ఇస్లాం ప్రతిపాదించే ఈ విధానంలోని విజ్ఞతను గుర్తించకుండా ఉండలేరు. తన అందచందాలకు, ఆకర్షణలకు తానే విభ్రాంతురాలయి, స్త్రీ, ఒక్కోసారి పొగరు మోతుగా తయారయి, బరి తెగించి తనభర్త పట్ల విచ్చలవిడిగా అవిధేయతా వైఖరిని అవలంబించడం సాధ్యమే. ఈ యదార్థాన్ని ఇస్లాం గుర్తించింది. దీన్ని దృష్టిలో ఉంచుకొని పై శిక్షను పరిశీలిస్తే పడకలో భర్తకు దూరమవడం చేత స్త్రీ ఎంత మనస్తాపానికి గురవుతుందో తెలుస్తుంది. ఆమె తన అందచందాలతో హొయలుతో, ఒయ్యారాలతో భర్తను వశపరచుకోలేక పోయిందన్నమాట! స్త్రీకి ఎంత గొప్ప గర్వభంగం!! దీని పర్యవసానంగా ఆమె తిరిగి సమంజసమయిన వైఖరి అవలంబించే ఆస్కారముంది. ఒకవేళ ఈ శిక్ష తరువాత కూడా ఆమెలో మార్పు రాలేకపోతే భావమేమిటి? ఆమె పొగరుమోతు తనం, పెడసరితనం శారీరక శిక్షకు తప్ప మరోవిధంగా మారదన్నమాట.

ఇలాంటి పరిస్థితి ఏర్పడినప్పుడు భర్తకు అనుమతించడం జరిగింది – చివరిసారిగా ఆమెను కొట్టేందుకు. కాని ఈ కొట్టడం అన్నది భార్య సంస్కరణ లక్ష్యంతో జరగాలి కాని ఆమెను బాధపెట్టేందుకు కాదు. అందువల్లనే ఇస్లామీయ చట్టంరీత్యా దెబ్బలు చాలా నెమ్మదిగా తేలిగ్గా కొట్టాలి.

స్త్రీ పట్ల ఈ వైఖరిని అవలంబించడం ఆమెని అవమానపరచడంతో, ఆమె ఆత్మగౌరవానికి భంగం కలిగించడంతో సమానమా? కాదు. ఈ విషయాన్ని మనం చర్చించేటప్పుడు మొదట గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే, ఇదొక ముందు జాగ్రత్తలాంటి ఉపాయం మాత్రమే అన్నది.

ఇంకా ఈ పద్ధతిని, సంస్కరణా మార్గాలన్నీ వ్యర్థమయిన తరువాతనే అవలంబించడం జరుగుతుంది అన్నదీను.

గుర్తుంచుకోవలసిన రెండో విషయం ఏమిటంటే, కొన్ని మానసిక రుగ్మతలు, కొన్ని చెడులకు లోనయిన వ్యక్తుల సంస్కరణ శారీరక శిక్ష ద్వారా తప్ప మరోవిధంగా సాధ్యం కాదు. మానసిక శాస్త్రం మనకు తెలిపేదేమంటే, సాధారణ పరిస్థితుల్లో పైన పేర్కొన్న విధానాలు - హితబోధ, పడకకు దూరంగా ఉండటం - సంస్కరణకు సరిపోతాయి. కాని కొన్ని మానసిక రోగాలు, ఉదాహరణకు పీడనా ప్రియత్వం (MASOCHISM) లాంటి మానసిక రోగాలకు గురయిన వ్యక్తి చికిత్స శారీరక శిక్షల వల్లనే సాధ్యం. ఈ మానసిక రుగ్మతకు, పురుషులకన్నా మహిళలే అధికంగా గురవుతూ ఉంటారు. ఇలాంటి రోగగ్రస్త స్త్రీలు పరాభవం జరిగినా, దెబ్బలు పడినా ఓ విధమయిన ఆనందానుభూతిని పొందుతారు. (దీనికి భిన్నంగా పురుషులు సాధారణంగా ఏ మానసిక రుగ్మతకు గురవుతారో అది పీడనాతత్వం (SADISM) అనబడుతుంది. దీనికి గురయిన పురుషులు బాధించడం, దౌర్జన్యం జరపడం పట్ల అనారోగ్య ప్రదమయిన ప్రేమను కనబరుస్తారు). భార్య ఇలాంటి పీడనా ప్రియత్వం గల మహిళ అయి ఉంటే, ఆమె సంస్కరణ శారీరక శిక్ష ద్వారానే సాధ్యపడుతుంది. కేవలం ఆ విధంగానే ఆమె మానసికంగా కుదుటపడుతుంది. అప్పుడే ఆమె బుద్ధి మాంద్యం తగ్గి చేతనావస్థలోకి వస్తుంది. ఇక్కడ ఓ విషయం విచిత్రంగా గోచరించవచ్చు కాని వాస్తవం మాత్రం ఇదే - పీడనా తత్వం గల పురుషుడు పీడనా ప్రియత్వం గల స్త్రీ పరస్పరం అన్యోన్యమయిన జంటగా మనగలుగుతారు! కాని వాస్తవానికి వారి పరస్పర సంబంధాలకు ఈ పునాది ఎంతో అనారోగ్యప్రదమయింది! ఇలాగే పీడనా ప్రియులయిన పురుషులు, పీడనా తత్వం గల స్త్రీల జంటల దృష్టాంతాలు కూడా మానవజీవితంలో లభిస్తాయి. ఆ స్త్రీలు అప్పుడప్పుడు తమ భర్తల్ని బాగా ఉతికి వదిలేస్తారు. అలాంటి పీడనా ప్రియులయిన పురుషుల స్వభావం కూడా బాగా ఏకేసిన తరువాతే సక్రమమవుతుంది. ఇది వారి మానసిక అవసరం. దాన్ని వారి భార్యలు తీరుస్తారు. ఇలాంటి జంటలు కూడా

సంతోషంగా జీవిస్తారు. ఇలా బాదటం కొట్టటం అనేది స్త్రీ పురుషుల్లో ఆ తత్వాలు రోగస్థాయికి చేరుకున్నప్పుడే సంభవిస్తుంది. లేకపోతే ఇలాంటి పరిస్థితే ఏర్పడదు.

ఇంతకు ఇస్లామీయ శాసనం, భర్తకు, భార్యను శిక్షించేందుకు అనుమతి నిస్తుందంటే అది కేవలం ముందు జాగ్రత్త లాంటి చర్యగా మాత్రమే కాని మరొకటికాదు. చీటికి మాటికి చిన్న చిన్న తప్పులకు భార్యను శిక్షించేహక్కు ఏ పురుషునికీ లేదు. దివ్యఖుర్ ఆన్ ఆయత్‌లోని నివారణోపాయంలోని క్రమం ఈ సత్యాన్నే విశదీకరిస్తుంది. ప్రవక్త మహనీయుల (సఅసం) ప్రబోధం కూడా ఇదే. పురుషులు ఇతర విధానాలన్నీ ఫలించకపోయినప్పుడు మాత్రమే ఈ అనుమతిని వినియోగించాలని బోధించారు.

> మీలో ఎవరయినా సరే తమ భార్యల్ని గాడిదల్లా బాదడం, ఆ రోజు చివరన (చీకటిపడినప్పుడు) ఆమె అక్కున చేరడానికి తయారవడం– ఇలాంటి వైఖరిని అవలంబించరాదు. (బుఖారి)

## భార్యకు అన్యాయం జరిగినా. ....

భర్త తనపట్ల నిరాదరణతో ప్రవర్తిస్తున్నాడన్న సంశయం స్త్రీలకు కలిగిన పక్షంలో ఆచరించవలసిన నియమం మరో విధంగా ఉంది. దైవ ప్రోక్తం ఈ విధంగా ఉంది.

> ఒకవేళ ఏ స్త్రీకయినా తన భర్తపట్ల చెడునడత, ఉపేక్షా భావాల భయం కలిగితే వారిరువురూ తమ మధ్య ఏదయినా రాజీ కుదుర్చుకోవడంలో తప్పులేదు. ఇలా రాజీ కుదుర్చు కోవడం ఎంతో ఉత్తమం. (4 : 128)

కొందరు ఈ విషయంలోనూ స్త్రీ పురుషుల మధ్య సంపూర్ణ

సమానత్వం కావాలని కోరగలరు. కాని కేవలం కాల్పనికమయిన, సిద్ధాంతపరమయిన న్యాయం కాదు కావలసింది, అది ఆచరణాత్మకమూ అయి ఉండాలి, మానవ స్వభావంతో సామరస్యం కలదీ కావాలి. స్త్రీ- "వెనకబడ్డ" ప్రాగ్దేశాలకు చెందినదయినా, "అభివృద్ధిచెందిన" పశ్చిమ దేశాలదయినా భర్త కొట్టినదానికి బదులుగా భర్తను తానూ కొట్టాలని కోరదు, తన చేతి దెబ్బలు తిన్న బలహీనుడయిన భర్తను స్త్రీ గౌరవాదరణలతో చూడనే జాలదు. ఈ కారణం చేతనే తన్ను కొట్టే హక్కు ఏ విధంగానయితే భర్తకు ఉందో అదే విధంగా తనకూ తన భర్తను కొట్టే హక్కు కావాలని ఏ స్త్రీ కూడా నేటి వరకు కోరలేదు.

ఈ సందర్భంలో మరో ముఖ్య విషయం ఏమిటంటే భర్త చేసే దౌర్జన్యాలను, అత్యాచారాలను, పెట్టే బాధల్ని భార్య నోరుమూసుకుని సహిస్తూ ఉండాలన్నది, దానికి వ్యతిరేకంగా ఎలాంటి షికాయత్ చెయ్యరాదన్నది ఇస్లాం అభిమతం కాదు. ఇలాంటి పరిస్థితిలో స్త్రీ కోరితే అతనితో విడిపోవడానికి హక్కు నిస్తుంది ఇస్లాం.

పై చర్యల వల్ల దిగువ అంశాలు మన ముందుకు వచ్చాయి.

(1). భర్త తరఫున భార్యపై మోపబడ్డ బాధ్యతలు కేవలం శక్తి, ఆధిక్యతల ప్రదర్శనలు కావు. వీటి అసలు లక్ష్యం సమాజంలో సామూహిక సంస్కరణ జరగాలన్నదే. స్త్రీ కూడా సమాజంలోని ఓ అంశమే కదా!

(2). భార్యపై మోపభడ్డ దాదాపు అన్ని బాధ్యతల్లాంటివే భర్తపై కూడా మోపబడ్డాయి. కేవలం కొన్ని సందర్భాల్లో పురుషునికి స్త్రీ కన్నా ఆధిక్యత ఉన్నా దానికి వారిరువురి మధ్య భౌతిక వ్యత్యాస ముందన్నదృక్పథమే ప్రాతిపదిక. స్త్రీని కించపరచడమో, న్యూనతకు గురి చెయ్యడమో దీని ఉద్దేశ్యం కాదు.

(3). స్త్రీ పై పురుషునికి ఆధిక్యత ఉందంటే, దానికి సదృశంగా, భర్త తనపట్ల సవ్యంగా నడచుకోక పోతే స్త్రీకి అతన్ని వదిలేసే చట్ట పరమయిన హక్కు ఉంది.

## విడాకులు – చట్టపరమయిన అంశాలు

భర్తతో విడిపోవడానికి లేక విడాకులు పొందడానికి మార్గాలు మూడున్నాయి. ఈ విడాకుల ద్వారా స్త్రీ వివాహబంధనాలనుండి స్వేచ్ఛను పొంది తన వైవాహిక బాధ్యతలనన్నింటినుండి విముక్తురాలవుతుంది. ఆ మూడు మార్గాలు ఇవి :

అ) నికాహ్ జరిగేటప్పుడు స్త్రీ తన కాబోయే భర్తనుండి విడాకులు తీసుకునే హక్కును పొందాలి. ఇస్లామీయ చట్టంరీత్యా పురుషుడు కోరితే తనకు ఉన్న విడాకుల హక్కును తన భార్యకు సంక్రమింప జెయ్యగలడు. కాని క్రియాత్మకంగా స్త్రీలు ఈ హక్కును వినియోగించుకోరు. చట్టంలో వారికి ఈ హక్కు అయితే వుంది. వారు కోరినట్లయితే దీన్ని వినియోగించుకోగలరు.

ఆ). భర్త అంటే తనకు అసహ్యమని, అతనితో కాపురం చెయ్యడం తన వల్ల కాదని కూడా స్త్రీ న్యాయస్థానం ద్వారా భర్తనుండి విడాకులు పొందగలదు. కొన్ని న్యాయస్థానాలు ఈ నియమాన్ని అమలు పరచటంలేదని, స్త్రీ కోరినప్పటికీ భర్త నుండి ఆమెను వేరు చెయ్యడం లేదని విన్నాము. వాస్తవానికి ఈ విషయంలో ప్రస్ఫుటమయిన ఇస్లామీయ నిబంధనలున్నాయి. ప్రవక్త మహనీయుల (సఅసం) సంప్రదాయం కూడా దాన్ని సమర్ధిస్తుంది. ఇది ఇస్లామీయ శాసనాంగంలో ఓ భాగం అనడంలో, ఎలాంటి సందేహం లేదు. స్త్రీ స్వయంగా విడాకులు కోరినట్లయితే ఇస్లాం ఆమెపై ఒకే ఒక షరతును విధిస్తుంది. అదేమంటే భర్త తనకు ఇచ్చిన నగలు, సామానులు గట్రా అంతా వాపసు చేసివెయ్యాలి. ఇది న్యాయవంతమయిన షరతే. ఎందుకంటే ఒకవేళ విడాకులు ఇచ్చేవాడు పురుషుడయితే తాను భార్యకు ఇచ్చిన మొత్తం సామాను వగైరా భార్యకే దత్తం చెయ్యవలసి ఉంటుంది. అంటే, వివాహబంధంనుండి ఎవరు స్వేచ్ఛ కోరితే వారు – భార్య అయినా, భర్త అయినా సరే – కొంత భౌతిక నష్టాన్ని భరించవలసిందే అన్నమాట.

(ఇ). స్త్రీ న్యాయస్థానం ద్వారా విడాకులు పొందటంతో పాటు అతన్నుండి తన సారె సామాను, నగలు భరణం వగైరా కూడా దక్కించుకోవచ్చు. అయితే ఆమె న్యాయస్థానంలో భర్త తన పట్ల చెడుగా ప్రవర్తించాడని, తన పోషణ కొరకు భరణం (MAINTENANCE) ఇవ్వలేదని రుజువు చెయ్యాలి. న్యాయస్థానం ఆమె చేసే ఈ వాదనను అంగీకరించి తృప్తి చెందితే వారి నికాహ్‌ను రద్దు చేసి ఆమె హక్కులన్నీ లభించేలా ఆదేశాలు జారీ చెయ్యగలదు.

ఇస్లాం స్త్రీకు ప్రసాదించే హక్కులివి. వీటిని అవసరాని కనుగుణంగా ఆమె వినియోగించుకోగలదు. స్త్రీలకు లభించిన ఈ హక్కుల మూలంగా స్త్రీ పురుషుల మధ్య హక్కుల సమతూలనం నెలకొంటుంది. పురుషునికి స్త్రీపై ఆధిక్యత ఉందంటే స్త్రీకి కూడా దానికి బదులుగా కొన్ని అదనపు హక్కులున్నాయి.

## విడాకులు : అభిశాపమా? వరమా?

విడాకులు కారణంగా అసంఖ్యాక కుటుంబాలు కష్టాలకు గురవుతున్నారన్న విషయం నిజమే. విడాకులవల్ల ఉత్పన్నమయిన కుటుంబ కలహాలు కోర్టుల్లో పేరుకుపోతున్నాయి - ఇవి ఎప్పటికయినా అంతమవుతాయా అన్న అనుమానం కూడా కలుగుతుంది. ఓ స్త్రీ ఆనందోత్సాహాలతో విశ్వసనీయురాలయిన భార్యగా తన చంటిపాప పెంపకంలో రేయనక పగలనక నిద్రనక సుఖమనక నిమగ్నమయి ఉంటుంది. భావి జీవితపు సుఖసంతోషాల కలలు కంటూ ఉంటుంది. అకస్మాత్తుగా భర్త తరఫున ఓ కాగితం ముక్క వచ్చి చేరుతుంది - విడాకుల పత్రం! ఆమె ప్రశాంత జీవితం అల్లకల్లోలమయి పోతుంది. భర్త చేసే ఈ చేష్టకు కారణం ఏదయినా - తాత్కాలిక ఉద్రేకమో లేక అభిప్రాయ భేదమో మరేమో కావచ్చు. కారణమేదయినా దాన్ని ఆధారంగా తీసుకుని స్త్రీ విమోచనోద్యమకారులు చెప్పేదేమంటే, పురుషునికి లభించిన విడాకులనే

ఈ ప్రమాదకరమయిన అస్త్రం ద్వారా అతను ఏ నిముషంలో నయినాసరే క్షణికమయిన భావోద్రేకాలకు లోనయి అమాయకురాలయిన సహనమూర్తి అయిన ఓ స్త్రీ జీవితాన్ని నాశనం చెయ్యగలడు. దీన్ని అతన్నుండి లాక్కోవాలి. అప్పుడే అతను దాన్ని అపమార్గాన ఉపయోగించి ఎవరికయినా నష్టం చేకూర్చకుండా ఉండగలడు.

సంతానంపై, అర్ధాంగిపై దాపురించే కష్టాలు బాధలకు ఓ కారణం ఈ విడాకులే అన్న విషయమూ నిజమే. కాని వీటికి పరిష్కారం ఏమిటన్నదే అసలు ప్రశ్న. పురుషున్నుండి విడాకుల హక్కును లాక్కోవడంవల్ల సమస్య తీరిపోతుందా? అయితే పురుషుణ్ణి విడాకుల హక్కుకు దూరం చేస్తే తలెత్తే పర్యవసానాలు ఎంత భయంకరంగా రూపొందుతాయో, వాటిని నివారించడం ఎంతకష్టమో, విడాకుల్ని పూర్తిగా నిషేధించిన ఒక్క రోమన్ కేథలిక్కు దేశాలను చూస్తేనే బోధపడుతుంది. వివాహాన్ని శాశ్వత బంధుత్వంగా, విడదీయరాని బంధంగా చేస్తే పరస్పరం అసహ్యించుకునే నిత్యం కలహించుకునే భార్యాభర్తల జీవితం ఎలా ఉంటుందో కాస్త ఊహించండి. నైతిక అపరాధాలు పెచ్చుపెరగడానికి ఇలాంటి పరిస్థితులు దోహదపడవా? భార్యాభర్తలు లైంగిక సుఖాన్ని పొందడానికి ఇంటికి వెలుపలి విటుల కోసం వెలయాలుల కోసం వేట నారంభించరా? ఇలాంటి నికృష్టమైన కంపుకొట్టే చీకటివాతావరణంలో పిల్లల పెంపకం సరయిన పద్ధతిలో జరగడం సాధ్యమా? పిల్లలపెంపకానికి అవసరమయిన తల్లిదండ్రుల ప్రేమ వాత్సల్యాలు, ఆనందమయమయిన వాతావరణం, సవ్యమయిన సామాజిక పరిస్థితులు అక్కడ ప్రాప్తమవుతాయా? అక్కడే మనుషుల జీవితాల్లో మానసిక సమస్యలు, వ్యాకులతలు ఉత్పన్నమవుతాయి. మూలకారణం? నిత్యం పోరుప్రియులయిన తల్లిదండ్రులు!

కొన్నివర్గాలు చేసే ప్రతిపాదన ఏమంటే పురుషునికిగల విడాకుల హక్కును కొన్ని నిర్బంధాల ద్వారా పరిమితం చెయ్యాలి. అంటే అది కేవలం పురుషుని ఇష్టం ప్రకారం జరక్కుండా ఈ అధికారం కోర్టులకు

లభించాలి. కోర్టువారు ఇరువర్గాల మధ్యవర్తుల్ని కూర్చోబెట్టి వారి మధ్య రాజీ కుదర్చడానికి ప్రయత్నించాలి. అందు విజయం సాధించలేకపోతే విడాకుల డిక్రీని జారీచెయ్యాలి. కాని విడాకుల డిక్రీకి పూర్వం మధ్యవర్తుల వ్యవహారాన్ని బాగా క్షుణ్ణంగా విచారించాలి. భర్త విడాకులు వాపసు తీసుకునేలా భార్యాభర్తల మధ్య రాజీ కుదిరేలా శాయశక్తులా కృషిచెయ్యాలి. అప్పుడు మాత్రమే విడాకులు ప్రకటించాలి - అదీ న్యాయస్థానమే కాని భర్త కాదు.

## సయోధ్యకు సరయిన పద్ధతి

మా అభిప్రాయంలో భార్యాభర్తల మధ్య రాజీ కుదర్చడానికి ఇలాంటి ప్రయత్నాలు జరగడం మంచిదే. చట్టపరంగా వీటిపై ఎలాంటి అభ్యంతరము రాదు కూడ. కాని న్యాయస్థానం ఈ విషయంలో జోక్యం చేసుకునే అవసరం లేదు. ఎందుకంటే ఇస్లామీయ శాసనాంగంలో ఈ సమస్యకు సూచించబడిన పరిష్కారం మనకు చాలు. *అదుండగా మరో పరిష్కారమార్గాన్ని వెదికే అవసరం లేదు. రాజీ విషయం అత్యధికంగా భార్యాభర్తలపైనే ఆధారభూతమయి ఉంది. వారిరువురు చిత్తశుద్ధితో రాజీకై సిద్ధమయితే ఈ విషయంలో వారి బంధుమిత్రులు, న్యాయస్థానాలకన్నా ఎక్కువగా సహకరిస్తారు. కాని వారిరువురి హృదయాల్లోనే అలాంటి కోరిక లేకపోతే ప్రపంచంలోని ఏ శక్తీ ఏ ఉన్నతోన్నత న్యాయస్థానమూ వారిని చేరదీసి రాజీ కుదర్చజాలదు. నేడు కూడా ప్రపంచంలో కొన్ని

---

* దివ్య ఖుర్ఆన్‌లో ఉంది: మీకు ఇద్దరి (భార్యాభర్తల) మధ్య తీవ్రమయిన విభేదాలు పొడసూపే ప్రమాదం గనక అగుపిస్తే అవి అధికమవకుండా జాగ్రత్త వహించే ఒక మార్గమేమిటంటే ఒక మధ్యవర్తి పురుషుని తరఫున మరో మధ్యవర్తి స్త్రీ తరఫున నియమించి పంపండి. వారిరువురు విభేదాలను దూరంచేసి వాస్తవంగానే సంస్కరణా భిలాషులయితే అల్లాహ్ వారుభయుల మధ్య సయోధ్య కుదిరే సద్బుద్ధి కల్పిస్తాడు. అల్లాహ్ అన్నీ ఎరిగినవాడు, ఆయనకు అన్నీ తెలుసు.

(అన్ నిసా : 35)

దేశాల్లో అవగాహన, రాజీమార్గాలు అన్నీ విఫలమయిన తరువాత న్యాయస్థానాలే విడాకుల పత్రాలు జారీచేస్తాయి. ఇంత చేసీ ఈ దేశాల్లో జరిగే వేలాది విడాకుల్ని నివారించడం సాధ్యం కాలేదు. కేవలం అమెరికాలో విడాకులు సంవత్సరానికి నలభయిశాతం జరుగుతాయి. ప్రపంచంలోకెల్లా అత్యధిక సంఖ్య ఇది.

భర్త న్యాయస్థానాల్లో సక్రమంగా అన్ని ఆధారాలతో తప్పంతా తన భార్యదేనని, ఆవిడతో తాను సంసారం చెయ్యలేనని రుజువుచేసి న్యాయస్థానం దానికి తృప్తి చెందిన తరువాతే విడాకులు ఇవ్వాలి అన్న ధోరణి వల్ల స్త్రీకి ఏదయినా ప్రయోజనం ఒనగూడుతుందని మేమనుకోవడంలేదు. పురుషుడు న్యాయస్థానాన్ని సంతృప్త పరచలేకపోయినప్పుడు విడాకులు తప్పించుకున్న ఆ స్త్రీ అలాంటి ఇంట్లో ఉంటూ పొందే గౌరవం, స్థానం ఏముందనీ? రేయింబవళ్ళు అనుక్షణం - నీ భర్త నీవంటే విసుగుచెందాడు, నీవిక్కడ ఓ భారం తప్ప మరేమీ కావు అన్న ధోరణి వేధిస్తున్నచోట ఆమె సుఖపడుతుందా? ఇలాంటి ఇంట్లో వీలయితే తన భర్తపట్ల ద్రోహం చెయ్యడానికే ఉండాలని అనుకుంటూ ఉండడానికి స్త్రీ మొరాయించడం భావ్యమా? ఏ చట్టమూ ఇలాంటి పరిస్థితిని సమర్థించదు. ద్వేషం నలువైపులా అలుముకున్న ఆ ఇంటి గోడల మధ్య స్త్రీ మూగగా ఆవేదన పడుతూ క్షణం క్షణం పరాభవాగ్నిలో దహించుకుపోతూ గడపడాన్ని కూడా ఏ న్యాయమూ ఒప్పుకోదు. పోతే, తన సంతానం శిక్షణ కోసం, వారి బాగోగులకోసం ఆమె అలాంటి ఇంట్లో కాపురం చెయ్యాలా? ఏ ఇంట్లో తనపట్ల అన్యాయపు చీకట్లు చోటుచేసుకున్నాయో అక్కడ ఆమె సంతానం తర్ఫీదు పట్ల ఏ విధంగా శ్రద్ధ చూపగలుగుతుంది, ఆ బాధ్యతల్ని ఏ విధంగా నిర్వర్తిస్తుంది?

నిజానికి ఈ సమస్యలన్నింటి పరిష్కారం, యావత్తు సమాజాన్ని నైతికంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా సంస్కరించడం ద్వారానే సాధ్యం. దీనిగ్గాను మానసిక పరిశుద్ధతాక్రియ సుదీర్ఘంగా కొనసాగవలసి ఉంటుంది. అప్పటిగ్గాని మంచి అన్నది సర్వత్రా ఆధిక్యత-పొందజాలదు, సామాజిక

జీవితానికి ఓ ఆరోగ్యవంతమయిన ప్రాతిపదిక ప్రాప్తం కాదు. ఇలాంటి పవిత్ర వాతావరణంలోనే పురుషుని హృదయంలో వైవాహిక సంబంధం పవిత్రమయిందన్న భావం, దాన్ని క్షణికమయిన ఉద్రేకానికి లోనయి తెంచివెయ్యడం సమంజసం కాదన్న భావం జాగృతం కాగలదు.

నైతిక, ఆధ్యాత్మిక పరిణామాల ఈ ప్రక్రియ ఎంతో నెమ్మదిగా సుదీర్ఘకాలం వరకు జరుగుతుంది. దీనిగ్గాను సామాజిక జీవితాన్ని ఇస్లామీయ శాసనపరిధిలో పునర్వ్యవస్థీకరించవలసి ఉంటుంది. ఈ లక్ష్యసాధనకు సకల సామూహిక వ్యవస్థలు - ఇల్లు, పాఠశాల, సినిమా, రేడియో, పత్రికలు, సాహిత్యం, మతగురువులు,ప్రజలు - కలసికట్టుగా కృషి చెయ్యాలి.ఎంతో కష్టసాధ్యమయిన పని. దీనికి బహుదీర్ఘకాలం అవసరం. కాని సుస్థిరమయిన సామాజిక విప్లవం తెచ్చే ఉద్దేశముంటే ఈ మార్గాన్ని అనుసరించడం తప్ప గత్యంతరం లేదు.

అంతేకాక మనం మరో విషయాన్ని విస్మరించరాదు. కుటుంబచట్టం (FAMILY LAW) ప్రాథమిక ఆశయం న్యాయవంతమయిన ఓ వ్యవస్థను నెలకొల్పడం. అది ఇరువర్గాలు అంటే భార్యాభర్తలకు పూర్తిగా న్యాయం చేకూర్చేదిగా, అన్యాయం జరగకుండా జాగ్రత్త వహించగల సమర్థవంతమయిన వ్యవస్థగా ఉండాలి. ఈ సామాజిక న్యాయాన్ని సమకూర్చేందుకు విడాకులు ఉపకరిస్తుంది. భార్యాభర్తలు శాంతి సుఖాలతో సంసారం సాగించలేకపోతే ప్రశాంతంగా విడిపొయ్యే అవకాశాన్ని అది కల్పిస్తుంది. ఈ సందర్భంలో ఇస్లామీయ ఫికహ్ (శాసనాంగం) సూచించే ఓ ముఖ్య విషయాన్ని కూడా మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. అది, "హలాల్ (ధర్మసమ్మతమయిన) విషయాల్లో అల్లాహ్‌కు అత్యంత అప్రియమైన విషయం తలాక్" అన్నది.

## మానవ ప్రకృతికి సామాజిక అవసరాలకు అతి సన్నిహితంగా

బహుభార్యాత్వం కేవలం అత్యవసర పరిస్థితుల్లో వర్తించే తాత్కాలిక చట్టం. ఇది ఇస్లామీయ శాసనాంగానికి సంబంధించిన మౌలిక నియమం మాత్రం కాదు. దివ్యఖుర్ఆన్ ప్రబోధం:

> మహిళల్లో మీకు ఇష్టమయిన వారిని నికాహ్ చేసుకోండి. ఇద్దరేసి, ముగ్గురేసి, నలుగురేసి మహిళలతో (మీరు నికాహ్ చేసుకోవచ్చు) ఒకవేళ మీకు న్యాయం చెయ్యలేమని భయముంటే ఒక్క భార్యతోనే తృప్తి చెందండి. (4:3)

ఈ ఆయత్‌లో ప్రవచించినట్లు ఒక భార్యను మించి చేసుకున్న పక్షంలో, పురుషుడు, వారందరితో సమానంగా న్యాయంగా వ్యవహరించాలి. ఇది నియమం. ఇందులోనే ఒకే భార్యతోనే తృప్తిచెందాలన్న సంకేతమూ ఉంది. అంటే దీన్ని బట్టి తెలిసేదేమంటే ఇస్లాం సాధారణ పరిస్థితుల్లో బహుభార్యాత్వానికి బదులుగా ఏకపత్నీవ్రతాన్నే బలపరుస్తుంది. కాని కొన్ని పరిస్థితుల్లో ఏకపత్నీవ్రతం న్యాయానికి బదులుగా అన్యాయానికి మారు రూపమయిపోతుంది. అలాంటి అసాధారణ పరిస్థితులకై ఇస్లామీయ శాసనాంగం బహుభార్యాత్వం ద్వారాన్ని తెరచే ఉంచాలని అంటుంది. ఎందుకంటే, బహుభార్యాత్వాన్ని పాటించడంలో పరిపూర్ణన్యాయం సాధించడం సాధ్యంకాకపోవడం వల్ల ఉత్పన్నమయ్యే చెడులు, ఏకపత్నీవ్రతాన్ని పాటించాలన్న మంకుతనం వల్ల జనించగల చెడులకన్నా అధికమయినవి, తీవ్రమయినవి, జటిలమయినవీ కాజాలవు. *

---

* నాకు తెలిసిన ఒక జంట ఇలాంటి అన్యాయానికే గురయింది. పెద్దలు సొంత మేనమామతో ఓ మహిళ పెళ్ళి చేశారు. ఇద్దరూ చదువుకున్నవారే. ఈ పెళ్ళి మేనరికం అవడంచేత ఇద్దరికీ ఇష్టంలేకపోయినా పెద్దల కోరిక ముందు వారు తలవంచారు. తొలినాడే చేసుకున్న ఒప్పందం ప్రకారం వారు దాంపత్య జీవితానికి యావజ్జీవితం దూరంగా ఉండిపొయ్యారు. ఇద్దరూ ఏకపత్నీవ్రతాన్ని సమర్థించే

ఉదాహరణకు యుద్ధాలనే తీసుకోండి. వీటిలో పురుషులు పెద్ద సంఖ్యలో హతమవుతారు. దీనివల్ల స్త్రీ పురుషుల సమతూకం ఒక్కసారిగా ఛిన్నాభిన్నమయిపోతుంది. ఇలాంటి పరిస్థితుల్లో బహుభార్యాత్వం అనివార్యమయిన సామాజిక అవసరంగా రూపొందుతుంది. తద్వారా సమాజం లైంగిక అరాచకపు ప్రమాదానికి లోనవకుండా భద్రంగా ఉంటుంది. సాధారణంగా ఇలాంటి అరాచకం యుద్ధాల తరువాత సంభవిస్తుంది. ఎందుకంటే పురుషుల సంఖ్య తగ్గిన కారణంగా అసంఖ్యాక మహిళలు ఆధారం లేకుండా రక్షణ లేకుండా సమాజంలో అనాథలయిపోతారు. ఇలాంటి అనాథల ఉపాధికై ఏర్పాట్లు వీలుపడవచ్చు కాని వారి భావోద్రేకాల, లైంగిక అవసరాల తృప్తి మాత్రం సాధ్యం కాదు. ఇలాంటి పరిస్థితుల్లో ఈ మహిళలు సునాయాసంగా పురుషుల కామ దాహానికి బలిఅయ్యే ప్రమాదం ఏర్పడుతుంది. అంతజేసీ లైంగికంగా నిజమయిన మానసిక తృప్తి, సుఖాలకు వారు నోచుకోలేరు. పైగా పిల్లలకై, వారి మమతానురాగాలకై వారు జీవితాంతం పరితపిస్తూనే ఉండిపోతారు. అవే లేకపోతే వారి జీవితానికి సార్థకత, సొగసు, సోయగం ఏముంటుందని?

ఇలాంటి అత్యవసర పరిస్థితుల్లో ఈ వితంతువుల్ని నిరాధారంగా వదలి వెయ్యడం భావ్యమేనా? వారు సామాజిక నీతికి తిలోదకాలిచ్చి ధర్మాధర్మాల విచక్షణ లేకుండా ఎలాగయినాసరే తమ లైంగిక తృప్తికై అడ్డదారులు త్రొక్కడం సబబేనా? ఫ్రెంచి జాతికి ఇలాంటి పరిస్థితినే ఎదుర్కోవలసి వచ్చింది. ఫలితంగా అక్కడి సామాజిక వ్యవస్థ పునాదులతో సహా కదలిపోయింది. చివరికి ఫ్రెంచి జాతి తన చారిత్రక ఔన్నత్యాన్ని,

---

వారవడంచేత విడాకులో లేక మరో పెళ్ళి ప్రస్తావనే రాలేకపోయింది. నాకు పరిచయమయ్యేకాలానికి ఆవిడ మెనోపాజ్ వయసుకు చేరిపోయారు. కానీ పురుషునికి మెనోపాజ్ లేదుగా? వారు ఎలాంటి మానసిక యాతనలకు గురయ్యారో దైవానికే తెలుసు.

(అనువాదకుడు)

గౌరవప్రదస్థానాన్ని కోల్పోయింది. ఇలాంటి సామాజిక అరాచకపు ప్రమాదం నుండి తప్పించుకోవడానికి ఒకటే మార్గం. న్యాయపరిధిలో పురుషునికి స్పష్టమయిన అనుమతి లభించి అతను ఒకరిని మించి అధికంగా మహిళల్ని వివాహం చేసుకోగలగాలి*—అయితే అతను వారి మధ్య న్యాయాన్ని, సమానత్వాన్ని పాటించగలగాలి. అతనికి తన ప్రత్యేక భార్యతో ఏర్పడే మానసిక, భావపరమయిన ప్రగాఢ అనుబంధానికి ఈ నియమం వర్తించదు. మనోమయమయిన ఈ విషయంలోనూ సమానత్వం పాటించడం అతని వల్ల కానేరని విషయం.

ఇలాంటి మరికొన్ని అత్యవసర పరిస్థితుల్లోనూ బహుభార్యాత్వం ఓ సామాజిక అవసరంగా రూపొందుతుంది. ఉదాహరణకు కొందరు పురుషులు ఇతరుల కన్నా అధికంగా పాశవిక శక్తిని కలిగి ఉంటారు. ఇలాంటివారు ఓ భార్యతో సంతృప్తిచెందడం కష్టం. వారు కోరినా తమ కామవాంఛను అణచలేరు. ఇలాంటి వారికీ చట్టం రీత్యా రెండో పెళ్ళి చేసుకునే అనుమతి ఉండవలసిందే. అలాకాని పక్షంలో వీరు తమ ఇండ్లకు వెలుపల గర్ల్‌ఫ్రెండ్స్‌ని వెదికి, వారి వద్ద తమ పశుత్వాన్ని శాంత పరచుకుంటారు. తద్వారా ఆరోగ్యవంతమయిన ఏ సమాజమూ కోరుకోని కుళ్ళుతో సమాజాన్ని కలుషితం చేస్తారు.

---

* మనదేశాన 1974,75 ప్రాంతాల్లో చెస్నాలా (బిహార్) లో బొగ్గుగనుల్లో ఓ పెద్ద ప్రమాదం జరిగింది. అప్పుడు 300 మందికి పైగా కార్మికులు అసువులు బాసారు. వారిలో 99 శాతం కార్మికులు 18 నుండి 40 వయసు వారే. దాదాపు అందరూ వివాహితులే. అప్పుడు వితంతువులయిన 300 మంది వయస్సులో వున్న మహిళలు ఏమయి ఉంటారు? వారు సౌశీల్యంగా జీవించాలంటే పునర్వివాహాలు చేసుకోవాలి. అయితే వారిని పెళ్ళి చేసుకోడానికి తొలి పెళ్ళిచేసుకునే యువకులు ఎంతమంది ముందుకు వస్తారు? బహుభార్యాత్వానికి చట్టపరమైన గుర్తింపులేని మనదేశంలో వారి గతి ఏమయిందో ఆ విశ్వ ప్రభువుకే తెలియాలి!

(అనువాదకుడు)

ఇంకా కొన్ని పరిస్థితులు ఎదురవుతుంటాయి. ఉదాహరణకు, భార్య గొడ్రాలయి ఉండటం లేదా దాంపత్య జీవితానికి అవరోధం కాగల రోగానికి ఆమె గురవడం. భార్య గొడ్రాలయి ఉంటే అందులో ఆమె తప్పు ఏదీ లేకపోవచ్చు. కాని ఆమె కారణంగా భర్త సంతానానికి నోచుకోకుండా ఎందుకు ఉండాలన్నదే ప్రశ్న. తనకు సంతానం కావాలన్న కోరిక మనిషి అంతరాళాల్లో నిగూఢమయి ఉంటుంది. ఇలాంటి పరిస్థితికి సరయిన, సమంజసమయిన సమాధానం రెండో పెళ్ళి ఒక్కటే. మొదటి భార్యకు యిష్టమయితే రెండోభార్యతోపాటు ఆమె కలసిమెలసి ఉండవచ్చు. అవసరమనుకుంటే విడాకుల ద్వారా వేర్పడనూ వచ్చు. పోతే, వ్యాధిగ్రస్తురాలయినభార్య విషయాన్ని పరిశీలిద్దాము. లైంగికవాంఛ ఎంతో హేయమయిన భావాలవల్ల జనిస్తుందని కేవలం దాని కొరకు అన్నెంపుణ్యం ఎరుగని భార్యను బాధపెట్టడం భావ్యం కాదని వకాల్తా పుచ్చుకోవడంలో అర్థమే లేదు. ఎందుకంటే అసలు సమస్య లైంగిక వాంఛ ఎలా ఉద్భవిస్తుందీ అన్నది కాదు. మనిషియొక్క క్రియాత్మక అవసరం ఏదీ అన్నదే. దీన్ని ఉపేక్షించడం ఎంత మాత్రం భావ్యం కాదు. ఈ సందర్భంలో పురుషుడు సంతోషంగా తన భార్యకోసం త్యాగానికి సన్నద్ధుడయితే లైంగిక రుచులకు దూరమవడాన్ని భరిస్తే అతని ఈ వైఖరి ఎంతో ఉదాత్తమయింది, పవిత్రమయింది, అతని విశాల హృదయతను చాటుతుంది, ఎంతో శ్లాఘనీయమయింది కూడా. కాని దేవుడు ఏ వ్యక్తిపైనా అతను మొయ్యలేని, అతనికి అలవికాని భారాన్ని వెయ్యడు. అందువల్ల వాస్తవాలను వాస్తవాలుగా ఎదుర్కోవడమే వాస్తవదృష్టి అనబడుతుంది. ప్రదర్శనాబుద్ధితో ఎంతో ఉదారత చూపి దాన్ని అడ్డంగా పెట్టుకుని అడ్డదారులు అనేకం త్రొక్కడంకన్నా వాస్తవ దృక్పథం అవలంబించడం ఎంతో కొనియాడదగిందనడంలో సందేహం లేదు. నేడు బహు భార్యాత్వాన్ని నిషేధించిన జాతుల్లో కానవచ్చే పై మెరుగుల వెనక దాగిఉన్న మురుగును ఎవరూ కానలేకపోతున్నారు. ఇలాంటి వాతావరణంలో భర్త భార్యకు అటు నిండు హృదయంతో ప్రేమానురాగాలూ అందించలేడు ఇటు ఆమెకు విడాకులే ఇచ్చి స్వేచ్ఛనూ ప్రసాదించలేడు. ఏ మార్గమూ కానరాని నికృష్టపు పరిస్థితి అది. ఇలాంటి పరిస్థితుల్లో బహుభార్యాత్వం ఒక్కటే

## సమస్యకు ఏకైక పరిష్కారం కాదా?

మహిళలకు సంబంధించిన సమస్యను మరికొన్ని కోణాలనుండి కూడా పరిశీలించాలన్నది మా అభిలాష. ఈ కోణాల విషయంలోనూ అనేక అనుమానాలు ఆశంకలు అప్పుడప్పుడు కొన్ని మూలలనుండి వినవస్తూ ఉంటాయి.

## ప్రమాదభరితం

ప్రప్రథమంగా కాయకష్టానికిగాను ఇంటివెలుపల రాకపోకలకు సంబంధించిన హక్కును తీసుకుందాము. ఇస్లాం స్త్రీకి కష్టపడి పనిచేసుకునేందుకు రాకపోకల హక్కునిస్తుంది. ప్రారంభ దశలోనూ యదార్థమయిన అవసరమేర్పడినప్పుడల్లా ముస్లిమ్ స్త్రీలు ఇండ్ల వెలుపల పని చేసేందుకు వేళ్ళేవారు. అలాగే, ఇస్లాం, సామాజిక సంస్థల్లో మహిళలు పనిచెయ్యడాన్ని కాదనదు. ఉదాహరణకు మహిళా విద్యాలయాల్లో, నర్సింగ్‌పనుల్లో, మహిళల వైద్యశాలల్లో పనిచెయ్యడాన్ని కాదనదు. అంతేకాదు, అత్యవసర పరిస్థితుల్లో ఏ విధంగానయితే ప్రజాసేవకై ప్రభుత్వం పురుషుల్ని వినియోగించుకుంటుందో అదేవిధంగా మహిళల్ని సయితం వినియోగించుకోవడం సాధ్యమే. అలాగే ఏ స్త్రీ అయినా పూర్తిగా అనాథ అయినట్లయితే పురుషుడెవరూ ఆమెకు అండగా లేనట్లయితే ఉపాధి సముపార్జనకు సయితం స్త్రీ గృహపరిధిని దాటడాన్ని అనుమతినిస్తుంది. కాని ఒక్క విషయం మాత్రం మరువ రాదు. స్త్రీ ఇల్లువదలి వెలుపలికి వెళ్ళడానికి నిజమయిన అవసరమేర్పడి, గత్యంతరం లేని పరిస్థితిలో, అది తప్ప మరే మార్గమే లేని పక్షంలోనే ఇస్లాం స్త్రీకి అనుమతినిస్తుంది. ఎలాంటి ఎమర్జెన్సీ లేనప్పుడు సాధారణ పరిస్థితుల్లో స్త్రీ అనవసరంగా ఇల్లు వదలి తిరగడాన్ని ఇస్లాం ఇష్టపడదు. ఇలా తిరగడం ఇస్లాం దృష్టిలో కేవలం అవివేకంతప్ప మరేమీకాదు. ఎందుకంటే సాంఘిక కార్యకలాపాల్లో పాల్గొనేం దుకు మహిళ తన ఇంటికి వీడ్కోలు చెప్పడం వల్ల స్త్రీ మౌలిక జీవన ధర్మానికి హాని కలగడం అనివార్యం. ఆ జీవన ధర్మాన్ని ఆమె ఇంటి

నాలుగుగోడలమధ్యనే ఎంతో నేర్పుగా సమర్థవంతంగా నిర్వర్తించగలుగుతుంది. అంతే కాదు ఒక్కసారి ఆమె అనవసరంగా ఇల్లును వదిలిందంటే సమాజంలో అనేక మానసిక, సాంఘిక, నైతిక సమస్యల్ని సృష్టిస్తుంది కూడా!

స్త్రీ, శారీరకంగాను, మానసికంగాను, అంతర్ప్రేరణల దృష్ట్యా కూడా తన జీవన లక్ష్యం అంటే మాతృత్వానికి సకల విధాలుగా ఉత్తమ శక్తి సామర్థ్యాలు కలిగి ఉందన్న విషయం ఎవరూ కాదనలేని యదార్థం. అందువల్ల ఆమె శ్రద్ధాశక్తులు అనవసరమయిన ఇతర కార్యకలాపాల వైపుకు మళ్ళినట్లయితే, ఆమె తన అసలు బాధ్యతను ఉపేక్షిస్తే నష్టం సంభవించేది సమస్త మానవాళికే అన్న విషయం వ్యక్తమవుతూనే ఉంది. ఆమె తల్లి అవడానికి బదులు పురుషుల చేతుల్లో ఓ ఆటబొమ్మగా, విలాసినిగా, వినోదినిగా రూపొందుతుంది. ఆమె జీవన సౌభాగ్యం భోగవిలాసాలకు బలయిపోతుంది. ఇస్లాం ఇలాంటి పరిస్థితిని సుతరామూ ఇష్టపడదు. ఎందుకంటే అది మానవాళిని సంగఠితమయిన ఏకత్వంగా మారే పరిస్థితుల కనుగుణంగా మార్పులకు గురిలేని ప్రత్యేక ఏకత్వంగా పరిగణిస్తుంది. ఇస్లాం తన ఈ ప్రత్యేకతను ఎలా వదలుకుంటుంది.

పిల్లల్ని ఆయాకు అప్పగించి స్త్రీ ఇంటి వెలుపల ఏదయినా ఉద్యోగం చేస్తే అందులో పొరబాటేమిటి అన్న అభిప్రాయం కొందరు వ్యక్తపరుస్తారు. ఈ విధంగానయితే ఆమె సంపాదించడమేకాక తల్లి రూపంలోనూ తన మౌలిక బాధ్యతను నెరవేర్చుతూ ఉంటుందన్నది వారి వాదన. కాని ఇది నిరాధారమయిన అసమంజసమయిన అభిప్రాయం. ఎందుకంటే ఒక ఆయా ఎంత మంచిదే అయినా, పిల్లల శారీరక, మానసిక ప్రగతీవికాసాల్లో ఎంత శ్రద్ధ వహించినా ఒక విషయంలో అశక్తురాలు. ఆమె 'తల్లి' మాత్రం కాజాలదు, తల్లి స్థానం ఆమెకు ఎన్నటికీ ప్రాప్తం కాజాలదు. పిల్లలకు తల్లి ప్రేమానురాగాలను, వాత్సల్యాభిమానాలను అందివ్వనూ జాలదు. అవే లేకపోతే జీవన వనంలో అంతా గ్రీష్మమే, నైతికతా ముఖాన సర్వత్రా మృత్యువు ఛాయలే!

పాశ్చాత్య నాగరికతా తనయులయినా, కమ్యూనిస్టు వ్యవస్థ ధ్వజ వాహకులయినా వారి అర్థంలేని అరుపులు, మానవనైజంలో ఏ మాత్రం మార్పును తీసుకురాలేవు. వాస్తవానికి శిశువుకు తొలి రెండేళ్ళు తల్లి ప్రేమవాత్సల్యాలు, రక్షణ నిరంతరంగా, బహువిధంగా అవసరమయి ఉంటాయి. దాని తీవ్రత ఏ స్థాయికి చేరుకుంటుందంటే పసికందు ఆ ప్రేమానురాగాలను చివరికి తన సొంత తోబుట్టువులతో సయితం పంచుకోవడానికి సిద్ధమవదు. ఒక ఆయా లేక నర్సు పాపకు ఆ తల్లి మమతానురాగాలను ఎలా అందివ్వగలుగుతుంది? సాధారణంగా ఒక ఆయా పదేసి, ఇరువయ్యేసి పసివారిని కనిపెట్టుకు ఉండవలసి ఉంటుంది. ఇలా 'అద్దె తల్లి' ఒడిలో పెంపకం పొందే బాలలు సతతం పరస్పరం పోట్లాడుకుంటూ ఉంటారు. ఒక్కోసారి ఆట వస్తువుల కోసం, లేదా ఆ కృత్రిమ మాతృ సానుభూతిని తమ వైపుకు మళ్ళించుకోవడానికి. క్రమేపి ఈ గుణం వారి స్వభావంగా రూపొందుతుంది. పెరిగి పెద్దవారయినప్పుడు వారి అంతర్యాలు ప్రేమ మమకారాల వెచ్చదనానికి అతీతంగా, సున్నిత భావాలకు అపరిచితంగా తయారవుతాయి.

## కావలసిందేమిటి?

నిజానికి ఏదయినా మార్గాంతరంలేని అవసరమే ఏర్పడితే పిల్లల సంరక్షణకై ఆయాను నియమించుకోవచ్చు. కాని ఎలాంటి అవసరమూ లేకుండా ఇలా చెయ్యడం వివేకవంతమయిన విషయం కాదు. పాశ్చాత్యులకయితే తమ ప్రత్యేక చారిత్రక, భౌగోళిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితుల కారణంగా ఇలా చెయ్యడం తప్పనిసరి కావచ్చు. కాని ప్రాక్ దేశాలవారికి ఇలా చెయ్యవలసిన అవసరమేదీ కానరావడంలేదు. మనదేశాల్లో నేడు పురుషుల సంఖ్య తగ్గిపోయి, ఇంటి వెలుపలి ప్రపంచాన్ని నడపడానికి మహిళల అవసరం ఏర్పడిందా? లేక ముస్లిం పురుషుల - తండ్రులు, సోదరులు, భర్తలు, ఇతర బంధువుల - హృదయాలనుండి ఆత్మగౌరవం, రోషం, అభిమానాలు సెలవు తీసుకున్నాయా? వారికి వారి భార్యలు,

కూతుళ్ళు, చెల్లెండ్రు భారమయిపొయ్యారా? మహిళలకు తమ భారాన్ని తామే మోసే, ఆఫీసుల్లో, కార్ఖానాల్లో పనిచేసే గతి పట్టిందా?

ఉద్యోగం చెయ్యడం మూలాన స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం లభిస్తుందని అంటారు. తద్వారా సమాజంలో ఆమె విలువ, స్థానాలు పెరుగుతాయి అని కూడా అంటారు కొందరు. అయితే స్త్రీకి తనదంటూ స్వతంత్రమయిన ఆర్థిక స్థానాన్ని ఇస్లాం ఎన్నడు కాదన్నదనీ? వాస్తవమేమంటే ఇస్లామీయ జగత్తు నేడు ఎదుర్కొంటున్న సమస్యలు ఇస్లామీయ జీవన వ్యవస్థలోని లోపం మూలంగా ఉత్పన్నం కాలేదు. సర్వవ్యాపితమయిన బీదరికం ఉత్పన్నం చేసిన సమస్యలివి. వీటి కారణంగా స్త్రీలనక పురుషులనక అందరూ పరిశుద్ధమయిన, శుభ్రమయిన జీవికకు దూరమయ్యారు. ఇవి పరిష్కృతమవడానికి మన ఉత్పాదనలు పెరగాలి. అప్పుడే జాతి మొత్తం సుసంపన్నం కాగలదు. మనలో ఎవ్వరూ అగత్యపరుడుగా నిరుపేదగా మిగలడు. అంతేకాని ఉత్పత్తి సాధనాలను కైవసం చేసుకోవడానికి స్త్రీ పురుషుల మధ్య సాగుతున్న పరుగు పందెం ఈ సమస్యకు పరిష్కారం ఎంతమాత్రం కాదు.

పూర్తి ఏకాగ్రచిత్తంతో మానవ సంతతిని పోషించడం, పెంచడం వారిని సుశిక్షితులుగా చెయ్యడం అనే స్త్రీ సహజమయిన జీవన ధర్మాలను స్త్రీకి కేటాయించింది ఇస్లాం. దాని ముందు మానవనైజం, సామాజిక అవసరాలు రెండూ ఉన్నాయి. అందువల్లనే స్త్రీ ఆర్థిక అవసరాలను తీర్చే బాధ్యత అంతా పురుషునిపై మోపింది. అప్పుడే స్త్రీ అనవసరమయిన ఆలోచనలకు దూరంగా నిశ్చింతగా తన బాధ్యతల్ని నెరవేర్చగలుగుతుంది. దానితోపాటు స్త్రీకి గొప్ప స్థాయిని, గౌరవాన్నీ ప్రసాదించింది.

> ఒకసారి ఓ వ్యక్తి మహాప్రవక్త (సఅసం)ను, "నా సద్వర్తనకు అత్యధికంగా అర్హులయిన వారెవరు?" అనడిగినప్పుడు ఆయన "నీ తల్లి" అని పలికారు. ఆ వ్యక్తి మళ్ళీ అడిగాడు, "ఆ తరువాత ఎవరు?" అని. దానికి "నీ తల్లి" అనే బదులిచ్చారు.

అప్పుడతను తిరిగి "ఆ తరువాత ఎవరు?" అని అడగ్గా దైవ సందేశహరులు (సఅసం) "నీ తల్లి" అనే సెలవిచ్చారు. ఆ తరువాత ఆ వ్యక్తి మరోసారి "ఆ తరువాత ఎవరు?" అని అడిగాడు. దానికి ప్రవక్త మహనీయులు (సఅసం) "నీ తండ్రి" అని సమాధానమిచ్చారు.

ఇస్లాం స్త్రీకి ప్రసాదించిన స్థానాన్ని చూస్తూ 'ఆధునిక ముస్లిం మహిళల హక్కు'ల పేరుతో చేసే ఈ గొడవంతా దేనికో బోధపడదు. ఇస్లాం స్త్రీకు ఇవ్వని హక్కు ఏదయినా ఉందా? నేడు ముస్లిం మహిళలు తమ హక్కుల కొరకు పథకం ప్రకారం ఉద్యమాలు నడపడానికి, ఓటు హక్కును, పార్లమెంటు ప్రాతినిధ్యంలాంటి సాధనాలను వినియోగించడానికి సిద్ధమయ్యారంటే అది ఏ హక్కుల కొరకని? వారి కోరికలేమో కాస్త పరిశీలిద్దాము.

నేటి ముస్లిం మహిళ, తనకు సరిసమానమయిన మానవస్థానం ఇవ్వాలని కోరుతుంది. కాని పాపం ఆవిడకు తెలీదు, ఇస్లాం ఈ హక్కును తనకు ఏనాడో ఇచ్చి వేసిందని. కేవలం సైద్ధాంతికంగా కాదు క్రియారూపంలోను, చట్ట పరిధిలోను.

ఆమె ఆర్థిక స్వాతంత్ర్యాన్ని కాంక్షిస్తుంది; సామాజిక జీవితంలో ప్రత్యక్షంగా పాల్గొనే హక్కును కోరుతుంది. నిజానికి మహిళలకు ఈ హక్కును ప్రప్రథమంగా ఇచ్చింది ఇస్లాం మాత్రమే.

ఆమె తనకు విద్యాసముపార్జన హక్కును అడుగుతుంది. ఇస్లాం కేవలం ఈ హక్కును గుర్తించడమే కాదు, విద్యాసముపార్జన ఆమె విధి అని నిర్ణయించింది.

తన ఇష్టానికి, అభిమతానికి, ఆమోదానికి వ్యతిరేకంగా పెళ్ళి చెయ్యరాదన్నది ఆవిడ అభిలాష. ఇస్లాం స్త్రీలకు ఈ హక్కును గుర్తించడమే కాదు, అలా జరగకపోతే ఆ వివాహమే చట్టబద్ధం

కాజాలదన్నది. ఇంకా ఆమెకు తన పెళ్ళి తానే నిర్ణయించుకునే హక్కును సయితం ప్రసాదించింది.

గృహ సీమకు రారాణిగా తానుండి తన బాధ్యతల్ని నిర్వర్తించాలని, తనకు న్యాయం జరగాలని తనకు ప్రేమాభిమానాలు లభించాలని, తన భర్త తన పట్ల దుష్ప్రవర్తనతో దురుసుగా వ్యవహరిస్తే అతన్నుండి విడిపోయే హక్కు తనకు ఉండాలని ఆవిడ కోరుకుంటున్నదా? ఇస్లాం ఈ హక్కులన్నీ ఆమెకు ప్రసాదించింది. ఆమెకు చెందిన ఈ హక్కుల్ని పరిరక్షించే బాధ్యత పురుషునిపై మోపింది కూడా!

ఇంటి వెలుపల ఉద్యోగానికి పని చేసేందుకు హక్కు కావాలా? మహిళల ఈ హక్కునూ గుర్తిస్తుంది ఇస్లాం.

## అసలు కారణాలేవి?

కాని వెకిలిగా వ్యవహరించే, నీతిబాహ్యమయిన రీతిలో బరితెగించి తిరిగే స్వేచ్ఛ తనకు కావాలని, మానవత సిగ్గుతో తలవంచే, మానవీయ ప్రమాణాలను మంటగలిపే తన కార్యకలాపాలపై ఎలాంటి ఆంక్షలు ఉండరాదని ఆమె కోరినట్లయితే - నిస్సందేహంగా ఇస్లాం దాన్ని సమ్మతించదు. ఎందుకంటే ఇస్లాం ఈ చర్యల్ని మానవ గౌరవోన్నతులకు వ్యతిరేకమయినవిగా పరిగణిస్తుంది. స్త్రీ పురుషులెవరయినా సరే ఇలాంటి వాటిలో పడి మానవతకు తలవంపులు తెచ్చే విధంగా వ్యవహరించడాన్ని ఇస్లాం సుతరామూ సహించదు. కాని ఒకవేళ స్త్రీ తనకు ఇవన్నీ కావాలని అభిలషించినా వీటికై ఆమెకు పార్లమెంటులో లభించే ప్రాతినిధ్యంపై ఆధారపడనవసరం లేదు. సామాజిక సంబంధ బాంధవ్యాలు, సామూహిక సంప్రదాయాలు పూర్తిగా ఛిన్నాభిన్నమయి, అవన్నీ అరాచకత్వానికి గురయ్యే ఆ సుమూర్తం కొరకు ఓరిమితో నిరీక్షిస్తే చాలు ఆ తరువాత ఆమె మనోరథం ఈడేరే మధుర క్షణాలు వాటంతట

అవే వచ్చి ఒడిలో రాలుతాయి. అప్పుడు ఆమె ఎలాంటి నైతిక బంధానికీ కట్టుబడకుండా విచ్చలవిడిగా వ్యవహరించవచ్చు.

కొందరు, ప్రాగ్దేశాల పరిస్థితులు, అక్కడి జీవితపు విలువలు, పాశ్చాత్య పరిస్థితులకు, అక్కడి విలువలకు పూర్తిగా భిన్నమయినవని అంగీకరించినప్పటికీ, ప్రాచ్య స్త్రీ సామాజిక స్థానం ఎంతో దిగజారిందని, దానికి ఎదురు తిరిగి నిరసన కంఠాన్ని లేవనెత్తడం తప్ప గత్యంతరం లేదని సెలవిస్తారు.

ప్రాచ్య దేశాల్లో మహిళలు సాధారణంగా వెనుకబడి ఉన్నారు, వారికి సామాజిక గౌరవమూ లేదు, ఆదరణ, ఉన్నతస్థానమూ లేదు, వారు పశువుల్లాంటి కడుహీనమయిన మనుగడ సాగిస్తున్నారు. సరే బాగానే ఉంది. కాని అసలు ప్రశ్న, ఈ పరిస్థితుల బాధ్యత ఎవరిపై పడుతుంది అన్నదే. ఇస్లాంపై, దాని బోధనలపై, ఏ సూత్రాలరీత్యానయినా సరే ఈ బాధ్యత మోపడానికి అవకాశముందా? వాస్తవమేమంటే నేడు ప్రాచ్యమహిళ ఏ నికృష్ట పరిస్థితులకు లోనయి ఉందో అవి, నేడు ఆ దేశాల్లో సామాన్యంగా ప్రబలి ఉన్న ఆర్థిక, సామాజిక రాజకీయ, మానసిక పరిస్థితుల పర్యవసానమే కాని మరొకటి కావు. ఒకవేళ మనం మన పరిస్థితుల్ని మెరుగుపరుచుకోవాలనుకుంటే ఈ విషయాలను సయితం పరిశీలించవలసి ఉంటుంది. అప్పుడే చెడుల మూలస్థానాన్ని కనుగొనగలం.

ప్రాచ్య మహిళల కష్టాలకు మూలం లేమి, బీదరికాలే. వీటిలోనే గత కొన్ని తరాలుగా ఆ మహిళ మ్రగ్గుతోంది. సమాజంలో నెలకొన్న సాంఘిక అన్యాయం దీనికి తోడయింది. ఆ కారణంగా కొందరయితే సకల భాగ్యాల్లో తులతూగుతున్నారు. సామాన్య ప్రజలకు అత్య ధికంగా కడుపుకు కూడు లేదు వంటికి గుడ్డలేదు. ఈ పరిస్థితి, ఊపిరి సలపని రాజకీయ వాతావరణం కారణంగా, నిరంకుశ దౌర్జన్యాల కారణంగా, ప్రజలంతా - పాలకులని, పాలితులని - రెండు వర్గాల్లో చీలిపోవడం చేత ఉత్పన్నమయింది. పాలకవర్గం సకల సౌకర్యాలు తన కైవసం చేసుకుంటుంది. కాని బాధ్యతలన్నీ సామాన్య ప్రజల తలపై

మోపుతుంది. స్వయంగా ఏ బాధ్యతనూ స్వీకరించదు. ప్రజలకు వారి ఏ హక్కునూ చిత్తశుద్ధితో అందజెయ్యదు. నేడు ప్రాచ్య దేశాలపై నియంతృత్వపు దౌర్జన్యాల కారు మేఘాలు అలుముకున్నాయంటే అవి ఈ కారణాల మూలంగానే. ప్రాచ్య మహిళకు నేడు ప్రాప్తించిన కీడు హీనమయిన స్థానానికీ, దాపురించిన కష్టాలకు ఈ పరిస్థితులదే అసలు బాధ్యత.

నేటి మహిళ పురుషునితో ప్రేమ, ఆదరణల ఆధారంగా సంబంధబాంధవ్యాలు నిర్మాణం కావాలని వాంఛిస్తోంది. కాని ప్రాచ్యదేశాల్లో ఈ ఊపిరాడని బీదరికంతో అలముటించే వాతావరణంలో ఆమెకు అవి ఎలా ప్రాప్తిస్తాయి? ఈ వాతావరణంలో స్వయంగా పురుషుడు కూడా - బయటికి ఇతని పరిస్థితి మెరుగ్గా అగుపించినా - పరిస్థితుల వాతనపడిన బాధితుడే.

## ముందు నుయ్యి, వెనుక గొయ్యి

పురుషుడు ఇంట్లో స్త్రీ పట్ల దురుసుగా ప్రవర్తిస్తాడంటే, చెడుగా నడుచుకుంటాడంటే, నిజానికి అతని చుట్టుపట్ల వుండే ప్రజలు అతని ఎడల నడుచుకునే తీరుకు అది ప్రతిక్రియ మాత్రమే. సమాజంలో అతను అనారతం పరాభవానికి గురవుతూ ఉంటాడు. అతని ఆత్మగౌరవం ఒకసారి గ్రామ పెద్దలచేత గాయపడితే మరోసారి పోలీసువాళ్ళు కర్మాగార యజమానులు అతని అహాన్ని దెబ్బతీస్తారు. ఒక్కోసారి ప్రభుత్వాధికారులే అతన్ని కించపరుస్తారు. సమాజంలో ప్రతిచోటా అతను పరాభవానికి, పరాజయానికి గురవుతూ ఉంటాడు. కాని అతను వారిలో ఎవరిపట్ల కూడా ప్రతీకారం తీర్చుకోలేడు. అందువల్ల అతను తన కోపతాపాన్నంతా ఇంట్లో గృహిణిపై, పిల్లలపై, బంధుమిత్రులపై వెళ్ళగ్రక్కుతాడు.

ఇదే బీదరికం తెచ్చే మహా శాపం. అది పురుషుణ్ణి పూర్తిగా పిండివేస్తుంది. అతను తన ఆత్మీయులకు ప్రేమ, సానుభూతి, సహనం లాంటి గుణాలు పంచి ఇచ్చే స్థితిలో మనలేడు. అయితే స్త్రీ తన భర్త

చేతుల్లో అన్ని రకాల అన్యాయాలను, అత్యాచారాలను, అక్రమాలను భరిస్తుంది. కాని నోరు మెదపదు. ఎందుకంటే, ఆమెకు తెలుసు, భర్త తన్ను ఇంటి నుండి గెంటి వేశాడంటే, పస్తులతో చావడం తప్పదని. చివరికి ఈ భయాల కారణంగా ఆమె తన చట్టబద్ధమయిన హక్కుల్ని కోరే ధైర్యం కూడా కోల్పోతుంది. భర్త ఆగ్రహంతో విడాకులిస్తాడేమో అన్న భయం ఆమెను నిత్యం వెంటాడుతూ ఉంటుంది. ఆమె తల్లిదండ్రులు కూడా నిరుపేదలే గనుక ఆమె భారాన్ని మొయ్యలేరు. ఆవిడ భర్తను వదలి పుట్టింటికి వెళ్ళినా అక్కడ కూడా, నచ్చజెప్పి తన్ను మెట్టినిల్లు పంపే ప్రయత్నమే ఎదురవుతుంది. అక్కడే కష్టమో నిష్టూరమో ఓపికతో భరించి బ్రతుకు వెళ్ళదీసే హితవు ప్రాప్తమవుతుంది. ప్రాచ్యదేశాల్లోనేడు స్త్రీ, అగౌరవానికీ, పరాభవానికీ గురవడానికి ఇదొక ప్రబల కారణం.

రెండో విషయం ఏమిటంటే నేటి ప్రాచ్యభూమి తన వెనుకబడినతనం మూలంగా ఓ ఉన్నత ధ్యేయానికీ ఆత్మ చైతన్యానికీ రెంటికీ దూరమయింది. ఫలితంగా అజ్ఞానపు కారుమబ్బులు దానిచుట్టూ అలుముకున్నాయి. ప్రాచ్యభూమి ఉన్నత మానవీయ ప్రమాణాల స్పృహను కూడా కోల్పోయింది. ఇప్పుడు దాని ముందు మిగిలింది ఒకే ఒక విలువ, అది 'శక్తి' – శక్తి ప్రదర్శనల్ని పూజించడం, శక్తిహీనుల్ని ద్వేషించడం, పరాభవించడం! అందువల్ల ఎవరినయినా కించపరచాలంటే, అవమాన పరచాలంటే అతను బలహీనుడవడం ఒకటే చాలు. ఈ 'శక్తి' పూజ కారణంగానే పురుషుడు స్త్రీని హీనంగా చూస్తాడు. తనకంటే శారీరకంగా అబల అయిన స్త్రీని గౌరవాదరణలతో చూడడానికి కావలసిన నైతిక ఔన్నత్యం, పవిత్రతలు పురుషునిలో లోపించాయి. ఈ కారణంగా నేడు అతని అంతర్యం స్త్రీ గౌరవశూన్యమయింది. అతను సాటి మనిషికి ఇవ్వవలసిన గౌరవాదరణలరీత్యా స్త్రీని గౌరవించలేకపోతున్నాడు. కాని ఏ స్త్రీ అయినా సిరిసంపదలు కలిగిఉంటే, ప్రాచ్యదేశమయినా సరే, భౌతికత ప్రబలిన వాతావరణంలో ఆమెకు సకల మర్యాదలు, పదవులు హోదాలు లభిస్తాయి.

ఈ విధంగా వెనుకబడ్డ సమాజాల్లో మనుషులు ఎంతో దిగజారిపోతారు. పూర్తిగా పాశవిక స్థాయికో, దాని దరిదాపులకో చేరిపోతారు. దానికి ఉదాహరణగా మన ప్రాచ్యభూమిని పేర్కొనవచ్చు. ఇలాంటి సమాజాలు కామతప్తమయి ఉంటాయి. జీవితానికి సంబంధించిన అక్కడి ప్రజల దృక్పథాలూ, వ్యవహారాలన్నింటిలో కామవర్గం ప్రాధాన్యత వహిస్తుంది. ఇలాంటి సమాజాల్లో స్త్రీ పురుషుని కామవాంఛలకు, లైంగిక తృష్ణలకు ఉపశమనం చేకూర్చే సాధనంగా రూపొందుతుంది.* ఆమెకు మనిషిగా ఎలాంటి గౌరవాదరణలు ప్రాప్తం కావు. ఎందుకంటే మానసికంగా, ఆధ్యాత్మికంగా ఆమెని పురుషునికన్నా ఎంతో అధమంగా నీచంగా పరిగణించడం జరుగుతుంది. పైగా ఆమె గౌరవాదరణలకై ఎలాంటి డిమాండు కూడా చెయ్యజాలదు. ఫలితంగా స్త్రీ పురుషుల శారీరక సంబంధం పూర్తిగా పాశవిక సంబంధమయి పోతుంది. అందులో 'మగ' పశువుకు ఎల్లప్పుడూ 'ఆడ' పశువుపై ఆధిక్యత ఉంటుంది. పైగా అది 'అవసరం' తీరిన తరువాత తన 'ఆడ' జోడిని పూర్తిగా ఉపేక్షిస్తుంది కూడా.

వెనుకబడ్డ సమాజాలు నిత్యం ఆకలి దప్పులకు అవిద్యా అజ్ఞానాలకు నిలయాలయి ఉండటంచేత వారివద్ద సమయమూ ఉండదు శక్తీ ఉండదు– నైతికంగానూ క్రమశిక్షణతోనూ పురోగమించడానికి. వాస్తవానికి ఈ గుణాలే లేకపోతే ఏ సమాజమూ ఉన్నత మానవ సమాజంగా గౌరవమూ పొందజాలదు, పాశవిక స్థాయినుండి పైకి ఎదగనూజాలదు. సమాజంలో ఇలాంటి నైతిక, ఆధ్యాత్మిక క్రమశిక్షణలు కొరవడినా లేక అవి అనుచితమయిన రీతిలో ఉన్నా పర్యవసానంగా మానవజీవితం కేవలం 'ఆర్థిక' రూపాన్ని ధరిస్తుంది. శక్తీ అధికారాల ఆరాధన జరుగుతుంది. జీవితాన్ని కేవలం పాశవిక వాంఛల ప్రమాణాలతో కొలిచే అధోగతి దాపురిస్తుంది.

---

* ఇదే విధంగా స్త్రీ కూడా పురుషుణ్ణి తన కామవాంఛల తృప్తికి సాధనమని భావిస్తుంది. వ్యత్యాసం ఒక్కటే – పురుషుడు సంపాదనాపరుడు, ఇంటి యజమాని అవడం చేత ఈ కామక్రీడలో స్త్రీకంటే తన వాటాను కాస్త అధికంగానే జుర్రుకుంటాడు!

ఇలాంటి వెనుకబడ్డ సమాజంలో తల్లిగా స్త్రీ ఓ తప్పుడు వైఖరిని అవలంబిస్తుంది. తద్వారా, అసంకల్పితంగానే మహిళలపట్ల పురుషులలో అసమంజస దృక్పథం ఏర్పడడానికి కారణభూతమవుతుంది. ఆమె తన చిన్న పిల్లవాణ్ణి కూడా తన వైఖరి వల్ల ఓ బుచ్చి నియంతగా చేసివేస్తుంది. అతనికి కేవలం ఆజ్ఞలివ్వడం, వాటిని పాలింపజేయడం మాత్రమే తెలుసు. ఆమె ప్రేమ ఎంత గుడ్డిగ తయారవుతుందంటే తన పిల్లవాని అర్థంలేని కోరికల్ని వాంఛల్ని కూడా అదుపులో పెట్టజాలదు. ఇలాంటి అదుపు ఆజ్ఞలేని ముద్దు మురిపాల పర్యవసానంగా పెరిగి యువకుడయినప్పుడు అతను తన కోరికల చేతుల్లో చేతకాని గులాముగా రూపొందుతాడు. ఇతరులు తన ఆదేశాలను ఎదురు పలక్కుండాపాటించాలని కోరుకుంటాడు. కాని క్రియాజీవితంలో ఇది సాధ్యం కాకపోయేటప్పటికి అతను చీదరించుకుంటాడు, కలత చెందుతాడు. దాని ప్రతిక్రియగా తన చుట్టుపట్ల ఉన్న ప్రజలపై, స్త్రీ పురుషులపై, బాలలపై తన క్రోధాగ్నిని కురిపిస్తాడు.

## ఇస్లాం కోరే వ్యవస్థలో.....

నేడు ప్రాచ్యభూభాగమంతా ఏ కలతలకు, అశాంతి, అనిశ్చితలకు ఆలవాలమయి ఉందో దానికి ఇవి కొన్ని పెద్దపెద్ద ముఖ్యమయిన కారణాలు. ప్రాచ్య నారి నేడు ఎదుర్కొంటున్న కష్టనష్టాలు, పరాభవ పరాధీనతల మర్మం కూడా ఈ కారణాల్లోనే నిగూఢమయి ఉంది. ఈ కారణాలను ఇస్లాం సృష్టించనూ లేదు, వీటికి నిజమయిన ఇస్లామీయ భావనలతో ఎలాంటి సంబంధమూ లేదు.

నేడు ప్రాగ్ దేశాలను పట్టి పీడిస్తున్న బీదరికం ఇస్లాం కారణంగా వచ్చిందా? ముమ్మాటికీ కాదు. ఇస్లాంలో ఆదర్శవంతమయిన ఇస్లామీయ రోజుల్లో - ఉదాహరణకు హజ్రత్ ఉమర్‌బిన్ అబ్దుల్‌అజీజ్ (రజిఅన్) కాలంలో - సమాజం ఎంతగా సంపన్నమయిందంటే వెదికినా దానం

తీసుకునేవాడు కానరాక పొయ్యాడు. ఇస్లాం ఆచరణాత్మక జీవన వ్యవస్థ. అది క్రియా ప్రపంచంలో మహోన్నతమయిన ఈ ఆర్థిక అద్భుతాన్ని చేసి చూపెట్టింది. ఆ ఇస్లాంను, ఆ జీవన వ్యవస్థను మళ్ళీ ప్రపంచంలో స్థాపించవలసి ఉంది. ఓ సమగ్ర జీవన వ్యవస్థగా ఇస్లాం కోరేదేమంటే జాతి సంపద దాని సభ్యుల మధ్య న్యాయవంతంగా పంపిణీ కావాలి.

"......తద్వారా సంపద మీలోని శ్రీమంతుల మధ్యనే పరిభ్రమిస్తూ ఉండరాదని" (హష్ర్ 7)

ఇస్లాం బీదరికాన్ని ఇష్టపడదు, ప్రపంచంనుండి దాని రూపురేఖలు తుడుచుకు పోవాలనే అది కోరుకుంటుంది. అలాగే అది భోగలాలసను, ధన మదాన్నీ అనుమతించదు. ఆధునిక ప్రాచ్య మహిళ కష్టాలకు ముఖ్యమయిన మూలం బీదరికం. అది అంతమయితే నారీమణుల అత్యధిక సమస్యలు వాటంతట అవే పరిష్కారమవుతాయి. దానితోపాటే ఆమె కోల్పోయిన గౌరవాదరణలు కూడా తిరిగి ప్రాప్తిస్తాయి. అప్పుడు ఆమె వాటికై ఇల్లు వదలి వెలుపలికి వెళ్ళి ఉద్యోగాన్వేషణ ప్రారంభించనవసరమే ఉండదు. (ఆమెకు ఆ ఉద్యోగ హక్కు అప్పటికీ ఎప్పటికీ ఉంటుందన్నది వేరే విషయం) ఎందుకంటే జాతిలో వృద్ధి చెందిన సిరిసంపదల నుండి, వారసత్వపు చట్టం ద్వారా ఆమెకు తన ధర్మసమ్మతమయిన వాటా ఎలాగూ సంప్రాప్తమవుతుంది. దాన్ని, తాను ఇష్టపడితే, తన సుఖం కొఱకు, సౌలభ్యాల కొరకు వినియోగించుకోగలదు. ఇలా స్త్రీ భౌతికంగా సుసంపన్నం అయినప్పుడు పురుషుడు కూడా ఆదరిస్తాడు. ఆమె బీదరికపు భయాందోళనలకు ఏ మాత్రం గురవకుండా స్వేచ్ఛగా తన చట్టబద్ధమయిన హక్కుల్ని వినియోగించుకోగలదు.

## నీతిమాలిన వ్యక్తులు కాదు....

పోతే, ప్రాగ్దేశాల్లో ఎల్లెడలా నేడు తాండవమాడుతున్న రాజకీయదోపిడి, దాని ప్రతిచర్యగా పురుషుడు ఇంట్లో తన భార్యాబిడ్డలపై

వెళ్ళుగ్రక్కే తన క్రోధావేశాలు కూడా ఇస్లాం సృజించినవేనా? ఇస్లాంను రాజకీయ దోపిడికి కారణమనడానికి ఎలాంటి ఆధారం లేదు. నిజానికి అన్యాయం అక్రమం ఎక్కడ ఏ రూపంలో ఎదురయినా వాటి ముందు తలవంచడాన్ని ఇస్లాం సమ్మతించదు. వాటికి ఎదురొడ్డి నిలవాలని బధిస్తుంది. పాలకులు, పాలితుల పరస్పర సంబంధాలను న్యాయవంతమయిన ప్రాతిపదికలపై నెలకొలుపుతుంది. ఒకసారి రెండవ ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజిఅన్) ప్రజలతో - " వినండి, విధేయత పాటించండి!" అని ఆదేశించినప్పుడు ఓ వ్యక్తి తటాలున లేచి నిలబడ్డాడు, "మేము మీ మాట వినమూ దానికి విధేయత చూపము - మీ వంటిపై ఉన్న ఆ దుప్పటి మీరు ఎక్కడి నుండి ఎలా పొందారో తెలపనంతవరకు!" అని నిలదీశాడు. ఈ మాట విని హజ్రత్ ఉమర్ క్రోధావేశంతో ఊగిపోలేదు. ఆయన ఆ వ్యక్తి సాహసాన్ని మెచ్చుకున్నారు. అందరి ముందు వాస్తవాన్ని ప్రకటించారు. అప్పుడు ఆ వ్యక్తే తిరిగి లేచి నిలబడి అన్నాడు, "ఇక చెప్పండి, మీ మాట వినడానికి మేము హాజరే!" అని. నేడు ఆ పాలనావ్యవస్థనే తిరిగి స్థాపించవలసి ఉంది. అప్పుడే ఏ పాలకుడూ ప్రజల్ని తన నిరంకుశ వైఖరికి బలి చెయ్యలేడు. అప్పుడే ప్రజల్లో ధైర్యసాహసాలు విజృంభిస్తాయి. వారు నిర్భయంగా తమ పాలకుల సమక్షంలో తమ అంతర్యంలోని మాటను చెప్పి వెయ్యగలుగుతారు. అప్పుడేవారు తమ ఇండ్లల్లో భార్యాబిడ్డల ఎడల న్యాయంగా ప్రేమగా సానుభూతితో వ్యవహరించగలుగుతారు.

ఉన్నత మానవీయ ప్రమాణాలు దిగజారిపోవడంలో ఇస్లాం పాత్ర ఏమయినా ఉందా? దీని సమాధానమూ లేదనే రాగలదు. ఇస్లాం మానవునికి ఉన్నత ఆధ్యాత్మిక ప్రమాణాలను పరిచయం చేసి అతన్ని ఓ ఉత్తమ మానవునిగా తీర్చిదిద్దింది. గౌరవానికి, ఆధిక్యతకు, ఉన్నత స్థానానికి కొలమానం ధనమో, బలమో, అధికారమో కాదని ప్రప్రథమంగా మనిషికి బోధించింది ఇస్లామేగా. వాటికి బదులుగా అసలు కొలమానం దైవం పట్ల భయభక్తులు, మనుషుల ఎడల రుజువర్తనం అని బోధించిందీ ఇస్లామే కదా!

> నిస్సందేహంగా మీలో ఎవరయితే అత్యధికంగా భయభక్తులు
> కలవాడో అతనే దైవం దృష్టిలో ఆదరణీయుడు.
> (అల్ హుజ్‌రాత్ : 13)

ఇస్లాం బోధించే ఈ ఉన్నత జీవితపు విలువలకు సమాజంలో ఒకసారి స్థిరత్వం లభించిందంటే ఇక స్త్రీ కేవలం శారీరకంగా అబల కావడంచేత హీనంగా చూచే ప్రసక్తే రాదు. వాస్తవంగా ఇస్లామీయ సమాజంలో సౌజన్యతను, మానవీయతను పరీక్షించే గీటురాయి భార్యతో భర్త నడవడి అని మహాప్రవక్త (సఅసం) బోధించారు.

> మీలో ఎవరయితే తన ఇంటివారితో ఉత్తమరీతిలో
> వ్యవహరిస్తాడో అతడే అందరికంటే ఉత్తమమయినవాడు.
> ఇంటివారితో వ్యవహరించడంరీత్యా నేను మీలో
> అందరికంటే మేలయిన వాణ్ణి .

ఈ హదీసు ప్రబోధం ద్వారా, ఇస్లాం శాసనాంగ నిర్మాత అయిన ప్రవక్త మహనీయులకు మానవ మనస్తత్వం గురించి ఉన్న సరయిన స్పష్టమయిన అవగాహన, అనుభవజ్ఞతలు ద్యోతకమవుతాయి. అంతేకాక మన ముందుకు వచ్చే ఇతర యదార్థాలేమంటే ఒక వ్యక్తి తన భార్యపట్ల దుర్వర్తనుడుగా తయారయ్యాడంటే అతడు స్వయంగా మానసిక సమస్యల్లో రుగ్మతల్లో చిక్కుకుని ఉన్నాడన్నమాట. లేదా నిజమయిన, సరయిన మానవతా ప్రమాణాలకు ఎంతో దిగువన ఉన్నాడన్నమాట.

నేడు మనిషి దిగజారిపోవడానికి, అతని జీవితంలో పశుత్వం ప్రాబల్యం వహించడానికి కారణం ఇస్లామా? నిస్సందేహంగా కాదు. మానవులు ఇలా అధఃపాతాళానికి దిగజారి పశువుల్లా బ్రతుకు వెళ్ళదీయడాన్ని ఇస్లాం అసలు ఏ మాత్రం సహించదు. దీనికి భిన్నంగా అది మనిషిని ఆధ్యాత్మికంగా మహోన్నత శిఖరాలను అధిరోహింపజెయ్యాలని కోరుతుంది. ఆ తరువాత అతను కేవలం తన

వాంఛలకు దాసుడయ్యే ప్రశ్నే తలెత్తదు. ఇంకా జీవితం పట్ల అతని దృక్పథం ఏనాడూ పశుప్రాయం కాజాలదు. ఇస్లాం దృష్టిలో స్త్రీ పురుషుల లైంగిక సంబంధం కేవలం పశుప్రాయమయింది కాదు. ఇది వీరి సహజమయిన అవశ్యకతను తీర్చుకునే మార్గం. అందువల్లనే అది భార్యాభర్తల సంబంధాన్ని ధర్మబద్ధం చేసింది. ఆ విధంగా స్త్రీ పురుషులు తీరని కామతృష్ణా ప్రమాదానికి లోనవకుండా ఉండాలన్నది, జీవితపు విభిన్నరంగాల్లో ఏకోన్ముఖులయి, ఏకాగ్రచిత్తంతో సృజనాత్మక కార్యకలాపాల్లో పాల్గొనాలన్నదే దాని అభిమతం. వారి లైంగికవాంఛల పరిపూర్తికి ధర్మసమ్మతమయిన ఈ ద్వారాన్నీ మూసివేసినట్లయితే స్త్రీ పురుషులుభయులూ పెడదారి పట్టే ఆస్కారముంటుంది. అందువల్లనే ఇస్లాం వైవాహిక సంబంధాన్ని చెడుగా భావించదు. అయితే అందులో హద్దులు మీరిన ఆసక్తి కనబరచడాన్నీ ఇష్టపడదు. దాని ప్రకారం, మనిషి తన శక్తిసామర్థ్యాలు కేవలం జీవితపు ఉన్నతమయిన, ఉత్తమమయిన లక్ష్యాల సాధనకై వెచ్చించాలి. పురుషుడు దైవమార్గంలో నిరంతరం కృషి సలిపేవాడుగా జీవించాలి. స్త్రీ గృహసీమలో పిల్లల సుశిక్షణలోనూ ఇతర గృహస్థ కార్యకలాపాల్లోనూ నిమగ్నమయి ఉండాలి. ఇలా ఇస్లాం స్త్రీ పురుషులుభయుల 'జీవితానికి' పవిత్రమయిన, ఉన్నతమయిన ధ్యేయాన్ని ప్రసాదిస్తుంది. వారిని 'మానవుల్లా' జీవించడం నేర్పుతుంది.

నైతికపు విలువల్లో నేడున్న అవకతవకలు, కలతలు, కల్లోలాలను ఇస్లాం సృష్టించిందా? ఎంత మాత్రం కాదు. ఎందువల్లనంటే దివ్యఖుర్ఆన్, ప్రవక్త మహనీయుల సంప్రదాయం రెండూ మానవుల్లో ఆధ్యాత్మిక పవిత్రత, పరిశుద్ధతను జనింపజేస్తాయి. మనిషి ఇతరులతో వ్యవహరించేటప్పుడు మనో నిగ్రహంతో, మానవతా గౌరవంతో, న్యాయవంతంగా వ్యవహరించమని బోధిస్తుంది ఇస్లాం.

మన సామాజిక సంప్రదాయాలు ప్రాచ్య నారీమణి వెనుకబాటుకు కారణమా? ఈ సంప్రదాయాలు, కొందరు మేధావులనబడేవారు వ్రాసినట్లు మన మహిళల్ని అచేతనావస్థలో పడవేశాయని, సంకుచిత దృష్టిని

అలవర్చాయని, మూర్ఖురాలుగా చేసి వేశాయని అనడం యదార్థమా? కాదు ముమ్మాటికీ కాదు. మన సంప్రదాయాలు మనల్ని జ్ఞానసముపార్జన చెయ్యరాదని బోధించవు. ఇంకా కాయకష్టంచేసి సంపాదనాపరులవడాన్ని, సామాజిక వ్యవహారాల్లో ఇతరులతో సహాయ సహకారాలు పొందడాన్నీ కాదనవు. అయితే ఒకే షరతు. ఈ కార్యకలాపాలన్నీ మానవ సాఫల్య, సంక్షేమాల లక్ష్యంతో బాటు కొనసాగాలి. వాటివల్ల ఎలాంటి సామూహిక నష్టం వాటిల్లే ప్రమాదమూ ఉండరాదు.

మన ఈ సంప్రదాయాలు* వ్యతిరేకించేది, కొన్ని హానికరమయిన, వివేకశూన్యమయిన కార్యకలాపాలనే. ఉదాహరణకు, అనవసరంగా స్త్రీలు వీధుల్లో తిరగడాన్ని తీసుకోండి. ఈ స్త్రీ విమోచనోద్యమకారులు ప్రతిపాదించే బాహ్య కార్యకలాపాలతో బాటు మహిళ స్త్రీగా తన సామర్థ్యాలను పూర్తిగా వినియోగించగలదని, తద్వారా సమాజంలో గౌరవమర్యాదలు పొందగలదని ఎవరయినా ఎలా ఆశించగలరు? మహిళలు ఒకవేళ ఈ మార్గాన పురోగమిస్తే, పాశ్చాత్య 'నాగరిక', 'భావ వికాస' సమాజంలోని 'సొసైటీ గర్ల్స్' అనుభవం మన ముందుంది. ఆ విధంగానే వీరూ సునాయాసంగా పురుషుల కామపిపాసకు బలయిపోతారు. ఈ కారణం చేతనే 'పాత' సంప్రదాయాలను వ్యతిరేకించే పెద్దలు, తాము ఇంతకాలం అలవాటుపడిన భోగవిలాసాలకు, రాసక్రీడలకు, ఆ సంప్రదాయాలు అడ్డు తగులుతాయనే వాటిని వ్యతిరేకిస్తున్నారు.

ఈజిప్ట్‌కు చెందిన ఓ ముస్లిమేతర సాహితీకారుడు ఇస్లాంను దెబ్బతీయడానికి ఏ అవకాశాన్నీ జారవిడిచేవాడు కాదు. అతను తన వారపత్రిక ద్వారా ముస్లిం స్త్రీలను మాటిమాటికీ ప్రోత్సహించేవాడు: "మీ పాతబడిన సంప్రదాయాలను పడగొట్టండి. ఇండ్లనుండి వెలుపలికి రండి.

---

* సంప్రదాయాలంటే మా ఉద్దేశ్యంలో అసలుసిసలయిన ఇస్లామీయ సంప్రదాయాలనే అర్థం. వీటిలో ఇతరుల నుండి గ్రహించిన అపరిచిత సంప్రదాయాలు చేరిలేవు. కాని సంప్రదాయాలను ప్రస్తావించేవారు ఈ రెండు విధాల సంప్రదాయాల మధ్య ఉన్న తేడాను పూర్తిగా విస్మరిస్తారన్నదే ఎంతో వింతయిన విషయం.

ధైర్యసాహసాలతో పురుషులతో స్వేఛ్ఛగా కలసి తిరగండి. కర్మాగారాల్లో, కార్యాలయాల్లో ఉద్యోగాలు చెయ్యండి. ఇదంతా ఎందుకు చెయ్యాలని అడుగుతారేమో, ఈ పనులు చేసే అవసరం ఏదీలేదు. కాని, మానవాళికి తల్లులుగా మీపై మోపబడ్డ బాధ్యతలనుండి మీరు తప్పించుకునే మార్గం ఇదొక్కటే." ఈ మహోదయుడు* స్త్రీను ఇలా బోధించేవాడు, "ఏ స్త్రీ అయితే రోడ్డున నడుస్తూ చూపులు క్రిందికి దించుకుపోతుందో ఆవిడ నిజానికి ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయింది, పురుషులంటే అమితంగా భయపడుతుంది. కాని అనుభవపూర్వకంగా ఆవిడలో భావ వికాసం కలిగితే ఆ భయం కూడా క్రమేణా తొలిగిపోతుంది. అప్పుడు ఆవిడ సాహసోపేతంగా ఎదుటి లింగం వ్యక్తుల చూపుతో చూపు కలపగలుగుతుంది". ఈ మాటలు వ్రాసే ఆ రచయిత, పాపం, చరిత్రనే పూర్తిగా విస్మరించాడు. హజ్రత్ ఆయిషా(రజిఅన్) తన కాలంలో రాజకీయాల్లోనూ పాల్గొన్నారు, యుద్ధాల్లో సైన్యానికి నాయకత్వమూ వహించారు. అయితే ఆవిడగారు పురుషుల ఎదుట బరితెగించి తిరగలేదు. పరదా పద్ధతిని వదల్లేదు. ఆ రచయితకు, క్రింది చూపుతో మసలుకోవడం కేవలం స్త్రీల ప్రత్యేకత కాదు అన్న విషయం కూడా తెలీదు. దైవప్రవక్త (సఅసం) కన్యలకన్నా అధికంగా సిగ్గుపడేవారు. ఆయనకు ఈ లజ్జాగుణం, ఆయనలో ఆత్మవిశ్వాసం కొరవడటం కారణంగానే అబ్బిందా? ఇస్లాం వ్యతిరేకులు ఇలా తలా తోకాలేని, వివేచనారహితమయిన మాటలు ఇంకా ఎంతకాలమని వల్లిస్తూ ఉంటారో?!

నేడు మగువ పతనానికి, హీనదశకు చేరుకున్నదన్నది వాస్తవం. దాన్ని కాదనగల ధైర్యం ఎవరికీ లేదు. కాని దీని నివారణోపాయం పాశ్చాత్య స్త్రీ చేపట్టిన పద్ధతి మాత్రం కాదు. పాశ్యాత్య స్త్రీ ఎదుర్కోవలసి వచ్చిన పరిస్థితులు వేరు. అక్కడి మహిళ ఏ మార్గ విహీనతలకు గురయిందో

---

* ఇక్కడ ప్రస్తావించిన రచయిత పేరు 'సలామా మూసా'. ఇతని రచనలు ఇస్లాం శత్రుత్వానికి ప్రతీకలు. వీటిలో నిత్యం ఇస్లాంకు వ్యతిరేకంగా ఏదో ఒక ఆక్షేపణ ఉంటూ ఉండేది. ఓ క్రైస్తవ రచయిత జార్జీ జైదాన్ కూడా ఇదే వైఖరి అవలంబించేవాడు. ఈజిప్ట్‌లో వీరిరువురూ ఇస్లాం వ్యతిరేక శక్తుల పదాతి దళంలాంటి వారు!

అవి కూడా ఆ పరిస్థితులు సృష్టించినవే.

సమస్య స్త్రీదయినా పురుషునిదయినా దాన్ని ఇస్లాం - కేవలం ఇస్లాం - మాత్రమే పరిష్కరించగలుగుతుంది. అందువల్ల పురుషులయినా, స్త్రీలయినా, వృద్ధులయినా, యువకులయినా చెయ్యవలసింది, కలసి కట్టుగా కృషిచేసి ఓ నిజమయిన ఇస్లామీయ సమాజాన్ని నెలకొల్పడం. మన జీవితాలను ఇస్లామీయ వ్యవస్థ కనుగుణంగా మలచుకోవడం; మనం ఈ కర్తవ్యాన్ని నెరవేర్చినప్పుడు క్రియా ప్రపంచంలో ఇస్లామీయ విశ్వాసాలు, సిద్ధాంతాలు కూడా ఆధిక్యతతో భాసిల్లుతాయి. జీవితంలో సామరస్యం, సమతూకం సాధించడానికి ఇదొక్కటే సరయిన మార్గం. ఈ మార్గం ఒక్కటే సకల విధాల అన్యాయాలు, అక్రమాలు, దోపిడీలు, దౌర్జన్యాలకు అతీతంగా పరిశుద్ధమయిన మనుగడను తీర్చిదిద్దగలుగుతుంది.

# 9. నేరమూ శిక్ష

"ప్రాచీన కాలంలో అనాగరికులకోసం నిర్ణయించిన ఆటవిక శిక్షల్ని నేటి అభివృద్ధిచెందిన రోజుల్లో ఎలా అమలుపరచగలం? కేవలం కొన్నిరూపాయల్ని దొంగిలించినందుకు మనిషి చేతుల్ని నరికివెయ్యడమా? వాస్తవంగా ఒక అపరాధి, దొంగయినా, దుండగీడయినా ఆధునిక దృక్పథం ప్రకారం సమాజం చేసిన అన్యాయాలకు, అత్యాచారాలకు గురయిన వాడేకదా. అతడు శిక్షకు కాదు సానుభూతికి, మానసిక చికిత్సకు అర్హుడు". ఇదే ఆ తర్కవాదం, ఇస్లామీయ శాసనాంగం విషయంలో నవీన భావవికాసం పొందిన వారి నోటిద్వారా తరచుగా వినవచ్చేది. కాని వింతయిన విషయం ఏమిటంటే ఇరువయ్యో శతాబ్దపు భావ వికాసం పొందిన ఈ మహానీయులు, ఉత్తర ఆఫ్రికాలోని 40 వేల అమాయక జీవుల విచక్షణారహిత నరమేధ జరిగినప్పుడు కనీసం కొంత కలతయినా చెందలేదు. కాని కేవలం ఓ అపరాధికి చట్ట బద్ధంగా శిక్షిస్తే ఎంతో కళవళపడతారు, చీదరించుకుంటారు - ఎంత శోచనీయం ! మనిషి అందమయిన పదాలకు మోసపోతాడు, అసలు వాస్తవం అతని కళ్ళనుండి మరుగయి పోతుంది. ఇరువయ్యో శతాబ్దపు నాగరికత, దాని రోగాలు అలాఉంచి మనం ఇస్లాం దృష్టిలో శిక్ష అంటే ఏమిటో పరిశీలిద్దాము.

## భిన్న ధృవాలు

సమాజానికి వ్యతిరేకంగా ఎలాంటి అత్యాచారం జరిగినా దాన్ని అపరాధం అని నిర్వచిస్తారు. ఈ కారణం చేతనే నేరమూ శిక్షల భావనను, వ్యక్తికీ సంఘానికీ మధ్య సంబంధాలను నిర్ణయించడంలో సమాజంలోని సామూహిక దృక్పథం ప్రముఖ పాత్ర వహిస్తుంది.

పశ్చిమంలోని పెట్టుబడిదారి, వ్యక్తితత్వ ప్రధానమయిన దేశాలు వ్యక్తి యొక్క గౌరవాదరణలపట్ల, అతని పవిత్రత పట్ల అత్యంత

అతిశయోక్తితో వ్యవహరిస్తాయి. వ్యక్తినే సామాజిక జీవితం మొత్తానికి కేంద్రంగా పరిగణిస్తాయి. ఈ దేశాల్లో మనిషి వ్యక్తిగత స్వేచ్ఛపై ఆంక్షలు విధించే విషయంలో రాజ్యాధికారాలు చాలా పరిమితం. ఈ మౌలిక భావనే ఆ దేశాల్లో నేరమూ - శిక్ష భావనలోనూ కానవస్తుంది. అక్కడ అపరాధుల్ని సానుభూతికి అర్హులుగా పరిగణించడం జరుగుతుంది. వారి దృష్టిలో నేరస్థులు అపసవ్యమయిన పరిసరాలు, మానసిక సమస్యలు, నరాల వ్యాధుల మూలంగా అలా తయారవుతారు. ఈ దృక్పథం మూలంగా ఆ దేశాల్లో నేరాలకు విధించే శిక్షల్లో, ముఖ్యంగా నైతిక నేరాలశిక్షల్లో ఉదారత కానవస్తుంది. చివరికి కొన్ని నేరాల విషయంలో వాటిని అసలు శిక్షార్హమయిన నేరాలుగా పరిగణించడమే జరగదు.

ఈ దశలో మానసిక విశ్లేషణ (PSYCHO ANALYSIS) సిద్ధాంతం మన ముందుకు వస్తుంది. అది నేరాన్ని విశదపరచడంలోనూ నిర్వచించడంలోనూ మనకు తోడ్పడుతుంది. ఫ్రాయిడ్ (FREUD) ఈ ముఖ్యమయిన చారిత్రకమయిన విప్లవానికి అగ్రగామి. అతని వాదన ఏమంటే, 'నేరస్థుడు వాస్తవానికి లైంగిక సమస్యలకు లోనయి ఉంటాడు. సమాజం, మతం, నైతికత, సంప్రదాయాలు ప్రకృతిసిద్ధమయిన మానవ వాంఛల్ని అణచే ప్రయత్నం చేసినప్పుడు ఆ సమస్యలు అతనిలో ఉత్పన్నమవుతాయి' అన్నది. అప్పటినుంచి మానసిక విశ్లేషణా సిద్ధాంతాన్ని ఆమోదించిన మనస్తత్వ శాస్త్రవేత్తలందరూ ఫ్రాయిడ్‌నే అనుసరించారు. అయితే వీరిలో చాలామంది అతని ఈ సిద్ధాంతాన్ని - అంటే జీవితంలో లైంగిక విషయాలకే కేంద్రస్థానముందన్న సిద్ధాంతాన్ని - అంగీకరించలేదు. ఈ శాస్త్రవేత్తల ప్రకారం నేరస్థుడు, తనలోని అశక్తత కారణంగా వ్యక్తిగత, సామాజిక జీవితంలో తాను ఎదుర్కొనే పరిస్థితులకు తలవంచుతాడని సిద్ధాంతీకరించారు. వారంతా 'మానసిక వత్తిడి' (PSYCHOLOGICAL DETERMINISM) సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టారు. వారి అభిప్రాయం ప్రకారం మానసిక శక్తులకు సంబంధించినంతవరకు మనిషికి ఇష్టపడే స్వేచ్ఛగాని, ఆచరించే స్వాతంత్ర్యంగాని లేదు. అతను వాటి సమక్షంలో కేవలం అశక్తుడు. ఆ శక్తులు అతని ప్రమేయం లేకుండానే ఓ నిర్దిష్ట

నియమం ప్రకారం పనిచేసుకుంటూ పోతాయి.

దీనికి భిన్నంగా కమ్యూనిస్టు దేశాల సిద్ధాంతం ఏమిటంటే సమాజం, సామూహిక వ్యవస్థే పవిత్రమయిన ఏకత్వం. దానికి వ్యతిరేకంగా గళం విప్పే హక్కు వ్యక్తికి ఏ మాత్రం లేదు. అందువల్ల ఈ దేశాల్లో ఏ వ్యక్తి అయినా రాజ్యానికి వ్యతిరేకంగా తిరగబడితే అతనికి అత్యంత కఠినమయిన శిక్ష విధించడం జరుగుతుంది. మరణదండన మొదలుకుని అన్ని రకాల చిత్రహింసలూ విధించబడతాయి. ఫ్రాయిడ్, అతనితో ఏకీభవించే మనస్తత్వవేత్తల మాదిరిగా, కమ్యూనిజం నేరాల బాధ్యతను మనిషి మనస్తత్వానికి ఆపాదించదు. దీనికి బదులుగా ఆర్థిక వ్యవస్థలో కారణాలు అన్వేషిస్తుంది. కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రకారం ఏ సమాజమయితే ఆర్థిక వెనుకబాటుకు లోనయి ఉంటుందో అందులో ఎలాంటి మంచితనమూ పెంపొందజాలదు. కనుక ఇలాంటి సమాజాల్లో నేరస్తులకు శిక్ష విధించరాదు. సరే ఈ సిద్ధాంతమే నిజమయితే, సర్వత్రా సమానత వెల్లివిరుస్తున్న రష్యాలో నేరాలు ఎందుకు జరుగుతున్నాయి? జైళ్ళు, న్యాయస్థానాలు ఎందుకు అవసరమయ్యాయి??

## పాక్షిక దృష్టి

వ్యక్తితత్వవాదులయినా, కమ్యూనిస్టులయినా - వారి సిద్ధాంతాలు పాక్షికంగా సరయినవే. వ్యక్తిపై అతని పరిసరాల ప్రభావం ప్రబలంగా ఉంటుందన్నదీ వాస్తవమే. అతని అధః చేతనలోని సమస్యలు ఒక్కోసారి నేరాలకు కారణభూతమవుతాయన్నది కూడా యదార్థమే. కాని మనిషి పరిస్థితుల ముందు కేవలం అశక్తుడన్నది మాత్రం నిజం కాదు. 'మానసిక విశ్లేషణ' శాస్త్రవేత్తలు తప్పుదారిన పడడానికి కారణం వారు మానవునిలోని 'గతిశీలకశక్తి' (DYNAMIC ENERGY) కి మాత్రమే ప్రాధాన్యత నిచ్చారు. మానవునిలో ప్రకృతి ప్రదానంచేసిన 'నిగ్రహ శక్తి' (CONTROLLING ENERGY)ని పూర్తిగా విస్మరించారు. వాస్తవానికి ఈ శక్తి సహాయంతోనే బాలుడు ఓ ప్రత్యేక వయసుకు చేరిన తరువాత మల మూత్రాలను

విసర్జింపచేసే నాడీమండలపై అదుపును పొందగలుగుతాడు, పడకను తడుపుకోడు. ఈ శక్తి సహకారంతోటే అతను తన భావోద్రేకాలపై, చర్యలపై అదుపును సాధించడం నేర్చుకుంటాడు. అదుపు తప్పే తన కోరికలకు ఆశలకు కళ్ళెం వెయ్యగలుగుతాడు.

ఆర్థిక పరిస్థితులు కూడా మనిషి భావోద్రేకాలపై, చర్యలపై ప్రభావం వేస్తాయన్న విషయం కూడా యదార్థమే. ఆకలి మనిషి ఆత్మలో సంచలనాన్ని, విద్వేషాన్ని సృష్టించి ఒక్కోసారి నేరాలకు, నైతిక విచ్చిత్తికి కారణభూతమవుతుందన్న విషయం కూడా నిజమే. అయితే కేవలం ఆర్థిక పరిస్థితులే మానవ జీవితానికి ప్రభావవంతమయిన ప్రేరణ నిస్తాయనడం సరికాదు. ఆకలిదప్పుల్ని, బీదరికాన్ని పూర్తిగా రూపుమాపిందని ప్రకటించే సోవియట్ రష్యా సామాజిక పరిస్థితులు చాలు ఈ వాదనను తప్పని రుజువు చెయ్యడానికి !

## మధ్యే మార్గం

అపరాధికి శిక్ష విధించాలా వద్దా అన్న నిర్ణయానికి వచ్చేముందు నేరం చెయ్యడంలో అతని బాధ్యత ఏ మేరకు ఉందో నిర్ణయించవలసి ఉంటుంది. నేరమూ - శిక్ష విషయానికి వస్తే ఇస్లాం ఈ అంశాన్ని విస్మరించదన్నది గమనార్హం.

ఇస్లాం గుడ్డిగా శిక్షల్ని విధించదు. కళ్ళు మూసుకుని వాటిని అమలు పరచదు. ఇస్లాం దృక్పథం, వ్యక్తితత్వవాదులు (INDIVIDUAL-ISTS) మరియు కమ్యూనిస్టులు ఉభయుల దృక్పథాల్లోని సరయిన అంశాల సమగ్రరూపం. ఇస్లాం అక్షరాలా న్యాయాన్ని నెలకొల్పాలని అభిలషిస్తుంది. నేరానికి శిక్ష విధించేముందు నేరం చెయ్యడంలో సంబంధం ఉన్న పరిస్థితులు, కారణాలన్నింటినీ పరిశీలించగోరుతుంది. అపరాధికి శిక్ష విధించేటప్పుడు ఇస్లాం రెండు విషయాలను పరిశీలిస్తుంది. అపరాధి అభిమతం, ఏ సమాజంలోనయితే నేరం జరిగిందో దాని దృక్పథం.

ఈ రెంటి వెలుగులో ఇస్లాం సమంజసమయిన శిక్షను నిర్ణయిస్తుంది. అది తార్కికంగా, బుద్ధిపరంగా కూడా సమతూకం కలిగి అపసవ్యమయిన వ్యక్తితత్వపు లేక జాతితత్వపు భావాలకు దూరంగా ఉంటుంది.

ఇస్లాం ప్రతిపాదించే కొన్ని ఆదర్శవంతమయిన శిక్షలు బాహ్యాంలో చూడడానికి క్రూరంగా, అనుచితమయినవిగా అగుపడవచ్చు. కాని కాస్త ఆలోచిస్తే ఈ శిక్షలు క్రూరమయినవి ఏ మాత్రంకావని, అనుచితమయినవి అంతకన్నా కావని ఇట్టే బోధపడుతుంది. అపరాధి గత్యంతరంలేని స్థితుల్లోనే నేరంచేశాడని, న్యాయసమ్మతమయిన, సమంజసమయిన కారణాలే అతన్ని దానికి పురికొలిపాయని రూఢీకాని పక్షంలోనే ఇస్లాం, ఆ శిక్షల్ని విధిస్తుంది. ఉదాహరణకు దొంగతనానికి శిక్ష ఇస్లాంలో చేతులు నరకడం. అయితే ఈ దొంగతనానికి ఆకలిదప్పులే కారణమని కాస్తంత ఆధారం లభించినా నేరస్థునికి చేతులు నరికే శిక్ష పడదు. ఇలాగే వ్యభిచారులయిన స్త్రీ పురుషులకు రాళ్ళు రువ్వి చంపే శిక్ష విధిస్తుంది ఇస్లాం. కాని ఈ శిక్ష వివాహితులయిన స్త్రీ పురుషులకే పరిమితం*. అదీ నలుగురు ప్రత్యక్ష సాక్షులు నేరం చేస్తుండగా చూసినప్పుడే విధించ బడుతుంది. అలాగే ఇతర శిక్షల విషయంలోనూ ఇస్లాం ఇలాంటి జాగ్రత్తలనే తీసుకుంటుంది.

రెండవ ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజిఅన్) ఇస్లామీయ చరిత్రలో మహాగొప్ప న్యాయవేత్తగా పరిగణించబడతారు. ఆయన సూత్రీకరించిన ఓ నియమంలోనూ పైనుదహరించిన యదార్థం ద్యోతకమవుతుంది. హజ్రత్ ఉమర్ (రజిఅన్) షరీఅత్ ఆదేశాలను అమలు జరపడంలో ఎంతో కఠినంగా వ్యవహరించేవారని ప్రతీతి. దాని కారణంగా ఆయన సూచించిన నియమాన్ని మెతకతనం అని చెప్పడానికి కూడా వీల్లేదు. ఆయన కాలంలో

---

* దీనికి హేతువు ఏమిటంటే, వివాహితులకు చట్టబద్ధంగా లైంగిక సుఖాన్ని అనుభవించే అవకాశాలుండగా వారు సంఘనియమాన్ని కాలరాచి పెడత్రోవ త్రొక్కడం మన్నించరాని నేరం. అవివాహితుల విషయం కొంతవరకు భిన్నమయింది.(అను)

ఓసారి ఘోరమయిన క్షామం ఏర్పడింది. అప్పుడు దొంగతనానికి చేతులు నరికే శిక్షను తాత్కాలికంగా రద్దు చేశారు. ఎందుకంటే, ఆకలి దప్పులకు తాళలేక మనుషులు దొంగతనం చేసే అవకాశం ఎంతయినా ఉంటుంది. అలాగే దిగువపేర్కొన్న సంఘటన ద్వారా కూడా ఇస్లామీయ శాసనంలోని ఈ కోణం బాగా ప్రస్ఫుటమవుతుంది.

హాతిబ్ బిన్ అబీ తబకా నౌకరులు కొందరు ముజ్నాకు చెందిన ఓవ్యక్తి ఒంటె నొకదాన్ని దొంగలించారని హజ్రత్ ఉమర్‌కు తెలిసింది. విచారణలో నౌకరులు నేరాన్ని అంగీకరించారు. దానికి ఆయన హస్తఖండన శిక్షను విధించారు. ఆ తరువాత ఆయన దాన్ని ఉపసంహరించుకుని ఇలా అన్నారు: "దైవం సాక్షి! నీవు ఈ యువకుల్ని నౌకరులుగా నియమించుకుని వారిని ఆకలితో అలమటింపజేస్తున్నావని, దాని కారణంగా వారు దొంగతనం చేసి హరామ్ (అధర్మమయినది) తినడానికి సిద్ధమయ్యారని తెలిసి ఉండకపోతే నేను వీరి చేతులు నరికించేవాణ్ణి" అంటూ వారి యజమాని హాతిబ్‌ని సంబోధించి, "దైవం సాక్షి! నేను వారి చేతులనయితే ఖండించలేదు కాని నీపై భారీ జరిమానాను విధిస్తున్నాను. దానివల్ల నీకు కష్టం కలిగి (బుద్ధి వస్తుంది)" అని అన్నారు. ఆ తరువాత ఆయన ఒంటె యజమానికి రెండు ఒంటెల ధర చెల్లించే జరిమానాను ఆ నౌకరుల యజయానిపై విధించారు.

ఈ సంఘటన ఇస్లామీయ శాసనాంగానికి సంబంధించిన ఓ స్పష్టమయిన, ప్రస్ఫుటమయిన సూత్రాన్ని మనకు తెలుపుతోంది. అదేమంటే నేరం పరిస్థితుల ప్రభావానికి లోనయి చేసినప్పుడు నేరస్థునికి చట్టబద్ధమయిన శిక్ష విధించడం జరగదు. ఈ సూత్రాన్ని దైవప్రవక్త (సఅసం) ప్రవచనం కూడా బలపరుస్తుంది.

"అనుమానం కలిగినప్పుడు శిక్షల్ని విధించకండి" అనే మహనీయ ముహమ్మద్ (సఅసం) ప్రవచనం.

## మూల నిర్మూలనం

నేరం - శిక్షలకు సంబంధించిన ఇస్లాం విధానాన్ని పరిశీలించిన తరువాత తెలిసేదేమంటే, ఇస్లాం ప్రథమంగా సమాజాన్ని, నేరాలకు కారణభూతమయ్యే పరిస్థితులనుండి పరిశుద్ధం చేస్తుంది. ఆ తరువాత కూడా నేరాలు చేస్తే వారికి గుణపాఠం కలిగేలా న్యాయవంతమయిన శిక్షలు విధిస్తుంది. కాని నేరాల కారణాలు ఇంకా దూరంకాని పరిస్థితుల్లో, అపరాధి పరిస్థితుల ప్రభావానికి లొంగి గత్యంతరం లేక నేరం చేశాడన్న ఏ కాస్త అనుమానం కలిగినా అతనికి శిక్ష విధించడం జరగదు. దానికి బదులుగా అతని నేరానికి తగినట్టు ఏదయినా వేరే తేలికయిన శిక్ష విధించడం జరుగుతుంది. లేదా శిక్ష విధించకుండానే వదలి వెయ్యడం జరుగుతుంది.

నేరాల మూల కారణాలను ఇస్లాం అనేక విధాలుగా రూపుమాపడానికి ప్రయత్నిస్తుంది. దానికి తోడుగా సంపద న్యాయవంతంగా సమాజంలో పంపకం అయ్యేలా కూడా కృషి చేస్తుంది. ఈ పద్ధతిద్వారా హ్రజత్ ఉమర్‌బిన్ అబ్దుల్ అజీజ్ (రజిఅన్) కాలంనాటికి బీదరికం పూర్తిగా నిర్మూలించబడింది. ఇస్లామీయ రాజ్యపరిధిలో నివసించే పౌరులందరికీ ప్రాథమికావసరాలు అందజేసే బాధ్యత ఇస్లామీయ ప్రభుత్వంపై ఉంది. ఈ విషయంలో మతం, వర్ణం, వంశం, వర్గం, భాష లేక సామాజిక స్థాయిలో ఉన్న ఏ వ్యత్యాసాన్నీ లక్ష్యపెట్టడానికి వీల్లేదు. అలాగే పౌరులందరికీ తగిన ఉపాధి కల్పన కూడా ప్రభుత్వ బాధ్యతల్లోని అంశమే. ఉపాధి కల్పన సాధ్యం కాకపోతే లేక ఏ పౌరుడయినా తన ఉపాధి తాను సంపాదించుకునే స్థితిలో లేకపోతే ప్రజా ధనాగారంనుండి అతనికి సహాయం చెయ్యడం జరుగుతుంది.

ఇస్లాం లైంగిక (SEX) ప్రాముఖ్యాన్ని కూడా కాదనదు, దాని తృప్తికై ధర్మబద్ధమయిన చట్టబద్ధమయిన మార్గం - నికాహ్ - ను ప్రతిపాదిస్తుంది. యుక్తవయసురాగానే పెళ్ళి చెయ్యాలని అంటుంది. ఎవరికయితే నికాహ్

(పెళ్ళి) చేసుకునే స్తోమత ఉండదో వారికి ప్రభుత్వ ధనాగారం నుండి సహాయం అందజెయ్యాలని అంటుంది. దీనికి తోడుగా భావోద్రేకాల్లో కల్లోలాన్ని రేకెత్తించే మూల కారణాలను దూరం చేస్తుంది.* ఇస్లాం మనిషికి ఓ ఉన్నతమయిన, పరిశుద్ధమయిన ధ్యేయాన్ని ప్రసాదిస్తుంది. దాన్ని అతను స్వీకరిస్తే అతని శక్తులన్నీ సమాజం సమగ్ర సంక్షేమంలో వినియోగపడతాయి. మనిషి ఖాళీ సమయాల్లో దైవ సాన్నిధ్యం, దైవ సామీప్యం పొందేందుకు కృషి చెయ్యాలని ప్రోత్సహిస్తుంది. ఈ విధం గా ఇస్లాం, అపరాధాల పెరుగుదలకు ప్రేరక అంశాలను నిర్మూలిస్తుంది.

నేటి ఆర్థిక, సామాజిక, నైతిక పరిస్థితుల కారణంగా యువకులు వివాహాలు చేసుకోవడం అంత సులువయిన పనికాదు, అందుచేత వారు దుష్టత్వానికి పాల్పడుతున్నారన్నది ఓ వాదన. మేము ఈ యదార్థాన్ని అంగీకరిస్తాము. కాని మనం ఇస్లాంను సరయిన రీతిలో అనుసరించినట్లయితే సమాజంలో హేయమయిన కామవాంఛల్ని ప్రేరేపించే, యువకుల నైతికతను సర్వనాశనం చేసే అసభ్యమయిన, నీతిబాహ్యమయిన సినిమాలు, పత్రికలు, అశ్లీలమయిన పాటలు కూడా ఉండవు. యువకుల భావోద్రేకాలను రెచ్చగొట్టే అన్ని మార్గాలూ మూతబడతాయి. సమాజంలో, కోరినా పెళ్ళిచేసుకోలేని నికృష్టపు అభిశాపమూ ఉండదు. సమాజం ఈ విధంగా అన్ని ప్రేరక కారణాలనుండి పరిశుద్ధమయినప్పుడు మనుషులు మంచి మానవులుగా జీవించాలని ఆశిస్తుంది ఇస్లాం. అప్పటికీ ఓ దుర్మార్గుడు, సమాజంలోని ఉన్నతమయిన విలువలన్నింటినీ కాలరాచి, పూర్తిగా పాశవిక స్థాయికి దిగజారి విచ్చలవిడిగా, వ్యభిచారానికి ఒడిగట్టి నలుగురు సాక్షులు కూడా చూచేవిధంగా ప్రవర్తించినట్లయితే అతనికి శిక్ష విధిస్తుంది. అలాంటి వాతావరణంలో వారి నేరానికి ఎలాంటి కారణమూ లేదు, వారు నేర ప్రవృత్తికి లోనయ్యేపరిస్థితులూ లేవు గనుక.

ఇస్లాంను ఇతర జీవన వ్యవస్థల నుండి వేరుచేసి ప్రత్యేకస్థానం

---

* పరదావ్యవస్థ, స్త్రీ పురుషుల కార్యరంగాల నిర్ణయం, స్త్రీ పురుషులు విచ్చలవిడిగా, కలివిడిగా సంచరించడాన్ని నిరోధించడం, అశ్లీలమయిన సాహిత్య, గాన, నృత్య సినీ ప్రదర్శనల్ని నిషేధించడం ఇత్యాది విషయాలు – (అను)

కల్పించేది కేవలం, శిక్షను విధించేముందు నేరానికి దోహదపడే సకల కారణాల ద్వారాలు మూయడమేకాదు ఇన్ని జాగ్రత్తలు తీసుకున్న తరువాత కూడా ఏ నేరస్థుని విషయంలోనయినా అతడు పరిస్థితుల ప్రభావానికి లోనయి అపరాధానికి పాల్పడ్డాడని అనుమానంవస్తే అతనికి శిక్ష విధించడం జరగదు. ప్రపంచంలో మరే న్యాయ వ్యవస్థ ఈ న్యాయానికి, ఈ విశాల దృక్పథంగల చట్టానికి సరితూగగలదో ఆలోచించండి!

## అపోహలా, భయాలా ?

కొందరు యూరపు రచయితలు, నేరమూ - శిక్షలపట్ల ఇస్లామీయ భావన గురించి పూర్తిగా తెలియని కారణాన అది నిర్ణయించిన శిక్షల్ని అమానుషమయినవని అనాగరికమయినవని అంటారు. యూరపు శిక్షా స్మృతి మాదిరిగానే ఈ శిక్షలు కూడా అనుదినం విధించటం జరుగుతూ ఉంటుందన్న అపోహకు వారు గురయ్యారు. వారి దృష్టిలో ఇస్లామీయ సమాజంలో కొరడా దెబ్బలు, హస్తఖండన, రాళ్ళు రువ్వి చంపడంలాంటి శిక్షలు సర్వసామాన్యమయిన విషయం! వాస్తవానికి ఇలాంటి గుణపాఠం గరిపే శిక్షలు ఇస్లామీయ సమాజంలో ఎప్పుడోగాని అమలుగావు. ఇస్లామీయ చరిత్ర తొలి నాలుగు శతాబ్దాల కాలంలో దొంగతనానికి హస్తఖండన శిక్ష విధించడమన్నది కేవలం ఆరుసార్లు మాత్రమే జరిగింది. ఈ శిక్షల అసలు ఉద్దేశ్యం దొంగతనాన్ని అరికట్టడమే కాని ప్రజల చేతులు నరకడం కాదన్నది దీనివల్ల ద్యోతకమవుతుంది. అందువల్లనే శిక్షలు విధించేముందు ప్రభుత్వం, అసలు నేరాలనే అరికట్టే ప్రయత్నం చేస్తుంది. ఇస్లామీయ శిక్షాస్మృతిని అమలుపరచిన ఈ కొన్ని సంఘటనలు కూడా నిస్సందేహంగా న్యాయవంతమయినవని గట్టిగా చెప్పవచ్చు. ఇస్లామీయ శిక్షాస్మృతిని అమలు జరపడంపట్ల కొందరు యూరపు మేధావుల అమితమయిన భయానికి కారణం ఏమిటో బోధపడదు. ఒకవేళ వారు నేరప్రవృత్తి గలవారయి, ఎలాంటి ప్రేరక కారణమూ లేకుండానే నేరానికి పాల్పడటం వారి గుణమయితే వారి భయానికి అర్థం ఉందనవచ్చు.

కొందరు ఇలాంటి శిక్షల వల్ల ఆచరణాత్మకంగా ఎలాంటి ప్రయోజనం ఒనగూడదని అభిప్రాయపడతారు. ఇది తప్పుడు అంచనా. ఇస్లామీయ శిక్షాస్మృతిని ఎలాంటి ప్రేరక కారణం లేకుండానే అపరాధానికి ఒడిగట్టే వారిని అదుపులో పెట్టేందుకే అమలు జరపడం జరుగుతుంది. ఇలాంటి వారి మానసిక శిక్షణ కోసం ఈ శిక్షలు ఎంతో ప్రయోజనకరంగా ఉంటాయి. వారి నేర ప్రవృత్తి ఎంత తీవ్రమయినదయినా శిక్ష లభించే భయం వారిని నేరం చేసేముందు తప్పని సరిగా పదిమార్లు ఆలోచింపజేస్తుంది. కొందరు యువకులు లైంగిక అసంతృప్తికి గురయి ఉంటారన్న విషయం వాస్తవమే అయినా ఇలాంటి కొందరి కొరకు మొత్తం సమాజాన్ని నైతిక ప్రమాదానికి గురిచెయ్యలేము కదా. ఎవరయితే ఎలాంటి కారణం లేకుండా నేరాలు చేసే ప్రవృత్తి కలిగి ఉంటారో వారిని ఇస్లాం జైలు కడ్డీల వెనక త్రోసి వెయ్యడంతో తన బాధ్యత తీరిందనుకోదు. సాధ్యమయినన్ని విధాలుగా వారి చికిత్సకై శిక్షణలకై పాటుపడుతుంది. వారు సమతూకంగల, సమంజసమయిన జీవితం గడిపేవైపుకు మరలి రావాలని ప్రయత్నిస్తుంది. ప్రజలందరి సంక్షేమం కొరకు కృషి చెయ్యగోరే సమాజం, తన ప్రజల ధన మాన ప్రాణాల రక్షణకు గ్యారంటీ ఇవ్వడం కూడా అవసరమే.

ఈ సందర్భంలో విచారకరమయిన విషయం ఏమిటంటే, సమకాలీన 'నాగరిక' నవయువకులు కొందరు, కొందరు న్యాయవేత్తలు ఇస్లామీయ శిక్షల్ని విమర్శించడానికి కారణం, కేవలం వారిలోని న్యూనతా భావం, యూరపు ప్రజలు వారిని అనాగరికులమయిన ఆటవిక ప్రజలుగా దెప్పి పొడుస్తారన్న భయం తప్ప మరేదీ కాదు. కాని వీరు ఇస్లామీయ శాసనాంగంలోని మర్మహేతువును, వాటిలో నిగూఢమై ఉన్న వివేచనా విజ్ఞతల్ని విశాల హృదయంతో అధ్యయనం చేస్తే వారి అపార్థాలన్నీ పటాపంచలవగలవని మా దృఢ విశ్వాసం.

# 10. సంస్కృతీ నాగరికతలు

"మీరు కోరేదేమిటి ? వేలాది ఏండ్లక్రితం మాదిరిగా గుడారాల్లో ఉండే దేశద్రిమ్మరులుగా మేమూ జీవించాలని కోరుతున్నారా ? ఎడారుల్లో నివసించే ఆటవిక, అనాగరిక బదుయిన్‌లకయితే ఇస్లాం సరిపోయింది. దాని నిరాడంబరతలో వారికి ఎంతో ఆకర్షణ కూడా ఉండింది. కాని నేటి యుగంలో, విమానాలు, బాంబులు, సినిమాల యుగంలో, దైవ విశ్వాసం ఆధారంగా ఏర్పడే సంస్కృతి, అభివృద్ధి చెందిన ఆధునిక సంస్కృతితో ఏమాత్రం సరితూగని సంస్కృతికి స్థానముందా ? ఆ సంస్కృతి స్తబ్ధమయింది. కాలానుగుణంగా పరిగెత్తే సామర్ధ్యం దానికసలు లేదు. అందువల్ల దాన్నుండి విముక్తి పొందనంతవరకు మనం నేటి అభివృద్ధి చెందిన నాగరిక జాతులతో భుజాలు రాసుకుంటూ నిలువలేము".

కొన్నాళ్ళక్రితం నేను ఓ బ్రిటిషు మేధావిని కలుసుకున్నప్పుడు ఇస్లాం విరోధుల ఈ ఆక్షేపణలన్నీ నా ముందుకు వచ్చాయి. నేను మొదటి కలయికలోనే ఆ ఇంగ్లీషు వ్యక్తికి చెప్పేశాను, ఈజిప్ట్ ప్రజలు బ్రిటిష్ ప్రజలంటే ద్వేషిస్తారని. బ్రిటిషు వారు ప్రాగ్దేశాల్లో ఎక్కడో ఓ చోట దురాక్రమణ దౌర్జన్యం జరుపుతూ ఉన్నంతకాలం వారు ద్వేషిస్తూనే ఉంటారని, ఇంకా మేము,బ్రిటన్ మిత్ర రాజ్యాలయిన అమెరికా వగైరా పట్ల కూడా అయిష్టంగానే ఉన్నామన్న విషయాన్ని తెలిపాను. మా ఈ అయిష్టతకు కారణం కూడా చెప్పాను. వారు ఈజిప్ట్,పాలస్తీనా ఇంకా ఇతర సమస్యల విషయంలో న్యాయ విరుద్ధమయిన వైఖరి అవలంబించారు. నా మాటలు విని అతను బిత్తరపోయాడు. ఓ క్షణం ఆగి అడిగాడు, "నీవు కమ్యూనిస్టువా?" అని. ఆపై నేను కమ్యూనిస్టును కాను ముస్లిముననని చెప్పాను, "ఇస్లాం రూపంలో నా వద్ద కమ్యూనిజంకన్నా, పెట్టుబడిదారీ వ్యవస్థకన్నా ఎంతో ఉన్నతమయిన, మరెంతో ఉత్తమమయిన సంస్కృతీ నాగరికతలు, జీవన వ్యవస్థ ఉన్నాయని. ఇస్లాం, జీవితం మొత్తాన్ని ఆవరించి దాని విభిన్న రంగాల మధ్య సమన్వయాన్ని సృష్టిస్తుంది" అని కూడా తెలిపాను.

దాదాపు మూడు గంటలవరకు మేము ఈ విషయాలనే చర్చించుకుంటు కూర్చున్నాము. చివరన అతను ఇలా అన్నాడు: "ఇస్లాం గురించి మీరు చెప్పేదంతా పూర్తిగా నిజమేకావచ్చు. కాని నా మటుకు నేను నవీన నాగరికతా ఫలాలను ఇట్టే వదులుకోలేను. నేను విమానాల్లో ప్రయాణించడమూ వదల్లేను, రేడియోలో వచ్చే ఆహ్లాదకరమయిన సంగీతం అందజేసే హాయినీ విడిచి పెట్టలేను. ఈ సౌలభ్యాలనూ సౌకర్యాలను ఈ విలాస సామగ్రిని నేను త్యజించలేను". అతని ఈ సమాధానం విని నేను చకితుడనయ్యాను. "కాని మీ ఈ అభిరుచులపై ఆంక్షలు విధించేదెవరూ ?" అనడిగాను.

"అయితే ఇస్లాం స్వీకరించడమంటే మూఢ కాలానికి, దేశ దిమ్మరుల జీవితానికి తిరోగమనం కాదా?"

## ఆమూలాగ్ర సంస్కరణ

ఇస్లాం విషయంలో ఆక్షేపణలు, అభ్యంతరాలు తెలిపేవారు సాధారణంగా నేటివరకూ ఇలాంటి అనుమానాల్లోనేపడి కొట్టుకుంటున్నారు. ఎవరయితే మత చరిత్రను అధ్యయనం చేశారో వారికి తెలుసు ఈ అభ్యంతరాల్లో ఎలాంటి పసలేదని. ఎందుకంటే, ప్రగతి, నాగరికతా మార్గాల్లో ఇస్లాం అవాంతరంగా నిలిచిన క్షణం ఒక్కటి కూడా చరిత్రలో కానరాదు. ఇస్లాం ప్రప్రథమంగా ఏ జాతినయితే సంబోధించిందో అది అత్యధికంగా బదూయీన్లతో కూడినదే. వారు నాగరికత, సంస్కృతీ సభ్యతలకు ఎంత దూరంగా, వాటిపట్ల ఎంత కర్కశంగా ఉండేవారంటే స్వయంగా దివ్యఖుర్ఆన్ వారిని గురించి ఇలా అన్నది.

> ఈ బదవీ అరబ్బులు కుఫ్ర్, కాపట్యాల్లోనే అధికంగా స్థిర చిత్తులయి ఉన్నారు. (అత్ తౌబా : 97)

ఇస్లాం సాధించిన మహత్కార్యాల్లో, మహాత్మ్యాల్లో, ఈ ఆటవిక, అనాగరిక, మొరటు ప్రజల్ని సంస్కారవంతులయిన మానవుల సంఘంగా,

ఓ జాతిగా తీర్చిదిద్దడం ఒకటి. అది వారికి కేవలం రుజు మార్గం మాత్రమే చూపలేదు, కేవలం వారిని పాశవిక స్థాయినుండి లేవనెత్తి వారికి మానవత్వపు ఉన్నత విలువలను పరిచయం చెయ్యడమే కాదు, వారిని ఇతరులకు మార్గదర్శకులుగా, దైవధర్మ ప్రచారకులుగా కూడా తీర్చిదిద్దింది. ఇస్లాంలో మానవుల సంస్కరణకై, మానవాత్మల పరిశుద్ధతకై అద్భుతమయిన సామర్థ్యం కలదనడానికి ఈ మహాత్కార్యం ఎంతో ప్రస్ఫుటమయిన, ప్రకాశవంతమయిన దృష్టాంతం.

మానవుల ఆత్మల పరిశుద్ధత ఎంతో పవిత్రమయిన ఆశయం. వాస్తవానికి సకల మానవ ప్రయత్నాలకు నిజమయిన లక్ష్యం ఇదే. మానవ సంస్కృతికి అసలు ధ్యేయం కూడా ఇదే. కాని ఇస్లాం ఆత్మల పరిశుద్ధతతోనే సరిపుచ్చదు. దానితోపాటు సంస్కృతికి నిదర్శనాలయిన వాటిని, నేడు జీవితపు నిజమయిన అనుభవాలుగా భావించబడే వాటిని సయితం జీవితంలో ఓ భాగంగా భద్రపరచింది. అందువల్లనే ఇస్లాం పరిధిలోకి వచ్చిన ఆయాదేశాల సంస్కృతిలోని మౌలిక అంశాలను అది పరిరక్షించింది. వాటిని తన సంరక్షణలో పెంపొందింపజేసింది. అయితే అది ప్రోత్సహించి రక్షించిన వాటిలో దేవుని ఏకత్వపు విశ్వాసానికి విరుద్ధం కానివి, ప్రజల్ని మంచి పనులకు దూరం చెయ్యనివి మాత్రమే ఉన్నాయన్నది వాస్తవం.

## మానవశ్రేయమే ధ్యేయం

ఇస్లాం గ్రీకునుండి లభించిన వైజ్ఞానిక వారసత్వాన్ని కూడా పరిరక్షించింది, వైద్యశాస్త్రం, ఖగోళశాస్త్రం, గణితశాస్త్రం, భౌతిక రసాయనికశాస్త్రాలు, తత్వశాస్త్రం ఇత్యాది విజ్ఞాన సంపదను కేవలం భద్రపరచడమే కాదు వాటిని ఇంకా పెంపొందించింది కూడా. యూరపు పునరుజ్జీవనోద్యమానికి, దాని వైజ్ఞానిక విజయాలకు ప్రాతిపదిక స్పెయిన్ ముస్లిములు చేసిన వైజ్ఞానిక పరిశోధనలే అనడం ఎంత మాత్రం అతిశయోక్తి

కాదు. వాస్తవమేమంటే ఇస్లాం మానవాళి సేవ చెయ్యగలందులకు ముందుకు వచ్చిన ఏ నాగరికతను, ఏ సంస్కృతినీ తన చరిత్ర మొత్తాన అడ్డగించలేదు.

నేటి పాశ్చాత్య నాగరికతపట్ల ఇస్లామ్ వైఖరి కూడా లోగడ ఇతర నాగరికతలపట్ల అది అవలంబించినటువంటిదే. ఇస్లాం ఏ నాగరికతలోని మంచినీ కాదనదు. అలాగే అది తెచ్చే చెడుగును కల్లోలాన్ని ఏ మాత్రం స్వీకరించదు. ఇస్లాం తన అనుయాయులకు భౌతిక, వైజ్ఞానిక రంగాల్లో వేరుగా ఉండే వైఖరిని బోధించదు. ఇతర నాగరికతా సంస్కృతులతో వ్యక్తిగత, జాతిపరమయిన పక్షపాతాలతో ఘర్షణకు దిగదు. ఎందుకంటే ఇస్లాం మానవుల విభిన్న జాతులు వర్గాలమధ్య పటిష్టమయిన సోదర సంబంధాలు ఏర్పడాలని అభిలషిస్తుంది.

ఇస్లామీయ ఉద్యమం సరికొత్త ఆవిష్కరణల్ని వ్యతిరేకించదు. లేదా వివిధ ఆయుధాలపై పనిముట్లను తమ ఇండ్లల్లో, కార్ఖానాల్లో, పొలాల్లో ఇతర రంగాల్లో ఉపయోగించడానికి వాటిపై 'బిస్మిల్లా హిర్రహ్మానిర్రహీం' అన్న పదాలు చెక్కి ఉండాలని కూడా ముస్లిములు కోరడం లేదు. కాకపోతే, ఆ ఆయుధాలు, పనిముట్లు కేవలం అల్లాహ్ కొరకు అల్లాహ్ కోరిన విధంగా వినియోగించాలని మాత్రమే ఇస్లాం కోరుతుంది. ఇవి ప్రాణంలేని పనిముట్లు, వీటికి ఏ మతమూ ఉండదు. వీటికి ఏ దేశమూ ఉండదు. కాని వీటిని సవ్యంగానో అపసవ్యంగానో వినియోగించడం మూలాన యావత్తు మానవాళి వాటి ప్రభావానికి లోనవుతుంది. ఉదాహరణకు ఒక ఫిరంగినే తీసుకోండి. దానికి మతమూ లేదు, వర్ణమూ లేదు, దేశమూ లేదు. కాని ఎవరయినా దాన్ని తప్పుగా ఉపయోగించి దాని ద్వారా ఇతరులపై అత్యాచారం చెయ్యడం సంభవిస్తే అది ఇస్లాం ప్రకారం ధర్మసమ్మతం కాదు. కనీసం ముస్లిమనబడేవాడు చెయ్యదగిన పని కాదది. అతడు, దౌర్జన్యపరుల జులుంనుండి పీడితుల్ని కాపాడటానికి దాన్ని వినియోగించాలి. లేదా దైవ వచనం అభ్యున్నతికి దాన్ని సక్రమమయిన రీతిలో వినియోగించాలి. అలానే సినిమా కూడా ఓ కొత్త ఆవిష్కరణే. ఇస్లాం

దాన్నీ వ్యతిరేకించదు. అది నిజమయిన ముస్లిములను కోరేది ఒక్కటే. పరిశుద్ధమయిన భావాలు, ఉత్తమ పాత్రలు లేదా సమాజంలో మంచీ చెడుల సంఘర్షణ ఇత్యాది వాటిని చిత్రీకరించేందుకు సినిమాను వినియోగించాలి. ముస్లిమనబడే ఏ వ్యక్తికీ, అతడు సినిమా ద్వారా నగ్న దృశ్యాలను, అశ్లీల భావాలను, నీతి బాహ్యమయిన సంఘటనల్ని, ఏహ్యమయిన ఉద్రేకాలను ప్రదర్శించటం, వాటిని ప్రచారం చెయ్యడం ధర్మసమ్మతం కాదు. దీనిద్వారా సమాజంలోని దుష్ట పాత్రల్ని పైకి లేవనెత్తడం, వారి ఆధ్యాత్మిక, మానసిక, నైతికమయిన కుళ్ళును అందలమెక్కించడం ఏమాత్రం తగదు. ఇస్లాం దృష్టిలో ఇలాంటి సినిమాలన్నీ ఎంతో హీనమయినవి.

ఇస్లాం మానవుని వైజ్ఞానిక ఆవిష్కరణల్ని ఎన్నడూ వ్యతిరేకించలేదు. ముస్లిములు సకల వైజ్ఞానిక శాస్త్రాలను తమ ధ్యేయాన్ని సాధించడానికి వినియోగించుకోవాలని మాత్రమే అది బోధిస్తుంది. దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు : "జ్ఞాన సముపార్జన ప్రతి ముస్లిమ్ వ్యక్తికి విధిగా చెయ్యడం జరిగింది." 'జ్ఞానం' అంటే సకల రకాల శాస్త్రాలు ఇందులో ఇమిడి ఉన్నాయని వేరుగా విశదపరచనవసరంలేదు. అంటే ముస్లిములు సకల శాస్త్రాల్లోను, ప్రతి వైజ్ఞానిక రంగంలోనూ ముమ్ముందే ఉండాలన్నది మహాప్రవక్త (సఅసం) ఉద్దేశం అని ద్యోతకమవుతోంది. ఒక్కమాటలో చెప్పాలంటే మానవాళి సేవచేసే ఏ సంస్కృతినీ ఏ నాగరికతనూ ఇస్లాం వ్యతిరేకించదు. కాని ఏ సంస్కృతి అయినా మద్యపానానికి, జూదానికి, నైతిక పతనానికి, జారవృత్తికి, వలస సామ్రాజ్యస్థాపనకు, ఇతర జాతుల్ని అనేక మిషలతో లోబరచుకుని తమ బానిసలుగా చెయ్యడాన్ని సంస్కారం, సభ్యతలుగా భావిస్తే, ఇస్లాం ఇలాంటి నాగరికతకు వ్యతిరేకంగా పోరాటపు కేతనాన్ని ఎగురవేస్తుంది. తద్వారా ప్రపంచప్రజలు ఆ నాగరికత మోసుకు వచ్చే వినాశాలనుండి, రుగ్మతలనుండి సురక్షితంగా ఉండాలన్నదే అభిలాష.

# 11. తిరోగమన వాదం

ఇస్లాం వ్యతిరేకుల్లో కొందరు హ్రస్వదృష్టిగల విమర్శకులు, ఇస్లామీయ జీవన వ్యవస్థ నవయుగం అవసరాలకు సరితూగ జాలదని అంటూ ఉంటారు. ఈ కారణంగా అది నవీన కాల ప్రజలకు స్వీకార యోగ్యం కాదని కూడా వారు వాదిస్తారు. వారి ప్రకారం, ఇస్లాం నియమాలు కేవలం మాజీ కాలానికే సరిపొయ్యాయి ఇప్పుడు వాటికి కాలం చెల్లింది. ఇంకా అవి ప్రగతి పథాన అవరోధాలయి కూర్చున్నాయి కూడా. వారి అభ్యంతరాలు ఇలా ఉంటాయి :

✳ – "మీరు నేటికీ వడ్డీ (అది ఆధునిక యుగానికి అనివార్యమయిన ఆర్థిక అవసరం) నిషిద్ధం కావాలని కోరుతున్నారా ?

✳ – నేడు కూడా జకాత్ ధనం ఎక్కడ కూడబెట్టింది అక్కడి ప్రజల కోసమే ఖర్చు చెయ్యాలని అభిలషిస్తున్నారా ? అసలు జకాత్ అన్నదే పురాతన పద్ధతి. అది ఆధునిక రాజ్య అవసరాలకు సరిపడదు. మరోవిషయం ఏమంటే ఓ గ్రామంలో అక్కడి ధనవంతుల వద్దనుండే జకాత్ వసూలు చేసి అక్కడి నిరుపేదలలో పంపకం చేసినప్పుడు ఆ బీదల ఆత్మ గౌరవం దెబ్బతింటుంది. అది వారి వరకు దానం తప్ప మరేమీకాదు.

✳ – మీరు మద్యపానాన్ని, జూదాన్ని, స్త్రీ పురుషులు స్వేచ్ఛగా కలుసుకోవడాన్ని, సంగీతనాట్య సభల్ని, ఉంపుడుగత్తెల్ని, వేశ్యల్ని, ప్రియుడు ప్రియురాలి ప్రణయ కలాపాలను కూడా నిషేధించబోతున్నారా ? వాస్తవంగా ఇవన్నీ నేడు సామాజిక జీవనంలో తప్పనిసరి అంశాలయ్యాయి".

## ఇది అవసరం కాదు అభిశాపం

వడ్డీని ఇస్లాం నిషేధిస్తుందన్న మాట వాస్తవం. కాని వడ్డీని ఆర్థిక

అవసరం అనడం మాత్రం తప్పు. నేటి యుగంలోనూ వడ్డీని ఆర్థిక ఆవశ్యకతగా గుర్తించని రెండు జీవన వ్యవస్థలు ఉన్నాయి. ఒకటి ఇస్లాం, రెండు కమ్యూనిజం. వ్యత్యాసమేమంటే కమ్యూనిజానికి నేడు, తన సిద్ధాంతాలను అమలుజరిపేందుకు కావలసిన శక్తి అధికారాలున్నాయి, ఇస్లాంకు ఇంకా ఈ శక్తి అధికారాలు ప్రాప్తం కాలేదు. దానికి నిజమయిన పరిపూర్ణ అధికారం లభించి ఉన్నట్లయితే, వడ్డీ అనివార్యమయిన అవసరం కాదని రుజువు చేసి ఉండేదే. ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థ, వడ్డీ పునాదులపై నెలకొనదు. ఏ విధంగానయితే కమ్యూనిస్టు రష్యా ఆర్థిక వ్యవస్థ వడ్డీని వదలి నేడు స్వేచ్ఛగా నిలబడగలిగిందో అదే విధంగా ఇస్లామీయ వ్యవస్థను కూడా స్థాపించటం జరుగుతుంది.

వడ్డీని ఏ విధంగానూ ఆధునికయుగపు అనివార్య ఆవశ్యకత అనడానికి వీల్లేదు. ఒకవేళ అనివార్యమే అయితే అది కేవలం శ్రీమంతుల కొరకే. ఇదే లేకపోతే వారు ధనవంతులే కాజాలరు. నేడు, స్వయంగా పాశ్చాత్య ఆర్థిక నిపుణులే వడ్డీని వ్యతిరేకిస్తున్నారు. దానిపై అదుపు సాధించలేకపోతే క్రమేణ ధనమంతా కొందరి చేతుల్లోకి చేరిపోతుందని వారు హెచ్చరిస్తున్నారు. అప్పుడు బీద ప్రజలు ఆర్థికంగా సర్వనాశనమయి ధనవంతులకు లోబడి వారి బానిసలుగా మారిపోతారని కూడా అంటున్నారు. పాశ్చాత్య చరిత్రలో ఇలాంటి దృష్టాంతాలెన్నో ఉన్నాయి. వీటివల్ల ఆర్థిక నిపుణుల ఈ ఆందోళనలు నిజమే అని రూఢీ అవుతుంది. పెట్టుబడిదారీ వ్యవస్థకు ఊపిరి అయిన వడ్డీని, గుత్తాధిపత్యాన్ని ఇస్లాం వేయిన్నర సంవత్సరాలకు పూర్వమే నిషేధించింది. ఆనాడు నేటి పెట్టుబడిదారీ వ్యవస్థ ఉనికే లేదు. ఇస్లాంను అవతరింపజేసిన దైవం సర్వజ్ఞుడు, ఆయన భూతభవిష్యత్కాలాలను దృష్టిలో ఉంచుకునే, మనిషికి మార్గం చూపాడు. ఆయనకు తెలుసు వడ్డీవల్ల ఎలాంటి చెడులు ఉత్పన్నమవుతాయోనని, ఎలాంటి సమస్యలు ఉద్భవిస్తాయోనని.

ఏ దేశాల ఆర్థిక జీవనమయితే విదేశీ సహాయాలపై ఆధారభూతమయి ఉందో వాటికి వడ్డీ సహించదగ్గ జుగుప్సాకరమయిన విషయం కావచ్చు. కాని ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో విలసిల్లుతుంది. స్వతంత్ర ప్రతిపత్తితో బలమయిన ఆధారాలపై నెలకొంటుంది. ఇతర

దేశాలతో దాని సంబంధాలు సమాన ప్రతిపత్తిలో ఉంటాయి - విధేయత దాస్యాల ఆధారంగా కాదు. అలాగే ఆర్థిక విషయాల్లో అది ఇస్లామీయ శాసనాంగం విధించే నియమాల ద్వారానే మార్గ దర్శకత్వాన్ని గ్రహిస్తుంది గనుక వాటి ప్రకారం వడ్డీ నిషిద్ధం. ఈ నియమాల వెలుగులో ఉనికిలోకి వచ్చే స్వేచ్ఛాయుత ఆర్థిక వ్యవస్థ ప్రపంచంలో ప్రగతికి అభ్యున్నతికి చిహ్నమయి నిల్చుంటుంది.

## సహేతుకమయిన ఏర్పాటు

జకాత్ విషయానికి వస్తే మేము ముందే వివరించాము అది నిరుపేదలకు ఇచ్చే దానం కాదు. దేవుని ఆజ్ఞ. ప్రజల హక్కు. దాన్ని పరిరక్షించడం ఇస్లామీయ ప్రభుత్వ బాధ్యత. ఈ సందర్భంలో స్థానిక వసూలు, పంపిణీ విధానాన్ని ఆక్షేపించేవారికి సమాధానమివ్వదలిచాము. అంటే ఏ ప్రాంతంలో కూడబెట్టిన జకాత్‌ను ఆ స్థానం ప్రజల్లోని అగత్యపరుల కొరకే వెచ్చించాలి అన్న సూత్రమన్నమాట. విచారకమయిన విషయం ఏమిటంటే మన మేధావులు అనేకమంది పాశ్చాత్యుల నుండి వచ్చే ప్రతి వ్యవస్థను, ప్రతి విధానాన్ని నాగరికత సంస్కృతుల అత్యుత్తమ రూపమని భావించి హృదయానికి హత్తుకుంటారు. కాని అదే విషయాన్ని ఇస్లాం ప్రతిపాదించినప్పుడు దాన్ని వారు తిరోగమనవాదమని, సంకుచితతత్వమని ఖండిస్తారు.

ఈ మేధావులకు అమెరికా (USA) పరిపాలనా వ్యవస్థను గుర్తు చెయ్యడం అవసరం. ఆ వ్యవస్థ సంపూర్తిగా వికేంద్రీకరణ (DECEN-TRALISATION) ఆధారంగా నిర్మాణమయింది. నేడు సంయుక్త రాష్ట్రాల్లోనూ ప్రత్యేక రాష్ట్రంలోనూ అమెరికా వ్యవస్థననుసరించి, ప్రతి గ్రామం, ప్రతి పట్టణం ఆర్థికంగా, రాజకీయంగా, సామాజికంగా స్వయాన పరిపూర్ణమయిన స్వతంత్ర ప్రతిపత్తిగల ఓ ఏకత్వం. ఈ స్వతంత్ర ఏకత్వాల మునిసిపల్ కౌన్సిళ్ళు తమ పరిధిలో నివసించే వారిపై పన్నులు విధిస్తాయి. వాటిని కూడబెట్టి తమ గ్రామం లేక టౌనులోని విద్య, వైద్య, రవాణా ఇత్యాది సాంఘిక సదుపాయాలపై ఖర్చు పెడతాయి. ఈ ఖర్చులు పోగా మిగులుధనాన్ని జిల్లాలేక రాష్ట్రస్థాయి పరిపాలనా వ్యవస్థకు అప్పజెప్పడం

జరుగుతుంది. దీనికి భిన్నంగా టౌను ఖర్చులు దాని ఆదాయాన్ని మించి పోయినట్లయితే లోటును రాష్ట్రం పూరిస్తుంది. ఈ వ్యవస్థ, ఈ ఏర్పాటు ఎంతో సమంజసమయిందనడంలో సందేహం లేదు. ఇందులో విభిన్న ప్రయత్నాలను వ్యవస్థీకరించి ఖర్చుల భారాన్ని పంచివెయ్యడం జరిగింది. ఖర్చులన్నీ కేంద్ర ప్రభుత్వమే భరించనవసరం లేదు. పైగా ఖర్చులు స్థానిక ప్రజల చేతుల మీదుగా జరుగుతాయి కాబట్టి వారి అవసరాలు సయితం పూర్తవుతూ ఉంటాయని ఖచ్చితంగా చెప్పవచ్చు. ఎందుకంటే తమ ప్రాంతాల అవసరాలు ఆ ప్రాంతం ప్రజలకు తెలిసినంతగా కేంద్రానికి తెలియవు.

మన మేధావులు ఈ అమెరికా వ్యవస్థను వేనోళ్ళ కొనియాడుతారు. కాని, ఇస్లాం ఈ వ్యవస్థను 13 వందల ఏళ్ళ క్రితమే స్థాపించిందన్న యదార్థాన్ని విస్మరిస్తారు. ప్రతి గ్రామంలో అక్కడి గ్రామాధికారులు పన్నులు వసూలు చేసేవారు. వాటిద్వారా స్థానిక ప్రజల అవసరాలు తీర్చేవారు. ఆదాయ వ్యయాల్లో ఉండే వ్యత్యాసాన్ని కేంద్రంలోని ప్రజాధనాగారంలోకి పంపి వెయ్యడమో లేక అక్కణ్ణుంచి ఋణంగా గ్రహించడమో జరిగేది.

మేము ఇంతకు క్రితమే సూచించినట్లు జకాత్ నగదుగా గాని, దినుసు రూపేణగాని మాత్రమే ప్రజలకు పంచిపెట్టాలని ఇస్లామీయ శాసనాంగంలో ఎక్కడా లేదు. జకాత్‌ని నిరుపేదల కొరకు విద్య, వైద్య, ఇతర సాంఘిక సదుపాయాలు సమకూర్చడానికి కూడా వినియోగించవచ్చు. దీనితో వికలాంగులకు, వృద్ధులకు, మరే కారణంవల్లనయినా ఏ పనీచెయ్యలేని నిర్భాగ్యులకు పింఛను కూడా ఇవ్వవచ్చు.

మనం నేడు ఇస్లామీయ ఆర్థిక సిద్ధాంతాలను మన సమాజంలో నెల కొల్పదలిస్తే మొత్తం రాజ్యపరిధిలోనూ, ఇస్లామీయ జగత్తు యొక్క సామూహిక వ్యవస్థలోనూ ఇమిడే చిన్న చిన్న పరిపాలనా వ్యవస్థల్ని ఏర్పరచవలసి ఉంటుంది. అవి వాటి స్థానిక సమస్యల్ని వ్యవహారాలను

పరిష్కరించుకోడానికి, స్థానిక ప్రజల అవసరాలను తీర్చడానికి స్వయంగా బాధ్యత వహించగలిగేలా ఉండాలి.

జూదం, మద్యపానం, స్త్రీ పురుషుల మిశ్రమ స్వేచ్ఛా విహారాన్ని, అభ్యుదయవాదులు అనబడే వారు ఎంతగా రోదించినా –ఇస్లాం వీటినన్నింటినీ నిషేధిస్తుంది.

## ఇది రోగం కాదు . . . లక్షణం

మద్యపానం అన్నది వాస్తవానికి ఒకానొక సామాజిక లేక వ్యక్తిగత కలతకు సంకేతం. మద్యం ఇత్యాది మాదక ద్రవ్యాలు చెడిపోయిన సమాజానికే అవసరమవుతాయి. ఆ సమాజంలో విభిన్న వర్గాల మధ్య దాటలేని దూరాలుంటాయి. ఒక వైపున కొందరు భోగభాగ్యాల్లో తులతూగుతూ ఉండి వారి గ్రహణశక్తులన్నీ అచేతనావస్థకు చేరుకునుంటాయి. మరోవైపు దేశమంతా లేమికి, దారిద్ర్యానికి, దౌర్భాగ్యానికీ ప్రతిరూపమయి ఉంటుంది. అప్పుడు లేమికి గురయిన వర్గం ప్రజలు వాస్తవికతను ఎదుర్కొనలేక పలాయనానికి మార్గాలు అన్వేషిస్తారు. ఓ కొత్త ప్రపంచాన్ని తమలోనే సృష్టించుకుంటారు. అందువల్లనే ఏ సమాజాల్లోనయితే మనుషులు జులుం, దౌర్జన్యాలకు నలిగి పోతుంటారో, మానవ ఆలోచన ఎక్కడ ఎనలేని ప్రతిబంధకాలకు లోనయి ముందుకు సాగే దాని గుణం స్థంభించి పోతుందో, మరెక్కడయితే ప్రజలు తమ జీవనోపాధి సముపార్జనలోనే లీనమయి సమస్తాన్నీ మరచి పోతారో అక్కడ, అలాంటి సమాజాల్లో మాదక ద్రవ్యాలు, మద్యపానం పెచ్చుపెరిగి పోతాయి. అలాగే ఏ సమాజాలు సదా యంత్రాలు పెట్టే అసహ్యాకరమయిన గోల, రణగొణ ధ్వనులమధ్య తల్లడిల్లిపోతుంటాయో ఆ సమాజాల్లోనూ ఈ చెడులు పెచ్చరిల్లి ఉంటాయి.

కాని ఈ సామాజిక లోటుపాట్లన్నీ ఏ విధంగానూ మద్యాన్ని ధర్మ సమ్మతం చెయ్యజాలవు. అయితే మద్యపాన సేవనం కేవలం ఓ వ్యాధి లక్షణమే గనుక దాన్ని నిషేధించేముందు ఈ రోగాన్ని సృష్టించే సామాజిక చెడులను సంస్కరించడం అత్యవసరం. అది ప్రథమంగా ఈ అభిశాపానికి కారణభూతమయిన చెడులన్నింటినీ రూపుమాపింది. ఆ విషయంలో

తృప్తిజెందిన తరువాత మద్యపాన నిషేధాన్ని ప్రకటించింది. ఇస్లామ్‌పై వ్రేలెత్తే నవనాగరికతా ధ్వజవాహకులు, ఇస్లాం ద్వారా తమ సామాజిక, రాజకీయ, మానసిక, భౌతిక రుగ్మతల నివారణోపాయాన్ని నేర్చుకోడానికి శ్రద్ధ చూపితే ఎంతో ప్రయోజనకరమవుతుంది. వారు ఇస్లాం ద్వారా నేర్చుకోవలసింది ఎంతో ఉంది.

జూదం గురించి మేము ఎక్కువ వివరంగా చెప్పనవసరం లేదు. ఎందుకంటే కేవలం వివేకశూన్యులే దాన్ని ఉపయోగకరమయిందిగా పరిగణిస్తారు.

## పతనానికి పూబాట

ఇక, స్త్రీ పురుషుల స్వేచ్ఛా విహారాన్ని పరిశీలిద్దాము. ఈ విషయం చర్చా వేదికల్లో వేడిని సృష్టించింది. చాలామంది హ్రస్వదృష్టి కలవారు ఇస్లాంను తిరోగమనవాదమని, ఛాందస మతమని భావిస్తారు. ఎందుకంటే అది స్త్రీ పురుషులు విచ్చలవిడిగా కలిసి తిరగడంపై ప్రతిబంధకాలు విధిస్తుంది. ఇలాంటివారు ఫ్రెంచి నాగరికతను నోటి తడియారకుండా కొనియాడుతూ ఉంటారు – ఆ నాగరికతలో ప్రేయసీ ప్రియులు నడిరోడ్డున, ఎవరెంత చూసినా మాకేటి సిగ్గు అని ఆలింగన చుంబన క్రియల్లో నిమగ్నులవడం మామూలే గనుక, ఇలాంటి జంటను ఏ వ్యక్తీ ఏమీ అనలేడు. పైగా వారు ప్రణయ కలాపాల్లో మైమరచి తన్మయత్వంలో పడిపోతే రోడ్డుపై ట్రాఫిక్ వల్ల కలిగే ప్రమాదంనుండి వారిని కాపాడటానికి తగిన పహరా ఏర్పాటు చేస్తారు ట్రాఫిక్ పోలీసు !

అమెరికా జీవన విధానాన్ని కళ్ళు మూసుకుని ప్రేమించేవారు కొందరున్నారు. వారి ప్రకారం, అక్కడి ప్రజలు ఆత్మవంచనకు లోనవ్వరు. వారు లైంగిక వ్యవహారాన్ని మానవ జీవనావశ్యకతగా పరిగణిస్తారు. అందువల్ల అక్కడ మనిషి యొక్క ఈ జీవనావశ్యకతలను తీర్చే ఏర్పాటు కూడా ఉంది. ప్రతి అమ్మాయికి ఓ బాయ్‌ఫ్రెండ్, ప్రతి అబ్బాయికి ఓ గర్ల్‌ఫ్రెండ్ తప్పక ఉంటుంది. వీరిద్దరు వీలయినంత ఎక్కువకాలం కలసి మెలసి ఉంటారు. నగరాలకు వెలుపల పిక్‌నిక్‌లకు వెడతారు. అక్కడ ప్రకృతి ఆహ్వానానికి ప్రతిస్పందించి తమలోని తాపాన్ని, తమకాన్ని

ఉపశమింప జేసుకుంటారు. ఇలాంటి పిక్నిక్ల అనంతరం వారు తిరిగి వచ్చేటప్పుడు ఎంతో తృప్తిగా సంతోషంగా వస్తారు. ఆ తరువాత పూర్తి ఏకాగ్రతతో దీక్షతో చదువు వైపుకో లేక ఇతర విద్యుక్త కార్యకలాపాల వైపుకో మరలుతారు. ఈ విధంగా వారు దేశ సౌభాగ్యానికి, ఉత్పాదనాభివృద్ధికి తోడ్పడిన వారవుతారు. దేశం బహుముఖ ప్రగతిని సాధిస్తూ ఉంటుంది.

కాని స్థూలదృష్టి, బాహ్యావలోకనమేగల ఈ పెద్ద మనుషులు, పాశ్చాత్యుల నైతిక దివాలా తనమంటే పడి చస్తారు కాని ఒక విషయాన్ని మరిచి పోతారు. రెండో ప్రపంచ సంగ్రామంలో ఫ్రాన్సు, జర్మనీ జరిపిన మొదటి దాడిని కూడా ఎదుర్కోలేక పోయింది. జర్మనులకు తల ఒగ్గింది. ఫ్రాన్సు ఇలా అవమానకరమయిన పరాజయానికి గురికావడానికి కారణం ఫ్రెంచి సైనికుల లోపభూయిష్టమయిన సైనిక శిక్షణయో, యుద్ధసామగ్రి కొరతయో కాదు. నిజానికి అసలు కారణమేమంటే, ఫ్రెంచి జాతి భౌతిక రుచులు మరిగి నైతిక అపభ్రంశతకు లోనయి జాతీయ భావనకే దూరమయింది. లోలోన అంతా గుల్లగా తయారయింది. వారు భయపడ్డదేమంటే యుద్ధం కొనసాగితే పారిస్ మహానగర ఆకాశహర్మ్యాలు, విలాస కేంద్రాలు నేల మట్టమయి శిథిలాలవుతాయని! పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో పడినవారు ఆ డ్రామాను ఇక్కడ కూడా ఆడించాలని అనుకుంటున్నారా ?

అమెరికా విషయంలో, దాని బూటకపు జీవితాన్ని చుట్టిఉన్న పరదాలను పటాపంచలు చెయ్యడానికి స్వయాన అమెరికా ప్రభుత్వం అందజేసిన గణాంకవివరాలు చాలు. వాటి ప్రకారం అమెరికా హైస్కూలు విద్యార్థినులు 38 శాతం గర్భవతులని కనుగొన్నారు. యూనివర్సిటి క్రింది తరగతుల విద్యార్థినుల్లో ఈ శాతం కాస్త తక్కువే. ఎందుకంటే గర్భనిరోధక ఉపాయాలను ఉపయోగించుకోవడంలో వారికున్న అనుభవం హైస్కూలు విద్యార్థినులకన్నా గొప్పదే కదా!

లైంగిక తృప్తిని పొందడం నిస్సందేహంగా గొప్ప ఆశయమే. ఇస్లాం దీనికి ప్రాముఖ్యాన్నిస్తుంది కూడా. మనిషి, లైంగికంగా అసంతృప్తికి, అసంతుష్టికి గురయినట్లయితే అతడు ఆ ఊబిలోనే ఇరుక్కుంటాడన్నది మరే విషయాన్నీ గమనించేస్థితిలో ఉండడన్నదీ వాస్తవమే. ఆ కారణంగా

జాతీయ ఉత్పాదన తగ్గేదీ నిజమే. కాని ఉన్నత ఆశయాలు, ఉన్నత మార్గాల ద్వారానే సాధించాలి. ఈ ఆశయం కొరకు మొత్తం సమాజాన్ని నైతికంగా రోగగ్రస్తం చెయ్యడం, యువకులు పశువుల్లా ఒకరినొకరు కొరుక్కుతినేలా వారిని విచ్చలవిడిగా వదిలి వెయ్యడం ఎక్కడి వివేకం? అమెరికా సాధించిన ఆశ్చర్యకరమయిన వృద్ధీవికాసాలు లైంగిక విశృంఖలత్వం ద్వారానే అని ఏ భ్రష్టద్రష్టలు భావిస్తున్నారో వారు ఒక విషయాన్ని బాగా గ్రహించాలి. అమెరికా నేటివరకు ప్రపంచానికి ఇచ్చింది భౌతికాభివృద్ధి మాత్రమే. ఇది ఇలాగే కొనసాగితే కొన్నాళ్ళకే మనుషుల స్థానంలో ప్రాణంలేని మిషన్లు వచ్చి తిష్టవేస్తాయి. ఈ కారణంగానే ఇంతగా ప్రగతి సాధించినా అమెరికా, మానసికంగా, ఆధ్యాత్మికంగా ఎంతో పతనమయిపోయింది. నేటికీ అక్కడ నల్లవారిని బానిసలుగానే పరిగణిస్తున్నారు. వారిని అనుదినం దారుణమయిన అత్యాచారాలకు గురిచేస్తున్నారు. ఇది దాని 'ఇంటి' పరిస్థితి. బయట చూస్తే ప్రపంచంలో ప్రతిచోటా అమెరికా వలస సామ్రాజ్యవాదాన్ని క్రియాత్మకంగా బలపరుస్తూ ఉంది. అమెరికన్ జీవితంలో పాశవిక వాంఛల ఈ బహుముఖ ప్రాబల్యం, వలస సామ్రాజ్యవాదపు నైజం, స్వదేశంలో బానిసత్వపు మనుగడ – ఇవన్నీ ఆ జాతి ఆధ్యాత్మిక పతనానికి చిహ్నాలు.

## స్త్రీ – తన సహజ రంగానికి దూరంగా

నేడు పురుషులు అందంగా ఉండే, ఫ్యాషన్‌గా అలంకరించుకొనే మహిళలతో కలసి తిరగడాన్నే ఎక్కువగా యిష్ట పడతారు. దానికి కారణం ఒక్కటే, వారు తమకు ప్రాప్తమయిన ధర్మబద్ధమయిన హక్కుతో తృప్తిచెందటం లేదు. పచ్చగా కనబడే ప్రతి గడ్డిని కరిచేందుకు అలవడ్డాయి. ఇది మనిషిలోని మౌలిక బలహీనత. అయితే జీవితంలో రుచులు మరగడం తప్ప మనిషికి మరే అర్థం లేదా? మనోకాంక్షల సంతృప్తివల్ల పొందే ఆనందాన్ని ఎవరుమటుకు కాదనగలరు? కాని ఇది ఇరువయ్యో శతాబ్దం కనిపెట్టిన విషయం కాదే? నేటికి వేలాది సంవత్సరాల క్రితం గ్రీకులు, రోమనులు, పర్షియనులూ దీన్ని ఆస్వాదించిన వారే.

వారంతా ఇందులో తలమునకలయి జీవించిన వారే. కాని హద్దుమీరిన ఈ రుచులే వారిని విద్యుక్త ధర్మంనుండి దూరం తీసుకెళ్ళాయి. క్రమేణ వారు తమ సామ్రాజ్యాలు, అధికారాలు, కీర్తి ప్రతిష్టలు సర్వమూ కోల్పోయ్యారు.

నేడు పడమటినేలలో విస్తృత భౌతిక సాధనా సంపత్తి ఉంది. సైన్సు ఆవిష్కరణలు, ఇతోధిక ఉత్పాదనలు, కృషిచేసే దీక్ష ఇవన్నీ ఉన్నా పాశవిక వాంఛల ప్రేమ ప్రాబల్యం వల్ల ఆ సంస్కృతి క్రమంగా పతనానికి చేరువవుతోంది. కాని మనమో? గత రెండుశతాబ్దాల ప్రతికూల పరిస్థితుల మూలంగా ఎంతో వెనుకబడి ఉన్నాము. నాగరికత, ప్రగతుల పేరిట ఔ క తిరోగమనపు తిట్లకు భయపడి పాశవిక రుచుల మైకంలోపడి ఆత్మ విస్మరణకు గురయితే మనకు చివరికి మిగిలేదేమిటి? మన పరిస్థితులు అనుదినం దిగజారిపోతాయి. విశాల దృక్పథం పేరిట మనల్ని మన చారిత్రక పరంపర నుండి దూరం చెయ్యాలని ప్రయత్నిస్తున్నవారు నిజానికి వలసి సామ్రాజ్యవాదుల పావులు. వలస సామ్రాజ్యవాదులు ఇలాంటి 'విశాల దృక్పథం' కలవారనబడే సాహితీకారుల్ని, మేధావుల్ని వీపుతట్టి ప్రోత్సహిస్తారు - వారి ద్వారా తమ ధ్యేయం నెరవేరాలని !

మార్గం తప్పిన వారనేకమంది అంటుంటారు, "పాశ్చాత్య సమాజంలో స్త్రీలను చూడండి, ఎంత ప్రగతిని సాధించారో, వారికి సమాజంలో అన్ని హక్కులూ ఉన్నాయి. అక్కడి సామాజిక జీవనంలో వారు పూర్తిగా పాల్గొంటారు" అని. పాశ్చాత్య దేశాల్లో స్త్రీలు ఉద్యోగాలు చెయ్యడం మూలంగానూ లింగ భేదం లేకుండా పురుషులతో కలసి తిరగడం మూలంగాను వారికి లభించే అవకాశాలు, అనుభవాలు ఇంటి నాలుగు గోడల మధ్య ఉంటూ పిల్లల పెంపకంలో కాలం వెళ్ళ దీసే వారికి ప్రాప్తం కావనడంలో సందేహం మటుకు లేదు. కాని ఇంటి వెలుపల స్త్రీకి ఎదురయిన అనుభవాలకు ఆమె స్త్రీత్వంతో ఏమాత్రం సంబంధముంది? వీటివల్ల ఆమె స్త్రీత్వం ఏ మేరకయినా మెరుగులు దిద్దుకుందా? స్త్రీత్వం కొత్త అందాలు సంతరించుకుందా? లేక స్త్రీత్వపు ప్రత్యేకతలు ఏవయినా అంతరించిపొయ్యాయా? ఈ ప్రశ్నలనే మరో విధంగా చెప్పుకోవచ్చు. స్త్రీ గడించిన ఈ బయటి అనుభవాల మూలంగా మానవ జీవితానికి ఏదయినా

సిద్ధించిందా? మానవ జీవితం కొత్త రంగులు సంతరించుకుందా? లేక వీటి కారణంగా పాత విశేషాలను కూడా కోల్పోయిందా?

పాశ్చాత్య స్త్రీ పురుషునికి మంచి తోడుగా తయారయింది. ఆమె అతని మానసిక ఉల్లాసానికి కృషిచేస్తుంది. అతని లైంగిక తృష్ణను తీర్చే వస్తువుగా పరిణమించింది. పైగా అతని సమస్యల్ని కొన్నింటిని తాను పంచుకుంటోంది. కాని ఇప్పుడు ఆమె ఓ మంచి భార్యగా మాత్రం అలరారజాలదు. ఉత్తమ తల్లిగా విలసిల్లజాలదు. USA లో 40 శాతం వరకు పెరిగిన విడాకుల స్థాయే దానికి ప్రబల నిదర్శనం. యూరపులో విడాకుల సంఖ్య దీనికి కొద్దిగా తక్కువే. కాని అక్కడ దంపతులు విటులకై విటురాండ్రకై అర్రులు చాచి వివాహేతర ప్రణయకలాపాలు సాగించడం సర్వసాధారణమయిపోయింది. పాశ్చాత్య స్త్రీ ఉత్తమ ఇల్లాలుగా తన ఇంటి సంక్షేమంకై తన జీవితాన్ని కేటాయించి ఉంటే అమెరికాలో విడాకులు ఇలా పెచ్చరిల్లేవికావు, ఇండ్లనుండి ఫరారవడం ఇంతగా సర్వసామాన్యమయ్యేదీ కాదు. ఉద్యోగాలు చేసే స్త్రీలు, ఉత్తమ ఇల్లాలు, మంచి తల్లి కాగలందులకు అవసరమయ్యే అనుభూతులకు అతీతు లయిపోతారు. దీనికి వారివద్ద సమయమూ ఉండదు, మానసికంగా వారు ఆ బాధ్యతల నిర్వహణకు సిద్ధంగానూ ఉండరు.

మరోవైపున స్త్రీ పురుషులు యథేచ్ఛగా తిరగడం మూలాన తాత్కాలిక ఆనందం తప్ప మానవతకు నేటి వరకు ఒరిగిందేమీలేదు. కొందరు స్త్రీలను పార్లమెంటు సభ్యులుగానో, మంత్రులుగానో లేక కొన్ని శాఖల అధికారులుగానో చేసినంత మాత్రాన ప్రపంచ సమస్యలు పరిష్కృతం కావు. మహిళామణి ఎవరయినా, పార్లమెంటు చప్పట్ల చప్పుడులో, ప్రశంసల ప్రతిధ్వనుల్లో ఈ యదార్థాన్ని విస్మరించడం సాధ్యమే కాని వాస్తవమేమంటే, మానవాళికి తల్లి పంచిపెట్టే మమతానురాగాలు లభించకపోవడం, మానవ ఆంతర్యంలోని రుగ్మతల్ని అంతంచేసే ఆమె ప్రేమమయమయిన శిక్షణ ప్రాప్తం కాకపోవడం మానవతకు తీరని అన్యాయం. దీనిముందు తాత్కాలికంగా ఆకాశానికెత్తే పొగడ్తల నినాదాలకు ఏమాత్రం విలువలేదు.

స్త్రీ ప్రపంచంలోని సుఖాలన్నింటికీ దూరమయ్యేలా, ఆమె వ్యక్తిత్వం అణగారి పొయ్యేలా ఆమెపై పనుల ఒత్తిడి ఉండరాదన్న విషయాన్ని మేము ఒప్పుకుంటాము. కాని యధేచ్ఛగా నడుచుకోవడానికి – స్త్రీకయినా పురుషునికయినా – జీవితంలో అవకాశంలేదు. మనం జీవితంలో నిత్యం మనకు ఇష్టమయిన దాన్ని మాత్రమే చెయ్యాలని అంటే అది కుదరదు. కాస్త ఆలోచించండి – మానవులందరూ స్వార్థపరులయి, తమ అభిరుచులపై, కోరికలపై ఆనందాలపై ఎలాంటి పరిమితినీ ఒప్పుకోకపోతే పర్యవసానం ఎలా ఉంటుందో! ఒక ఫలితం ఏమంటే మన స్వార్థప్రియత్వం, మార్గభ్రష్టత్వం కారణంగా రాబోయే తరాలు రకరకాల కష్టాలను, ఆపదల్ని అనుభవించవలసివస్తుంది. స్వయంగా మహిళాజాతి సంక్షేమం దృష్ట్యా కూడా ఈ విషయం గమనార్హమయింది. ఓ ప్రత్యేక కాలంలోని నారీమణులు రుచులు మరిగి, కాంక్షా దాస్యంలో అంధులవడం, దానికి శిక్షగా రాబోయే తరాల మహిళలందరూ శాశ్వతంగా బాధలకు లోనవడం ఎక్కడి న్యాయం?

ఇస్లాం ప్రతిపాదించిన జీవన వ్యవస్థను నిందించడం సబబు కాదు. అది ఒక తరం మానవులకు ఇతర తరాల మానవులపై ఎలాంటి ప్రాధాన్యత నివ్వడానికి సిద్ధంగా లేదు. దాని దృష్టిలో మానవ జాతి అంటే అనంతమయిన అనేక తరాల సంచయనం. కాని ఇస్లాం ఒకవేళ మానవుని సహజ వాంఛలను వ్యతిరేకిస్తే, లేక సకల సంతోషాలు, అన్ని ఆనందానుభూతులు నిషిద్ధమని ప్రకటిస్తే దాన్ని ఆక్షేపించడానికి తావుండేది. పరిస్థితి అలా లేదే !

# 12 ఇస్లాం మరియు శృంగారం

పాశ్చాత్య మనస్తత్వ శాస్త్రవేత్తలు, మతం మనిషికి తన మూల శక్తిని అణచివెయ్యాలని బోధిస్తుందని నిందిస్తారు. ఆ విధంగా మనిషిని మతం, చివరికి శాశ్వతంగా పాప భావ పంకిలంలో పడవేస్తుందని అక్కడ మనిషికి తాను చేసే ప్రతిపనీ పాపంగానే స్ఫురిస్తుందని, దానికి ప్రాయశ్చిత్తంగా జీవితంలోని సకల ఆనందోత్సాహాలనుండి దూరమవడంతప్ప గత్యంతరం లేదని మనిషి భావిస్తాడని కూడా వారు అంటారు. తమ ఈ వాదనకు ఆధారంగా వారు ఇంకా ఇలా అంటారు, "యూరపు, మతం పిడికిలిలో బంధించబడి ఉన్నంతవరకు దాన్ని నలువైపులనుండి అజ్ఞానాంధకారాలు పరివేష్ఠించి ఉండేవి. కాని మతం బిగువునుండి విముక్తంకాగానే అణగారివున్న దాని ఆశలు, కోరికలు, భావోద్రేకాలువెల్లువయి పారాయి. కోర్కెలవనంలో వసంతం వచ్చింది." ఈ వాదన ఆధారంగా మనస్తత్వవేత్తలు, 'నీవు మనల్ని తిరిగి ఆ మతం వైపుకు మరలమంటావా? నీవు మా ప్రగతి పథాన మత విశ్వాసాల ముండ్లకంపను పరచాలని కోరుతున్నావా? మేము మా రాబోయే కొంగ్రొత్త తరాలను అడుగడుగునా అభ్యంతరాలు సృష్టించి వారి జీవితాలను నరకప్రాయం చెయ్యమంటావా?' అని ప్రశ్నిస్తున్నారు.

ఇది పాశ్చాత్యులు తమ మతాన్ని దృష్టిలో ఉంచుకుని ప్రకటించే అభిప్రాయం. మన చర్చనీయాంశం ఇస్లాం గనుక వారి ఈ అభిప్రాయాన్ని ప్రస్తుతం మేము పరామర్శించడం లేదు. ఇస్లాం లైంగిక భావావేశాలను అణచే బోధ చేస్తుందా అన్న అంశాన్ని స్పృశించేముందు, లైంగిక అసంతృప్తి లేక లైంగిక కోరికల అణచివేత (SEXUAL REPRESSION) అన్న దానికి సరయిన భావం ఏమిటో పూర్తిగా అర్థం చేసుకోవడం అవసరమని భావిస్తున్నాము. ఎందుకంటే పతితులూ పామరులూ అందరూ దానికి పెడర్థాలు తీస్తున్నారు. విభిన్న పరిస్థితులపై దాన్ని అన్వయింపజేసేటప్పుడు కూడా పప్పులో కాలు వెయ్యడం జరుగుతోంది.

## అణచివేత – తాత్కాలిక ఉపసంహరణ

లైంగిక దమనము (SEXUAL REPRESSION) అంటే శృంగారకేళినుండి దూరంగా ఉండటం వల్ల జనించేది కాదు, దాన్ని అసహ్యమయిందిగా, జుగుప్సాకరమైన చర్యగా భావించడం ద్వారా జనించే పరిణామం. ఆ భావం ప్రకారం శృంగారం ఎంత జుగుప్సాకరమయిందంటే, ఈ భావన మనిషి అచేతనావస్థలో చోటు చేసుకుని, రతిక్రీడను ఎన్నిసార్లు జరిపినా అది అంతర్యంనుండి దూరమవదు. అందువల్ల లైంగిక దమనానికి గురయిన వ్యక్తి తన సహజ ప్రవృత్తి వత్తిడికి లొంగి రోజుకు ఇరువయ్యేసిసార్లు ఆ చేష్టలో పాల్గొన్నా దాన్ని మనస్సులో అసహ్యమయిందిగా, లజ్జాకర మయిందిగా భావిస్తూ ఉంటాడు. ఆవిధంగా అతను ఓ లైంగిక రోగిగానే మిగిలిపోతాడు. అతడు రతిలో పాల్గొన్నప్పుడల్లా అతని మనోమస్తిష్కాల్లో ఓ సంఘర్షణ బయల్దేరుతుంది, తాను చెయ్యవల సిందేమిటి? చేసిందేమిటి? అని. ఇలాంటి సచేతన, అచేతనావస్థల్లో జరిగే మానవసికమయిన అలజడి కారణంగా వివిధ మానసిక సమస్యలు, రుగ్మతలు ఉత్పన్న మవుతాయి.

లైంగిక దమనానికి ఈ నిర్వచనం రచయిత కల్పించింది కాదు. ఇది మేము సిగ్మండ్ ఫ్రాయిడ్ (SIGMUND FREUD) నుండి గ్రహించిందే. ఈయన తన జీవితకాలమంతా మతాన్ని తిట్టి పోస్తూనే ఉన్నాడు – అది మనిషి క్రియాశీలతను అణచివేస్తుందని, జీవితాన్ని చలనం, ఆచరణలకు దూరం చేసివేస్తుందని. అతను తన పుస్తకం (THREE CONTRIBUTIONS TO SEXUAL THEORY) లో ఇలా వ్రాసాడు : "లైంగిక దమనం, లైంగిక చర్యకు దూరంగా ఉండటం – ఈ రెంటి మధ్య వ్యత్యాసాన్ని గుర్తించటం అవసరం. రెండవ విషయానికి ఆ చర్యను తాత్కాలికంగా మానుకోవడమని అర్థం". (పుట 82). లైంగిక దమనమన్నది రతిని జుగుప్సాకరమయిన, అసహ్యకరమయిన విషయంగా భావించడం వల్ల ఉత్పన్నమయిందని, దానికీ రతిక్రీడను తాత్కాలికంగా నిలిపి వెయ్యడానికీ ఎలాంటి సంబంధం లేదని వెల్లడి అయిన తరువాత ఈ విషయంలో ఇస్లాం దృక్పథం ఏమిటో పరిశీలిద్దాము.

## నిషేధాలు కావు, పరిమితులు

మానవుని స్వాభావిక భావోద్రేకాలను ఆరోగ్యవంతమయినవని, పరిశుద్ధమయినవని ఇస్లాం ప్రకటించిన రీతిలో ప్రపంచంలోని మరే మతమూ చెప్పలేకపోయింది. దివ్యఖుర్ఆన్‌లో ఉంది:

> జనులకై- మనోభిరామమయిన కాంక్షలు, స్త్రీలు, సంతానం, వెండి బంగారాల రాసులు, మన్నికయిన గుర్రాలు, పశువులు (పాడి), వ్యవసాయభూములు —ఇవన్నీ మనోజ్ఞం చెయ్యబడ్డాయి. (3 :14)

ఈ ఆయత్ సకల "మనోభిరామమయిన కాంక్షల"ను ప్రస్తావించి వాటిని కాదనలేని యదార్థాలుగా అంగీకరిస్తుంది. ఇవి మనుషులకు ఎందుకు రుచిస్తున్నాయని ఈ ఆయత్ వాటిపై ఎలాంటి ఆక్షేపణనుగాని అభ్యంతరాన్ని గాని వెలిబుచ్చలేదు, ఇంకా వాటికి సంబంధించిన మానవ భావోద్రేకాలను కూడా అది ఖండించలేదు. ఇస్లాం కోరికల, భావోద్రేకాల దాస్యాన్ని మంచి దృష్టితో చూడదన్న విషయం నిజమే. అది మనిషిపై కళ్ళెంలేని కోరికలు, భావోద్రేకాలు అధికారం చెలాయించేవరకు వీటికై అర్రులు చాచడానికి వీలుపడదు. ఎందుకంటే ఇవి మనిషిలోని శక్తి సామర్థ్యాల కేంద్రాన్ని సర్వనాశనం చేసి వేస్తాయి. మనిషిని పశుస్థాయికి దిగజార్చుతాయి.

మానవులు ఈ విధంగా దిగజారడాన్ని పశుత్వానికి గురవడాన్ని ఇస్లాం ఇష్టపడదు. అయితే అంతమాత్రాన శృంగారం, తద్వారా ఉద్భవించే భావోద్రేకాలను, కోరికల్ని అసహ్యామయినవిగా, ఘృణ కల్పించేవిగా భావించి జీవంలేని పవిత్రత, ఆధ్యాత్మిక వికాసాల బలిపీఠంపై వాటిని అంతమొందించాలని అది కోరదు. ఇస్లాం దృష్టిలోని ఉన్నత ఆశయానికీ, ఈ విధంగా అచేతనావస్థ నుండి రూపుదిద్దుకొనే లైంగిక దమనానికి భూమ్యాకాశాల తేడా ఉంది. మానవ ఆధ్యాత్మిక పరిశుద్ధత, పవిత్రతల

విషయంలో ఇస్లాం సూత్రప్రాయంగా మానవ సహజసిద్ధమయిన సకల భావోద్రేకాలను గుర్తిస్తుంది. అచేతనావస్థలోనే వాటి గొంతునులిమే బోధనలు చెయ్యదు. క్రియా జీవితంలో వాటి అభివ్యక్తికి పరిపూర్ణంగా అవకాశమిస్తుంది. వాటి ద్వారా సమంజసమయిన పరిధుల్లో ఆనందానుభూతి కలగవలసిందే కాని వ్యక్తికయినా సమాజానికయినా ఎలాంటి హాని వాటిల్లరాదు. ఏ వ్యక్తి అయితే సదా మనోకాంక్షల సంతృప్తిలోనే మునిగి తేలుతూ ఉంటాడో అతని శక్తి సామర్థ్యాలు అకాల వినాశానికి గురవుతాయి. భావోద్రేకాల రంగుల వలలో చిక్కుకుని అతను మరే కార్యమూ చేపట్టే స్థితిలో ఉండడు. అతను తన మనోకాంక్షలను గురించి తప్ప మరే విషయాన్నీ ఆలోచించనూ లేడు. దైవం నియమించిన నియమాలను ఉల్లంఘించిన ఈ మూఢులు, తమ శక్తి సామర్థ్యాలను జీవితపు విభిన్న రంగాలను తీర్చిదిద్దడానికి వినియోగించడంపోయి, కేవలం అల్పమయిన ఓ భాగం కొరకు మటుకే వ్యర్థం చేసుకుంటారు. ఫలితంగా కుటుంబ సంబంధాలూ దెబ్బతింటాయి, సామాజిక జీవితమూ చిందువందవుతుంది; ఆ తరువాత సమాజంలో నెలకొనే స్థితిని దివ్య ఖుర్ఆన్ ఈ విధంగా చిత్రించింది:

> నీవు వారిని ఒకటిగా ఐక్యంగా ఉన్నారని భావిస్తున్నావు,
> నిజానికి వారి హృదయాలు చీలిపోయాయి. (59:14)

ఈ పరిస్థితుల్లోనే ఇతరులు ఇలాంటి జాతిపై లంఘించి దాన్ని నామరూపాల్లేకుండా తుడిచి పారేసే అవకాశం ఏర్పడుతుంది. ఫ్రాన్సు ఆధునిక చరిత్ర ద్వారా ఈ యదార్థం విస్పష్టంగా రూఢీ అయింది.

## కావలసింది మనో నిగ్రహం

ఇస్లాం వ్యక్తిపై కొన్ని ఆంక్షల్ని విధించడానికి కారణం అతను తన స్వేచ్ఛ దుర్వినియోగంచేసి తన స్వయానికి, కుటుంబానికి, సమాజానికి ఎలాంటి హాని కలగజెయ్యకుండా ఆనంద మకరందాన్ని గ్రోల గలగాలన్నదే.

అది జీవితపు ఆనందాలను అనుభవించాలని నిర్ద్వంద్వమయిన మాటల్లో మనిషికి పిలుపునిస్తుంది. కొన్ని ఆయత్‌లు పరిశీలించండి.

> ఓ ముహమ్మద్ (సఅసం), వారిని అడగండి, అల్లాహ్ తన దాసుల కొరకు సృజించిన అందాలుచిందే వరాలను, ఆయన ప్రసాదించిన పరిశుద్ధ పదార్థాలను నిషేధించిందెవరు? అని (7 : 32)

> ఇంకా ప్రపంచంలో నీ వాటాను విస్మరించకు. ( 28 : 77)

> తినండి, త్రాగండి - మేము మీ కొరకు ఉద్దేశించిన పరిశుద్ధపదార్థాలను. (7 : 160)

> తినండి, త్రాగండి, అయితే హద్దులు మీరకండి. (7 :31)

> ఇస్లాం శృంగార ప్రవృత్తికి ప్రాముఖ్యాన్ని ఎంత స్పష్టంగా గుర్తిస్తుందంటే దైవ ప్రవక్త (సఅసం) స్వయంగా ప్రవచించారు:

> ప్రపంచంలోని సుఖాలలో నాకు అన్నింటికంటే ప్రియప్రదమయినవి సుగంధపరిమళము, స్త్రీలు. ఇంకా నా కంటి చలువ నమాజ్‌లో ఉంది. (తఫ్సీర్ ఇబ్ను కసీర్)

ఈ హదీసులో శృంగారాని (స్త్రీ)కి ప్రపంచంలోని అత్యుత్తమ సుగంధ పరిమళంతో సమానస్థాయి నివ్వడం జరిగింది. ఇంకా దీన్ని దైవ సామీప్యానికి గొప్ప మార్గమయిన నమాజ్‌తో పాటు ప్రస్తావించటం జరిగింది. ఒకసారి దైవప్రవక్త (సఅసం) 'మనిషి తన భార్యతో కలసినందుకు కూడా పుణ్యం లభిస్తుంది' అని అన్నప్పుడు ఆయన సహచరులు విస్మయంతో అడిగారు, "మనిషి తన కామ వాంఛను సంతృప్త పరచుకున్నా పుణ్యం లభిస్తుందా?" అని. అప్పుడు ఆయన ఇలా ప్రవచించారు, "మీరు గమనించడం లేదు; ఒకవేళ అతను తన కామవాంఛను నిషిద్ధమయిన మార్గంలో తీర్చుకుని ఉంటే అతనికి పాపం మూడేది కాదా?

అందువల్ల అతను ధర్మసమ్మతమయిన రీతిలో తన కోరికను తీర్చుకున్నప్పుడు అతనికి పుణ్యం ప్రాప్తమవుతుంది'' (ముస్లిం). అంటే ఇస్లామీయ వ్యవస్థలో ఏ వ్యక్తీ లైంగిక దమనానికి గురయి ఉండే ఆస్కారం లేదు. యవ్వనంలో లైంగిక వాంఛ తీవ్రమయితే అందులో తప్పు ఏదీ లేదు. ఏహ్యమయిందిగా భావించి దాన్ని అణచివేసే ప్రయత్నం అవసరం లేదు. అయితే ఇస్లాం యువకుల్ని ఒకటి మాత్రం కోరుతుంది. వారు తమ లైంగిక వాంఛను గొంతునులమడానికి బదులుగా దానికి కళ్ళెం వెయ్యాలి. దాన్ని సచేతన సంకల్పబలంతో, ఐచ్ఛికంగా అదుపులో ఉంచాలి. మరోవిధంగా చెప్పాలంటే, లైంగిక వాంఛను అణచకుండా తీర్చుకునే సరైన అవకాశం లభించేవరకు దాన్ని వాయిదా వెయ్యాలి. ఇలాంటి వాయిదా వెయ్యడం ఫ్రాయిడ్ దృష్టిలో కూడా లైంగిక అణచివేత అనబడదు. దీనివల్ల నాడీమండలంపై కూడా ఎలాంటి హానికరమయిన ప్రభావాలు పడవు, అలాగే లైంగిక దమనక్రియవల్ల జనించగల మానసిక సమస్యలు, రుగ్మతలూ ఉత్పన్నం కావు.

## ఆశయసిద్ధికి త్యాగనిరతి అనివార్యం

మనోనిగ్రహంకై చేసే ఈ సూచన నిర్బంధ శాసనం కాదు. దీని వెనక ఎంతో నిగూఢ వివేచన దాగి ఉంది. ప్రపంచ సుఖాలను జీవితాశయానికి తగినట్లుగా మలచుకోవడం. ఏ జాతి ప్రజలయితే తమ మనోకాంక్షల్ని భావోద్రేకాలను తమ అధీనంలో ఉంచుకోలేరో మరెవరయితే అవసరమేర్పడినా తమకు ప్రియమయిన వాటిని వదలుకోవడం ఇష్టపడరో అలాంటి జాతి నాయకత్వపు హోదాను పొందజాలదు. అలాగే అంతర్జాతీయ సంఘర్షణల్లో ఏజాతి ప్రజలయితే కష్టాలను, ఆపదలను భరించే సామర్థ్యం కలిగి ఉంటారో, ఎవరయితే అవసరం కలిగినప్పుడు తమ మనోభిరామమయిన కోరికల్ని గంటలు, దినాలేకాదు సంవత్సరాల తరబడి త్యజించి నిబ్బరం చూపగలరో అలాంటి పురుషోత్తములకే విజయశ్రీ కాళ్ళు పడుతుంది. ఇస్లాంలో రోజా (ఉపవాసవ్రతం) లోని అసలు మర్మహేతువు ఇదే.

కొందరు స్వేచ్ఛా ప్రియులయిన స్త్రీ పురుషులు, రోజా విషయాన్ని ప్రస్తావించేటప్పుడు ఈ విధంగా వ్యాఖ్యానిస్తారు: - "రోజా? . . . . . హు, ఇదెక్కడి బుద్ధిలేని పని? అర్థంలేని వివేక శూన్యమయిన, నిష్ప్రయోజనమయిన కొన్ని ఆదేశాలను పాటించడం కోసం మనిషిని అనవసరంగా ఆకలి దప్పులతో మాడ్చడం వల్ల అసలు ఒరిగేదేమిటి?"

పిచ్చి స్వేచ్ఛకు మనసిచ్చిన వీరితో మేము చెప్పదలచుకున్న విషయం ఒకటే: "ఒక ఆశయం కొరకు కొన్ని గంటలయినా తన మనోకాంక్షల పొగరుమోతు గుర్రానికి కళ్ళెం వెయ్యలేని మనిషి కూడా మనిషేనా? ఇలాంటి కాంక్షాదాసులు మానవాళికి ఎన్నడూ ఎలాంటి సేవనూ చెయ్యలేరు. తమకు ప్రియమయిన విలాసాలను త్యాగం చేసే సాహసం లేనివారు, ప్రపంచంలో సత్యానికి తోడుగా నిలవాలన్నా అసత్యాన్ని ఎదిరించి పోరాడాలన్నా కావలసిన సహన స్థయిర్యాలను ఎలా కూడదెచ్చుకోగలరు?

రష్యా సామ్యవాదులకు తమ లక్ష్యం కొరకు ప్రాణాంతకమూ ప్రాణసంకటమూ అయిన బాధల్ని భరించే శిక్షణే లభించి ఉండకపోతే వారు స్టాలిన్ గ్రాడ్‌లో అలా స్థయిర్యంగా పోరాడగలిగే వారా? ఇదంతా తెలిసీ, ఇస్లామీయ జగత్తులోని కమ్యూనిస్టు క్రియాశీల శక్తులు, మనిషిలో మనో నిగ్రహశక్తిని పెంపొందించగలిగే రోజాలను, ఇతర ఇస్లామీయ శిక్షణా మార్గాలను అవహేళన చేస్తుంటారు. కమ్యూనిజం ధ్వజవాహకులు 'రాజ్యం' లేక గోచరమయిన అధికారశక్తి ఆదేశం మేరకయితే మనోనిగ్రహం పాటించవలసిందే అనంటారు. కాని సకల ప్రాణుల కర్త, ప్రభువూ అయిన దైవం కొరకు అదేమాట చెబితే చీదరించుకుంటారు, పెద్ద హంగామా సృష్టిస్తారు.

## కరుణాసాగరం – దైవం

మతం, తన అనుయాయుల మనస్సుల్లో వారు అజన్మ పాపులన్న

భావనను నాటి, వారి జీవితాల్లో వెగటును నింపుతుంది, తత్కారణంగా పాపభావన వారి మనోమస్తిష్కాలపై ప్రేతంలా ఆవహించి ఉంటుందన్న ఆరోపణ కూడా ఉంది. కొన్ని మతాల విషయంలో ఇది నిజమేమో కాని ఇస్లాంలో ఇలాంటి భావనకు తావులేదు. ఇస్లాం, శిక్ష, నరకయాతనల కన్నా క్షమ, కారుణ్యాలకు ప్రాధాన్యతనిస్తుంది. ఇస్లాం ప్రకారం, పాపం అన్నది నిత్యం మనిషిపై తిరగాడే భూతం కాదు. అది అంతం కాని చీకటి బూచీ కాదు - మనిషి జీవితాంతం దారి తప్పి వెలుపలికి రాలేక తిరగడానికి. ఆదమ్ (అస్సలాం) వల్ల జరిగిన పొరపాటు మనిషిపై సదా వ్రేలాడుతున్న ఒరలేని కత్తి కూడా కాదు. దాని పరిహారానికి మనమే ప్రాయశ్చిత్తం చేసే అవసరమూ లేదు.

> అప్పుడు ఆదమ్ తన ప్రభువు ద్వారా కొన్ని వచనాలు నేర్చుకుని పశ్చాత్తాపం ప్రకటించాడు. దాన్ని అయన ప్రభువు స్వీకరించాడు. (2:37)

అంటే ఆదమ్ తన పాపపరిహారానికిగాను లాంఛనాల అఖాతాలేవీ దాట వలసిరాలేదు. ఆయన చిత్తశుద్ధితో మనః పూర్వకంగా పశ్చాత్తాపంతో వేడుకోగానే దైవసన్నిధిలో అది ఆమోదించబడింది. తమ పితామహుని మాదిరిగా ఆదమ్ సంతతికి కూడా దైవకారుణ్యచ్ఛాయలు సతతం తోడుగా ఉంటాయి. ఇంకా ఏ విధంగానయితే ఆదమ్ పొరపాటు చేసీ దైవకారుణ్యానికి దూరం కాలేదో అలాగే ఆయన సంతతి కూడా పాపం చెయ్యడంచేత దైవ కారుణ్యానికి దూరంకాదు. దైవానికి వారి సహజమయిన బలహీనతలు, పరిధులు తెలుసు. ఆయన వారిపై వారు మొయ్యగలిగినంత భారాన్నే వేస్తాడు.

> అల్లాహ్ ఏ ప్రాణిపై కూడా దాని శక్తికి మించిన భారం వెయ్యడు. (2 : 286)

ఆదం సంతతిలో అందరూ తప్పు చెయ్యగలవారే. అయితే

తమ తప్పులకు సిగ్గుపడి, పశ్చాత్తాపం చెందేవారు, తప్పుచేసే
వారిలో ఉత్తములు. (ప్రవక్త ప్రవచనం – తిర్మిజి)

దివ్య ఖుర్‌ఆన్‌లో కారుణ్యం, క్షమాభిక్షకు సంబంధించిన ఆయత్‌లు అనేకమున్నాయి. ఇక్కడ ఒక్కదాన్ని మచ్చుకు పేర్కొంటున్నాము.

మీ ప్రభువు క్షమాభిక్ష వైపుకు, స్వర్గం వైపుకు పొయ్యే మార్గాన పరుగిడండి. (ఆ స్వర్గం) భూమ్యాకాశాలంత వైశాల్యం గలది. అది భయభక్తులు గల వారికొరకు సిద్ధం చెయ్యబడింది. వారు – కలిమిలోనూ, లేమిలోనూ తమకు ఉన్నదానిలోనే ఖర్చు చేస్తారు; క్రోధాన్ని దిగమ్రింగుతారు. ఇతరుల తప్పిదాలను క్షమిస్తారు. ఇంకా ఉత్తమ జనుల్ని అల్లాహ్ ఎంతో ప్రేమిస్తాడు. వారు ఎప్పుడయినా తమవల్ల నీతిబాహ్యమయిన పని ఏదయినా జరిగి, లేక ఏ పాపమయినా వారిచేత సంభవించి వారు తమపై అన్యాయం చేసుకున్నట్లయితే వెంటనే వారికి అల్లాహ్ గుర్తుకు వస్తాడు. వారు ఆయన్ని తమ అపరాధాలకు మన్నింపును వేడుకుంటారు– అల్లాహ్‌తప్ప మన్నించగలవాడెవడు? వారు తాము చేసిన దాన్ని కావాలని సమర్థించుకోరు. ఇలాంటి వారికి వారి ప్రభువు వద్ద ఉన్న ప్రతిఫలం ఏమిటంటే ఆయన వారిని మన్నిస్తాడు. వారిని, దిగువన కాలువలు ప్రవహించే ఉద్యానవనాల్లో ప్రవేశింప చేస్తాడు. వారక్కడ శాశ్వతంగా ఉంటారు. సదాచారులకు ఎంత ఉత్తమ ప్రతిఫలమిది ! (3:133 – 136)

దీన్నిబట్టి తెలిసేదేమంటే అల్లాహ్ కారుణ్యచ్ఛాయ సువిశాలమయింది. ఆయన తన దాసుల పశ్చాత్తాపాన్ని ఆమోదించడమే కాదు, వారిని పాపాల రోతలనుండి ప్రక్షాళన చేసి తన సన్నిధానంలో గుర్తింపునిచ్చి, కరుణించి, భయభక్తులు కలవారిలో, ఉత్తమ జనులవర్గంలో

వారిని చేర్చుకుంటాడు. ఇలాంటి ప్రేమ మూర్తి, కరుణాసాగరుని క్షమాభిక్షపట్ల ఏ మాత్రమయినా ఏ అనుమానమయినా చోటు చేసుకుంటుందా? దైవకారుణ్యం యొక్క ఈ విస్తృత భావన పాపం విషయంలో ఆత్మ క్షోభను, ఆవేదనను అంతం చేస్తుంది. మనిషి అజన్మపాపి కాడని, అతని ప్రభువు కారుణ్యం ఎప్పటికయినా అతన్ని విస్మరించదని ఇంకా, అతను తన పాపాల ఎడల నిండుగుండెతో సిగ్గుపడి పశ్చాత్తాపం చెందితే ప్రభువు కటాక్షం అతన్ని తన ఛత్రఛాయల్లో కాపాడుతుందని అతనికి ధైర్యాన్నిస్తుంది. ఈ మన్నింపు క్షమాభిక్షల్ని పొందడానికి సిగ్గుపడటం, పశ్చాత్తాప్పడటం తప్ప మరే షరతూ లేదు. ఇంత స్పష్టమయిన విషయానికి మరే నిదర్శనమూ అవసరంలేదు కాని, ప్రవక్త మహనీయుల (సఅసం) ప్రవచనం ఒకదాన్ని గమనించండి.

> ఏ శక్తి అధీనంలోనయితే నా ప్రాణముందో దాని సాక్ష్యం, ఒకవేళ మీరు ఏ పాపమూ చెయ్యక పోయిఉంటే, దేవుడు మిమ్మల్ని అంతమొందించిన తరువాత మరో వర్గాన్ని– పావం చేసి క్షమాభిక్షకై వేడుకునే వారిని – ఆవిర్భవింపజేసేవాడు. (ముస్లిం)

అంటే తప్పులను దయతో ఉపేక్షించడం, మన్నించడం దైవానికి ఎంతో ఇష్టమయిన విషయమన్నమాట. ఈ యదార్థాన్నే దైవ వచనం ఇలా విశదపరచింది:

> మీరు కృతజ్ఞులయి విశ్వసించేవారయితే మిమ్మల్ని శిక్షించే అవసరమేముంది దైవానికి? అల్లాహ్ అర్హులయిన వారికి ఎంతో విలువనిచ్చేవాడు, ఆయన అందరి పరిస్థితులూ తెలిసిన వాడు. (4 : 147)

నిస్సందేహంగా అల్లాహ్, మానవుడు బాధలకు గురికావడం ఇష్టపడడు. తన కారుణ్యాన్ని, క్షమాభిక్షను అనుగ్రహించాలని అభిలషిస్తాడు!

# 13. భావ స్వాతంత్ర్యం

మాటల సందర్భంలో ఓ మహాపురుషుడు అన్నాడు, "నీ దసలు మొండితత్వం, వేసిన గీటు దాటని ప్రబుద్ధుడివి" అని.

"ఎందుకు?" నేనడిగాను.

"నీవు దైవాన్ని నమ్ముతావా?"

"నిస్సందేహంగా"

"ఆయన్ని ఆరాధిస్తావు, ఉపవాసాలు పాటిస్తావు, అవునా?"

"సరిగ్గా ఊహించారు"

"రైట్, అయితే నా ఊహ సరయిందే అన్నమాట. నీది సంకుచిత దృష్టి అన్నది, ఛాదస్తపు మనస్తత్వం అన్నది రూఢీ అయింది" అతను తీర్పు చెప్పాడు. అప్పుడు నేనడిగాను, "నేను సంకుచితదృష్టి కలవాణ్ణని, ఛాదస్తపు మనిషనీ మీరెలా అనగలుగుతున్నారు?"

"ఎందుకంటే నీవు ఏఏ విషయాన్నయితే నమ్ముతున్నావో అదంతా పూర్తిగా బూటకం, నిరాధారమయింది. అది వాస్తవం మాత్రం కాదు". ఆయనగారి బదులది.

"మరి మీరో, మీరు దేన్ని నమ్ముతారు? మీకు, ఈ విశ్వాన్ని సృష్టించినదెవరో, జీవితానికి ఉనికి నిచ్చిందెవరో తెలుసా?" నేనడిగాను.

"ప్రకృతి"

"ప్రకృతి? - ప్రకృతి అంటే ఏమిటి?"

"ప్రకృతి అంటే - నిగూఢమయిన, అనంతమయిన 'శక్తి'. దాన్ని......దాని నిదర్శనాలని మనం మన పంచేంద్రియాల ద్వారా గ్రహించగలం" అన్నాడాయన.

"మీ మాటల వల్ల బోధ పడేదేమంటే, మీరు నాచేత, ఓ అగోచరశక్తి విధేయతను మాన్పించి, మరో అంతే అగోచరమయిన రహస్యమయశక్తి

(ప్రకృతి)కి నన్ను తల ఒగ్గమంటున్నారు. అంతేనా? - ఇప్పుడు ప్రశ్న ఏమిటంటే, నేను నా నిజ ఆరాధ్యశక్తిని, నాకు మానసికంగా, శారీరకంగా సుఖాన్నీ శాంతినీ ఇచ్చే శక్తిని కాదని మీరు చెప్పే ఆ మిథ్యా దైవాన్ని - నా నివేదనను వినజాలని, నీ అవసరాన్ని తీర్చజాలని ప్రకృతిని - ఎందుకు ఆశ్రయించాలి?"

## విలోమ ప్రతిక్రియ

సాధారణమయిన ఈ చిన్న సంభాషణ ద్వారా, భావస్వాతంత్ర్యం కావాలనే 'విశాలహృదయుల' మనోగతిని బాగా అంచనా వెయ్యవచ్చు. వారి దృష్టిలో భావ స్వాతంత్ర్యం అంటే, మనిషి తన నిజదైవాన్ని తిరస్కరించాలి. ఇది కేవలం నాస్తిక వాదమే కాని భావ స్వాతంత్ర్యం ఎంత మాత్రం కాదు. వీరు ఇస్లాంను నిందించడానికి కారణమేమంటే, ఇస్లాం మనిషిని, దైవతిరస్కారం, నాస్తికత బోధించే "భావ స్వాతంత్ర్యాన్ని" ఇవ్వదు. కాని, భావ స్వాతంత్ర్యం అన్నా, నాస్తికత్వం అన్నా భావం ఒకటేనా? వీరు పప్పులో కాలువేసేదిక్కడే. యూరపులో ఆవిర్భవించిన "భావస్వేచ్ఛ" (LIBERALISM) ఉద్యమాన్ని అధ్యయనం చేస్తూ ఒక విషయాన్ని వారు మరచిపోతారు. యూరపులో కొన్ని ప్రత్యేక పరిస్థితులు, సంఘటనల కారణంగా దైవతిరస్కారం, భౌతికవాదం పెంపొందాయంటే, ప్రపంచంలో ప్రతిచోటా ఇలాంటి పరిస్థితులే ఉత్పన్నమవుతాయని, ఇలాగే నాస్తికత, ధర్మవిహీనత వృద్ధిలోకి వస్తాయని అర్థంకాదుగదా.

క్రైస్తవ చర్చీవ్యవస్థ యూరపు సమక్షంలో పెట్టిన క్రైస్తవమత భావన, అది స్పష్టమయిన వైజ్ఞానిక యదార్థాలను తిరస్కరించిన తీరు, అది శాస్త్రవేత్తలను కష్టాలకు, బాధలకు గురిచేసిన రీతి, అసత్యాన్నీ మూర్ఖవిశ్వాసాలను, మూఢాచారాలను దైవధర్మంగా చిత్రించిన విధానం - ఇవన్నీ కలసి, పర్యవసానంగా స్వేచ్ఛాప్రియులయిన యూరపు మేధావుల్ని నాస్తికత ఒడిలో పడవేశాయి. యూరపు ప్రజల సమక్షంలో రెండు రాజీ

కుదరని దృక్పథాలు వచ్చాయి. వాటిలో ఏదో ఒకదాన్నే స్వీకరించడం సాధ్యం. ఫలితంగా వారు దైవవిశ్వాసం యొక్క సహజమైన మార్గాన్ని వదలి, సైన్సును, దాని ప్రబోధాలను నమ్మారు. చర్చివ్యవస్థ పడవేసిన సందిగ్ధావస్థనుండి కొంతవరకయినా విముక్తిని పొందే మార్గం అదొక్కటే వారికి గోచరించింది. మరో విధంగా చెప్పాలంటే వారు చర్చి వ్యవస్థ నుండి బయటపడి బహిరంగంగా ఇలా ప్రకటించారు ; "మీరు ఏ దైవం పేరు మీదుగా మమ్మల్ని మీ బానిసలుగా చేసుకోదలిచారో, మాపై భరించరాని బాధ్యతల్ని మోపుతున్నారో, మమ్మల్ని మీ జులుంకు, మీ పీడనకు గురి చేస్తున్నారో – ఆ మీ దైవాన్ని నమ్మడమంటే వనవాసానికి వెళ్ళడమన్న మాట! ప్రపంచాన్ని త్యజించి ఎడారుల్లో, అరణ్యాల్లో నివసించడమన్న మాట!! మాకు ఇలాంటి దైవం, ఇలాంటి మతం రెంటి అవసరమూ లేదు. దానికి బదులుగా ఇప్పుడు మేము కొత్త దైవాన్ని సృష్టించుకుంటున్నాము. అందులో మీ దైవం లక్షణాలన్నీ ఉన్నాయి. కానీ ఆ దైవం వద్ద మమ్మల్ని బానిసలుగా చేసేందుకు 'చర్చివ్యవస్థ' మటుకు లేదు. మీ దైవం ప్రత్యేకతలయిన నైతిక, ఆధ్యాత్మిక, భౌతిక ప్రతిబంధకాలేవీ లేవు".

దీనివల్ల తేలిందేమంటే, యూరపులో మతానికి వ్యతిరేకంగా పుట్టిన "ప్రతిక్రియ" కేవలం అక్కడి చర్చి వ్యవస్థలోని అపశ్రుతుల పర్యవసానమే తప్ప మరేమీ కాదు. ఇస్లాంలో చర్చి వ్యవస్థలేదు. ఒక్క దైవమే విశ్వానికీ, సృష్టి మొత్తానికీ ఏకైక కర్త. మరణం తరువాత మనుషులందరూ ఆయన సన్నిధానంలోనే హాజరు అవుతారు. ఇది స్పష్టమయిన స్వచ్ఛమయిన విశ్వాసం. సృష్టిపూజారులు (NATURISTS), నాస్తికులు (ATHIESTS) దీన్ని త్రోసిపుచ్చాలన్నా సునాయాసంగా సాధ్యంకాదు.

## ధార్మికంగా గుత్తాధిపత్యం?

ఇస్లాంలో ధర్మంపై ఏ వ్యక్తికీ లేక ఏ వర్గానికీ గుత్తాధిపత్యం లేదు. ఇదంతా మానవాళి అంతటికీ చెందిన ఉమ్మడి వారసత్వం. ప్రతి వ్యక్తికీ అతని సహజమయిన మానసిక, ఆధ్యాత్మిక సామర్థ్యాలను బట్టి దాని

ద్వారా ప్రయోజనం పొందే సమానమయిన హక్కు ఉంది. గౌరవమర్యాదలకు నిజమయిన అర్హులు కేవలం దైవభక్తి పరాయణులయిన వారే - వారు తమ వృత్తి రీత్యా ఇంజనీర్లయినా, ఉపాధ్యాయులయినా, సాధారణ కూలీ వాళ్ళయినా కార్మికులయినా సరే. 'మతం' వృత్తుల్లో ఒక వృత్తిగా చెలామణీ కాదు. అందువల్లనే ఇస్లాంలో ఆరాధనలు ఆచరించడానికి పాదరీలు అవసరంలేదు. అయితే ఏ సమాజంలోనయినా సాంఘిక నియమాలు, చట్టాలు తెలిసిన శాస్త్రవేత్తలుండటం ఎంతో అవసరంగనః ఇస్లామీయ శాసనాంగం, చట్టాల నిపుణులకు, ఇతరవ్యవస్థల్లో మాదిరిగానే తగిన స్థానం లభిస్తుంది. ఇతరులపై వారికి ఎలాంటి ఆధిక్యతా ఉండదు, ప్రత్యేక రాయితీలూ లభించవు. న్యాయవేత్తలుగా వీరు రాజ్యానికీ ప్రజలకు సలహాదారుల్లా వ్యవహరిస్తారు. ఉదాహరణకు అజ్‌హర్ యూనివర్శిటీ ఓ ధార్మిక సంస్థే. కాని యూరపులో చర్చీ మాదిరిగా తన వ్యతిరేకుల సజీవదహనానికో, వారిని చిత్రహింసకు గురిచెయ్యడానికో, లేక మార్చడానికో దానికి అధికారం ఎన్నడూ ప్రాప్తం కాలేదు. దాని బాధ్యత ఏమంటే ప్రజల ధార్మిక అవగాహనను, వారి దృక్పథాలను విమర్శనా గీటురాయిపై పరిశీలించి అందులో గోచరించిన లోపాన్ని విశదపరచాలి. కాని అదే మాదిరిగా ప్రజలకు కూడా హక్కు ఉంది. వారిలో కూడా ధర్మజ్ఞాన నిష్ణాతులయిన వారు అజ్‌హర్ విశ్వవిద్యాలయం వెలిబుచ్చే ధార్మికభావాలను అభిప్రాయాలను చర్చించి దాని తప్పిదాన్ని వివరించగలరు. ఎందుకంటే ఇస్లాంలో ఏ వ్యక్తికీ లేదా ఏ వర్గానికీ గుత్తాధిపత్యం లేదు.

అందువల్లనే ఇస్లామీయ వ్యవస్థ సంస్థాపన అంటే, 'ఉలమా' లేక ఇస్లామీయ న్యాయ శాస్త్రవేత్తలకే అధికారం, ఉన్నత పదవులు దక్కుతాయని ఎంతమాత్రం అర్థం కాదు. ఇస్లామీయ వ్యవస్థలో సంభవించే మౌలికమయిన మార్పు ఒకటే. ప్రభుత్వ వ్యవస్థలో ఇస్లామీయ షరీఅత్ లేక దైవశాసనాన్ని ప్రాతిపదికగా నిర్ణయించడం జరుగుతుంది. ఇంజనీర్లు, డాక్టర్లు యథావిధిగా తమ బాధ్యతలు నిర్వహిస్తూ ఉంటారు. ఆర్థిక నిపుణులు కూడా తమ పరిధిలో మామూలుగానే నిమగ్నులయి ఉంటారు. వారి కార్యకలాపాల

మౌలిక స్వరూపం ఇస్లామీయ ఆర్థికవ్యవస్థ వెలుగులో కొత్త రూపు ధరిస్తోంది.

ఇస్లామీయ విశ్వాసాలు, ఇస్లామీయ రాజ్యం, వైజ్ఞానిక దృక్పథాలు - ఈ మూటి క్రియాశీల అన్వయంలో ఎన్నడూ ఏ సంఘర్షణా జరగలేదన్నది చారిత్రక సత్యం. ఇస్లామీయ రాజ్యం, ఎన్నడయినా ఏ శాస్త్రవేత్తనయినా అతను వెలిబుచ్చిన వైజ్ఞానిక సిద్ధాంతానికి గాని లేదా అతని ఆవిష్కరణను పురస్కరించుకుని గాని అతని సజీవదహనానికి పాల్పడినట్లు దాఖలాలున్నాయా? సైన్సు మరియు ఇస్లాంల మధ్య మౌలిక అవగాహన, ఓ మౌలిక విశ్వాసంలో - అది, ఈ విశ్వం మొత్తానికి కర్త ప్రభువు ఒక్కడే అన్న విషయంలో- ఎలాంటి ఘర్షణ లేదు. అందుచేతనే ఇస్లాం మనిషిని ఆకాశం (అంతరిక్షం) లోనూ, భూమిలోనూ పరిశోధనలు, అధ్యయనాలు జరపమని మాటిమాటికీ ప్రేరేపిస్తుంది. ఈ విధంగా తన సృష్టి, మరియు విశ్వసృష్టి విషయంలో పరిశీలన, చింతనల ద్వారా మనిషి తన దైవాన్ని గ్రహించగలగాలని అది అభిలషిస్తుంది. ఈ విశ్వ పరిశీలన మూలంగానే పాశ్చాత్య వైజ్ఞానికులు అనేకమంది దేవుని ఉనికినే కాదన్న వారు, నేడు దేవుని అస్థిత్వాన్ని అంగీకరిస్తున్నారు.

## నాస్తిక ధర్మం

ఇస్లామీయ దేశాల్లో కొందరు దైవతిరస్కారం, నాస్తికతల ప్రచారంచేస్తూ కనిపిస్తారు. అసలు వీరు కోరేదేమిటి? వీరు నిజానికి తమ వలస ప్రభువుల అంధానుయాయులు. వారి అనుసరణలో ధర్మం, ధార్మిక ఆరాధనలు వగైరా పట్ల అడ్డదిడ్డంగా విమర్శలు చెయ్యాలనీ, ముస్లింలను ధర్మభ్రష్టులుగా చెయ్యాలని అభిలషిస్తున్నారు. ఈ విషయానికే "భావ స్వాతంత్ర్యం" అన్న అందమయిన పేరు వీరు తగిలిస్తున్నారు. యూరపు ప్రజలు, చర్చీవ్యవస్థ సాగించిన దౌర్జన్యకాండకు, అది ప్రచారం చేసిన మూఢాచారాలకు నిరసనగా మతానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేస్తే వారి చర్య కొంతవరకు సమంజసమయితే కావచ్చేమో కాని ఇస్లాంలో

దౌర్జన్యమూ లేదు, మూఢవిశ్వాసాలూ లేవు, స్వయంగా అదే మనిషికి అవసరమయిన స్వేచ్ఛలన్నింటినీ ప్రసాదిస్తుందే, అలాంటప్పుడు ఈ హంగామా అంతా దేనికి?

వాస్తవమేమంటే 'భావస్వాతంత్ర్యం' ధ్వజవాహకులుగా పేరొందిన ఈ మహనీయులకు నిజమయిన భావస్వేచ్ఛ పట్ల ఆసక్తి లేదు. దీని చాటుగా సమాజాన్ని నైతిక అరాచకానికి, లైంగిక విశృంఖలత్వానికి గురిచెయ్యాలన్నదే వీరి అసలు ఉద్దేశ్యం. నైతికత మతాలకు ప్రతికూలంగా వీరు ప్రారంభించిన వికృతమయిన పోరులో భావ స్వాతంత్ర్య నినాదం కేవలం ఇతరుల్ని వంచించడానికి ఉద్దేశించినదే. వారు ఇస్లాంను వ్యతిరేకించేది, అది మానవ భావ స్రవంతిపై ప్రతిబంధకాలు సృష్టిస్తుందన్న భయం వల్ల ఎంత మాత్రం కాదు. ఇస్లాం మానవాళిని, నీచమయిన, క్షుద్రమయిన భావాల నుండి, అభిప్రాయాల నుండి విముక్తంచేస్తుందన్న విషయమే ఈ స్వైర విహార ప్రియులకు కంటక ప్రాయమయింది. అదే వారి ఇస్లాం విరోధానికి మూలకారణం!

## నిరంకుశ రాజ్యం

'భావ స్వాతంత్ర్యం' సమర్ధకులు ఇస్లాం రాజకీయ వ్యవస్థను నియంతృత్వ వ్యవస్థగా ఆరోపిస్తారు. ఇందులో రాజ్యం విస్తృత అధికారాలు కలిగి ఉంటుందని, ధర్మం పేరుతో వాటిని ఇష్టారాజ్యంగా వినియోగిస్తుందని, ప్రజలు మత మౌఢ్యంతో ఈ వ్యవస్థకు, దాని దౌర్జన్యాలకు దాసోహమంటారని కూడా వారంటారు. ఇస్లామీయ రాజ్యానికి లభించిన ఈ అధికారాలు నియంతృత్వాన్ని సృజిస్తాయని, ఈ వ్యవస్థలో ప్రజలకు ఆలోచించేందుకు, నిర్ణయాలు చేసుకునేందుకు ఎలాంటి స్వేచ్ఛ ఉండదని, ఎవరికీ పాలకుల అత్యాచారాలను వ్యతిరేకించే ధైర్యం కలగదని, ఏ దౌర్భాగ్యుడయినా అలా గళం విప్పితే అతన్ని దైవానికీ ధర్మానికీ విరోధిగా, విద్రోహిగా చిత్రించ నేరుమోయించడం జరుగుతుందని వారి ఆరోపణ.

నిరాధారమయిన తలాతోకా లేని ఈ ఆరోపణలకు సరయిన సమాధానం దివ్యఖుర్‌ఆన్ ఒక్కటే. ఒక చోట ప్రవచించబడింది:

> వారి పనులన్నీ పరస్పర సలహా సంప్రతింపుల ద్వారా జరుగుతాయి. (42:38)

మరోచోట :

> మీరు ప్రజల మధ్య తీర్పు చేసేటప్పుడు న్యాయవంతంగా చెయ్యండి. (4 : 58)

తొలి ఖలీఫా హజ్రత్ అబూబక్ర్ (రజిఅల్లాహుఅన్‌హు) పలికారు :

> 'ఒకవేళ నేను దైవానికీ, దైవప్రవక్తకు అవిధేయుణ్ణయితే నాకు విధేయులుగా ఉండే బాధ్యత మీపై మిగలదు'.

రెండో ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజిఅన్), 'నాలో ఏదయినా లోపం కనిపిస్తే దాన్ని సంస్కరించండి' అని చెప్పినప్పుడు ఒక వ్యక్తి ఇలా పలికాడు:

> 'దైవం సాక్షి మేము నీలో ఏదయినా లోపం చూసి ఉన్నట్లయితే దాన్ని మా కరవాలాలతో సంస్కరించే వారము'.

ఇస్లాం బోధనలు, దాని అనుయాయుల ఈ వైఖరి, ఇన్ని ప్రస్ఫుటమయిన దృష్టాంతాలుండగా ఆ నిరాధారమయిన ఆరోపణలకు ఇంకా ఏదయినా స్థానముందా?

మతంపేరిట ప్రపంచంలో కొందరు, అన్యాయం, అక్రమం, దౌర్జన్యాల నాటకం పలుమార్లు ఆడినట్లు చారిత్రక ఆధారాలున్న విషయం వాస్తవమే. నేడు కూడా కొన్ని దేశాల్లో దాని పేరున హింసా దౌర్జన్యాలు కొనసాగుతున్న విషయమూ యదార్ధమే. కాని ఈ హింసా దౌర్జన్యాలు కేవలం మతం పేరిటనే జరిగాయా? హిట్లర్ నిరంకుశత్వానికి మూలం మతమా? నేడు రష్యాలో బహిరంగంగా ఒప్పుకుంటున్నారు, స్టాలిన్ జులుం చేశాడని, దౌర్జన్యపరుడయిన నియంత అని, అతని ప్రభుత్వం కేవలం పోలీసు రాజ్యమనీను. అయితే స్టాలిన్ పరిపాలన మతం ఆధారంగా ఏర్పడ్డదా? నియంతలందరు - వారు, మావో సేటుంగ్ అయినా, జనరల్ ఫ్రాంకో అయినా, దక్షిణాఫ్రికాలో డా. మలాన్ అయినా జాతీయవాది చైనా చాంగ్కైషెక్ అయినా - వీళ్ళంతా మతం ఆధారంగా, దాని అండదండలతోనే అధికారాసనాన్ని అధిరోహించారా? వాస్తవమేమిటంటే 20వ శతాబ్దపు మనిషి ఆధ్యాత్మికత నుండయితే స్వేచ్ఛను పొందాడు కాని నేటికీ అతను నియంతృత్వం, నిరంకుశత్వం, అన్యాయం, అక్రమాల అత్యంత భయంకర, వికృతరూపాల ఉక్కుపంజాలో బందీగా ఉన్నాడు. ఈ దౌష్ట్యాలపై, మనుషుల్ని మోసగించేందుకు రకరకాల అందమయిన లేబుళ్ళు అతికించారు. చిత్రమేమిటంటే, వాటికి, ఒక కాలంలో మతానికున్న పవిత్రతను కూడా అంటగట్టారు!

బుద్ధిగల ఏ మనిషీ నియంతృత్వాన్ని సమర్ధించలేడు. దాన్ని సరయినదని భావించనూలేడు. కాని మానవ స్వార్ధబుద్ధిని ఏమనగలం? ఎంతో పరిశుద్ధమయిన సిద్ధాంతాలున్నా వాటిని రూపు మాపి స్వార్ధప్రయోజనాలకై వాటిని పనిముట్లుగా వాడుకుంటే, తప్పు ఆ సిద్ధాంతాలది కాదు, వాటిని వాడుకునే స్వార్ధపరులది. వారు తమ నీచలక్ష్యాలను మరుగుపరచడానికి వాటి పేరును వాడుకుంటారు.

ఫ్రెంచి విప్లవం రోజుల్లో స్వేఛ్ఛాస్వాతంత్ర్యాల పేరిట వికృతమయిన అత్యాచారాలు అనేకం జరిగాయి. ఆ అత్యాచారాల సాకుతో స్వాతంత్ర్యోద్యమాలనన్నింటినీ వ్యతిరేకించడం భావ్యమా? అలాగే చరిత్రలో

అనేక పర్యాయాలు చట్టమని, శాసనాలని, చెప్పి వందలాది నిర్దోషుల్ని జైళ్ళలో వేశారు. వారిని నికృష్టమయిన యాతనలకు గురిచేశారు, **సర్వనాశనం** చేశారు. అయితే అంత మాత్రాన చట్టాన్నీ, శాసనాన్నీ నిరర్థకమని, వ్యర్థమని చెప్పగలమా? అలాగే కొన్ని దేశాల్లో మతం పేరిట దుర్మార్గం దౌర్జన్యాలు జరుగుతుంటే కేవలం అంత మాత్రాన మతాన్ని మనం మన జీవితాలకు దూరం చేసుకోవలసిందేనా? ఒక వేళ మతం **జులుం**ను, దౌర్జన్యాన్ని, అన్యాయాన్ని, అత్యాచారాన్ని బలపరిచేదయితే అలాంటి మతాన్ని విసర్జించడమే శ్రేయస్కరం. కాని న్యాయం, సన్మార్గాల ధర్మమయిన ఇస్లాంను, అన్ని రకాల అత్యాచారాన్ని జులుంను నిర్మూలించగోరే ధర్మాన్ని వ్యతిరేకించడంలో గల అర్థమేమిటి? ఇస్లాం కేవలం ముస్లిముల మధ్యనే కాక వారి అత్యంత దుష్టశత్రుగణం విషయంలో కూడా **న్యాయవంతంగా వ్యవహరించే** మహోదాత్తమయిన దృష్టాంతాలను నెలకొలిపింది. అలాంటి విశాలహృదయత మరెక్కడయినా మచ్చుకయినా కానవస్తుందా?

ప్రజల హృదయాల్లో దౌర్జన్యానికి, దుర్మార్గానికి ప్రతిగా దైవవిశ్వాసం పటిష్టపరచాలి. తద్వారా, స్వయంగా మతం ఇతరులకు ప్రసాదించిన అధికారాలను, హక్కుల్ని, స్వేచ్ఛల్ని గౌరవించడం నేర్పాలి. ఇలాంటి దైవభక్తి పరాయణులయిన వ్యక్తులు, వారితో కూడిన సమాజం, పాలకులు ఇతరులపట్ల దౌర్జన్యం, అత్యాచారాలు జరపడాన్ని, శాసనపరిధుల్ని అతిక్రమించడాన్ని ఎంతమాత్రం సహించదు. ఇస్లాం, మనుషుల్లో న్యాయానికి అండగా నిలిచి, అన్యాయానికి ఎదురొడ్డి పోరాడే మనస్తత్వాన్ని అలాంటి జీవనవ్యవస్థను రూపొందిస్తుంది. ఇస్లాం ప్రకారం, పాలకులు హింసా దౌర్జన్యాలకు పాల్పడితే వారిని సంస్కరించే కృషి చెయ్యడం ప్రజలందరి బాధ్యత. ప్రవక్త మహనీయులు (సఅసం) ప్రబోధించారు:

'మీలో ఎవరయినా చెడును చూస్తే దాన్ని సంస్కరించాలి'
(ముత్తఫకున్ అలైహ్)

మరొకసారి ఆయన ఇలా ఉపదేశించారు :

'దైవదృష్టిలో అన్నింటికంటే గొప్ప జిహాద్ (దైవమార్గంలో కృషి) ఏమిటంటే అది దౌర్జన్యపరుడయిన పాలకుని సమక్షంలో సత్యవాక్కును పలకడం.'

తమ ఈ మౌలిక హక్కును ప్రజలు వినియోగించిన నిదర్శనాలు కూడా కోకొల్లలుగా ఉన్నాయి. మూడవ ఖలీఫా హజ్రత్ ఉస్మాన్ (రజిఅన్) సరయిన రీతిలో పరిపాలన చెయ్యడం లేదని కొందరు అనుకోగానే తిరుగుబాటు ప్రకటించారు. ఆ తిరుగుబాటు కారణంగా ఉపద్రవాలూ, చెడులూ ఇంకా అధికమయ్యాయన్నది వేరే విషయం. కాని తమ హక్కును ప్రజలు వాడుకున్నారన్నది సత్యం.

చివరన మేము మా "ప్రగతిశీల" మిత్రులతో చెప్పదలచు కున్నదేమంటే, నిజమయిన స్వేచ్ఛ ధర్మాన్ని త్యజించడంలో కాదు, ఎలాంటి జులుంను, దౌర్జన్యాన్నీ సహించలేని విప్లవాత్మక భావాన్ని ప్రజల్లో ప్రదీప్తం చెయ్యడంలో ఇమిడి ఉంది. ఎక్కడ, ఏమాత్రం చెడు గోచరించినా దాన్ని అక్కడికక్కడే నిర్మూలించగలగాలి. ఇలాంటి విప్లవాత్మక భావనే ఇస్లాంలోని యదార్థమయిన, విశిష్టమయిన ప్రత్యేక గుణం!

# 14. ప్రజలకు మత్తుమందు

"మతం ప్రజలకు మత్తుమందు" అన్నది కారల్ మార్క్స్ నుడివిన ప్రఖ్యాత పలుకులు. దీన్ని కమ్యూనిజం ప్రచారకులు నేటికీ గుడ్డిగా వల్లె వేస్తూ ఉంటారు. చివరికి ఇస్లాం కూడా దాని తాకిడికి గురయింది.

కారల్ మార్క్స్ మరియు కమ్యూనిజం శైశవ దశలో వెలసిన ఇతర కమ్యూనిస్టు నాయకులు తమ సమకాలీన పరిస్థితుల కారణంగా నాటి చర్చీవ్యవస్థను, చర్చీపెద్దల్ని ఎదిరించడం తప్పనిసరి అయింది. ఆ కాలంలో యూరపులో ముఖ్యంగా రష్యాలో భూస్వామ్యం తన క్రూరమయిన కోరల్లో మొత్తం వ్యవస్థను బంధించింది. అందులో లక్షలాది ప్రజలు ఆకలిదప్పులకు తీవ్రమయిన శీతల వాతావరణం తాకిడికి గురయి ప్రాణాలు కోల్పోయ్యేవారు. మిగిలిన వారిలో అత్యధిక భాగం క్షయలాంటి సుదీర్ఘవ్యాధులతో తీసుకుని అసువులు బాసేవారు. వీరందరినీ పట్టించుకునే నాథుడే లేక పొయ్యాడు. దీనికి భిన్నంగా జాగీర్దారుల వర్గం ఈ నిరుపేదల రక్తంతో తమ కొరకు సకల రకాల సౌకర్యాలు, సౌలభ్యాలు, భోగభాగ్యాల వస్తుసామగ్రి సమకూర్చుకొనేవారు. తమ చుట్టుపట్ల పరిస్థితుల్ని లక్ష్యం చెయ్యకుండా విచ్చలవిడిగా భోగవిలాసాల్లో తులతూగుతూ ఉన్నారు.

## విప్లవమార్గంలో మహావరోధం

పుండుపై కారం చల్లినట్లుగా, నిరుపేదలు,శ్రామికులు ఈ సామాజిక అన్యాయాన్ని ఎదిరిస్తే, లేక వారు నికృష్ట పరిస్థితి పట్ల చైతన్యవంతులయి ప్రతిస్పందిస్తే మత పెద్దలు అంటే పాదరీలు వారికి ఏవో ఓదార్పు మాటలు చెప్పి జోకొట్టి నిద్రపుచ్చేవారు. కార్మికులకు, పీడితులయిన ప్రజావళికి తోడ్పడడం పోయి సహనం, సంయమనం పాటించమని బోధించేవారు. "ఎవరయినా మీ కుడి చెంపపై కొడితే రెండవ చెంప కూడా అతని ముందుంచండి. మీపై ఎవడయినా దౌర్జన్యం చేసి చొక్కాను తీసుకోదలిస్తే

మీరు మీ ఉత్తరీయాన్ని కూడా తీసుకోనివ్వండి" అని బోధించారు."ఎవరయితే ఇహలోకంలో అన్యాయాలకు జులుంకు గురవుతున్నారో వారు దీనికి బదులుగా మరో ప్రపంచంలో శాశ్వత స్వర్గానికి, సుఖశాంతుల జీవితానికి అర్హులవుతారు. అందువల్ల ఓర్పుచూపాలి. తమ హక్కుల కొరకు నిరసనా కంఠాన్ని విప్పరాదు" అని వారు పీడిత ప్రజలకు పసిపాపలకు బోలె మోసపుచ్చి హక్కులకై కృషి చెయ్యకుండా వారించారు. విప్లవమార్గాన్ని అరికట్టారు. ఇంకా ఒకవేళ పరలోక సుఖసంతోషాల వాగ్దానాలను ఖాతరు చెయ్యక పీడితులు తమహక్కుకై పోరాడదలిస్తే, "ఎవరయితే తన భూస్వామి ఆజ్ఞల్ని ఎదిరిస్తాడో అతను దైవానికీ, చర్చికి, పాదరీలకు ఎదురు తిరిగినవాడు, ద్రోహి, శత్రువు" అని ఘాటుగా చెప్పేవారు చర్చి పెద్దలు. ఆ కాలంలో ఖుద్దు చర్చివ్యవస్థే ఘనత వహించిన జాగీరుగా ఉండేది. లక్షలాది కార్మికులు దాని భూముల సాగుబడిలో నిమగ్నులయి ఉండేవారు. అందువల్ల సహజంగానే శ్రామికులు, జాగీర్దారుల మధ్య సంఘర్షణ ప్రారంభమయినప్పుడు చర్చివ్యవస్థ రష్యా రాజవంశానికి, దానికి వత్తాసు పలికే జాగీర్దారుల అడుగుల్లో మడుగులొత్తింది. వాస్తవానికి వీరంతా ఒకే బొంతలోని అతుకులే తప్ప మరేమీకాదు. వీరందరికీ బాగా తెలుసు - ఒకవేళ ప్రజావిప్లవమంటూ ఏదయినా విజృంభిస్తే అది జాగీర్దారుల్ని వదలదు, పాదరీ వర్గాన్ని విడిచి పెట్టదు అని. అందువల్ల పరలోక విజయాల వాగ్దానాలు సరిగ్గా పని చెయ్యలేకపోతే, బెదిరింపులూ ప్రభావం చూపలేకపోతే దండోపాయాన్ని దైవ ద్రోహులపై మతభ్రష్టులపై ప్రయోగించేవారు. ఈ విషయంలో జాగీర్దార్లకు చర్చి మద్దత్తు సంపూర్ణంగా లభించేది. చర్చినాయకుల ఈ వైఖరి వల్లనే యూరపు ప్రజల్లో క్రమేణ, మతమే మనిషికి నిజమయిన శత్రువు అనే భావం స్థిరపడింది. కారల్ మార్క్స్ చెప్పిన మాటల్లో ఈ చారిత్రక వాస్తవాన్నే ఎత్తి చూపడమయినది.

## ముస్లిం విద్వాంసులు

మత వర్గాలు సదా కార్మిక వర్గానికి శత్రువులుగా, పాలకవర్గానికి తొత్తులుగా వ్యవహరిస్తూ వచ్చాయని కూడా కమ్యూనిజం ధ్వజవాహకులు

ఆరోపిస్తారు. ప్రజలకు శాశ్వత స్వర్గ సుఖాల ఆశలు చూపి సకల విధాల అవమానాలకు అన్యాయాలకు తల ఒగ్గేలా, సమస్త బాధల్ని భరించేలా మతం బోధిస్తుందని, తత్ఫలితంగా ప్రజల్లో తాము కోల్పోతున్నదేమిటో అన్న స్పృహకూడా నశిస్తుందని, దౌర్జన్యపరులు ఎలాంటి అవరోధం లేకుండా వారి రక్తాన్ని పీల్చి పిప్పిచేస్తారని కూడా వారంటారు. ఈ సందర్భంలో అజ్‌హర్ * విశ్వవిద్యాలయానికి చెందిన కొందరు పండితుల ప్రస్తావన కూడా వస్తుంది. వారు వంగి, రాజుల చేతుల్ని చుంబించేవారని, వారి అభిరుచులకనుగుణంగా ఖుర్‌ఆన్ భాష్యాలు చెప్పేవారని, ఆ విధంగా ధర్మస్వరూపాన్ని మార్చివెయ్యడానికి వెనుకాడే వారు కారని కూడా ఆరోపిస్తారు. ఆ విధంగా ఈ పండితులు ప్రభుత్వ దర్పాన్ని స్థిరపరచి ప్రజలు వారికి ఎదురు తిరగకుండా కాపాడేవారని అంటారు. పాలకులపై తిరుగుబాటు లేక వారిపట్ల అవిధేయత దైవం ఎడల ద్రోహమని, మహాపరాధమని ఈ విద్వాంసులు ప్రజలతో చెప్పేవారని కూడా వారు ఆరోపిస్తారు.

ఈ ఆరోపణలన్నీ నిజమే కావచ్చు. కాని మత పెద్దరికమే వృత్తిగా గల ఈ నాయకులు ఇలా చేశారంటే అదంతా ధర్మావలంబన వల్ల జరిగిందా లేక ధర్మాన్ని ప్రక్కకు నెట్టి కేవలం తమ స్వార్థప్రయోజనాల పరిరక్షణకై, స్వలాభాలకై దురాశలకు లోనవడం వల్ల జరిగిందా? అన్నదే అసలు ప్రశ్న.

## అన్యాయంపై పోరాటం

ముందుకు సాగేముందు ఒక మాటను విశదపరచడం అవసరమని భావిస్తున్నాము. ప్రథమంగా, వృత్తిపరమయిన మత గురువుల వర్గానికి ఇస్లాంలో చోటులేదు. మరో విషయం, మత నాయకులు చెప్పేదీ చేసేది అంతా ఇస్లాం ఉద్దేశాల కనుగుణంగా ఉంటుందని చెప్పలేము. నిజానికి ముస్లిములు ధర్మజ్ఞానంలో వారిపైనే ఆధారపడి ఉండకపోతే

---

★ కైరో (ఈజిప్ట్) లోని అతి పురాతన ఇస్లామీయ విద్యాపీఠం.

ఈ దుస్థితి ఎదురయ్యేది కాదు. ముస్లిముల దౌర్భాగ్యానికి అసలు కారణం ధర్మజ్ఞానం పట్ల వారి ఈ అలక్ష్యం, ఈ పరాధీనతలే.

ఇస్లాం జులుం, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా శ్రామికప్రజల్ని నోరెత్తి మాట్లాడనివ్వదన్న ఆరోపణ కేవలం పచ్చిఅబద్ధం. దీనికి ప్రత్యక్ష సాక్ష్యం ముస్లిముల చరిత్ర. మాజీ నియంత నుండి ఈజిప్ట్ విముక్తి కోసం వెలసిన ఉద్యమం ప్రారంభం రీత్యా, ప్రాతిపదికరీత్యా ధార్మిక ఉద్యమం. అలాగే ఇస్లామీయ దేశాల్లో వెలసిన స్వాతంత్ర్య ఉద్యమాలన్నీ ఇస్లాం సృజించిన స్వేచ్ఛాతత్వం వల్ల ఉనికిలోకి వచ్చినవే. ఫ్రాన్సుకు ప్రతికూలంగా ఈజిప్ట్ప్రజలు విజృంభించినప్పుడు ముస్లిమ్ ధర్మవేత్తలే మున్ముందు ఉన్నారు. ముహమ్మద్ అలి చేసిన అన్యాయాలకు ఎదురు తిరిగి నిరసన తెలిపిన వారు కూడా ఓ ధర్మవేత్త ఉమర్ కిరామ్ అన్నది సర్వవిదితమే. సూడాన్‌లో బ్రిటిషు పాలకుల్ని ఎదిరించి స్వాతంత్ర్య ఉద్యమ నాయకత్వం వహించిన అల్‌మహదీ కూడా అక్కడి ప్రఖ్యాత ధర్మవేత్తయే. అలాగే లిబియాలో ఇటాలియన్ సామ్రాజ్య వాదులకు, మొరాక్కోలో ఫ్రెంచ్ సామ్రాజ్యానికి ఎదురు తిరిగి పోరాడింది ఇస్లాం ధ్వజవాహకులే. బ్రిటన్ రాచరికాన్ని ఎదిరించిన కాషాని విప్లవోద్యమం కూడా ఈ ఇస్లామీయ భావాలకు ప్రతిఫలమే. ఆ స్వాతంత్ర్య ఉద్యమాలు, స్వయంగా ఇస్లామే ఓ మహత్తర స్వాతంత్ర్య ఉద్యమం అని చాటడానికి గొప్ప తార్కాణాలు. ఇస్లాం అంటే అన్ని రకాల అన్యాయాలకు, అక్రమాలకు ఎదురొడ్డి, మానవులకు జరిగే అవమానాన్ని, పరాభవాన్ని ప్రతిఘటించే మహాసంగ్రామం.

## వక్ర భాష్యాలు

కమ్యూనిజం ప్రచారకులు సామాన్యంగా దివ్యఖుర్‌ఆన్‌లోని రెండు ఆయత్‌లను ప్రస్తావించి, వాటికి తమకు అనువయిన అర్థాన్ని అన్వయింపజేసి, ఇస్లాం అన్ని రకాల అక్రమాలను, అవమానాలను సహనంగా భరించాలని ప్రబోధిస్తుందని నిరూపించేందుకు

ప్రయత్నిస్తుంటారు.

> దైవం ఏ విషయంలోనయితే కొందరికి కొందరిపై ఆధిక్యత నిచ్చాడో అలాంటి దాని అభిలాషకు మీరు లోనవకండి.
> (4 :32)

> తిరస్కారుల విభిన్న వర్గాలకు వారి పరీక్ష నిమిత్తం మేము ఏ కలిమినయితే ప్రసాదించామో మీరు దాని వైపు కన్నెత్తి కూడా చూడకండి. అదంతా కేవలం ప్రపంచ జీవితంలోని పై మెరుగులు మాత్రమే. మీ ప్రభువు (పరలోకంలో) ప్రసాదించేది ఎంతో మేలయినది, శాశ్వతమయినది.
> (20 :131)

మొదటి ఆయత్ అవతరణ పూర్వరంగాన్ని ఖుర్ఆన్ వ్యాఖ్యాతలు ఈ విధంగా వివరించారు: పురుషులకు జిహాద్ (దైవ మార్గంలో పోరాటం) విధిగా నిర్ణయమయినప్పుడు ఓ మహిళ వచ్చి, స్త్రీలకు దైవమార్గంలో జిహాద్ చేసే భాగ్యం కల్పించకపోవడానికి కారణమేమిటని ప్రవక్త మహనీయుల్ని ప్రశ్నించినప్పుడు ఈ ఆయత్ అవతరించింది. ఈ ఆయత్‌కు మరో విస్తృత భావమేమిటంటే, మనిషి ఆశలు ఆకాంక్షల ఊహాలోకంలో విహరించరాదు. మనిషి క్రియాశీలశక్తిని గుల్ల చేసి వేసే ఊహాసౌధాల నిర్మాణం ఓ రుగ్మత. దాన్ని గురించి ఇక్కడ హెచ్చరించడం జరిగింది. ఈ రోగం సోకిన మనిషి కాపట్యం, ఈర్ష్యాద్వేషాల్లాంటి రోగాలకు గురవుతాడు. ఇవి మనిషికి భౌతికంగానూ నష్టదాయకమయినవే. అందువల్ల ఈ ఆయత్‌లో వాటినుండి దూరంగా ఉండడానికి, తనలోని సహజ గుణగణాలను, శక్తిసామర్థ్యాలను పెంపొందించుకోవడానికి మనిషిని ప్రేరేపించడం జరిగింది. ఈ వైఖరివల్ల మనిషికి నిజమయిన గౌరవ మర్యాదలు ప్రాప్తమవుతాయని బోధించడం జరిగింది.

రెండవ ఆయత్ మనిషిని భౌతికస్థాయినుండి ఉన్నతంగా ఎదిగేందుకు

ఆహ్వానిస్తుంది. కేవలం ప్రాపంచిక వస్తుసామగ్రిలో ఆధిక్యత ఒకరి గొప్పదనానికి, ఘనతకు నిదర్శనం కాదని చాటి చెబుతుంది. ఏ వ్యక్తులయితే భోగభాగ్యాలు తప్ప ఇతర మంచితనాలన్నింటికీ దూరంగా ఉంటారో అలాంటి వ్యక్తులు మనిషికై ఆదర్శనీయులూ కారు, అనుసరించదగ్గవారూ కారు. ఈ ఆయత్ ప్రప్రథమంగా స్వయాన ప్రవక్త మహనీయుల్ని (సఅసం) సంబోధించింది. ఈ ఆయత్‌లో, మహాప్రవక్త (సఅసం) కు తెలుపబడిన సత్యం ఏమిటంటే దైవదృష్టిలో కలిమి, సంపదలు మెండుగా ఉన్న తిరస్కారులకు ఎలాంటి విలువ, ప్రాముఖ్యతల్లేవు. కారణం, వారికి విశ్వాస సిరులు ప్రాప్తంకాలేదు. దైవంవద్ద ఎవరికయినా ప్రాముఖ్యం ఉందంటే అది దైవ ప్రవక్త (సఅసం) కే. ఆయన సత్యమార్గాన్ని, సన్మార్గాన్ని అవలంబిస్తున్నారు. కనుక నిజమయిన గౌరవ మర్యాదలకు అర్హులు ఆయనే.

ఇదీ ఈ రెండు ఆయత్‌ల నిజమయిన భావన. కాని కాస్సేపటికి దీన్ని కాదని, ఈ ఆయత్‌లలో (ఇస్లాం ప్రతికూల వాదులు చెప్పినట్లు) మనిషికి సహనాన్ని, సంతృప్తినీ అవలంబించే బోధన చెయ్యడమే జరిగిందని, ఇతరులకు ప్రాప్తమయిన వాటిపై ఈర్ష్య చెందకుండా వారించడం జరిగిందని ఒప్పుకుందాము. అయితే ఈ ఆదేశాల సరయిన సందర్భం ఏది? వీటిని అమలు పరచడానికి కావలసిన పరిస్థితులేవి? సమాధానం నిజమయిన ఇస్లామీయ వ్యవస్థ అని తెలుస్తూనే ఉంది.

దీన్ని అర్థం చేసుకునేందుకు గుర్తుంచుకోవలసిన మొదటి విషయం ఏమిటంటే ఇస్లాం ఒక పరిపూర్ణమయిన జీవనవ్యవస్థ. దాని అనుసరణ, అవలంబన సరిగ్గా జరగాలంటే ఆ వ్యవస్థను పరిపూర్ణంగా, దాని వివరాలతోసహా, నిమ్న విషయాల సమేతంగా స్వీకరించినప్పుడే అది సాధ్యం. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకుని ఈ సమస్యను పరిశీలించాలి. ఇస్లాం నిరుపేదలకు, అభాగ్యులకు సహనం, సంతృప్తిని పాటించాలని, తమకన్నా సంపన్నులయిన వారి సిరుల్ని, వారి కలిమిని ఈర్ష్యతో చూడరాదని బోధించడం మాత్రమే కాదు, దానితో పాటు సంపన్నులయిన

వారిని సయితం, స్వార్థప్రియత్వానికి దూరంగా ఉండాలని, దైవం ప్రసాదించిన ధనాన్ని ఇతోధికంగా ఆయన మార్గంలో వెచ్చించాలని, అదే వారి మోక్షానికి మార్గమని, లేకపోతే పరలోకంలో తీవ్రమయిన యాతనను అనుభవించవలసి ఉంటుందని కూడా అది బోధిస్తుంది. ఈ రెండు కోణాలను దృష్టిలో ఉంచుకుని గమనించినట్లయితే ఇస్లాం అవలంబించిన మార్గమే వాస్తవానికి న్యాయవంతమయిన, మధ్యస్థ మార్గమని ద్యోతకమవుతుంది.

## అన్యాయాన్ని సహించడం మహాపాపం

ఇస్లాం విధానం ఏమిటంటే మనిషి తన వ్యక్తిగత స్థాయినుండి ఉన్నతంగా ఎదిగి, తోటి సోదరులకై నిష్పాక్షికంగా, నిస్వార్థంగా ఖర్చుపెట్టాలన్న మార్గాన్ని అది చూపుతుంది. మరోవైపు ఈర్ష్యాద్వేషాలను, కడుపుమంటను దరి చేరనివ్వరాదని తాకీదు చేస్తుంది. ఈవిధంగా మనిషి తోటి సోదరులమధ్య ఎట్టి పరిస్థితిలోనూ నీచంగా, హీనంగా మసలుకోరాదని ఉద్బోధిస్తుంది. ఫలితంగా ఇస్లామీయ వ్యవస్థలో సమాజం నిజమయిన ఆధ్యాత్మిక శాంతితో పరిఢవిల్లుతుంది. ఈ శాంతి ఆర్థిక న్యాయంతో కూడా సమన్వయమవుతుంది. ఈ ఆర్థిక నీతివల్ల ఇస్లాం, సంపద సమాజంలో వ్యక్తులందరి మధ్య సమంజసంగా పంపిణీ కావాలని కోరుతుంది. కొందరికి అత్యధికంగా లభించి వారు విలాసవంతమయిన జీవితం గడుపుతూ, కొందరు నిరుపేదలు శాశ్వతంగా లేమికి దౌర్భాగ్యానికి గురయ్యే పరిస్థితి రూపొందకుండా చూస్తుంది.

కాని ఇది సరిగ్గా అమలు జరగాలంటే, శ్రీమంతులు, సంపాదనాపరులయిన వారు తమ విధులు తెలుసుకుని వాటిని నిర్వర్తించడానికి పూర్తిగా సన్నద్ధులయి ఉండాలి. ఇస్లామీయ వ్యవస్థలో ఒకవేళ శ్రీమంతులు, కలవారు తమ బాధ్యతల నిర్వర్తనలో వెసులుబాటు కనబరచి దైవమార్గంలో ధనం వెచ్చించకుండా ఉంటే నిరుపేదలకు, పీడిత ప్రజలకు సహనం, సంయమనం నూరిపోయడం సాధ్యమా? తమ లేమిని, జరిగే అన్యాయాలను భరించమని బోధించడం సులభమా? తమపట్ల జరిగే అత్యాచారాన్ని అక్రమాన్ని ఎదిరించకుండా వారించవీలుపడుతుందా?

నిస్సందేహంగా ఇది ఇస్లాం విధానం కాదు. ఎవరయితే అన్యాయానికి, అత్యాచారానికి లొంగి, వాటిని ఎదిరించి ప్రతిఘటించరో వారు ప్రపంచంలోనూ పరలోకంలోనూ తీవ్రమయిన యాతనకు గురవుతారు:

> ఎవరయితే తమపై తామే జులుమ్ చేసుకుంటూ ఉండేవారో వారి ఆత్మల్ని దైవదూతలు స్వాధీనం చేసుకున్నప్పుడు వారిని అడిగారు, 'మీరు ఈ స్థితిలో చిక్కుకున్నారేమిటి?' అని. వారు, 'మేము ధరణిలో బలహీనులుగా గత్యంతరంలేనివారుగా ఉండేవారము', అని బదులిచ్చారు. అప్పుడు దైవదూతలు, 'దేవుని భూమి విశాలమయింది కాదా అందులో మరెక్కడికయినా వలసవెళ్ళడానికి (మీరెందుకు సిద్ధమవ్వలేదు?)' అని అడిగారు. వీరు, నరకమే తమ చిరనివాసమయినవారు, అది ఎంతో నికృష్టమయిన నివాసం. అయితే ఏ పురుషులు, స్త్రీలు, బాలలు నిజంగానే అశక్తులయి, బయటపడే మార్గం కానరాని వారయ్యారో అల్లాహ్ అలాంటివారిని క్షమించి వదలి వెయ్యవచ్చు. అల్లాహ్ అమితంగా క్షమించేవాడు, మన్నించే వాడూను. (4:97, 98)

అన్యాయాన్నీ, అక్రమాన్ని కేవలం బలహీనతవల్ల స్వీకరించడం ఖురాన్ దృష్టిలో క్షమించరాని నేరం. కనుక అది అలాంటి వ్యక్తుల్ని 'తమపై తామే అన్యాయం చేసుకున్నవారు'గా ప్రస్తావిస్తుంది. ఎందుకంటే వీరు దైవం మానవులకై నిర్ణయించిన మానవ గౌరవ ప్రతిష్ఠల ఉన్నత స్థానం నుండి దిగజారి క్రిందిస్థాయికే తృప్తి చెందారు. గౌరవోన్నతులు సాధించేందుకు తమ శక్తి సామర్థ్యాలన్నింటినీ వినియోగించడం తమ విద్యుక్త ధర్మం అన్న విషయాన్ని విస్మరించారు.

ఈ విషయాన్ని అది ఎంతగట్టిగా నొక్కి చెబుతుందంటే, ముస్లిముల్లో ఎవరయితే నిజంగానే బలహీనులూ, అశక్తులవడం మూలాన పీడించబడేవారో, మరెవరివద్ద దౌర్జన్యపరుల్ని ఎదుర్కొనే శక్తి, సాధనా సంపత్తి లేకున్నాయో వారికి కూడా దైవ మన్నింపు లభించే అవకాశం

ఉన్నట్లు - అదీ గట్టిగా కాదు - పై ఆయత్‌లో కేవలం వాగ్దానం మాత్రమే చేస్తుంది. ఈ ఆయత్‌లో నొక్కి చెప్పిన విషయం ఏమిటంటే మనిషిలో అన్యాయాన్ని అరికట్టేందుకు దాన్ని ఎదుర్కొనేందుకు ఏ మాత్రం శక్తి ఉన్నా, అతను దాన్ని సహించి, దాన్ని అంతమొందించడానికి ఎలాంటి కృషి చెయ్యకుండా ఉండటం ధర్మసమ్మతం కాదు. అంతగా గత్యంతరం లేకపోతే వలస వెళ్ళే ఆదేశమన్నా ఇస్తుందికాని అన్యాయాన్ని సహించడం మాత్రం సహించదు ఇస్లాం.

పోతే, పూర్తిగా బలహీనులు, అశక్తులు, పీడితులయిన ముస్లిముల విషయంలోనూ ఇస్లాం వారిని అట్టే వదలి పెట్టదు. వారిని పరిరక్షించే, వారికి సహాయమందించే బాధ్యతను మొత్తం ముస్లిం సమాజానికి అప్పగిస్తుంది. ఈ ఆశయం కొరకు అవసరమయితే దౌర్జన్యపరులతో పోరాడే ఆదేశమూనిస్తుంది.

> బలహీనులయినందువల్ల పీడించబడే అశక్తులయిన పురుషులు, స్త్రీలు, బాలలకొరకు మీరు, దైవమార్గంలో పోరాడక పోవడానికి అసలు కారణమేమిటి? వారు మొర బెట్టుకుంటున్నారు, "ఓ మా ప్రభూ మమ్మల్ని ఈ బస్తీనుండి వెలికి తీయి. దీని ప్రజలు దౌర్జన్యపరులు, ఎవరినయినా మమ్మల్ని ఆదుకునే వారిని, మాకు సహాయపడే వారిని నీ తరఫున పంపు. (4 : 75)

ఈ ఆయత్‌వల్ల వ్యక్తమయ్యేదేమంటే అల్లాహ్ అన్యాయానికి తలవంచే వారిని ఇష్టపడడు. దైవ ప్రసన్నతను అభిలషించే ప్రతివ్యక్తి, సత్య ప్రియులతో కలసి అన్యాయాన్ని అత్యాచారాన్ని ప్రతిఘటిస్తూ రంగంలో దూకాలని, తద్వారా దౌర్జన్య పరుల ఆగడాలకు గురయ్యేవారిని వాటినుండి రక్షించాలని ఆయన కోరుతాడు.

## ఆర్థిక దోపిడీపై ధ్వజమెత్తాలి

పైన పేర్కొన్న ఆయత్‌లు మతపరమయిన విశ్వాసాలకు మాత్రమే

సంబంధించినవని, ముస్లిములు పాలితులుగా, పీడితులుగా, అశక్తులుగా, తిరస్కారుల నడుమ చిక్కుకుని తమ ధార్మిక విధులు కూడా నిర్వర్తించే స్వేచ్ఛ కలిగిలేని పరిస్థితులకే అవి వర్తిస్తాయని ఎవరయినా అభిప్రాయపడవచ్చు. కాని ఈ అభిప్రాయం సరయినది కాదు. ఎందుకంటే ఇస్లాం ఓ సమగ్ర వ్యవస్థ. ఇస్లాం దృష్టిలో ఇస్లామీయ ఆరాధనల మార్గంలో అవాంతరాలు సృష్టించే వారైనా, ఇస్లామీయ జీవనవ్యవస్థ సంస్థాపనా మార్గాన్ని దుర్గమం చేసేవారయినా అందరూ సమానులే. ఇలా చేసే దుర్మార్గులు తమపేరు, పనులూ రెంటి దృష్ట్యా ఇస్లాం తిరస్కారులయినా, లేదా పేరుకుమాత్రం ముస్లిములయి, పనులరీత్యా దైవధిక్కారులే అయినా అందరూ ఒక్కటే. ఇదే పవిత్ర ఖుర్‌ఆన్ తీర్పు.

> మరెవరయితే దైవం అవతరింపజేసిన చట్టం ప్రకారం తీర్పులు చెయ్యరో వారే కాఫిర్లు - తిరస్కారులు.
> (5 : 44)

ఇంతకు ఇస్లాం కోరేదేమంటే ఐశ్వర్యం కేవలం కొన్ని ఇండ్లల్లో తిష్ఠవేసి ఉండరాదని, అది సమాజం మొత్తాన పరిభ్రమిస్తూ ఉండాలనీను. దీనికితోడుగా తన పౌరులకు ఉపాధి కల్పించడం ఇస్లామీయ రాజ్యం బాధ్యత. అది అలా చెయ్యలేకపోతే లేదా ఏ వ్యక్తి అయినా శారీరక వైకల్యంవల్ల, బలహీనతవల్ల పని చేసే స్థితిలో లేకపోతే ప్రభుత్వ ధనాగారంనుండి అతనికి సహాయం అందజెయ్యడం దాని కర్తవ్యం. ఇవేకాక గత పుటల్లో ప్రస్తావించినట్లు దైవప్రవక్త (సఅసం) ఆదేశం మేరకు ఇస్లామీయ రాజ్యం తన ఉద్యోగులకు కొన్ని ప్రత్యేక రక్షణలు కూడ

---

* రచయిత ఇక్కడ ప్రవక్త మహనీయుని (సఅసం) ఓ ప్రవచనాన్ని బహుశ సూచిస్తున్నారు. అందులో "ఏ వ్యక్తి మన (ఇస్లామీయ రాజ్య) ఉద్యోగిగా పనిచేస్తున్నాడో అతనికి పెళ్ళికాకపోతే పెళ్ళి చెయ్యాలి. అతనికి ఇల్లులేకపోతే ఇల్లు కట్టివ్వాలి. అతనివద్ద నౌకరు లేకపోతే ఓ నౌకరును కూడా ఏర్పాటు చెయ్యాలి" అని ఆయన సెలవిచ్చారు. (అను)

కల్పించవలసి ఉంటుంది. ఈ రక్షణలు ప్రయివేటు, పబ్లిక్ సంస్థల్లో పనిచేసే ఉద్యోగులందరికీ సమంగా వర్తిస్తాయి.

ఏ వ్యక్తి అయినా వీటిలో ఏ కోణంలోనయినాసరే దైవశాసనాన్ని కాదన్నాడంటే అతను నిజమయిన ముస్లిం కాడు. ఎవరయితే ఇస్లాం ప్రతిపాదించే రాజకీయ, ఆర్థిక, సామాజిక వ్యవస్థల్ని ప్రపంచంలో సంస్థాపించి వాటి ప్రాబల్యం కొరకు జరిగే కృషిలో పాలుపంచుకోరో వారిని ఖుర్ఆన్, 'ఇష్టపూర్వకంగా దౌర్జన్యాన్ని, అన్యాయాన్ని, అక్రమాన్ని సహించి వాటితో రాజీపడిన అపరాధులుగా, 'తమపై తాము అన్యాయం చేసుకున్నవారు' గా పరిగణిస్తుంది.

## ధన సర్పాలు వినాశకారకులు

ఎవరయితే ముందు పుటల్లో పేర్కొన్న ఖుర్ఆన్ 4:32 మరియు 20:131 ఆయత్‌లను ప్రస్తావించి, ఇస్లాం అన్యాయాన్ని, దౌర్జన్యాన్ని నోరు మెదపకుండా భరించాలని బోధిస్తుందని అంటారో, కాస్సేపటికి వారి వాదనను సరయినదిగా ఒప్పుకున్నా దాని తార్కిక పరిణామాలు స్వయంగా వారి వాదనను ఖండిస్తాయి. ఆ వాదనలోని పరిణామాలు ఇస్లాంకు పూర్తిగా విరుద్ధమయినవి, వారి వాదనలోని మొదటి పరిణామం ఏమంటే ధనమంతా కొన్ని చేతుల్లో మటుకే చేరిపోతుంది. ఇతరులంతా దాని ఫలాలు లాభాలకు దూరమవుతారు. (వాస్తవంగా భూస్వామ్య, పెట్టుబడిదారీ వ్యవస్థల్లో జరిగేదిదే) కాని ఈ పరిస్థితుల స్వరూపం దైవేచ్ఛకు పూర్తిగా విరుద్ధమయినది. ఎందుకంటే దివ్యఖుర్ఆన్‌లో స్పష్టంగా ఉంది:

> . . . ఈ విధంగా ధనం ధనవంతుల మధ్యనే తిరుగాడుతూ ఉండరాదని. (59:7)

మరో పరిణామం ఏమంటే శ్రీమంతులు తమ సంపదపై నిధి సర్పాలయి కూర్చుంటారు. ఖర్చుచేసినా కేవలం తమ సొంత విషయాలకై భోగవిలాసాలకై మాత్రమే చేస్తారు. ఇలాంటి వారిని గురించే దివ్యఖుర్ఆన్‌లో

ఇలా వక్కాణించడం జరిగింది:

> ఎవరయితే వెండి బంగారాలను కూడబెట్టి వాటిని దైవమార్గంలో ఖర్చుచెయ్యరో వారికి బాధాకరమయిన యాతన యొక్క శుభవార్తనివ్వండి. (9 : 34)

దీనివల్ల, దైవం ఇలాంటి పరిస్థితిని ఏ మాత్రం ఇష్టపడడని ద్యోతకమవుతుంది. దివ్య ఖుర్ఆన్‌లో అనేకచోట్ల భోగవిలాసాలను, విలాస జీవితాన్ని తీవ్రంగా ఖండించడం జరిగింది:

> మేము ఏ బస్తీలోనయినా హెచ్చరిక చేసే ప్రవక్తని పంపినప్పుడు అక్కడి కలిగిఉన్నవారు సదా ఇదే అన్నారు - ఏ ఆదేశాలనయితే యిచ్చి నిన్ను పంపడం జరిగిందో మేము వాటిని తిరస్కరిస్తున్నాము. (34 :34)

> మేము ఒక బస్తీని నాశనం చెయ్యసంకల్పించినప్పుడు అక్కడి సంపన్నులవద్దకు ఆదేశాలు పంపుతాము. వారు ఆ ఆజ్ఞల్ని ఉల్లంఘిస్తారు. అప్పుడు ఆ బస్తీని శిక్షించాలన్న తీర్పు నిర్ధారితమవుతుంది. ఆ తరువాత మేము దాన్ని సర్వనాశనం చేసివేస్తాము. (17 :16)

> వామ పక్షీయులు, వామపక్షీయులు ఎంత నికృష్టమయిన వారు!వారు అగ్నిలోనూ మరిగే నీటిలోనూ ఇంకా నల్లటి పొగనీడలోనూ ఉంటారు. అది చల్లదనమూ ఇవ్వదు, హాయినీ ఇవ్వదు. ఈ ప్రజలు పూర్వం ప్రపంచంలో ఎంతో సంపన్నులుగా జీవించేవారు! (56:41-45)

మొత్తానికి, సామాజిక అన్యాయానికి, అక్రమానికి ఎదురు తిరిగి పోరాడకపోతే పర్యవసానంగా విచ్ఛిన్నం వినాశం తప్పమరేదీ ఉనికిలోకిరాదన్నది ఇస్లాం బోధన. అలాంటి ఇస్లాం, దైవప్రసన్నత కొరకు

ప్రజలు సామాజిక దౌర్జన్యానికి, అన్యాయానికి తలవంచాలని బోధిస్తుందని చెప్పడం కేవలం పట్టపగలును చిమ్మ చీకటిగా వర్ణించడమే. ఖుర్ఆన్ ప్రకారం, సామాజిక దౌష్ట్యాలు వ్యాపిస్తూ ఉండగా చూస్తూ ప్రతిఘటించకుండా ఉండటం వాస్తవానికి 'కుఫ్ర్' ఇస్లాంను తిరస్కరించడంతో సమానం. దాని ద్వారా దైవాగ్రహం భగ్గుమంటుంది. అలా చేసే జాతి ఏదయినాసరే అది ఆయన అభిశాపానికి, శిక్షకు యోగ్యతాపత్రం సంపాయించుకుంటుంది.

> బనీ ఇస్రాయీల్ (ఇస్రాయీల్ సంతతి) లో ఎవరయితే తిరస్కారమార్గాన్ని అవలంబించారో వారిపై దావూద్, మర్యం కుమారుడు ఈసా నోట శపించటం జరిగింది. ఎందుకంటే వారు తలబిరుసుతనం గలవారయ్యారు, అక్రమాలు చెయ్యసాగారు. వారు పరస్పరం చెడుచేష్టలనుండి వారించు కోవడం మానుకున్నారు. ఇది వారవలంబించిన అతి దుష్ట వైఖరి. (5:78,79)

దైవ ప్రవక్త (సఅసం) ప్రవచించారు:

> మీలో ఎవరయితే ఓ చెడు జరుగుతూ ఉండగా చూస్తాడో దాన్ని వారించడానికి కృషిచెయ్యాలి. జిహాద్ (అసత్యాన్ని ఎదిరించి చేసే పోరాటం) లో అత్యుత్తమ మయింది, దౌర్జన్యపరుడయిన పాలకుని ఎదుట సత్యవాక్కును పలకడం.

ప్రవక్త మహనీయులు నుడివిన ఈ రెండు ప్రవచనాలను పై ఆయత్లతో కలిపి పరిశీలించినట్లయితే వెల్లడి అయ్యే వాస్తవమేమంటే, సమాజంలో సామాజిక అన్యాయాలు, చెడులు తలెత్తుతున్నాయంటే పాలకులు న్యాయం, ధర్మం, నిజాయితీ మార్గాన్ని వదలి, విచ్చలవిడిగా విహరిస్తున్నారని అర్థం. ఇలాంటి పరిపాలకులను ఎదురొడ్డి పోరాడటం ముస్లిముల బాధ్యత. ఇదే దైవ ప్రసన్నత బడయటానికి మార్గం. అయితే ఇవన్నీ

ఉన్నప్పటికీ, ఇస్లాం సకల అన్యాయాలను అధర్మాలను శిరసావహించి భరించే బోధన చేస్తుందని ఎత్తిపొడిచే మేధావులు ఎలాంటి వారని చెప్పాలో!? ఇలాంటి మాటలు పలికే వారు, దురభిమానానికి పక్షపాతానికి లోనయి గుడ్డివారయినవారు లేదా తమ మనోకాంక్షల భావోద్రేకాల దాస్యంలో పడిపోయిన వారే కాగలరు. ఇలాంటి వారు ఇస్లాంకు ప్రతికూలంగా ఎన్నిరకాల అబద్ధాలనయినా ప్రచారం చెయ్యడానికి వెనకాడరు.

పై ఆయత్‌లలో మనిషిని ఊహాలోకాల్లో విహరించకుండా క్రియాశీల జీవితంలో బ్రతకడానికి బోధించడం జరిగింది. సృజనాత్మక కృషిలో పాల్గొనేందుకు ప్రోత్సహించడం జరిగింది. అదే సమయంలో, రాజ్యం, సమాజం, జాతి ఇవన్నీ సహజసిద్ధమయిన వాస్తవాలని, మనిషి తలచినా వాటిని అంతమొందించలేడని, అందువల్ల వాటిని గుర్తించి తదనుగుణంగానే తన వైఖరిని మలచుకోవాలని ఉద్బోధిస్తుంది.

## సంతృప్తే సదా వాంఛనీయం

ఊహాలోకాల్లో ఆకాశహర్మ్యాలు నిర్మించి విహరించడం వల్ల నష్టంతప్ప ప్రయోజనం ఏమీ ఉండదు. ప్రపంచంలో కొందరు దైవదత్తమయిన శక్తి సామర్థ్యాలు కలిగి ఉంటారు. వాటి కారణంగా వారికి పేరు ప్రతిష్ఠలూ, గౌరవమర్యాదలూ లభిస్తాయి. దీనికి భిన్నంగా కొందరు పేరు ప్రతిష్ఠలకై, గౌరవమర్యాదలకై ప్రాకులాడుతారు; కాని వారిలో కావలసిన శక్తి సామార్థ్యాలూ, దక్షతా ఉండవు. ఇలాంటివారి నిరాధారమయిన కోరికలకు ఏ రాజ్యవ్యవస్థ అయినా ఏమీ చెయ్యలేదు, వారిలో పెరిగి పెను భూతాల్లా తయారయ్యే ఈర్ష్యాద్వేషాల్లాంటి విభిన్న మానసిక రుగ్మతల్ని నివారించనూ లేదు.

మరో ఉదాహరణను గమనించండి. ఇద్దరు మహిళల్లో ఒకావిడ రూపసి, సుకుమారి, మూర్తీభవించిన సౌందర్యరాశి. మరొకావిడకు రూపమూలేదు, దర్పమూలేదు మరే సుగుణమూలేదు. అయినా ఈ రెండో ఆవిడ తన 'సౌందర్యాన్ని' ప్రజలు కొనియాడాలని, తాను అందరిదృష్టికీ

కేంద్రమవ్వాలని కలలు కంటుంది. అయితే ఏ రాజ్యవ్యవస్థ అయినా ఈ ఉభయుల అందచందాలను, మనోజ్ఞతను ఒకేస్థాయికి తీసుకురాగలదా? ఇద్దరి మధ్య సామ్యం, సమానత్వం సాధ్యమవుతుందా?

ఇలాగే రెండు పెళ్ళయిన జంటల్ని తీసుకోండి. ఒక జంటలో దంపతులు అన్యోన్యానురాగంతో, ప్రేమానందడోలికలూగుతున్నారు. అందమయిన ఆరోగ్యవంతమయిన సంతానమూ వారికి ఉంది. వారి దాంపత్యం, జీవితానికి సొగసు, శాంతి, సంతోషాలను పంచిపెడుతోంది. రెండవ జంట దీనికి పూర్తిగా విరుద్ధంగా ఉంది. ప్రేమానురాగాలే లేవంటే, అనేక చికిత్సలు చేసినప్పటికీ సంతాన ప్రాప్తి యోగంలేదని పెదవి విరిచేశారు డాక్టర్లు. ఇక ప్రపంచంలోని శక్తులన్నీ ఏకమయి ఈ దంపతుల మధ్య ఆనందాన్ని దాపంత్య జీవితపు మాధుర్యాన్ని సృష్టించగలవా? ఏ రాజకీయ వ్యవస్థ అయినా వీటికి హామీ నివ్వగలదా?

చెప్పవచ్చిందేమంటే మానవ జీవితంలో ఎన్నోకోణాలు కేవలం ఆర్థిక పరిష్కారం వల్లనే, సామాజిక న్యాయంవల్లనే పరిపూర్ణం కాజాలవు. ఇలాంటి పరిస్థితులన్నింటిలోనూ మనిషికి సమంజసమయిన, వివేకవంతమయిన మార్గం ఒక్కటే - దైవ నిర్ణయాన్ని సహించడం, దాన్ని నిండు గుండెలతో భరించడం; సంతృప్తిని, సంతుష్టిని తన విధానంగా మలచుకోవడం; ఇంకా మనిషికి దైవం ప్రసాదించిన ప్రమాణాలు భౌతిక ప్రమాణాలకు భిన్నమయినవని, వాటి ప్రకారం, ప్రపంచపు కొరతలు, పరలోక సౌఖ్యాల రూపంలో పూర్తయ్యే అవకాశం మెండుగా ఉందని తెలుసుకోవడం.

## సంతృప్తి - పోరాటం

కేవలం ఆర్థిక, సామాజిక దృక్కోణం ప్రకారం కూడా, ఈ ప్రపంచంలో పరిపూర్ణ సమానత్వం సంభవమని ఎవరనగలరు? వేతనాలు, హోదా రీత్యా పరస్పరం సర్వ సమానమయిన ప్రజలుండే దేశం ప్రపంచ మంతటా వెదికినా ఒక్కటీ కానరాదు. సోవియట్ రష్యా తాను సంపూర్ణ

సమానత్వాన్ని నెలకొలిపినట్లు దావా చేస్తుంది. అయితే అక్కడ సామాజిక హెచ్చుతగ్గుల్లేవా? ఉదాహరణకు రష్యాలో ఒక వృత్తి పనివాడు పైకి ఎగబ్రాగాలని, ప్రగతి సాధించాలని బలీయమయిన కోరిక పెంచుకుంటాడు. అతను ఇంజనీయర్ కావాలని ఉబలాట పడతాడు. కాని సకల సౌకర్యాలున్నా అవకాశాలున్నా తన లక్ష్యసాధనలో తన అసంపూర్ణమయిన బుద్ధీ కుశలతవల్ల ముందుకు సాగలేడు. అలాంటి సందర్భంలో రాజ్యవ్యవస్థ ఏం చెయ్యగలదు? అలాగే ఒక కార్మికుడు బలహీనుడయి ఉండీ తాను చెయ్యలేని ఓవర్టైం చెయ్యాలను కుంటే రాజ్యవ్యవస్థ అతని కొరకు చెయ్యగలిగిందేముందనీ? ఇలాంటి విషయాల్లో రాజ్యవ్యవస్థ ఏమీ చెయ్యజాలదన్నది సుస్పష్టం. ఇలాంటి వారంతా కేవలం కోరికల మేడల్లో నివసిస్తూ క్రియాజీవితంలో అశక్తులయి క్రియా శూన్యులయి ఉన్నట్లయితే వారి జీవితాలు, శాశ్వత అసంతృప్తి, విచారం, తీరని కోరికల నిస్పృహ, ఈర్ష్యాద్వేషాల బందిఖానా నుండి ఎన్నటికీ విముక్తం కాజాలవు. ఇలాంటి వ్యక్తులు తమ విధి నిర్వహణలో కూడా వెనుకబడి ఉంటారు. అధికార పిపాస, ధనపేరాశలు వారి జీవితాలనుండి సుఖశాంతుల్ని దూరంచేసి వేస్తాయి. అయితే ఇప్పుడు ఒకప్రశ్న. ఇలాంటి భావాలను, రోగాలను బలవంతంగా, హింసా దౌర్జన్యాల ద్వారా అణచడం ఉత్తమమా? లేక మనిషి తన అంతరంగ పరివర్తనల ద్వారా, ప్రేరణల ద్వారా సంకల్పం ద్వారా వాటిని అదుపులోకి తెచ్చుకోవడం మంచిదా? పైన పేర్కొన్న ఆయత్లలో సహనం, దైవంపట్ల కృతజ్ఞతాభావం, సంతృప్తిని బోధించడంలోగల మర్మహేతువు ఇదే.

ఇదీ ఇస్లాం బోధనల సారం. అది మనిషి యొక్క న్యాయబద్ధమయిన కోరికలు, అవసరాలు అన్నింటికీ అవకాశం కల్పిస్తుంది. వాటి పరిపూర్తి కొరకు మార్గాలు సూచిస్తుంది. దీనికి తోడుగా మనిషి అధీనంలో లేని వాస్తవ విషయాలను పరిగణనలోకి తీసుకోవాలని అంటుంది. అయితే ఎక్కడయినా అన్యాయం, అత్యాచారాలు జరుగుతూ ఉంటే వాటిని వారించడం, సాధ్యమయితే వాటిని నిర్మూలించటం మనిషి శాయశక్తులా చెయ్యవలసిన కృషి అని, దాన్ని అతని దైవ విశ్వాసానికి, దైవప్రసన్నతా

కాంక్షకు గీటురాయి అనీ అంటుంది.

> మరెవరయినా దైవమార్గంలో పోరాడి హతుడయినా లేదా విజయుడయినా మేము అతనికి తప్పనిసరిగా మహోన్నతమయిన ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాము.
> (4:74)

ప్రపంచంలో ఏ మతానికయినా 'మనిషికి ఇది మత్తు మందులాంటిది' అని చెప్పదలిస్తే అలాంటి మతం ఇస్లాం మాత్రం కాదు. ఎందుకంటే అది అన్యాయాలు, అక్రమాలను సకలరూపాల్లోనూ తుదముట్టించాలని కోరుతుంది. వాటికి తల ఒగ్గేవారు, రాజీపడేవారు బాధాకరమయిన యాతనకు గురికావలసి ఉంటుందని భావిస్తుంది.

# 15. ముస్లిమేతర అల్పసంఖ్యాకులు

కొందరి దృష్టిలో ఇస్లామీయ రాజ్యంలో ముస్లిమేతర అల్పసంఖ్యాకుల విషయం చాలా నాజూకయిన విషయం. ఎందుకంటే దాన్ని కదిలిస్తే ముస్లిములూ ముస్లిమేతరుల మధ్య విద్వేషం చెలరేగే ప్రమాదముంది. అందువల్ల వీరు అసలు ఆ విషయాన్ని ప్రస్తావించడానికే జంకుతారు.

## సమాన హక్కులు

కాని మేము ప్రాగ్దేశాల్లో ఉన్న క్రైస్తవుల్ని (ముస్లిమేతరుల్ని) ఈ విషయాన్ని స్పష్టంగా అడగదలిచాము. వారికి ఇస్లామీయ ప్రభుత్వం అంటే భయం దేనికి? వారు ఇస్లామీయ శాసనాలంటే భయపడుతున్నారా? లేక క్రియాత్మక జీవితంలో వాటి అన్వయం గురించి భయపడుతున్నారా? ఖుర్ఆన్ ఆదేశాలకై మేము వారిని దిగువ ఆయత్‌లను పరిశీలించమని విజ్ఞప్తి చేస్తున్నాము.

> ఎవరయితే ధర్మం విషయంలో మీతో పోరాడలేదో, మిమ్మల్ని ఇండ్ల నుండి వెళ్ళగొట్టలేదో వారి ఎడల మీరు మంచిగా ప్రవర్తించడాన్ని, న్యాయవంతంగా వ్యవహరించడాన్ని అల్లాహ్ కాదనడు. అల్లాహ్ న్యాయశీలురయిన వారిని ఎంతో ప్రేమిస్తాడు. (60 : 8)

> నేడు మీ కొరకు పరిశుద్ధమయిన వస్తువులు హలాల్ (ధర్మసమ్మతం) చెయ్యబడ్డాయి. గ్రంథం గలవారు జిబహ్ చేసింది మీకు హలాల్‌గాను మీరు జిబహ్ చేసింది వారికి హలాల్ గానూ చెయ్యటం జరిగింది. ముస్లిములయిన శీలవతులే కాదు గ్రంథంగల వారి శీలవతులు కూడా (మీకు వివాహానికి హలాల్ చెయ్యబడ్డారు) (5 : 5)

ఇస్లామీయ ధర్మశాస్త్రంలో సామాన్యనియమం ఏమిటంటే ముస్లిమేతరులకు కూడా ముస్లిముల హక్కులే వర్తిస్తాయి. విధులూ బాధ్యతలు కూడా వారికీ ముస్లిములకు సమంగా వర్తిస్తాయి. దివ్య కుర్ఆన్ లోని పై ఆధారాలు ముస్లిమేతరులతో మంచిగా ఉత్తమ రీతిలో వ్యవహరించాలని, వారి విషయంలో న్యాయంగా నడచుకోవాలని ఇంకా ఆరాధనలకు సంబంధించని విషయాల్లో, సామాజిక పౌర సంబంధమయిన హక్కుల విషయాల్లో ముస్లిములకు, వారికీ మధ్య సమానతను, సమతను స్థాపించాలని ఆదేశిస్తున్నాయి. పైగా అవి, పరస్పర సమావేశాలు, సమిష్టి భోజనాల ద్వారా ముస్లిములు, ముస్లిమేతరుల మధ్య ప్రేమైక సంబంధాలను పటిష్టపరచాలని కోరుతున్నాయి. వీటన్నింటినీ మించి వివాహ సంబంధాల్లాంటి గట్టి సంబంధాలు కూడా నెలకొనే అవకాశమూ లేకపోలేదు.

## పాశ్చాత్య సాక్ష్యం

ఇస్లాం ప్రబోధించే ఈ బోధనల్ని ఎంతవరకు అమలు జరుపుతున్నారు అన్న విషయంలో మేము స్వయంగా ఏదయినా చెప్పడానికి బదులుగా యూరపుకు చెందిన క్రైస్తవ శాస్త్రవేత్తను ఉదాహరించదలిచాము. వారు ఇస్లాంను నిరాధారంగా సమర్థిస్తారని, లేక ఇస్లాం పట్ల గుడ్డి నమ్మకం, దురభిమానాలకు గురయి ఉంటారనీ ఎవరూ అనలేరు. సర్ ఆర్నాల్డ్ తన గ్రంథం (THE PREACHING OF ISLAM) లో ఇలా వ్రాస్తున్నాడు:

> ఆ కాలంలో క్రైస్తవులూ ముస్లిముల మధ్య ఉన్న సత్సంబంధాల ద్వారా కూడా, వారు ఇస్లాం స్వీకరించింది ఎలాంటి ఒత్తిడీ బలాత్కారాల ఫలితంగా కాదని ద్యోతకమవుతుంది. స్వయంగా ముహమ్మద్ (సఅసం) అనేక క్రైస్తవ తెగలతో ఒడంబడికలు చేసుకున్నారు. వాటిననుసరించి ఆయన వారి రక్షణాభారం తమపైనే వేసుకున్నారు, వారికి తమ మతాన్ని స్వేచ్ఛగా

అవలంబించేందుకు కావలసిన వసతులు కల్పించే హామీనిచ్చారు. వారి మత గురువులకు, ఇస్లాం ఆగమనానికి పూర్వం ఉన్న హక్కులూ అధికారాలను యధాతథంగా ఉండనిచ్చారు. (పుట : 48)

ఆ పైన ఆయన ఇలా వ్రాశాడు :

హిజ్రీ శకం మొదటి శతాబ్దికి చెందిన ముస్లిం విజేతలు అరబ్బు క్రైస్తవుల పట్ల కనబరచిన మత సహన వైఖరి, దాన్ని ఆ తరువాత వచ్చిన తరాలు కొనసాగించిన తీరు వీటిని చూచి, ఏ క్రైస్తవ తెగలయితే ఇస్లాం స్వీకరించారో వారు ఎలాంటి ఒత్తిడికి లోనవకుండా తమ ఇష్టపూర్వకంగా, మనస్ఫూర్తిగా స్వీకరించారని మనం గట్టిగా చెప్పగలము.. (పుట : 51)

ముస్లిముల సైన్యాలు జోర్డాన్ లోయలోకి చేరినప్పుడు అబూ ఉబైదా (రజిఅన్) ఫహిల్ అనేచోట తన గుడారం వేయించారు. అప్పుడు ఆ ప్రాంతపు క్రైస్తవులు అరబ్బులకు వ్రాశారు "ముస్లిములారా! మేము బాజ్‌నతీనుల కన్నా - వారు మా స్వమతస్థులే అయినా - ప్రాధాన్యతనిస్తాము. ఎందుకంటే మీరు మాతో చేసుకున్న ఒడంబడికను ఎంతో ఉదారంగా పాటించారు. మా ఎడల మరింత దయతో వ్యవహరించారు. ఎలాంటి అన్యాయానికి ఒడిగట్టలేదు. మాకు వారి పరిపాలనకంటే మీ పరిపాలనే నచ్చింది. వారు మా వస్తుసామగ్రిని, మొత్తం ఇండ్లనే దోచుకున్నారు.' (పుట : 55)

సర్ ఆర్నాల్డ్ ఇంకా ఇలా వ్రాశారు :

> సిరియా రాష్ట్రంలో ప్రజల భావాలు అలా ఉండేవి. హి.శ. 633-639 మధ్యన జరిగిన పోరాటాల్లో అరబ్బులు రోమనులను క్రమేణ సిరియా నుండి వైదొలగించారు. హి.శ. 637 లో అరబ్బులతో డెమాస్కస్‌కొన్నినిబంధనల మేరకు సంధి ఒడంబడిక చేసుకున్నప్పుడు, కేవలం దాడి నుండి రక్షణ పొందడమే కాక అనేక ప్రయోజనాలను కూడా పొందడం జరిగింది. ఆ తరువాత వెనువెంటనే సిరియా నగరాలన్నీ ఈ విధానాన్నే అనుసరించాయి. హమ్స్ (EMESSA) ఆర్థుసా (ARTHUSA) అరెథుసా (ARE-THUSA) హీరో పోలిస్ (HERO POLIS) ఇంకా ఇతర నగరాలు కూడా ఒకదాని తరువాత మరొకటి ఒడంబడికలు చేసుకుని అరబ్బుల సామంత రాజ్యాలయ్యాయి. ఎరుషలేం పవిత్ర పాదిరి (PATRIARCH) కూడా ఇలాంటి షరతుల ప్రకారం నగరాన్ని ముస్లిములకు అప్పగించాడు. విశ్వాసహీనుడయిన చక్రవర్తి చేసే మతపరమయిన బలాత్కారం సమక్షంలో ముస్లిముల మతసహనం వారికి ఎంతో మేలనిపించింది. దండయాత్ర చేసిన సైన్యాల ప్రారంభ భయ తరంగం ఉపశమించిన తరువాత వారిలో అరబ్బు విజేతల అభిమానంలో ప్రగాఢ భావపరమయిన స్పందన ఏర్పడసాగింది. (పుట : 55)

ఇది ఒక క్రైస్తవ పండితుని సాక్ష్యం. ఇస్లామీయ ప్రభుత్వం పట్ల ఇది విన్న తరువాత కూడా ముస్లిమేతరులు, క్రైస్తవులు ఇస్లామీయ వ్యవస్థ విషయంలో ఇంకా భయపడడానికి కారణమేముంటుందని?

## మత మౌఢ్యానికి నిజభావం

కొందరు ముస్లిముల 'మతపిచ్చి' వల్ల భీతిల్లుతున్నారేమో. ఇదే నిజమయితే వారు మత దురభిమానం అంటే ఏమిటో మత మౌఢ్యం అంటే ఏమిటో తెలుసుకోవలసిన అవసరం ఎంతయినా ఉంది. వారు ఈ మాటల నిజభావాన్ని తెలుసుకోదలిస్తే దిగువ పేర్కొన్న దృష్టాంతాల ద్వారా అది బాగా బోధపడుతుంది.

చర్చ్ వ్యవస్థ మతపరమయిన న్యాయ స్థానాలను (INQUISITION COURTS) నెలకొల్పింది. వాటి అసలు ఉద్దేశ్యం స్పెయిన్ ముస్లిముల నిర్మూలన. ఈ న్యాయ స్థానాలు ముస్లిములకు భయంకరమయిన శిక్షలు విధించాయి. వారిని బాధించేందుకు అవలంబించిన జుగుప్సాకరమయిన పద్ధతులు అంతకు పూర్వం ఎవరూ కనీ వినీ ఎరుగనివి. వారు ముస్లిముల్ని సజీవ దహనం చేశారు. వారి గోళ్లను వ్రేళ్ళనుండి వేరుచేసి వేశారు. కళ్ళు పీకి పారేశారు. అంగాలు వేర్వేరుగా నరికి వేశారు. ఇదంతా చేసింది దేనికి? ముస్లిములు తమ ధర్మానికి విముఖులయి క్రైస్తవంలోని ఓ ప్రత్యేక నమ్మకం గల వర్గంలో చేరాలని. ఇస్లామీయ రాజ్యాల్లో నివసించే క్రైస్తవులు ఇలాంటి ప్రవర్తన ఎప్పుడయినా కన్నారా? విన్నారా?

నేటికీ దురభిమాన క్రుళ్ళులో మ్రగ్గే యుగస్లావియా, అల్బానియా, రష్యా లేక యూరపు అధికార ప్రభావం క్రింద ఉన్న దేశాలయిన ఉత్తర ఆఫ్రికా, సొమాలిలేండ్, కెన్యా, జెంజిబార్, తదితర దేశాల్లో ఒక్కోసారి శాంతిభద్రతల పేరున, మరోసారి జాతి పారిశుధ్యం పేరిట ముస్లిముల నరమేధం జరుగుతూనే ఉంటుంది.

మత దురభిమానానికి మరో ఉదాహరణ ఇథియోపియా; ఇది ప్రాచీన కాలం నుండి ఈజిప్ట్‌తో చారిత్రక, భౌగోళిక, సాంస్కృతిక మతపరమయిన సంబంధాలు కలిగి ఉంటోంది. ఇందులో ముస్లిములూ

క్రైస్తవుల మిశ్రమ జనాభా ఉంది. ముస్లిములు మొత్తం జనాభాలో 35 శాతం ఉన్నారు. అయినప్పటికీ దేశం మొత్తాన వారి బాలలకు ఇస్లామీయ బోధనలు, లేక అరబీ భాష బోధించే ఏర్పాటు గల ఒక్కటంటే ఒక్క పాఠశాల కూడా లేదు. ముస్లిములు తమ సొంత కృషితో తెరచుకున్న కొన్ని ప్రయివేటు పాఠశాలలపై కూడా భారీ పన్నులు విధించారు. వాటికై రకరకాల ఇబ్బందుల్ని సృష్టిస్తుంటారు. ఫలితంగా ఆ పాఠశాలలు మూసివెయ్యవలసి వస్తుంది. తరువాత కొత్తగా పాఠశాలలు తెరిచే ధైర్యం ఎవరికీ కలగదు. అక్కడ, ఇస్లామీయ విద్యాబోధన ఏమాత్రం వృద్ధిచెందకుండా ఉండేందుకు కృషి జరుగుతోంది. ఆ కాస్త జరిగే బోధన కూడా పురాతనమయిన, అన్నిటా విసర్జించబడుతున్న విద్యా విధానాల స్థాయి నుండి పైకి ఎదగకుండా ప్రయత్నాలు సాగుతున్నాయి.

ఇటాలియన్ దాడికి పూర్వం ఇథియోపియాలో, ఒక ముస్లిం ఋణగ్రస్తుడు క్రైస్తవ ఋణదాతకు నిర్ణీత కాలంలో ఋణం చెల్లించకపోతే ఋణదాత అతన్ని బానిసగా చేసుకునేవాడు. ఈ విధంగా ప్రభుత్వం కళ్ళముందరే ముస్లిములను బానిసలుగా చేసి అమ్మేవారు. వారిని రకరకాల యాతనలకు, చిత్రహింసలకు గురిచేసేవారు. ముస్లిములు జనాభాలో మూడోవంతుకు పైగా ఉన్నా వారి ప్రాతినిధ్యానికి క్యాబినెట్‌లో ముస్లిమ్ మంత్రి ఒక్కడూ లేడు. ఇంకా పరిపాలనా వ్యవస్థలోనూ ముఖ్యమయిన పదవుల్లోనూ ముస్లిమ్ వ్యక్తి ఒక్కడయినా లేడు. ఇస్లామీయ దేశాల్లో నివసించే క్రైస్తవులు ఇలాంటి వ్యవహారాన్ని ఎప్పుడయినా చవిచూశారా? నేడు వారి స్వమతస్థులు ముస్లిముల ఎడల ఎలా వ్యవహరిస్తున్నారో తమపట్ల అలాంటి ప్రవర్తనకు వారు ఇష్టపడతారా?

ఇదే మత దురభిమానం, మతమౌఢ్యం అంటే నిజమయిన అర్థం!

కమ్యూనిస్టుల దృష్టిలో - ఆర్థిక స్వేచ్ఛే జీవిత పరమార్థం. ఒకవేళ కాస్సేపటికి ఈ తర్కాన్ని ఒప్పుకున్నా ఇస్లామీయ దేశాల్లో నివసించే క్రైస్తవులు జీవితంలో ఈ ప్రమాణాన్ని ఏ మాత్రమయినా కోల్పోయ్యారా?

ఎప్పుడయినా ఇస్లామీయ ప్రభుత్వాలు, వ్యక్తిగత ఆస్తుల్ని, వ్యాపార లావాదేవీలను, ధనసముపార్జనను, సంపదను కూడబెట్టడాన్ని నిషేధించాయా? కేవలం మతం వేరయినందువల్ల వారికి విద్య,హెూదా ప్రభుత్వ ఉద్యోగాలు, ఉన్నత పదవులు పొందకుండా చేశాయా?

## మత స్వేచ్ఛ

ఇకపోతే నైతిక, ఆధ్యాత్మిక విషయాలకు సంబంధించినంతవరకు ఇస్లామీయ దేశాల్లో క్రైస్తవులకు ఎన్నడూ 'సంప్రదాయ సిద్ధమయిన' మతపరమయిన హింస (PERSECUTION) ఎదురవలేదు. ఈ మధ్యన వివిధ వర్గాల మధ్య వైషమ్యాలు పెంచే ఉద్దేశ్యంతో ఇంగ్లీషు వాళ్ళు ప్రోత్సహించిన ఇలాంటి ఉదంతాలు అక్కడక్కడ వినవచ్చినా వాటికై ముస్లిముల్ని నిందించడం అర్ధరహితం.

కొందరు ఇస్లాం విరోధులు జిజ్‌యాను ఉదాహరిస్తూ, ముస్లిమేతరులనుండి దాన్ని వసూలు చేయడానికి అసలు కారణం మతపరమయిన అసహనం అని ఆరోపిస్తారు. దీనికి అత్యుత్తమ రీతిలో సర్ ఆర్నాల్డ్ సమాధానమిచ్చారు. ఆయన తన గ్రంథం (PREACHING OF ISLAM) లో ఇలా వ్రాశాడు :

> "దీనికి భిన్నంగా, ఈజిప్ట్ ముస్లిం రైతాంగానికి సైనిక సేవ విషయంలో వినాయింపు ఇచ్చినప్పుడు దానికి బదులుగా వారిపై కూడా, క్రైస్తవులకు విధించేటటువంటి పన్నునే విధించేవారు. (పుట : 63)

ఆ పైన ఆయన ఇంకా ఇలా వ్రాశారు :

> "పైన పేర్కొన్న విధంగా జిజ్‌యా అన్నది ఆరోగ్యవంతులయిన పురుషులపై విధించబడేది. ముస్లిముల

> విషయంలోనయితే, వారు నిర్వర్తించవలసిన సైనిక బాధ్యతలకు బదులుగా విధించబడేది. మరోవిషయం గమనార్హమయింది. క్రైస్తవులు ముస్లిముల సేనలో పాల్గొని; సైనిక సేవ చేసినప్పుడు వారికి ఇలాంటి పన్ను నుండి మినహాయింపు లభించేది. కనుక అన్తాకియా (ANTI-OCH) పరిసర గ్రామాల్లో నివసించే అల్‌జూరాజిమ క్రైస్తవ తెగతో ముస్లిములు చేసుకున్న ఒప్పందం ప్రకారం వారు యుద్ధంలో ముస్లిముల తరఫున పోరాడతారని, దానికి బదులుగా వారిపై జిజ్‌యా విధించడం జరగదని, పైగా యుద్ధ ప్రాప్తినుండి వారికి వాటా కూడా ఇస్తారని షరతులు నిర్ణయమయ్యాయి."
>
> (పుట : 62)

దీనివల్ల స్పష్టంగా తెలిసిందేమంటే జిజ్‌యా, ముస్లిముల పరమత అసహనం కారణంగా విధించబడదు. అది ఒక రకమయిన పన్ను. ఎవరయితే అవసరమేర్పడినప్పుడు సైనిక సేవలో పాల్గొనలేరో అలాంటి వారందరినుండి కుల మత విచక్షణ లేకుండా వసూలు చేసే పన్ను. ఈ విషయంలో ఖుర్‌ఆన్ ఆయత్‌ను ఒకసారి పరిశీలించడం ఉత్తమం.

> గ్రంథం కల వారిలో ఎవరయితే అల్లాహ్‌ను, అంతిమదినాన్ని విశ్వసించరో, అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త హరామ్‌గా నిర్ణయించిన వాటిని హరామ్‌గా నిర్ణయించరో సత్యధర్మాన్ని తమ ధర్మంగా చేసుకోరో అలాంటి వారితో యుద్ధం చెయ్యండి. వారితో పోరాడండి - వారు తమ చేతులతో జిజ్‌యా ఇచ్చే అధీనులయి ఉండేవరకు. (9 : 29)

ఈ ఆయత్‌లో ముస్లిములను కేవలం ఇస్లాంకు విరుద్ధంగా నడుంకట్టే ముస్లిమేతరులతో మాత్రమే యుద్ధం చెయ్యాలని ఆదేశించడం జరిగింది. ఈ ఆదేశంతో ముస్లిమ్ దేశాల్లో నివసించే ముస్లిమేతర పౌరులకు ఎలాంటి

సంబంధం లేదు.

చివరన మేము మరో యదార్థాన్ని కూడా విశదపరచదలిచాము. ముస్లిములు, ఇస్లామీయ దేశాల్లోని ముస్లిమేతర పౌరుల మధ్య ప్రస్తుతం తలెత్తిన విద్వేష వైషమ్యాల వాతావరణం, వలస సామ్రాజ్యవాదులు, కమ్యూనిస్టులూ సృష్టించిందే కాని మరేమీ కాదు.

## కపట నాటకం

కమ్యూనిస్టులకు అటు ముస్లిముల అవసరాలు ఇటు క్రైస్తవుల బలహీనతలు బాగా తెలుసు. వారు కార్మికుల్ని కలుసుకున్నప్పుడు - "మీరు కమ్యూనిస్టు ఉద్యమానికి తోడుగా వస్తే మేము కార్ఖానాలన్నీ మీకే అప్పజెప్పుతాము" - అనంటారు. రైతులకు భూములపై అధికారం అనుగ్రహిస్తామని అరచేతిలో పచ్చని తోటలు చూపిస్తారు. నిరుద్యోగులయిన గ్రాడ్యుయేట్లను చూస్తే, "మీరు గనక కమ్యూనిజాన్ని స్వీకరిస్తే మీ అందరికీ మీ సామర్థ్యాలను బట్టి ఉద్యోగాలు కల్పిస్తాము" అని ఊహాసౌధాలు చూపుతారు. లైంగికబలహీనతలకు గురయిన యువకుల్ని చూసి ఉదార సమాజాన్ని (PERMISSIVE SOCIETY) స్థాపించే వాగ్దానాలు చేస్తారు, అక్కడ ఎలాంటి చట్టపరమయిన, సంప్రదాయాల అవరోధాలు లేకుండా వారి కోరికలు ఈడేరుతాయని కాంక్షలు రేపుతారు.

మరోవైపున క్రైస్తవుల్ని కలుసుకున్నప్పుడు వారితో, 'మీరు కమ్యూనిజాన్ని బలపరిస్తే మేము మానవుల మధ్య మతం ఆధారంగా విభేదాలు సృష్టించే ఇస్లాంను రూపుమాపుతాము' అనంటారు.

> పెద్ద మాట వారి నోటినుండి వెలువడుతుంది. వారు వాగేదంతా కేవలం బూటకం. (5 : 18)

ఇస్లాం, మతం పునాదిగా మనుషుల మధ్య విభేదాన్ని సృష్టిస్తుందనడం నీలాపనింద అని మాత్రమే అనగలం.- ఎందుకంటే ఇస్లాం మతమూ

విశ్వాసాల విచక్షణ లేకుండా మానవులందరికీ వారి ప్రాథమిక హక్కులనిస్తుంది. అది మానవుల్ని ప్రత్యేకంగా మానవత ఆధారంగానే ఏకం చెయ్యగోరుతుంది. వారు తమకు ఇష్టమయిన మతాన్ని స్వీకరించి పాటించే పరిపూర్ణ స్వేచ్ఛను కల్పిస్తుంది.

అందువల్ల క్రైస్తవ సోదరులు కూడా తమ తోటి సోదరులతో శాంతి పూర్వక వాతావరణంలో నివసించాలనే కోరుకుంటారని మేము విశ్వసిస్తున్నాము. వారి ప్రయోజనాలూ ముస్లిముల ప్రయోజనాలూ సురక్షితంగా ఉండాలని కూడా వారు కోరుకుంటారనే మా నమ్మకం. కమ్యూనిస్టుల, సామ్రాజ్యవాదుల ఆగడాలకు వంచనా శిల్పానికి లొంగిపోరని ఆశిస్తున్నాము.

# 16. ఇస్లాం మరియు కమ్యూనిజం

"ఇస్లాం, జీవితానికి సంబంధించిన సకల సద్గుణాలు, సమస్త సద్భావాలూ, ఆరోగ్యవంతమయిన విలువలు కల ధర్మం. ఇది శాశ్వత ప్రాతిపదికపై అన్ని తరాలకు, సర్వ సమాజాలకు వర్తించే జీవన నియమావళి. కాని గత నాలుగు దశాబ్దాలుగా ఇస్లామీయ సమాజం కల్లోలానికి లోనయి ఉండటం కారణంగా ఇస్లామీయ శాసనాంగంలోని ఆర్థిక అంశాలు స్తబ్దతకు, గమన రాహిత్యానికి గురయ్యాయి. నిరంతర పరిణామగతిని కొనసాగించలేకపొయ్యాయి. అందువల్ల ఆధ్యాత్మిక, చింతనాత్మకమయిన పవిత్రత కొరకు మనం ఇస్లాం విశ్వాసాన్ని అంగీకరించి, ఆర్థిక సమస్యల్లో కమ్యూనిజాన్ని అవలంబించడం భావ్యం కాదా? ఈ విధానంవల్ల మన ఆర్థిక సమస్యలూ తీరిపోతాయి, మన సామాజిక వ్యవస్థపై ఎలాంటి చెడు ప్రభావమూ పడదు. ఈ విధంగా మనం కేవలం మన నైతిక, సామాజిక సంప్రదాయాలను, విలువల్ని కాపాడుకోవడమే కాక మన సమకాలీన అత్యుత్తమ ఆర్థిక సిద్ధాంతాన్నీ వినియోగించుకోగలుగుతాము."

## సరికొత్త హేతువు

ఇది కమ్యూనిస్టు పెద్ద మనుషుల సరికొత్త ప్రియాతిప్రియమయిన తార్కిక విధానం. ప్రథమంలో వారు ఇస్లాంను వ్యతిరేకిస్తూ బాహాటంగా ధ్వజమెత్తారు, దాడులు చేశారు. ఇస్లాంపై రకరకాల అభ్యంతరాలు లేవనెత్తి దాని విలువను తగ్గించడానికి ప్రయత్నించారు. కాని దానివల్ల ముస్లిముల్లో ఇస్లామీయ భావన ఇంకా దృఢతరమయిందన్న సత్యాన్ని గుర్తించి వారు తమ విధానాన్ని మార్చుకున్నారు. వంచనా శిల్పంతో,

మోసంతో పనిచెయ్యనారంభించారు. కనుక వారు అవలంబించిన తార్కిక విధానం ఇలా సాగుతుంది: "కమ్యూనిజం మీ ఇస్లాంలో ఏ మాత్రం జోక్యం కల్పించుకోదు. ఎందుకంటే కమ్యూనిజం మౌలికంగా సాంఘిక న్యాయానికై మాత్రమే పాటుపడుతుంది. అది రాజ్యానికి, దాని పౌరుల ప్రాథమిక అవసరాలకు సంబంధించిన బాధ్యతల్ని గుర్తు చేస్తుంది. దీని దృష్ట్యా, ఇస్లాం కమ్యూనిజానికి వ్యతిరేకమని అంటే ప్రపంచం ఏమంటుంది? ఇస్లాం సాంఘిక న్యాయానికి వ్యతిరేకమని ఎత్తిపొడవదా? వాస్తవానికి ఇస్లాం సాంఘిక న్యాయానికి వ్యతిరేకం కాదు. ఇంకా సాంఘిక న్యాయాన్ని చేకూర్చే జీవన వ్యవస్థనూ అది వ్యతిరేకించదు."

ఈ వంచనతో కూడుకున్న తార్కిక విధానం పాశ్చాత్య సామ్రాజ్యవాదుల తర్కానికి ఏమాత్రం భిన్నమయింది కాదు. కమ్యూనిస్టుల మాదిరిగానే సామ్రాజ్యవాదులు కూడా ప్రారంభంలో బాహాటంగానే దాడులు జరిపారు. దీనివల్ల ముస్లిముల్లో ఇంకా జాగృతి వచ్చిందన్న విషయాన్ని గమనించగానే వారు తమ టెక్నిక్‌ని మార్చుకున్నారు. ఇప్పుడేమంటున్నారంటే, "పాశ్చాత్యులు, ప్రాగ్దేశాలకు నాగరికత నేర్పాలని మాత్రమే అనుకుంటున్నారు. అందువల్ల సకల నాగరికతలకు పునాది అయిన ఇస్లాం, నవ నాగరికతను ఎన్నటికీ వ్యతిరేకించదు." వారు ముస్లిములతో, "మీరు మీ నమాజులు(ప్రార్థనలు), రోజాలు (ఉపవాసాలు) సాధనలు - వీటన్నింటిలో నిమగ్నులయి ఉంటూ నవ నాగరికతనూ స్వీకరించగలరు." నిజానికి వారికి తెలుసు, ఒక్కసారి ఆ నాగరికత ముస్లిముల్లో చోటు చేసుకుందంటే, ఇక తమ ఇస్లామీయ స్వరూప స్వభావాలను కాపాడుకోగలిగే శక్తి సామర్థ్యాలు సయితం వారు కోల్పోతారు. కొన్ని తరాల తరువాత వారు పూర్తిగా ఆ 'కొత్త' నాగరికతకు శాశ్వతంగా దాసులయిపోతారు. పాశ్చాత్యుల అంచనా నూటికి నూరుపాళ్ళూ నిజమయిందే. కనుక ముస్లిముల్లో ఆ నవ నాగరికతా ఛాయల్లో పెరిగిన వారు అనేకమందికి ఇస్లాం అంటే ఏమిటో కూడా సరిగ్గా తెలీదు. పైగా నిష్కారణంగా వారు ఇస్లాంకు వ్యతిరేకంగా ద్వేషాన్నీ పెంచుకున్నారు.

## వంచనకు పరాకాష్ఠ

సరిగ్గా ఈ నాటకాన్నే కమ్యూనిస్టులు ముస్లిమ్ దేశాల్లో ఆడదలచుకున్నారు. వారు ముస్లిములతో, "మీరు కమ్యూనిజాన్ని ఓ ఆర్థిక వ్యవస్థగా స్వీకరించినప్పటికీ నిక్షేపంగా ముస్లిములుగా ఉండవచ్చు, మీ నమాజు, రోజా, ధ్యాన సాధనాల్లో ఎలాంటి లోటురాదు. ఇది కేవలం ఆర్థిక వ్యవస్థ. ఇది మనిషి యొక్క మతపరమయిన విషయాల్లో అసలు జోక్యమే చేసుకోదు. అందువల్ల ముస్లిములు కమ్యూనిజం అంటే భయపడటం, దాన్ని స్వీకరించడమంటే జంకడం అర్థరహితం." కాని కమ్యూనిస్టులకు బాగా తెలుసు, ఒకసారి ముస్లిములు కమ్యూనిజం ఉచ్చులోపడి తమ ఆర్థిక సమస్యలకు పరిష్కారంగా దాన్ని స్వీకరించారా, అంటే వారు ఇకపై ముస్లిములుగా జీవించడమే అసాధ్యం. కొన్నేండ్లల్లోనే వారి మస్తిష్క ప్రక్షాళన జరిపి వారిని తమ జీవన తత్వానికనుగుణంగా మలచుకోవడం, ఇస్లాం అవశేషాలేమయినా వారిలో మిగిలి ఉంటే వాటిని పూర్తిగా తుడిచి వెయ్యడం అవలీలగా జరుగుతుంది. ఎందుకంటే వర్తమాన కాలం ఎంతో వేగంగా పరుగులిడే చలనమయమయిన కాలం. ఇందులో దీర్ఘకాలికమయిన మార్పులు బహు స్వల్పకాలంలో తీసుకురావడం సునాయాసంగా సాధ్యమవుతుంది. కాని విచారకరమయిన విషయమేమిటంటే ఇన్ని యదార్థాలు కళ్ళకు కట్టినట్టు కనిపిస్తున్నా అనేకమంది ముస్లిములు కమ్యూనిస్టుల మాటల ఉచ్చుల్లో ఐచ్ఛికంగా, సంతోషంగా పడిపోతూ ఉంటారు. ఈ విధంగా వారికి ఇస్లామీయ బోధనల్లోని రుచిలేని శుష్క విధుల నిర్వహణ నుండి తప్పుకునే మార్గం సుగమమవుతుంది. పైగా స్వయంగా ఆలోచించి, తమ మార్గమేదో తాము అన్వేషించి నిర్మించుకునే, నిర్మాణాత్మకమయిన పనుల్లో పాలు పంచుకునే జంజాటం నుండి తప్పించుకోవచ్చు. వారు కోరేది ఒక్కటే నిత్యం పనీ పాటా లేకుండా పోవాలి. మందు కొట్టిన వారిలా కేవలం కలలు కంటూ మరే పనీ ముట్టకుండా కూర్చోవాలి. ఏ సమస్యనయినా సరే 'స్వయంగా' ఆలోచించే అవసరమూ ఉండరాదు. నిత్యం ఇతరులే ఆ సమస్యల్ని గురించి ఆలోచించాలి, మార్గం చూపాలి. వారు చెప్పినట్లుగా

కళ్ళు మూసుకుని తాము ఆచరిస్తూ పోవాలి.

ఇక్కడ ఓ విషయం విశదం చెయ్యడం అవసరం. సూత్రప్రాయంగా ఇస్లాం, దాని మౌలిక సిద్ధాంతాలకు విరుద్ధం కాని ఏ వ్యవస్థనూ ఎదిరించదు. మారిన పరిస్థితుల్లో ముస్లిం సమాజంలోని ఏ సామూహిక సమస్యకు పరిష్కారం అది చూపగలిగినా దాన్ని ఇస్లాం సంతోషంగా స్వీకరిస్తుంది. కాని కమ్యూనిజం మాటకు వస్తే అది ఇస్లామీయ వ్యవస్థకు సూత్రప్రాయంగా, మౌలికంగా విరుద్ధమయింది. ఈ కారణంగా వీటి మధ్య కొన్ని నిమ్న విషయాల్లో స్థూలమయిన సామ్యం అగుపించినా ఇవి రెండూ రెండు భిన్న ధృవాలు. దివ్య ఖుర్ఆన్‌లో ఉంది :

> ఎవరయితే అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం తీర్పులు చెయ్యరో, ఆదేశాలివ్వరో వారే కాఫిర్లు (తిరస్కారులు) (5 : 44)

అయితే మనం కమ్యూనిజాన్ని స్వీకరించి ముస్లిములుగా ఉండగలుగుతామా? దీనికి సమాధానం 'లేదు' అన్నదే తప్ప మరేదీ కాదు. కమ్యూనిజం కేవలం ఆర్థిక ప్రణాళిక కాదు. ఎవరయితే దాన్ని ఆ విధంగా చిత్రిస్తారో వారు ఆత్మవంచనకయినా గురయ్యారు లేదా పరవంచనకయినా పాల్పడుతున్నారు.

## సిద్ధాంతాల్లో వ్యతిరేకత

సైద్ధాంతికంగా ఇస్లాం మరియు కమ్యూనిజాలమధ్య ఉన్న వివిధ వ్యతిరేకతల్ని ఈ విధంగా ప్రస్తావించవచ్చు:

మొదటి విషయమేమంటే కమ్యూనిజం శుద్ధ భౌతికవాదం. దాని దృష్టిలో పంచేంద్రియాలకు గోచరమయింది మాత్రమే 'యదార్థం'. ఏ యదార్థాలయితే మన ఇంద్రియాలకు పట్టుబడవో అవి అర్థంలేని

మూఢనమ్మకాలు, వ్యర్థ ప్రసంగాలున్నూ! అందువల్ల వాటిని గుతించి మనిషి అసలు పట్టించుకోనవసరం లేదు. కనుక ఏంజెల్స్ (ENGLES) ఒకసారి వ్రాశాడు, 'భౌతిక పదార్థమే జీవితపు ఏకైక సత్యం' అని. అలాగే ఈ భౌతికవాదుల అభిప్రాయంలో "మానవ మేధ కూడా పదార్థం యొక్క అభివ్యక్తికి ఓ రూపమే. అది తన చుట్టుప్రక్కల వాతావరణానికి ప్రతిరూపం." వీరి ప్రకారం 'ఆత్మ' అన్నది వాస్తవం కాదు - స్వచ్ఛంగా భౌతిక పరిస్థితుల సృజన. వీటివల్ల తేలిందేమంటే కమ్యూనిజం కేవలం ఒక భౌతికతా ప్రధానమయిన సిద్ధాంతం. దీని రీత్యా మానవ జీవితంలోని సకల ఆధ్యాత్మిక వ్యక్తీకరణలు పరిహాసపాత్రమయినవి, అశాస్త్రీయమయిన దృక్పథాల ఫలితంగా పుట్టినవి!

మానవ జీవితం, మానవ ప్రయత్నాలు, మానవ కృషికి సంబంధించిన ఈ భావన ఎంతో హేయమయినది. ఇస్లాం దాన్ని ఓ క్షణం కూడా సహించదు, ఇస్లాం దృష్టిలో మానవస్థానం ఎంతో ఉన్నతమయింది, ఉచ్ఛతరమయింది. అతని శరీరం భౌతికమయిందే, అతను భూమిపైనే సంచరిస్తాడు కాని అతని ఆత్మ పయనించే దూరాలు అపరిమితమయినవి. అందువల్ల అతని మౌలిక అవసరాలు కూడా కార్ల్‌మార్క్స్ భావించినట్లు కేవలం కూడు, గూడు, (లైంగిక) తోడు వరకు మాత్రమే పరిమితం కావు.

అయితే, కమ్యూనిజం బోధించే ఈ భౌతికవాదం మన జీవితాలను ఎలా ప్రభావితం చెయ్యగలుగుతుంది - మనం కేవలం దాని ఆర్థిక ప్రణాళికనే కదా అమలు జరిపేది? దైవం, దైవప్రవక్తకు సంబంధించిన ఏ విశ్వాసాన్నీ, సిద్ధాంతాన్నీ వదలుకోముగా, మన ఆధ్యాత్మిక వ్యవస్థను త్రోసిపుచ్చము. అలాంటప్పుడు కేవలం ఆర్థిక సంస్కరణా కార్యక్రమం ఉన్న కమ్యూనిజం ఈ విషయాలపై ప్రభావం చూపగలగడం సాధ్యం కాదే?

ఈ భావాలు కేవలం మధురమయిన అపోహలు. ఎందుకంటే స్వయంగా కమ్యూనిజం దృష్ట్యా ఒక జాతి ఆర్థిక కార్యక్రమం మరియు దాని విశ్వాసాలూ దృక్పథాలు రెండు వేర్వేరు అంశాలు కావు. వాటి మధ్య

దృఢమయిన అవినాభావ సంబంధం ఉంటుంది. వాటిని వేరు చేసి అర్థం చేసుకోవడమే కష్టం. రెంటికీ ప్రాతిపదిక ఒకే భౌతికతా ప్రధానమయిన జీవన వ్యవస్థ. ఈ యదార్థాన్ని కమ్యూనిస్టు పండితులు మార్క్స్,ఎంగెల్స్ తమ రచనల్లో ప్రస్ఫుటంగా వ్రాశారు.

కమ్యూనిజం గతితార్కిక భౌతికవాదాన్ని విశ్వసిస్తుంది. దాని దృష్టిలో విరుద్ధ శక్తుల పోరాటం – పెట్టుబడిదారులు, కార్మికుల పోరాటమే –మానవుని ఆర్థిక, భౌతిక ప్రగతుల మర్మహేతువు. నేటి వరకు మానవాళి గడించిన ప్రగతి వికాసాలు ఈ వర్గాల పోరాటం ఫలితంగా ప్రాప్తమయినవే. నేటివరకు ఏ పరిణామ క్రమంలో మానవాళి బానిసత్వం, భూస్వామ్యం, పెట్టుబడిదారి దశలను దాటుకుంటూ వచ్చిందో అది కూడా ఈ పోరాటం ఫలితంగానే ఉనికిలోకి వచ్చింది. ఈ పోరాటం ద్వారానే మానవాళి తన చివరి గమ్యం అయిన కమ్యూనిస్టు విప్లవం వరకు చేరుకోగలుగుతుంది. గతి తార్కిక భౌతిక వాదమనే ఈ సిద్ధాంతం ద్వారానే కమ్యూనిస్టులు తమ అభిప్రాయాలను సరయినవిగా నిరూపించడానికి ప్రయత్నిస్తారు. ఈ సిద్ధాంతం ఆధారంగానే నేటి సైద్ధాంతిక సంఘర్షణలో చివరికి కమ్యూనిజానికి విజయం ప్రాప్తమవుతుందని వారు నమ్ముతారు. కమ్యూనిజం మరియు ఈ గతి తార్కిక భౌతికవాదంలో సశాస్త్రీయమయిన సంబంధం ఉందని కూడా వారు వాదిస్తారు. వారి ప్రకారం ఇందులో దైవానికి, దైవ ప్రవక్తకు లేక ధర్మానికి అసలు తావేలేదు. ఇలాంటి నమ్మకాలు కూడా కేవలం ఆర్థిక పరిస్థితుల వల్ల జనించినవే. వాటికి సంబంధించిన ఆర్థిక పూర్వరంగాన్ని వేరు చేసి చూస్తే వాటి ప్రాముఖ్యత గాని వాటి ప్రత్యేకత గాని ఏమీ లేదు. అందువల్ల మానవ జీవితానికి నిజమయిన లక్ష్యం, సరయిన ఉద్దేశ్యాల నిర్ణయానికయినా లేక వాటి వివరాల అభివ్యక్తికయినా ఆ నమ్మకాలు ఏవిధంగానూ ఉపకరించవు. జీవితంలో దేనికయినా విలువ అంటూ ఉంటే అది ఆర్థిక వనరులు, ఉత్పత్తి సాధనాలకే ఉంది. వాటి మార్పు వల్లనే మానవ జీవితం ప్రభావితం కాగలదు. అప్పుడే విప్లవాలు ఆవిర్భవిస్తాయి.

కమ్యూనిస్టుల ఈ సిద్ధాంతం తప్పయినదనడానికి, అపసవ్య మయినదనడానికి కేవలం అరేబియా ద్వీపకల్పం ఒక్కటే చాలు. అక్కడ ఇస్లాంకు పూర్వం ఏ ఆర్థిక విప్లవమూ రాలేదు. అక్కడ మహాప్రవక్త (సఅసం) తెచ్చిన విప్లవానికి పూర్వరంగం కాగలగడానికి అరబ్బుల ఆర్థిక వనరుల్లో, ఉత్పత్తి సాధనాల్లో ఎలాంటి మార్పు కూడా సంభవించలేదు. కమ్యూనిస్టుల గొప్పగొప్ప నినాదాలకు ఈ ఒక్క బదులే చాలు!

## మౌలిక వైరుధ్యాలు

ఇస్లాం మరియు కమ్యూనిజం ఒకటనడానికి ఇంకా ఏదయినా ఆధారం మిగిలిందా? ఇస్లాం ప్రకారం సృష్టి యావత్తుపై దైవకారుణ్యం దైవ ప్రేమానురాగాలు ఆవరించి ఉన్నాయి. ఆ అనుగ్రహం ద్వారా సృష్టిలో సమస్త మానవాళికి ఎనలేని ప్రయోజనాలు ఒనగూడుతున్నాయి. దైవం, తన దాసులయిన మానవుల మార్గదర్శకత్వం కొరకు ప్రవక్తల్ని పంపాడు. వారు మానవుల్ని ఇస్లాం ఋజు మార్గాన నడపడానికి కృషి చేశారు. ఆ రుజుమార్గం ఆర్థిక పరిస్థితుల కంటే గొప్పదయిన, ఉన్నతమయిన యదార్థం. దీనికి భిన్నంగా కమ్యూనిజం దృష్టిలో మానవ ప్రగతీ, వికాసాలు పరస్పర వ్యతిరేకశక్తుల సంఘర్షణకు ఫలితంగా సంభవిస్తాయి. ఇందులో దైవ అభీష్టానికో లేక ఏ ఇతర కారణానికో ఎలాంటి పాత్రలేదు. మానవ సమాజ ప్రగతిలో ఏ విషయానికయినా ప్రాముఖ్యం ఉందంటే అది ఆర్థిక పరిస్థితులు, వాటి వత్తిడి, వాటివల్ల తలెత్తే మానవ ఆవశ్యకతలు మాత్రమే. ఒక ముస్లిం, ముస్లింగా ఉంటూ ఇస్లాంను సత్యమయినదిగా నమ్ముతూ కమ్యూనిజం బోధించే ఈ తత్వాన్ని ఎలా విశ్వసించగలడు? దానికై పాటుబడే కార్యకర్త ఎలా కాగలడు?

రెండవ ముఖ్యమయిన వ్యత్యాసం ఏమిటంటే మానవుని పట్ల కమ్యూనిజం దృక్పథం విలోమమయినది (NEGATIVE) . దాని రీత్యా మనిషి భౌతిక, ఆర్థిక పరిస్థితులు, సంఘటనల చేతుల్లో కేవలం

అశక్తుడయిన ఓ బొమ్మ తప్ప మరేమీ కాదు. కార్ల్ మార్క్స్ ఇలా వ్రాస్తున్నాడు :

> మనిషి జీవితంలో సామాజిక, రాజకీయ, మానసిక వ్యవహారాలన్నీ భౌతిక పరిస్థితులూ సంఘటనలూ తీర్చిదిద్దిన రీతిలో రూపొందుతాయి. మానవ చైతన్యం తన సమకాలీన సామాజిక పరిస్థితుల సంఘటనల నిర్మాణంపై ఎలాంటి ప్రభావం వెయ్యజాలదు. వాస్తవంగా సామాజిక పరిస్థితులే మనిషి చైతన్యాన్ని రూపొందిస్తాయి.

దీనికి భిన్నంగా ఇస్లామీయ మానవ దృక్పథం అనులోమ (POSITIVE) రీతిలో ఉంది. అందులో మనిషి స్వతంత్ర సంకల్పశక్తి గల సాధికార వ్యక్తి. అతను మహా మహిమాన్వితుడయిన ఒక్క దైవం తప్ప ఎవరికీ ఆజ్ఞాబద్ధుడు, విధేయుడు కాడు. దివ్య ఖుర్‌ఆన్ ప్రవచనం :

> ఇంకా ఎన్ని వస్తువులయితే ఆకాశాల్లో, భూమిలో ఉన్నాయో వాటినన్నింటినీ దైవం తన తరఫున మీ కొరకు మీ అధీనంలో ఇచ్చాడు. (13 : 45)

ఈ విధంగా మనిషికి, అధికారాలు, శక్తి దృష్ట్యా ప్రపంచంలో అత్యున్నత స్థానం ఉండటమే గాక ఇక్కడి మిగతా వస్తువులన్నీ అతనికి లోబడి ఉన్నాయన్న యదార్థాన్ని చాటుతుంది ఇస్లాం. ఉదాహరణకు స్వయంగా ఇస్లాంనే తీసుకోవచ్చు. దాని ప్రగతి వికాసాలు గతి తార్కిక భౌతిక వాదపు ఏ సూత్రాన్ననుసరించీ జరగలేదు. తొలినాటి ముస్లిములు ఒక్క క్షణానికయినా ఆలోచించి ఉండరు – కేవలం ఆర్థిక పరిస్థితులు మానవ భవితవ్యాన్ని నిర్ణయిస్తాయని! ఇంకా మార్క్స్ నుడివినట్లు మనిషి వాటిముందు కేవలం అశక్తుడయిన ఓ పనిముట్టనీను!! ఆ ముస్లిములు తమ సంకల్పం సామర్థ్యంతో దైవబోధనలు, ఆయన ప్రవక్త మార్గదర్శకత్వం వెలుగులో తమ ఆర్థిక వ్యవస్థను నిర్మించుకున్నారు. అలాగే ఇతర

సామాజిక సంబంధాల విషయంలోనూ వారు దైవిక మార్గదర్శకత్వాన్నే అనుసరించారు. అందువల్లనే వారు బానిసల్ని విముక్తి చేసినప్పుడు కూడా ఎలాంటి ఆర్థిక ప్రయోజనమో, భౌతిక లాభమో వారి దృష్టిలో లేదు. ఇస్లామీయ బోధనల ప్రభావం మూలంగానే ముస్లిం జగత్తులో భూస్వామ్య వ్యవస్థ ఎన్నడూ నెలకొనలేదు. మరో ప్రక్కన ఆ వ్యవస్థ యూరపులోనూ ఇతర ప్రపంచ భూభాగాల్లోనూ శతాబ్దాల తరబడి రివాజులో ఉండింది.

ఇస్లాం మరియు కమ్యూనిజం విషయంలో చర్చించేటప్పుడు గుర్తుంచుకోవలసిన మూడో విషయం ఏమిటంటే, 'వ్యక్తిగత ఆస్తి' అధ్యాయంలో చెప్పినట్లు, ఒక ఆర్థిక వ్యవస్థను దాని సామాజిక తత్వంతో వేరుచెయ్యడం అసలు సాధ్యమే కాదు. అందువల్ల కమ్యూనిజాన్ని ఆర్థిక వ్యవస్థగా స్వీకరించిన తరువాత మనం కమ్యూనిస్టు జీవనతత్వాన్ని స్వీకరించకుండా తప్పించుకోలేము. ఆ తత్వం ప్రకారం మనిషి, ఆర్థిక వ్యవస్థలో కేవలం మరబొమ్మ మాత్రమే. ఆ తత్వం, సకల సామాజిక విప్లవాలకు మూలాంకురం కేవలం ఆర్థిక అంశాలే అని వాదిస్తుంది. ఈ తత్వం దృష్టిలో సామూహిక లేక సామాజిక వ్యవస్థకే జీవితంలో నిర్ణయాత్మకమయిన ప్రాముఖ్యముంది. వ్యక్తులు దానికి కేవలం అశక్తులయిన సేవకులు మాత్రమే. రాజకీయంగా ఈ ధోరణి నిరంకుశత్వానికి దారి తీస్తుంది.

ఈ దృక్పథం ఇస్లామీయ దృక్పథానికి పూర్తిగా భిన్నమయింది. ఇస్లామీయ దృక్పథం ప్రకారం అసలు ప్రాముఖ్యత సమాజానికి లేదు వ్యక్తికే. అందువల్లనే ఇస్లామీయ వ్యవస్థ దాని లక్ష్యసిద్ధికై సమాజం కంటే వ్యక్తికే అధిక ప్రాధాన్యతనిస్తుంది. ఇస్లాం మనిషి అంతర్యాన్ని జ్యోతిర్మయం చెయ్యాలని, సంస్కారవంతం చెయ్యాలని కోరుతుంది. ఆపైన వ్యక్తి ఐచ్ఛికంగా, సంతోషంతో సకల సామాజిక బాధ్యతల్ని నిర్వహించేందుకు సిద్ధమవుతాడు. అంటే ఇస్లాం వ్యక్తిని సమాజంలో చైతన్యవంతుడయిన సభ్యునిగా చూడాలని కోరుకుంటున్నదన్నమాట. అతను స్వచ్ఛందంగా తన సామాజిక బాధ్యతల్ని నెరవేర్చుతాడు, స్వచ్ఛందంగానే తనకు ఇష్టమయిన వృత్తిని చేపడతాడు. ఏ వృత్తి చేపట్టాలన్నా అతనిపై నిర్బంధం ఉండదు,

ఏ వృత్తిని వదలాలన్నా ఆంక్షలూ ఉండవు. పాలకులు ఒకవేళ దైవం నియమించిన హద్దుల్ని అతిక్రమిస్తే, వారి ఆజ్ఞల్ని ధిక్కరించే హక్కును కూడా ప్రతి వ్యక్తికీ ఇస్తుంది ఇస్లాం. ఈ విధంగా ఇస్లాం ప్రతి వ్యక్తిని సామాజిక నీతి నియమాలను పాటించేవానిగా, వాటి పరిరక్షకునిగా రూపొందిస్తుంది. సమస్త సామాజిక కీడుల్ని దూరం చెయ్యడం అతని విధిగా నిర్ణయిస్తుంది. 'వ్యక్తి'కి ఎలాంటి ప్రాముఖ్యం లేని సమాజంలో ఉత్పత్తి సాధనాలను పూర్తిగా స్వాధీనం చేసుకున్న నిరంకుశ వ్యవస్థలో అశక్తుడయిన 'వ్యక్తి' ద్వారా ఇస్లాం కోరే ఆశయాలు నెరవేరవన్నది ద్యోతకమవుతూనే ఉంది.

## నైతిక, ఆర్థిక స్థితిగతులు

వివరిమాట : కమ్యూనిజంలో సామాజిక సంబంధాలకు అసలు ఆధారం కేవలం ఆర్థిక అంశాలే అన్న విషయాన్ని మనం మరువరాదు. మానవ జీవితంలో ఆర్థిక విషయాలకు ఉన్న ప్రాముఖ్యాన్ని ఇస్లాం కాదనదు. ఒకజాతి మనుగడలో పటిష్ఠమయిన ఆర్థిక వ్యవస్థకు ఉన్న మహత్తును కూడా ఇస్లాం ఉపేక్షించదు. ఇంకా ఆర్థిక పరిస్థితులు, నైతిక సామాజిక పరిస్థితులపై కూడా ప్రభావం చూపుతాయన్న మాటనూ అది త్రోసిపుచ్చదు. కాని జీవితమంటే ఆర్థిక విషయాలు తప్ప మరేమీ కాదన్న విషయాన్ని మాత్రం అది తీవ్రంగా వ్యతిరేకిస్తుంది. కమ్యూనిజం మాదిరిగా, మనిషి ఆర్థిక సమస్యలు పరిష్కారమయినట్లయితే అతని తతిమ్మా సమస్యలు వాటంతట అవే పరిష్కారమవుతాయన్న సూత్రాన్నీ అది నమ్మదు. ఈ యదార్థాన్ని క్రియాత్మక జీవితంలోని దిగువ ఉదాహరణల ద్వారా అర్థం చేసుకోవచ్చు.

ఒకే విధమయిన ఆర్థిక స్థితిలో ఉన్న ఇద్దరు యువకుల్ని పరిశీలిద్దాము. ఒకతను తన గుడ్డి కోరికల దాస్యంలో భోగవిలాసాల జీవితాన్ని మరిగాడు, అందులోనే తేలియాడుతున్నాడు. రెండవవాడు భోగవిలాసాలకు బదులుగా తీరిక సమయాలన్నింటిలో తన జ్ఞాన సంపదను పెంచుకోవడంలో, తన మనోజగత్తు పరిధుల్ని సువిశాలం

చెయ్యడంలో వినియోగిస్తున్నాడు. వీరిద్దరూ ఒకే విధమయిన వ్యవహారానికి పాత్రులా? వీరిద్దరి స్థితిగతుల్లో వ్యత్యాసమంటూ ఏదీ లేదా? వీరిద్దరి జీవితాలూ సమాన స్థాయిలో శ్రేయోసాఫల్యాలకు ఆలవాలములని చెప్పవచ్చా?

అలాగే మరో వ్యక్తిని తీసుకోండి. అతనిది పటిష్టమయిన వ్యక్తిత్వం. ప్రజలు అతని ప్రతి మాటను ఆనందంతో ఆదరంతో వింటారు, పాటిస్తారు. సామాజికంగా ఇంత ఎత్తు ఎదిగిన మనిషిని మరో మరుగుజ్జుతో పోల్చడం భావ్యమా? ఇతనికి వ్యక్తిత్వం లేదు, సమాజంలో గౌరవం లేదు, ఇతరుల అపహాస్యానికి కేంద్రమయి ఉంటాడు. ఈ వ్యక్తి అసలు సమస్య ఆర్థికత మాత్రమేనా? ఇది పరిష్కరించడం జరిగితే ఇతర సమస్యలు కూడా పూర్తిగా పరిష్కృతమవుతాయా? ఇతని జీవితం ఆర్థికంగా మెరుగుపడితే, మొదటి వ్యక్తిలా సకల శోభాయమానంగా విరాజిల్లగలుగుతుందా?

అలాగే అందమయిన, హుందాగల ఓ మహిళను మరియు అందమూ లేని హుందాతనమూ లేని మహిళను పోల్చండి. ఇద్దరూ సమానులు కాగలుగుతారా? ఆర్థిక సమస్యలు దూరమయితే రెండో స్త్రీ కష్టాలన్నీ కడతేరినట్లేనా? ఆవిడ తొలి మహిళకు సమానం కాగలుగుతుందా?

మానవుల్లోని ఈ వ్యత్యాసాల కారణంగానే ఇస్లాం, ఆర్థికతకు బదులుగా నైతికతకు ప్రాధాన్యతనిచ్చింది. మానవ జీవితం ఆర్థిక ప్రమాణాలపై కాదు అంతకంటే విలువయిన ఇతర ప్రమాణాలపై ఆధారభూతమయి ఉంది. వాటిని క్రియాత్మకంగా నెలకొలపాలంటే కనీసం ఆర్థిక ప్రమాణాలను నెలకొలపడానికి కావలసినంత కృషి, ఆసక్తి అవసరమవుతాయి. దీనిగ్గాను ఇస్లాం దైవం - మనిషి, ప్రభువు - దాసుడు, వీరుభయుల మధ్య శాశ్వత సంబంధాన్ని ఏర్పరచాలని అంటుంది. ఆ సంబంధం ఆధ్యాత్మికమయింది. ఈ ఆధ్యాత్మిక సంబంధం మూలంగానే మానవుని క్రియా జీవితంలో నైతికపు విలువలు పరిపూర్ణంగా వికసించడానికి వీలు కలుగుతుంది.

ఇది మనిషిని, భౌతిక అవసరాల సంఘర్షణలో ఈర్ష్యా ద్వేషాలకు గురయ్యే పతనావస్థ నుండి పైకి లేవనెత్తి, అతను కోరికల దాసుడు కాకుండా కాపాడి, సత్యం, సదాచారం, ప్రేమానురాగాలు విలసిల్లే కొత్త ప్రపంచంలో అత్యున్నత స్థానానికి అతన్ని చేరుస్తుంది.

## అపూర్వ మహత్కార్యాలు

ఇస్లాం దృష్టిలో ఆధ్యాత్మిక శక్తి, ప్రమాణాలకు మానవ జీవితంలో మరో విధంగా కూడా మౌలిక ప్రాముఖ్యత ఉంది. ఈ ఆధ్యాత్మిక ప్రమాణాలు మనిషికి లభించిన ఎంతో విలువయిన వారసత్వం. ఇవి మానవ జీవితాన ఎంతో లోతయిన ప్రభావాన్ని వేశాయి. వీటిపట్ల సరిగ్గా శ్రద్ధ వహించి వాటిని సరయిన రీతిలో వికసింపజేస్తే ఇవి సమాజంలో మరే ఆర్థిక, ఆర్థికేతర అంశాలు వెయ్యలేనంత విస్తృతంగా ప్రభావం వెయ్యగలవు. ముస్లిముల గత చరిత్ర ఈ యదార్థానికి ప్రత్యక్ష నిదర్శనం. ధర్మ భ్రష్టత్వం ఓ విపత్తుగా వచ్చిపడినప్పుడు తొలి ఖలీఫా హజ్రత్ అబూ బక్ర్ (రజిఅన్) ఒక్కరే దాన్ని నిర్మూలించడానికి సమాయత్తమయ్యారు. హజ్రత్ ఉమర్ (రజిఅన్) లాంటి మహనీయులు కూడా ధర్మభ్రష్టులకు వ్యతిరేకంగా పోరాడటం భావ్యంకాదని వాదించారు. కాని అబూబక్ర్ (రజిఅన్) స్థయిర్యంలో ఎలాంటి తొణుకు కానరాలేదు... ఆయన నిలకడగా తన మార్గాన నిలబడ్డారు. ఈ స్థయిర్యం వెనుక ఉన్న ప్రేరణ ఏది? ఆర్థిక లాభమా? ప్రాపంచిక ప్రయోజనమా? ఏమిటి? చివరికి విజయం ఆయన పాదాక్రాంతమయింది. ఆ గడ్డు పరిస్థితుల్లో ఏ భౌతిక లాభమూ ఆయన దృష్టిలో లేదన్నది నిర్వివాదాంశం. అదే ఒక వేళ కారణమయి ఉంటే ఇస్లామీయ చరిత్రలో కడు కష్టకాలమయిన ఆ దశలో తన విధిని అంత నిబ్బరంగా, నిక్కచ్చిగా నిర్వహించ లేకపొయ్యేవారు. ఆయనలోని ఆధ్యాత్మిక భావనే ఆయనకు ఆ గడ్డు రోజుల్లో తోడుగా నిలిచి ఓ అద్భుతాన్ని సాధించింది. ఆ రోజులు మానవ చరిత్రలో ఎంతో మహత్తు గల భాగం. ఆధ్యాత్మిక శక్తిలోనే ఎంతో గొప్ప ఆర్థిక, భౌతిక శక్తులూ ఇమిడి ఉన్నాయనడానికి ఇది అపూర్వమయిన తార్కాణం.

ఇలాంటి ఓ దృష్టాంతం హ్రజత్ ఉమర్‌బిన్ అబ్దుల్ అజీజ్ (రజిఅన్) జీవితంలోనూ కానవస్తుంది. ఆయన ఆధ్యాత్మిక శక్తి మూలంగానే తన కుటుంబంలోని మాజీ ఖలీఫాలు జరిపిన అక్రమాలు, దౌర్జన్యాలను అంతమొందించి, అంతమయిన ఇస్లామీయ దృక్పథాల కనుగుణంగా సామాజిక, రాజకీయ న్యాయాన్ని పునఃస్థాపించారు.

అందువల్లనే ఇస్లాం, ఆధ్యాత్మిక కోణానికి ప్రాముఖ్యాన్నిస్తుంది. ఆధ్యాత్మికత సాధించగల మహాద్భుతాలకు మానవాళిని దూరం చెయ్యడం దానికి ఇష్టం లేదు. ఆధ్యాత్మిక ప్రగతితోపాటు భౌతిక ప్రయోజనం పొందడాన్నీ అది కాదనదు.

కమ్యూనిజం చూపెట్టే మార్గాన భౌతిక ఆర్థిక అవసరాలను తీర్చుకోవడానికి కృషిచేస్తే వారికి, తమ నైతిక ఆధ్యాత్మిక జీవితం పట్ల కూడా శ్రద్ధ చూపడం సాధ్యం కాదు. ఎందుకంటే కమ్యూనిజంలో కృషి అంతటికీ ప్రాముఖ్యత ఆర్థిక కోణం వైపుకే కేంద్రీకృతమయి ఉంటుంది. దీన్ని స్వీకరిస్తే మానవ జీవితం సర్వతోముఖంగా ప్రగతిని సాధించజాలదు. ఒక్క కోణంలోనే అది ఎదుగుతుంది. మన శరీరంలో ఏదో ఒక అవయవం పెరుగుదల అధికమయితే ఏ విధంగా ఇతర అవయవాల ఎదుగుదలకు హాని కలుగుతుందో అచ్చం అలాగే కమ్యూనిజంలో జీవితపు ఆర్థిక విభాగానికి బాగా ప్రాముఖ్యాన్నిస్తే సహజంగానే ఇతర విభాగాలు కుంటుబడతాయి.

## ఆచరణాత్మకంగానూ ....

కొందరు పెద్ద మనుషులకు కమ్యూనిజాన్నీ ఇస్లాంతో ఇలా తాత్వికంగా పోల్చడం అన్నది రుచించదు. వారి ప్రకారం ఇలాంటి సైద్ధాంతిక చర్చలు క్రియాశూన్యమయినవి, స్థూలస్థాయిని దాటలేవు. వీరి దృష్టిలో జీవితపు ఆచరణాత్మక సమస్యలకే ప్రాముఖ్యం ఉంటుంది, సైద్ధాంతిక చర్చలకన్నా వాటికే ప్రాధాన్యత నివ్వాలి కనుక ఒక వ్యవస్థను స్వీకరించడమో

తిరస్కరించడమో జరిగేటప్పుడు మనం ఇలాంటి అనవసరమయిన చర్చల్లో కాలయాపన చెయ్యరాదు. దానికి బదులుగా ప్రస్తావనలోని వ్యవస్థ క్రియాజీవితంలో ఎంతవరకు ప్రయోజనకరమయింది, ఆచరణీయమయింది అన్న అంశాన్నే దృష్టిలో ఉంచుకోవాలి. ఈ మహోదయుల సైద్ధాంతిక చర్చలంటే తలనొప్పి. క్రియాజీవితంలో ఇస్లాం కమ్యూనిజాల మధ్య ఘర్షణ ఎలా తలెత్తుతుందో వారి తలకెక్కదు. ఫలితంగా వారు ఈ రెంటి మధ్య ఎలాంటి వివాదమే లేదని తీర్మానించుకుంటారు.

మా దృష్టిలో ఈ ఆలోచనాపథం సరయినది కాదు. ఒక సమస్యను సైద్ధాంతికమని, క్రియాత్మకమని వేర్వేరు కోణాల్లో విభజించి చూడటం సాధ్యం కాదు. అయినా కమ్యూనిజం, ఇస్లామ్‌ల మధ్య కేవలం సైద్ధాంతికమయిందే కాదు ఆచరణాత్మకమయిన గట్టి విభేదం కూడా ఉంది. దానికి సంబంధించిన కొన్ని అంశాలు ఇక్కడ ప్రస్తావిస్తున్నాము.

(1) ఇస్లామీయ దృక్పథం దృష్ట్యా స్త్రీ యొక్క అసలు కార్యరంగం భావితరాల పెంపకం, వారి శీల నిర్మాణం. అందువల్ల స్త్రీ ఇల్లు వదలడాన్ని ఇస్లాం అంతగా ఇష్టపడదు. అసాధారణమయిన, అత్యవసర పరిస్థితుల్లో తప్ప అది స్త్రీని కార్యాలయాల్లో, కార్ఖానాల్లో, పొలాల్లో పనిచెయ్యడానికి అనుమతించదు. దీనికి భిన్నంగా కమ్యూనిజం పురుషుల్లా స్త్రీలు కూడా కార్ఖానాల్లో పొలాల్లో పనిచెయ్యాలని నిర్బంధిస్తుంది. కమ్యూనిజం జీవన తత్వంలో స్త్రీ పురుషుల మధ్య ఎలాంటి మానసిక తారతమ్యం లేదు. అందువల్ల అది వారి శారీరక విధుల్లోనూ వ్యత్యాసాన్ని పాటించదు. మరోవైపు కమ్యూనిజం ఆర్థిక వ్యవస్థ యొక్క మూలసిద్ధాంతమే ఉత్పత్తి సాధనాలను వీలయినంత మేరకు పెంచుకుపోవడం. ఈ ధ్యేయాన్ని సాధించేందుకు దేశంలోని వ్యక్తులందరు, స్త్రీలు, పురుషులు కలసి తమ శక్తి సామర్థ్యాలు అన్నింటినీ దానికి అంకితం చెయ్యవలసిందే. పరిశోధన, ఉత్పాదనా కేంద్రాలే తమ కలల కేంద్రాలని భావించ

వలసిందే. ఈ మహా ప్రస్థానంలో స్త్రీ కూడా సమాజంలోని ఇతరులకు తోడుగా, సమంగా పాల్గొనవలసిందే. అందరిలా తమ విధి నిర్వహణలో చురుగ్గా నిమగ్నులవవలసిందే. ఈ విషయంలో ఎలాంటి రాయితీకి వారు అర్హులు కారు. ప్రసవ కాలంలో తప్ప మరెప్పుడూ వారు తమ విధి నిర్వహణను తప్పించుకోలేరు.

పర్యవసానం ఏమవుతుంది? పిల్లలు తల్లి ప్రేమానురాగాలకు శిక్షణకు నోచుకోరు. వారు కూడా ప్రభుత్వం ఆధ్వర్యాన కార్ఖానాల్లో [1] ఇతర వాణిజ్య వస్తువుల్లా గ్రూపులు గ్రూపులుగా తయారయి సమాజ మార్కెట్టులోకి వస్తారు. భావమేమిటంటే కమ్యూనిస్టు ఆర్థిక వ్యవస్థను మనం అవలంబిస్తే మన మహిళలు గృహసీమను వదలి తప్పనిసరిగా బజారు దారి పట్టవలసిందే. కుటుంబ జీవితం ఛిన్నాభిన్నం కాకుండా ఉంటుందా? వాస్తవంగా ఇస్లామీయ నైతిక, ఆర్థిక వ్యవస్థలకు పునాది ఈ కుటుంబమే.[2] కమ్యూనిస్టు వ్యవస్థను స్వీకరిస్తే స్త్రీలు కర్మాగారాలకు, పొలాలకు వెళ్ళి పనిచెయ్యనవసరం లేదని ఎవరయినా వాదిస్తే ఆ వాదన ఆయనగారి సొంత సిద్ధాంతమేమో కాని కమ్యూనిస్టు సిద్ధాంతం మటుకు కాదు. ఈ విషయంలో కమ్యూనిస్టులు ఎలాంటి దాపరికం లేకుండా తమ అభిప్రాయాన్ని బట్టబయలు చేశారు.

ఆర్థిక ప్రగతిని సాధించడానికి కమ్యూనిస్టు ఆర్థిక వ్యవస్థను స్వీకరించనవసరంలేదు. కమ్యూనిస్టులు సాధించిన ఆర్థిక ప్రగతి కూడా

---

(1) బాలల సుశిక్షణ విషయంలో 'ఇస్లాం మరియు స్త్రీ' అన్న అధ్యాయంలో మేము వివరంగా చర్చించాము.

(2) స్త్రీ పురుషుల కార్యరంగాలు వేర్వేరయినంత మాత్రాన వారి మధ్య సహాయ సహకారాలు ఉండబోవని అర్థం ఎంతమాత్రం కాదు. సమాజంలో విభిన్న వ్యక్తులు విభిన్న వృత్తులు చేస్తూ ఉన్నప్పటికీ పరస్పర సహాయ సహకారాల బంధంలో ఎలా ఇమిడి ఉంటారో అదే విధంగా కుటుంబంలో స్త్రీ పురుషులున్నూ. వీరి కార్య పరిధులు వేరయినా వీరిమధ్య సహాయ సహకార సంబంధాలు పటిష్ఠంగా ఉంటాయి.

వారి సొంత ఆర్థిక వనరుల వల్ల ప్రాప్తమయింది కాదు. వారు యూరపు నుండి అరువు తెచ్చుకున్న ఉత్పత్తి సాధనాలను వినియోగించడం మూలంగా అది సాధ్యమయింది.★ ఒక కమ్యూనిస్టు దేశం ఇతరుల అభివృద్ధి చెందిన ఉత్పత్తి సాధనాలను వినియోగించి ప్రగతిని సాధిస్తే వాటినే వినియోగించి ఓ ఇస్లామీయ దేశం ప్రగతిని సాధించడం ఎందుకు సాధ్యంకాదు? ఓ ఇస్లామీయ రాజ్యం ప్రాపంచిక లాభాల కొరకు అత్యాధునిక వ్యావసాయిక, పారిశ్రామిక విధానాలు అవలంబించడానికి ఎంతమాత్రం వ్యతిరేకంకాదు.

(2) కమ్యూనిస్టులు ఆర్థిక వ్యవస్థ కట్టడం పునాదుల్లో "శ్రామిక వర్గ నియంతృత్వం" ఉంటుంది. ఈ వ్యవస్థలో, ఎవరు ఏ పనిచెయ్యాలన్నది కేవలం ప్రభుత్వమే నిర్ణయిస్తుంది. వారికి ఆయా పనుల్లో కావలసిన యోగ్యతలున్నాయా లేదా అన్న విషయాన్నీ అది వారి అభిరుచికి, నైజానికి తగినట్లున్నదా లేదా అన్న విషయాన్నీ పరిశీలించడం జరగదు. కమ్యూనిస్టు ప్రపంచంలో మనిషి ఆలోచనలపై ఆచరణలపై గట్టి పహరా ఉంటుంది. ప్రభుత్వం అభీష్టానికి వ్యతిరేకంగా ఆలోచించడమయినా, వ్రాయడమయినా సాధ్యపడదు. సామాజిక సంఘాలను సయితం ప్రభుత్వమే నిర్ణయిస్తుంది. ప్రభుత్వమే వాటి లక్ష్యాలు, విధానాల రూపకల్పన చేస్తుంది. కమ్యూనిజంలోని ఈ శ్రామిక వర్గ నియంతృత్వం ఒకే వ్యక్తి నియంతృత్వం కన్నా అనేక రెట్లు అధ్వాన్నమయింది. నియంత ఉత్తముడయితే సమతూకంగల ఆలోచనాపరుడయితే జాతి, దేశప్రయోజనాలు అతనికి ప్రియ మయినవయితే ఎప్పుడయినా అతను ప్రజాప్రతినిధుల్ని, మంచి వారినో పెద్దవారినో కొందరిని సంప్రతించి చట్టం చెయ్యడమయినా, నిర్ణయాలు చెయ్యడమయినా జరుగుతుందని, వారి ఇష్టం మేరకు

★ కమ్యూనిస్టు వ్యవస్థ ప్రారంభంలో రష్యా పారిశ్రామికంగా ఎంతో వెనకబడి ఉండింది. ఆ తరువాత యూరపు వనరుల్ని ఉత్పత్తి సాధనాలను వినియోగించి వృద్ధిచెందిన దేశాల్లో చేరిపోయింది.

నడుచుకుంటాడని ఆశించవచ్చు. కాని శ్రామికవర్గ నియంతృత్వంలో అదీ సాధ్యపడదు. ఎందుకంటే దాని ప్రధాన ఏకైక ధ్యేయం కేవలం ఆర్థిక అభ్యున్నతి ఒక్కటే. అందువల్ల అది తన పంజాను మరింత పటిష్టం చేసే పనుల్లోనే ఆసక్తి కనబరుస్తుంది. ప్రజల ఇష్టం అంటూ దానికి వేరుగా ఉండదు. స్వయంగా ఈ సమాసం - 'శ్రామిక వర్గ నియంతృత్వం' - కూడా ఈ సత్యాన్నే చాటుతోంది.

## ఇది బలమయిన సిద్ధాంతమా?

కమ్యూనిజంలోని ఇన్ని లోపాలతోపాటు మరోపెద్ద లోపం ఏమిటంటే, దానికి ఆరోగ్యవంతమయిన గట్టి సైద్ధాంతిక ప్రాతిపదిక అంటూ ఏదీలేదు. ఈ కారణంగానే కమ్యూనిజం సిద్ధాంతం, ఆచరణ రెంటి విషయంలోనూ ఇతర వ్యవస్థలతో రాజీకి సిద్ధమవుతుంది. ప్రప్రథమంగా అది వ్యక్తిగత ఆస్తిని పూర్తిగా అంతమొందించినట్లు ప్రకటించింది. ఒక్కసారిగా పనిచేసే వారందరి వేతనాలను సమానంగా నిర్ణయించింది. కాని అతి త్వరలోనే ఈ రెంటినీ ఉపసంహరించుకుంది. అనుభవం నేర్పిన పాఠం వల్ల అదీ గ్రహించింది, వ్యక్తిగత ఆస్తి వల్ల పనిలో ఆసక్తి జనిస్తుందని; అలాగే శ్రమకు తగ్గట్టుగా వేతనాలు ఇవ్వడమే ఉత్పత్తి రీత్యా లాభసాటిదనీను. వ్యక్తిగత ఆస్తిని, వేతనాల్లో వ్యత్యాసాన్ని ఒప్పుకొని కమ్యూనిజం ధ్వజవాహకులు కార్ల్‌మార్క్స్ తత్వంలోని రెండు ముఖ్యమయిన అంశాలకు విముఖులయ్యారు. వారు అవలంబించిన కొత్త విధానానికి ఇస్లామీయ సూత్రాలతో సన్నిహితత్వం కలదు. ప్రపంచం ఈ విధంగా ఇతర సిద్ధాంతాలను ప్రయోగించి, నిరాశకు లోనయి ఇస్లాంవైపుకు మాటిమాటికీ మరలుతుంటే, ముస్లిములయిన మనం, మన సత్యమయిన మార్గాన్ని, జీవన విధానాన్ని వదలి కమ్యూనిజం ఒడిలో కూర్చోవలసిన అవసరమేమిటి?

# 17. ఇస్లాం మరియు ఆదర్శవాదం*

"మీరు, (ముస్లిములు) ప్రస్తావించే ఇస్లాం ఎక్కడుంది? దాని నిజస్వరూపంలో ప్రజలు ఎప్పుడయినా దాన్ని అవలంబించారా? మీరు దాన్ని ఓ ఆదర్శ వ్యవస్థగా పేర్కొంటారు కాని అది ఆచరణాత్మక జీవితంలో ఎప్పుడయినా అమల్లోకి వచ్చిందా ? మీరు మహాప్రవక్త (సఅసం) కాలంలోను, సన్మార్గగాములయిన తొలి నాలుగు ఖలీఫాల కాలంలోనూ ఈ వ్యవస్థ పరిపూర్ణంగా, అన్ని హంగులతో, తన ఆర్థిక, సామాజిక, రాజకీయ, నైతిక, ఆధ్యాత్మిక విభాగాలతో నెలకొన్నదని, ఇస్లాం చూపే ఆదర్శవంతమయిన సమగ్ర జీవన విధానం ఆ రోజుల్లో అమల్లోకి వచ్చిందని చెబుతారు. దీనివల్ల తేలేదేమిటి? ఆ కాలంలో కొందరు అసాధారణ శక్తి సామర్థ్యాలు గల వ్యక్తులు కొన్ని అద్భుతాలను సాధించగలిగారు. ఇలాంటి వ్యక్తులు, వారు సాధించిన మహత్కార్యాలు మానవజీవితంలో అసాధారణమయినవి, చాలా అరుదయినవి. వాటిని సాధారణ పోకడలో వినాయింపుగా పరిగణించవలసిందే. అందువల్లనే ఇలాంటి అద్భుతాలు చెయ్యగల అసాధారణ వ్యక్తులు తిరిగి ప్రపంచంలో పుట్టలేదు. మున్ముందు కూడా పుడతారనడానికి ఆధారాల్లేవు."

ఈ ఆక్షేపణలు, అభ్యంతరాలు సాధారణంగా కమ్యూనిస్టులు, వారి అనుంగు అనుయాయులు ఇస్లాం పట్ల తెలుపుతూ ఉంటారు. దురదృష్టవశాత్తు అనేకమంది ముస్లిములు కూడా తప్పుదారి పట్టించే ఈ ప్రాపగాండా విషవలయంలో చిక్కుకున్నారు. వారికి ఇస్లామీయ చరిత్రను గురించి ఏమీ తెలియదు. తమ సామ్రాజ్యవాద పెత్తందార్లు తమకు ఏ మేరకు నేర్పారో ఆ మాత్రమే వారికి తెలుసు.

---

* ఆదర్శం ( IDEAL) అనే పదాన్ని ప్రాగ్ దేశీయులు మంచి భావంలో ప్రయోగిస్తారు. ఒక వ్యక్తి, సంస్థ లేక వ్యవస్థలోని సకల సద్గుణాలను సూచించదలచినప్పుడు ఈ పదాన్ని ప్రయోగిస్తారు. కాని ఈ వ్యాసంలో ఈ పదాన్ని ఆ మంచి భావంలో ప్రయోగించడం జరగలేదు. దాని పాశ్చాత్య ప్రయోగాన్ని (ఆదర్శవాదం = IDEAL-ISM ) ఇక్కడ ప్రస్తావిస్తున్నాము. పాశ్చాత్యుల దృష్టిలో ఆదర్శవాదం అంటే

## ఆచరణీయ ఆదర్శం

అసలు సమస్యను చర్చించేముందు ఆదర్శవాదంలోని మౌలిక మయిన రెండు విభిన్న రకాల మధ్య ఉన్న వ్యత్యాసాన్ని విశద పరచదలిచాము. ఆదర్శవాదం లేక ఆదర్శతత్వంలోని ఒక రకం కేవలం ఊహాజగత్తువరకే పరిమితం. క్రియా జీవితంలో దాని ఆచూకి ఎక్కడ వెదకినా దొరకదు. ఈ వాదన చరిత్రలో ఎప్పుడయినా క్రియాత్మకంగా సమస్యల్ని పరిష్కరించి నట్లుగా గాని, అది ఆచరణీయమయినదిగా గాని ఒక్క రుజువు, ఒక్క ఆధారం ప్రాప్తం కాదు. దీనికి భిన్నంగా మరో ఆదర్శవాదం కేవలం ఆలోచనా ప్రపంచం వరకే పరిమితం కాదు. అది క్రియారంగంలో పనిచేసినట్లు, ఆచరణీయమయినట్లు చరిత్ర సాక్ష్యం పలుకుతుంది. మానవజీవితంలో దాని గట్టి ముద్ర కూడా కొట్టవచ్చినట్టు కానవస్తుంది.

ఆదర్శవాదంలోని ఈ విభిన్నమయిన రకాలను దృష్టిలో ఉంచుకుని

---

ఊహాలోకాల్లో, భావనా ప్రపంచంలో తన్మయత్వంతో విహరించడాన్ని, జీవితపు క్రియాత్మక సమస్యల్ని – బీదరికాన్ని, ఆకలి దప్పుల్ని, కష్టాలు బాధల్ని, అన్యాయాన్ని అక్రమాల్ని – ఉపేక్షించి కళ్ళు మూసుకుని బ్రతకడమన్నమాట ! నిరుపేద ప్రజలను అడిగే నాధుడే లేకపోయినప్పుడు, వారి కష్టాలను బాధల్ని దూరం చేసే ఏ క్రియాశీల ప్రయత్నాన్నీ చెయ్యనప్పుడు, వాళ్ళ జులుంకు, దౌర్జన్యానికి లోనయి పరిస్థితుల దయాదాక్షిణ్యాలపై కాలం వెళ్ళదీస్తున్న సందర్భంలో ఈ "ఆదర్శవాదం"లో కొట్టుమిట్టాడే వారినేమనాలి? అందువల్లనే యూరపు ప్రజలకు ఈ 'ఆదర్శవాదం' అంటే అసహ్యం ఏర్పడింది. ఇది ఓ వైపు ప్రజల్ని భూస్వామ్య వ్యవస్థవల్ల దాపురించిన ఆపదలు, కష్టాలు, పరాభవాల పాల్జేస్తే మరోవైపున వారిని నిరర్ధకమయిన తాత్విక రంధ్రాన్వేషణల్లో పడేసి తికమక పరుస్తుంది. ఈ తాత్విక భావాలకు జీవితపు క్రియాత్మక సమస్యలతో ఎలాంటి సంబంధముండదు. ఇలాంటి తాత్వికభావాలను ప్రజలు ద్వేషించడంలోను, అసహ్యించుకోవడంలోను ఆశ్చర్యమేముంది. ఈ కారణంగా ఆదర్శవాదం అనగానే, అది ఏ కోవకు చెందినదయినా, పాశ్చాత్యులు ఏవగించుకుంటున్నారు, పరిహసిస్తున్నారు. దీన్ని ఆసరాగా తీసుకుని కమ్యూనిస్టులు కూడా ఇస్లాంను అర్థంలేని ఆదర్శవాదమని, ప్రయోజనం లేని సిద్ధాంతం అని తిట్టిపోస్తారు. దీనివల్ల ఇస్లాంకు కలిగే కీడుకన్నా వారి మానసిక అపరిపక్వత, అజ్ఞానం బట్టబయలవుతాయి.

అసలు సమస్యను పరిశీలించాలి. ఈ చర్చలో మొదటిప్రశ్న ఏమిటంటే ఇస్లాం దాని సహజగుణం దృష్ట్యా ఎలాంటి వ్యవస్థ? కేవలం ఒక సిద్ధాంతం మాత్రమేనా? లేక క్రియా జీవితంలోనూ దానికి ఏమయినా స్థానముందా? మౌలికంగా దాని స్వరూపం సైద్ధాంతికమయిందే అయితే దాన్ని అమలు జరపడం సాధ్యమేనా? లేక ఇస్లాం మౌలికంగా క్రియాశీలమయిన జీవనవ్యవస్థేకాని అన్ని కాలాల్లోనూ దాన్ని క్రియాత్మక జీవితంలో సమంగా ప్రయోగించడమూ, అన్ని వేళలా దాని ఫలితాలు సమానంగానే వ్యక్తం కావడమూ సాధ్యం కాకపోవచ్చు అన్నది నిజమా?

పైన పేర్కొన్న రెండు రకాల ఆదర్శవాదాల్లో గల తేడాను ఇంకా విడమర్చవలసిన అవసరం లేదనుకుంటున్నాము. ఇస్లాం ఒకవేళ కేవలం ఊహాజనిత సిద్ధాంతం మాత్రమే అయినట్లయితే మానవసమాజం దాన్ని అమలు జరపడం ఎన్నడూ సాధ్యం కాదు – సామాజికంగా పరిస్థితులు, సంఘటనలు ఎంత ఒత్తిడి చేసినా, ఎన్ని బ్రహ్మాండమయిన మార్పులు సంభవించినా దాన్ని అమలు జరపడం సాధ్యపడదు. కాని ఒకవేళ అది ఆచరణీయమయిన జీవన వ్యవస్థే అయినట్లయితే, కేవలం కొన్ని బాహ్యాకారణాల మూలంగా దాన్ని అమలు జరపడం సాధ్యం కాకపోయిన పక్షంలో వ్యవహారం పూర్తిగా మారిపోతుంది. ఇలాంటి పరిస్థితుల్లో ప్రతికూల వాతావరణం మారిపోయి, అనుకూలత ఏర్పడగానే దాని ఆచరణాత్మక అమలుకు మార్గం సుగమమవుతుంది.

ఇస్లాం ఎలాంటి ఆదర్శవాదాన్ని సమర్థిస్తుంది. దీనికి సమాధానం సునాయాసంగా చెప్పవచ్చు. గతంలో ఇస్లాం, వైభవ ప్రాభవాలతో దేదీప్యమానంగా వెలుగొందింది. చరిత్ర పలికే ఈ సాక్ష్యం, ఇదొక క్రియాశీల వ్యవస్థ అని నిరూపిస్తోంది. దీన్ని నేడు కూడా అమలు జరపవచ్చు. మానవుడు ప్రకృతి సిద్ధంగా గతంలోని మానవుడే. అతని నైజం కూడా మారలేదు. మునుపు ఒకసారి ఇస్లాంను సంపూర్ణంగా ఆచరించి విజయం సాధించిన మనిషి నేడు దానికి తన క్రియాజీవితంలో చోటు కల్పించి, దాని కనుగుణంగా తన్ను తాను మలచుకోలేడనడానికి ఎలాంటి కారణమూ కానరావడం లేదు.

## క్రియాశీల ఆదర్శవ్యవస్థ – దాని చరిత్ర

నేడు కొందరు అభ్యుదయవాదులు, ఈ కాలంలో ఇస్లాంను పునరుజ్జీవింప జెయ్యడం సాధ్యమే కాదని వాదిస్తున్నారు. వీరి దృష్టిలో ధర్మ పునరుజ్జీవనోద్యమాలకు అర్థమేలేదు.మేము మా అభ్యుదయ వాదులయిన మిత్రుల్ని ఓ ప్రశ్న అడగదలిచాము. వారు ఇలా అన్నదానికి భావమేమిటి? గతంలో ఇస్లాం మూలంగా మనిషి ఏ నైతిక ఔన్నత్యాలకు ఎదగగలిగాడో నేటి ఆధునిక మనిషికి ఆ ఔన్నత్యాలను అందుకోవడం సాధ్యపడదా ? ఒకవేళ ఇదే నిజమయితే మానవుడు నిరంతర పరిణామానికిలోనయి వృద్ధి చెందుతున్నాడు, ప్రగతిని సాధిస్తున్నాడు. నైతికంగా, మానసికంగా, పూర్వపుస్థితికంటే ఇప్పుడు ఎంతో మెరుగయిన, ఉన్నతమయిన స్థాయికి ఎదిగాడు అని వారు చేసే నినాదాలకు భావమేమిటి?

సన్మార్గగాములయిన ఖలీఫాల యుగం స్వల్పకాలికమయింది. ఆ తరువాత ముస్లిముల చరిత్రలో అలాంటి ఆదర్శాలు బహుస్వల్పంగా, తాత్కాలికంగా అప్పుడప్పుడూ అగుపిస్తాయి. దీనివల్ల ఇస్లాం ఓ జీవనవ్యవస్థగా ఆచరణయోగ్యం కాదని ద్యోతకమవడం లేదా అని అడుగుతున్నారు మన మిత్రులు. ఈ ప్రశ్నకు సమాధానం వెదకడంకోసం కాస్త విస్తృతంగా పరిశీలించవలసి ఉంటుంది. దీని సమాధానం చరిత్రపుటల్లోనూ ఇస్లామీయ జగత్తులో ప్రాంతీయ జనజీవనంలోనూ కానవస్తుంది. ఇంకా ప్రపంచ జాతుల అనుభవాలు, ప్రయోగాల రూపంలోనూ, కొన్ని విశ్వజనీన సత్యాల రూపంలోనూ కానవస్తుంది.

ఈ ప్రశ్నను పరిశీలించేటప్పుడు రెండు విషయాలు మనం మరువరాదు. ఒకటి, సన్మార్గగాములయిన తొలి ఖలీఫాల కాలంలో ఇస్లాం ప్రభావం మూలంగా మానవాళి గడించిన అఖండ ప్రగతిని, ఇస్లాం మానవాళిని అధఃపాతాళాలనుండి లేవనెత్తి సంస్కృతీ సభ్యతల, నైతికతల ఊర్ధ్వశిఖరాలకు చేర్చిన విషయాన్ని ఇస్లాంను కాదని, ప్రకృతి సిద్ధాంతాల వెలుగులో నిర్వచించడం ఏ విధంగానూ సాధ్యం కాదు. ఈ మానవ ప్రగతీ వైభవాలు ఇస్లాం ద్వారా వెలుగులోకి వచ్చిన అనేక మహత్కార్యాల్లోనివే

అన్నది నిర్వివాదాంశం. కాని ఈ మహత్కార్యం ఇట్టే ఉట్టిపడలేదు. దీనిగ్గాను ముస్లిములు నైతిక విప్లవం తెచ్చి సుదీర్ఘ నవనిర్మాణవాహినిని దాటవలసివచ్చింది. అప్పటిగ్గాని ఈ అద్భుతానికి సజీవ ఉదాహరణలు కాగల ఆ వ్యక్తులు ఉనికిలోకి రాలేదు. ఏ మెరుపు వేగంతో ఇస్లాం ప్రపంచమంతటా విస్తరించిందో మరొక దృష్టాంతం అలాంటిది మొత్తం మానవచరిత్రలోనే కానరాదు. చరిత్ర యొక్క భౌతిక, ఆర్థిక లేక మరే ఇతర వివరణ ద్వారానూ ఇస్లాం సాధించిన ఈ ఆశ్చర్యకరమయిన ప్రగతిని నిర్వచించడం సాధ్యం కాదు. ఇస్లాం ఈ విధంగా అనన్యమయిన వ్యాప్తి నొందడం వల్ల అనేకశక్తులు ఇస్లాం పరిధిలోకి వచ్చి చేరాయి. అవి ఇస్లాంను సరిగ్గా అర్థం చేసుకోకపోవడమేకాక దాని సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థల విలువను కూడా సరిగ్గా గ్రహించలేకపొయ్యాయి. పైగా జరిగిన ఘోరమేమంటే, ఆనాటి ముస్లిం ప్రభుత్వాలు ఆగంతకుల ఇస్లామీయ శిక్షణ, బోధనలకై ఎలాంటి శ్రద్ధ తీసుకోలేదు.

ఫలితంగా ఇస్లామీయ రాజ్యపరిధులు సువిశాలమయినా, ముస్లిముల సంఖ్య పెరిగినా నవముస్లిముల అధిక సంఖ్య ఇస్లాం సమగ్ర అవగాహనలో ముందంజ వెయ్యలేకపోయింది. ఈ పూర్వరంగంలో ముస్లిం పాలకులు విచ్చలవిడిగా ఇస్లామీయ ఆదేశాలను ఉల్లంఘించడానికి సాహసించసాగారు. ఎందుకంటే ఆ కాలంలో ఇస్లాం ప్రకారం తర్ఫీదు పొందిన ప్రజాభిప్రాయం రంగంలో లేదు. పాలకుల తప్పుల్ని వ్రేలెట్టి చూపేవాడు కరువయ్యాడు. ఫలితంగా పాలకులు ఇస్లాంను త్రోసిరాజని, ప్రజల హక్కుల్ని హరించివేశారు. వారిని అనేక విధాలుగా పీడనకు, అన్యాయానికి, అక్రమాలకు గురిచేశారు. బనీ ఉమయ్యా (UMAIDS), బనీ అబ్బాస్ (ABBASAIDS), తురుష్కులు (TURKEYS) మమ్లూక్ రాజుల చరిత్ర ఇలాంటి జులుం జరిపిన ఉదంతాల మచ్చలతో నిండిపోయింది.

## ధార్మిక పునరుజ్జీవనం

రెండవ విషయం, ఈ సందర్భంలో జ్ఞాపకం ఉంచుకోవలసిందేమంటే,

ఇస్లాం మూలంగా మానవాళి గడించిన అనన్యమయిన ప్రగతి కేవలం భౌతికమయిందికాదు. ఏ విధంగానయితే మానవాళిని ఒకే పరుగులో బానిసత్వం, భూస్వామ్యాల హీనమయిన ఊబిలో నుండి సామాజిక న్యాయపు అత్యున్నత శిఖరాలకు ఇస్లాం లేవనెత్తిందో అదే విధంగా మానవాళికి గుడ్డి కోరికలు చెవిటి కాంక్షల దాస్యం నుండి కూడా ముక్తి నిచ్చింది, నైతికతను పతాకస్థాయిన చేర్చింది.

ప్రారంభంలోని ముస్లిముల విభ్రాంతి కలిగించే ఈ నైతిక ఔన్నత్యం ఇస్లాం సాధించిన మహిమే. దైవప్రవక్త (సఅసం) ఆయన సహచరులు (రజిఅన్) అత్యున్నత ఆధ్యాత్మిక శక్తితో అలరారారు. ఆ శక్తి ద్వారా వారు సాధించిన గొప్ప కార్యాలను గమనిస్తే అవి నేడు మహత్యాలుగా గోచరిస్తున్నాయి. కాని ఆ తరువాత వారి ఆధ్యాత్మిక శక్తి సరోవరం ఇంకిపోసాగింది. వారు పతనానికి గురయ్యారు. అయినప్పటికీ దైవమార్గదర్శకత్వపు వెలుగు ఎంతో కొంత నిత్యం ఉంటూ వచ్చింది.

నేడు దైవప్రవక్త (సఅసం) గాని ఆయన సహచరులుగాని మన నడుమలేకపోవడం చేత పూర్వపు ఆధ్యాత్మిక విప్లవం సంభవమా అని కొందరు అనుమానం వెలిబుచ్చుతారు. ఈ అనుమానం నిరాధారం. గత పదమూడువందల ఏళ్ళల్లో మానవాళికి కలిగిన విస్తృత అనుభవాలు, ప్రగతుల మూలంగా మాజీలో రాజకీయ, ఆర్థిక రంగాల్లో జరిగిన అద్భుతాలన్నీ నేడు ఎంతో సామాన్య విషయాలుగానే గోచరిస్తున్నాయి. వాటిని సాధించడం నేడు ఏ మాత్రం కష్టం కాదు. అలాంటి విప్లవాలకు కావలసిన శక్తి సామర్థ్యాలు నేటి మనిషికి మెండుగానే ఉన్నాయి. అందువల్ల ఇస్లాం ప్రారంభం నాటి ఆదర్శాలను దృష్టిలో ఉంచుకుని ఆధునిక కాలంలోనూ ఇస్లామీయ వ్యవస్థను పునఃస్థాపించడం సాధ్యం కాదని అసలు చెప్పడమే తప్పు.

## నాటి అద్భుతాలు నేటి అవసరాలు

ఉదాహరణకు, నేడు పరిపాలకుల్ని సర్వసాధారణంగా సార్వత్రిక

ఎన్నికలద్వారా ఎన్నుకుంటారు ప్రజలు. ఇలా ఎన్నుకున్నవారే, తమ ప్రతినిధులు బాధ్యతల నిర్వహణలో వెసలుబాటు చూపినట్లయితే వారిని బర్తరఫ్ చెయ్యడానికి కూడా హక్కు కలిగి ఉన్నారు. వాస్తవానికి ఈ పద్ధతి 1300 ఏళ్ళనాటి ఇస్లామీయ వ్యవస్థలోనిదే. దాన్ని ఆధునిక అవసరాలకనుగుణంగా వర్తింపజెయ్యడం జరిగింది. ఈ పద్ధతిని హజ్రత్ అబూబక్ర్ లేక హజ్రత్ ఉమర్ (రజిఅన్) కాలంలో ప్రవేశపెట్టి అమలు జరపడం మహాద్భుత కార్యమనడంలో సందేహం లేదు. కాని నేడు అది అద్భుతం కాదు, అతిసాధారణ విషయం. అయితే చిత్తశుద్ధితో ఆ పద్ధతిని వ్యవస్థలో ప్రవేశపెట్టేందుకు మనం సిద్ధం కావాలి. ఈ పద్ధతిని మనం ఇతరుల నుండి - ఇంగ్లండు, అమెరికాలనుండి - అరువు తెచ్చుకోడానికి సిద్ధమయినప్పుడు ఇస్లాం నుండి గ్రహించడం తప్పేముంది ?

అలాగే ప్రభుత్వోద్యోగుల ప్రాథమిక అవసరాల విషయానికి వస్తే, మహాప్రవక్త (సఅసం) జారీ చేసిన స్పష్టమయిన ఆదేశాలున్నాయి. ప్రభుత్వోద్యోగుల మౌలికావసరాలను తీర్చడం ఇస్లామీయ ప్రభుత్వబాధ్యతగా గుర్తించడం జరిగింది. దీన్ని పొందడానికి 20వ శతాబ్దిలో కార్మిక నియంతృత్వాన్ని ఊతగా తీసుకోవలసివచ్చింది. నిజానికి ఈ విషయంలో ఎలాంటి నియంతృత్వ ధోరణులు ప్రదర్శించకుండానే ఇస్లాం దాన్ని అమలు జరిపి చూపింది. మనం మన ఉద్యోగులకు ప్రాథమిక అవసరాలు అందజెయ్యదలిస్తే కమ్యూనిజం వైపు చూడవలసిన అవశ్యకతలేదు. ఇస్లాం చూపిన ప్రకాశవంతమయిన మార్గమే చాలు.

ఇంతకు ఈ చర్చలో మౌలికాంశం ఏమిటంటే, ఓ ప్రత్యేకమయిన సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థ ఆచరణీయమా కాదా అన్నది. ఒక వ్యవస్థ ఆచరణీయమా కాదా అన్న విషయం పరిశీలించడానికి సరయిన గీటురాయి దాని ఆచరణాత్మక చరిత్రే కాగలదు. ఈ ప్రామాణికత ప్రకారం ఇస్లాం పూర్తిగా నెగ్గుతుంది. అదొక ఆచరణాత్మక వ్యవస్థ. భువిలో విజయవంతంగా అమలు జరిగిన తొట్టతొలి సమగ్ర, సంపూర్ణ వ్యవస్థ కూడా ఇదే అని చెప్పవచ్చు.

ఆధునిక నాగరికతా సౌధం శాస్త్రీయ యదార్థాల ఆధారంగా నిర్మాణమయింది, ఇస్లాం కేవలం ఆశా సౌధమని కమ్యూనిస్టు మేధావులు వారి అనుయాయులు చేసే వాదనలో ఏ మాత్రం సత్యంలేదు. ఇస్లామీయ శాసనాంగాన్ని ఒక్కసారి స్థూలంగా చూసినా ఈ వాదన ఎంత నిస్సారమయిందో ద్యోతకమవుతుంది. ఇస్లాం నిర్మించిన శాసనాంగానికి కేవలం అభిలాషలు, కోరికలు ఆధారం కావు. అనుభవపూర్వకమయిన యదార్థాలు దాని పునాదుల్లో ఉన్నాయి. అలాగే సన్మార్గగాములయిన ఖలీఫాల ఆదర్శం కూడా మన ముందుంది. వారు తమ సల్హా మండలితో సంప్రదించినా, లేదా ఇస్లామీయ శాసనాంగంలోని ఒక అంశాన్ని విశదీకరించినా, ఏ నిర్ణయాలు గైకొన్నప్పుడయినా సరే ఎన్నడూ ఆశలు, కోరికల ఆధారంగా వ్యవహరించలేదు.

అయితే మొత్తం జీవితానికి సమగ్రమయిన ఓ శాసనాంగాన్ని ప్రసాదించినప్పటికీ ఇస్లాం కేవలం శాసనాన్ని నమ్ముకుని మనిషిని వదిలివెయ్యదు. అది మానవుని అంతర్యాన్ని సంస్కరిస్తుంది. అతనిలో నైతిక జాగృతి కలిగించి తనంతట తానే శాసన పాలనకు సమాయత్తమయ్యేలా అతన్ని తయారుచేస్తుంది. బాహ్యంలో నుండి ఆశలు రేకెత్తించడమో, భయం సృష్టించడమో చెయ్యవలసిన పనిలేదు. రాజకీయంగా, పరిపాలనరీత్యా ఇది మానవాళికి ప్రాప్తమయిన గొప్ప విజయమనడంలో సందేహంలేదు. ఇస్లామీయ సమాజంలో శాసనదండాన్ని వినియోగించవలసివచ్చిందంటే, సామాజిక శ్రేయానికి ఉద్దేశించిన సంస్కరణా మార్గాలన్నీ ఫలవంతం కాకపోగా, ఈ మార్గం తప్ప గత్యంతరం లేదన్న స్థితి ఏర్పడిందన్న మాట. అంతవరకు శాసనబద్ధమయిన చర్య తీసుకునే అవసరమే కలగదు. అన్ని పనులూ, నైతిక, ఆధ్యాత్మిక ప్రాతిపదికల ద్వారా సక్రమంగా సాగుతుంటాయి.

## ఆదర్శాన్ని అనుసరించే వారవసరం

ఇస్లాం పునరుజ్జీవనం సాధ్యపడదని భావించేవారు, హజ్రత్ ఉమర్ లాంటి ఉన్నత వ్యక్తులు చరిత్రలో రోజురోజు పుట్టరని సెలవిస్తుంటారు.

ఈ అభిప్రాయం ఇలాంటి వ్యక్తుల బుద్ధి మాంద్యాన్ని మాత్రమే వ్యక్తపరుస్తుంది. నేడు మనకు కావలసింది హజ్రత్ ఉమర్ (రజిఅన్) లాంటి ఆదర్శమూర్తులు కాదు, ఆయన ఆదర్శాలను ఆచరించి చూపగలిగేవారు. మనలో చిత్తశుద్ధివుంటే వాటిని అమలు జరపడం అసాధ్యం మాత్రం కాదు. ఉదాహరణకు హజ్రత్ ఉమర్ తన ఖిలాఫత్ కాలంలో, 'ఎవరయినా ఆర్థిక, సామాజిక కారణాల చేత దొంగతనం చేసినట్లయితే అతనికి చెయ్యిని నరికే శిక్ష వెయ్యకూడదు' అని శాసించారు. ఈ చట్టాన్ని నేడు అమలు జరపడానికి స్వయాన హజ్రత్ ఉమర్ దిగిరావలసిందేనా ? ఈ ఆదేశం నిజానికి ఒక 'ఇజ్‌తిహాద్' -షరీఅత్ శాసనాల అన్వయింపు సూత్రం-మాత్రమే. దానికి ఆధారం-"అనుమానాస్పద స్థితిలో శిక్షాస్మృతిని అమలు పరచకండి" అన్న షరీఅత్ ఆదేశమే.

అలాగే హజ్రత్ ఉమర్ తన కాలంలో, "శ్రీమంతుల అధిక ధనాన్ని వారినుండి గ్రహించి నిరుపేదలకు పంచే అధికారం పరిపాలకునికి ఉంది" అని సూచించారు. ఆధునిక ఇంగ్లండులో నేడు సరిగ్గా ఇదే చట్టాన్ని అమలు జరుపుతున్నారు. నేడు అక్కడ ఉమర్ అవసరం కలగలేదే ! ఇస్లామీయ శాసనాలు నేటికీ ఆచరణీయమయినవనడానికి ఇదొక తార్కాణం. ఈ చట్టం కూడా హజ్రత్ ఉమర్ సొంతం కాదు, దానికి ఆధారం దివ్యఖుర్‌ఆన్‌లోని ఈ ఆదేశం :

> "....ఈ విధంగా ధనం మీలోని శ్రీమంతుల మధ్యనే పరిభ్రమిస్తూ ఉండరాదని ......." (సూరతుల్ హషర్:7 )

హజ్రత్ ఉమర్, "ప్రభుత్వానికి తన ఉద్యోగుల ఆస్తులు, ఆదాయపు వివరాలను తెలుసుకునే అధికారముంది. తద్వారా ఉద్యోగుల ధనార్జనలో అవినీతి ఉన్న విషయాన్ని తెలుసుకోగలుగుతుంది' అన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. నేడు ప్రపంచమంతటా ఈ సూత్రాన్ని అంగీకరిస్తోంది. దాన్ని అమలు పరుస్తోంది కూడా! కాని మన మధ్య నేడు ఉమర్ లేరు.

హజ్రత్ ఉమర్ మరో నియమాన్ని కూడా చేశారు: 'తల్లి దండ్రుల ఆచూకి తెలియని బాలల పోషణ ప్రభుత్వ ధనాగారం నుండి జరగాలి.

ఇంకా వారి సుశిక్షణ, విద్యాబోధనల ఏర్పాటు కూడా జరగాలి' అని. 20 వ శతాబ్దిలో యూరపు, అమెరికాల్లో కూడా ఇలాంటి చట్టం చెయ్యవలసి వచ్చింది. దీనివల్ల, ఇస్లామీయ శాసనాంగాన్ని అమలు జరపడానికి హజ్రత్ ఉమర్‌లాంటి ఉన్నత వ్యక్తులే కావాలన్న నెపంతో వాటిని త్రోసి రాజనడంలో వివేకం లేదని తేలిపోతుంది. హజ్రత్ ఉమర్ గొప్పదనం ఏమిటంటే ఆయన ప్రారంభకాలంలో ఇస్లామీయ శాసన నిర్మాణంలో అనన్యమయిన న్యాయ శాస్త్ర నైపుణిని ప్రదర్శించారు, మహోన్నత షరీఅత్‌వేత్తగా విరాజిల్లారు. ఆయన ఇస్లాం సిద్ధాంతాలు, నియమాల లోతయిన అవగాహన, విస్తృతమయిన అన్వయావకాశాలు నిత్యం ఆయన కళ్ళముందు ప్రత్యక్షదర్శనమిస్తూ ఉండేవి. ఆయన ఆదర్శకాంతినుండి మనం నేటి వ్యవహారాలను చక్కబెట్టుకోవచ్చు. ఆయనలాంటి ఉన్నత గుణగణాలు మనం పెంపొందించుకోలేకపోయినా మన ఆచరణాత్మక జీవితంలో ఆయన అనుసరించిన ఇస్లామీయ శాసనాలు, శాసన నిర్మాణ విధానాలే మనకు చాలు. వాటిని అనుసరిస్తే ఇతరుల గడపలు త్రొక్కి భిక్ష దెచ్చుకునే హీనస్థితినుండి అయినా మనం బయటపడగలమన్నది నిర్వివాదాంశం.

ఇస్లాం విషయంలో ప్రబలి వున్న మరో అపోహ ఏమిటంటే, సన్మార్గగాములయిన ఖలీఫాల కాలం, ఆ తరువాత హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ కాలం లాంటి అతి క్లుప్తమయిన కాలం తప్పిస్తే ఇస్లామీయ వ్యవస్థ పూర్తిగా నెలకొన్న దాఖలాలు లేవన్నది. అయితే సన్మార్గగాములయిన ఖలీఫాల తరువాత లేక ఉమర్‌బిన్ అబ్దుల్ అజీజ్ తరువాత ఇస్లాం ఒక 'వ్యవస్థ'గా ఏ మాత్రం అంతం కాలేదన్నది యదార్థం. కాని ఇస్లామీయ దృక్పథం రీత్యా పాలనా పద్ధతుల్లో కొంతవరకు అనారోగ్యకరమయిన మార్పు వచ్చిన విషయం వాస్తవమే అయినా సమాజం మాత్రం మొత్తానికి ఇస్లామీయ స్వరూప స్వభావాలను ఏ మాత్రం కోల్పోలేదు. ఈ సమాజం ధనవంతుడు-నిరుపేద, స్వామి-దాసుడు అన్న వర్గ విభజనను ఎన్నడూ సహించలేదు. అది ఇస్లామీయ సమాజం- అందరూ ఒకే సోదరభావంలో అమరిన సమాజం. శ్రమ దాని ఫలితాలు, శుభాలు అందరూ పరస్పరం పంచుకున్న సమాజం.

ఈ విధంగా ఇస్లామీయ జగత్తులో పలుచోట్ల, అనేక ప్రదేశాల్లో ఇస్లామీయ శాసనాలే అమల్లో ఉండేవి. ఇస్లామీయ సంప్రదాయాలు ముస్లిముల చరిత్రనంతటినీ దేదీప్యమానంగా భాసిల్లజేశాయి. వాటి కాంతి రేఖలు ముస్లిముల సంపర్కంలో వచ్చిన ముస్లిమేతర సమాజాల్లోనూ ప్రసరించాయి. అలాగే అంతర్జాతీయ ఒప్పందాల విషయంలోనూ ముస్లిముల గత చరిత్ర ఎంతో ప్రకాశవంతమయింది. విజ్ఞానం పట్ల ప్రేమ, సంస్కృతీ నాగరికతల ప్రగతి పట్ల వారి ఆసక్తి ఏమేరకు ఎదిగిందంటే ఇస్లామీయ ప్రపంచం ఆనాడు విజ్ఞాన శాస్త్రానికి, కళాసాహిత్యాలకు పట్టుకొమ్మగా విరాజిల్లేది. ఇస్లాం వెలిగించిన విజ్ఞాన జ్యోతి ద్వారానే చివరికి యూరపు వెలుగొందిందన్నది నేడు ఎవరూ కాదనలేని యదార్థం.

## వట్టి ఆదర్శవాదం ?

ఒక్క మాటలో చెప్పాలంటే పాశ్చాత్యదేశాల్లో అనుకునేలా అనర్థదాయకమయిన, అర్థరహితమయిన భావంలో ఇస్లాం "ఆదర్శవ్యవస్థ" కాదు. అది పరిపూర్ణమయిన ఆచరణీయమయిన జీవన నియమావళి. ఒకసారి దాన్ని విజయవంతంగా అమలు జరపడం కూడా సాధ్యమయింది. ఇప్పుడు దాన్ని అనుసరించడం ఇంకా సులభతరమే. ఎందుకంటే గత 13 శతాబ్దాల్లో మనిషి గడించిన అనుభవాలు అతన్ని ఇస్లాంకు ఇంకా చేరువే చేశాయి. ఈ కాలంలో కేవలం 'సిద్ధాంతం'గా దేన్నయినా పేర్కొనవలసివస్తే అది కమ్యూనిజం ఒక్కటే. దాన్ని ఇంతవరకు ఎక్కడా ఆచరణ రూపేణ విజయవంతంగా అమలు పరచడం జరగలేదు. స్వయంగా కమ్యూనిస్టులు చెప్పేదీ ఇదే ! "ప్రస్తుతం, అసలు కమ్యూనిజం చాలా దూరముంది, ప్రపంచం క్రమేణ దాని వైపుకు పురోగమిస్తోంది. ప్రపంచమంతా ఒకే ప్రపంచ కమ్యూనిస్టు వ్యవస్థ క్రింద పరిపాలనలోకి వచ్చినప్పుడు ప్రపంచ ధనాన్ని ప్రజలందరి మధ్య సమంగా పంచడం సాధ్యమవుతుంది. అప్పటికిగాని నిజమయిన కమ్యూనిజం నెలకొనదు. అప్పుడే నిరుపేదలు, ధనవంతుల మధ్య వర్గపోరాటం కూడా శాశ్వతంగా సమసిపోతుంది. ఎందుకంటే ఈ సంఘర్షణకు మూలమయిన ఆర్థిక నిమ్నోన్నతలు అంతమవుతాయి" అని.

కమ్యూనిస్టుల ఈ 'ఊహా వైకుంఠం' యదార్థంతో ఎలాంటి సంబంధమూ లేనిది. ఇకపై ఇది యదార్థ రూపం దాల్చడమన్నది కూడా కల్లే. ఇది ఆత్మవంచన, పరవంచన తప్ప మరేమీ కాదు. ఏ ఊహల ఆధారంగా ఆ సౌధం నిర్మాణమయిందో అవన్నీ నిజంకానివి, ఆధారం లేనివి. కృత్రిమంగా ఆర్థిక సమానతలు సృష్టించడం జరగని పని; ధనాన్ని సమానంగా పంచినంతమాత్రాన మనిషి కష్టాలన్నీ కడతేరవు; పైగా మానవ ప్రగతి రహస్యం వర్గపోరాటంలో దాగివున్నదన్న వారి వాదనలో ఏ మాత్రం నిజం లేదు. కమ్యూనిజం ప్రతిపాదించే ఆదర్శవాదాన్ని ఆలోచనాశక్తి, అవగాహనాయుక్తి కోల్పోయిన వారే సమర్థించగలరు. ఈ సిద్ధాంతం పచ్చి భౌతికవాదం గర్భాన పుట్టింది. కాని చిత్రమేమిటంటే ఇది ఎంతో సశాస్త్రీయమయిందిగా, జీవితానికి సన్నిహితమయిందిగా వాదించేవారు వాదిస్తే నమ్మేవారు నమ్ముతారు!

# 18. కింకర్తవ్యం ?

ఇస్లాం మనకు అప్పగించిన ధ్యేయాన్ని సాధించే మార్గమేది? ఇస్లాం శ్రేష్టమయిన జీవన విధానమే. చారిత్రక, భౌగోళిక, అంతర్జాతీయ స్థానాన్ని గమనించినా మానవులకు గౌరవం, నాయకత్వం, సామాజిక న్యాయాన్ని చేకూర్చగల ఏకైక మార్గం ఇస్లాం అన్నది కూడా ఒప్పుకోవలసిందే. అయితే ప్రస్తుత పరిస్థితుల్లో దాన్ని అమలు జరపడం ఎలా సాధ్యమవుతుంది? ప్రపంచమంతా దాన్ని వ్యతిరేకిస్తోంది, స్వయంగా ముస్లిమ్ దేశాలపైనే నియంతలు తిష్టవేశారు, వారు ఇతరులకన్నా ఎంతో తీవ్రంగా దీన్ని వ్యతిరేకిస్తున్నారు. ఇప్పుడు మార్గమేది?

అవును మార్గమేది? మనం చెయ్యవలసిందేమిటి? ఈ ప్రశ్నలకు సమాధానం ఒక్కటే. ఇస్లామీయ ధ్యేయాన్ని సాధించడానికి కూడా, ప్రపంచంలోని ఏ ఉద్యమమయినా అనుసరించే మార్గాన్నే అనుసరించవలసి ఉంటుంది. ఆ మార్గమే అచంచల విశ్వాసం, దృఢ సంకల్పాల మార్గం !

## విశ్వాసం అభేద్యమయిన కోట

తొలినాటి ముస్లిముల శక్తి సరోవరం ఈ విశ్వాసమే. నేటి ప్రజల మోక్ష మార్గం కూడా అదే. నేడు మనం ఎదుర్కొంటున్న పరిస్థితులు తొలినాటి ముస్లిములు ఎదుర్కొన్న పరిస్థితులకు భిన్నమయినవి కావు. వారు గుప్పెడు మనుషులు. నాటి బలవత్తర శక్తులయిన రోమను, పర్షియాలతో, మానవశక్తి రీత్యా, భౌతిక వస్తు సామగ్రి దృష్ట్యా, సంపద, యుద్ధసామగ్రి, రాజకీయ ప్రభావాల రీత్యా తమకంటే ఎన్నోరెట్లు అధికమయిన శక్తులతో వారు పోరాడారు. యాభయ్యేళ్ళకంటే తక్కువ వ్యవధిలోనే వారు అటు కైసర్ (రోమను చక్రవర్తి) ఇటు కిస్రా (పర్షియా చక్రవర్తి) ఉభయుల గర్వాన్ని అణచివేశారు. హిందూ మహా సముద్రం మొదలుకుని అట్లాంటిక్ సముద్రంవరకు వారి ప్రాంతాలను కైవసం

చేసుకున్నారు. వారి ఈ విజయం చరిత్రలో మహాద్భుతం, మహోజ్వలం.

అనన్య సామాన్యమయిన ఈ చారిత్రక విజయాలలోని మర్మహేతువును అర్థం చేసుకోవడానికి విశ్వాసం, సంకల్పబలాల ఆధారంగా తప్ప మరే భౌతిక నిర్వచనాల ద్వారా అర్థం చేసుకోవడం సాధ్యం కాదు. ఈ విశ్వాస బలిమితోనే ముస్లిం ముజాహిద్‌లు (యోధులు) యుద్ధక్షేత్రంలో ప్రత్యర్థుల్ని చూడగానే ఎలుగెత్తి చాటేవారు :

"నాకూ స్వర్గానికీ మధ్య ఎంతో దూరంలేదు – నేను వెళ్ళి (ఎదుటి) వ్యక్తిని అంతమొందించడమో లేదా అతని చేతుల్లో అంతమవడమో తప్ప!"

ఈ మాటలు పలికి వారు యుద్ధరంగంలో–వరుడు శోభన మందిరం వైపుకు వెళ్ళే ఉత్సాహం, ఆవేశాలతో–పరుగిడేవారు. వారి ఈ విశ్వాసం మహిమవల్లనే వారు ప్రత్యర్థి సిపాయిల్ని చూసీ చూడగానే నినదించేవారు:

"మీరు మా కొరకు రెండు మేళ్ళల్లో ఒకదానితో నిరీక్షిస్తున్నారా?" (విజయం లేక వీర మరణం) అని.

ఈ మార్గం ద్వారానే మనం లక్ష్యశ్రీని పొందగలము. ఈ మార్గాన్ని కాదని ఏ సందేశమూ విజయ గమ్యాన్ని చేరుకోజాలదు.

ఆయుధాలను గురించి కూడా మమ్మల్ని ప్రశ్నిస్తారు కొందరు. 'మీ వద్ద ఆయుధాలూ లేవు ఇతర అవసరమయిన వస్తు సామగ్రీ లేదు. అలాంటప్పుడు ఇస్లాం సంస్థాపనా సమరంలో ఎలా విజయం సాధిద్దామనీ? అని కూడా అడుగుతుంటారు. ఇలాంటి ప్రశ్నల్ని కొందరు చిత్తశుద్ధితోనే అడుగుతారు. మరికొందరు నిజానికి నిరాశా నిస్పృహలకు గురయినవారు. వాస్తవమేమంటే, ఆయుధాలు, భౌతిక వస్తుసామగ్రి కూడా అవసరమే. ఈ విషయంలో సందేహం లేదు. వీటిలో ఏదీ మావద్ద లేదన్న విషయమూ యదార్థమే. కాని మరో విషయం మనం మరువరాదు. మనకు అత్యంతావశ్యకమయినది ఆయుధం కాదు. కేవలం ఆయుధ బలంతో ఏ

జాతి అయినా అద్భుతాలు సృజించజాలదు. గత ప్రపంచ సంగ్రామంలో ఇటాలియన్ సైన్యం అత్యాధునిక ఆయుధబలం సమకూర్చుకున్నది. కాని ఎలాంటి గొప్ప కార్యాన్నీ అది సాధించి చూపలేకపోయింది. దాని సైనికులు అత్యంత భీరులు, పిరికిపందలుగా రుజువయింది. పారిపోతూ తమ ఆయుధాలన్నీ శత్రుసైన్యం కొరకు వదలిపొయ్యారు. కొరవడింది ఆయుధశక్తికాదు, విశ్వాసబలమే పూజ్యమయింది.

దీనికి భిన్నంగా విశ్వాసబలంతో మత్తెక్కిన ఓ చిన్న వర్గం–దాని మొత్తం సంఖ్యాబలం మహా అయితే నూరు–దాని కమెండోలలో ఆరు లేక ఏడుగురు కన్నా అధికంగా ఎప్పుడూ లేరు.* కాని 'మహాగొప్ప' ఇటాలియన్ ప్రభుత్వం కొన్ని రోజుల్లోనే బిత్తరపోయింది. దాని సైన్యం ఆ దేశం వదలి పారిపోవడమే శ్రేయస్కరమని భావించింది. ఈ విశ్వాసధనుల వద్ద ఎలాంటి మారణాయుధాల్లేవు. ఫిరంగుల్లేవు, జెట్ విమానాల్లేవు, పదాతిదళమంటూ ఏదీలేదు. వారు సాధారణ పిస్తోళ్ళు, తుపాకులతోనే పోరాడారు, విజయం సాధించారు. కాని వాస్తవానికి వారి వద్ద ప్రత్యర్థుల కన్నా ఎన్నోరెట్లు ప్రభావంగల భయంకరమయిన ఆయుధం ఒకటి ఉంది. ఆ ఆయుధమే వారి విశ్వాసం. తొలినాటి ముస్లిముల మాదిరిగా విశ్వాస బలంతోనే వారు దైవమార్గంలో పోరాడారు. తాడోపేడో తేల్చాలని, దైవ విరోధుల్ని హతమార్చడమో లేక వారి చేతుల్లోనే అంతమవడమో అన్న కృత నిశ్చయంతో రంగంలో దిగారు.

## జరిగిన పరాభవం చాలదా ?

మాకు బాగా తెలుసు, మేము ఎన్నుకున్న మార్గం పూలపాన్పుకాదు. అది నిరంతర కృషి, పరిశ్రమ, రక్తం, కన్నీటి కాలువలగుండా పోతుంది. ఇక్కడ త్యాగాలే తప్ప బహుమానాల్లేవు. మన మహత్తర పవిత్ర ధ్యేయమయిన గౌరవం, మర్యాద, సామాజిక న్యాయాలను సాధించాలంటే అవి ఆ మార్గానే ప్రాప్తమవుతాయి. మరి ఈ బేరంలో నష్టమేముందనీ?

---

* బహుశా ట్రిపోలికిచెందిన సనౌసి ముజాహిద్‌లను గురించి రచయిత ఇక్కడ ప్రస్తావిస్తున్నట్లుంది.

వాస్తవమేమంటే, విద్వేషం, పరాభవం, దారిద్ర్యం, బలహీనత, విచ్ఛిన్నత, విభిన్నతల కారణంగా మనం నేటి వరకు ఎన్ని కష్ట నష్టాలు భరించామో వాటిముందు ఇస్లాం మార్గాన చేసే త్యాగాలవల్ల కలిగే కష్టాలు ఏ మూలకు? గత ప్రపంచ సంగ్రామంలో లక్షలాది అరబ్బులు హతమయ్యారు. వేలాది అరబ్బులు బాంబులకు గురయ్యారు, అంతులేని ఆస్తులు నాశనమయ్యాయి. ఎందరో కారాగారాల్లో బందీలయ్యారు. ఎందరో అకారణంగా ఉపాధి కోల్పోయ్యారు.అయినప్పటికీ మన ఎడల మిస్టర్ చర్చిల్ ప్రసన్నుడవలేదు ! అటు యుద్ధం అంతం కాగానే ఆయన మొహమాటం లేకుండా అన్నాడు "మేము మిమ్మల్ని రక్షించాము, ఇక దాని ప్రతిమూల్యం చెల్లించడానికి సిద్ధమవండి" అని.

ఇది నిన్న మొన్నటి విషయమేగా, పాశ్చాత్యశక్తులు ఉమ్మడి రక్షణ ఒప్పందం క్రింద అరబ్బుల్ని తమతో కలుపుకోవాలని తహ తహలాడాయి. వారి అసలు ఉద్దేశ్యం ఏమిటంటే, ఈ విధంగా కనీసం 50 లక్షల అరబ్బుల్ని తమ సాయుధసైన్యంలో చేర్చుకుని, తమ మారణాయుధాలను వారిపై పరీక్షించాలి. ఆ విధంగానయితే తెల్లవారిని కాపాడే ధ్యేయమూ నెరవేరుతుంది. అరబ్బులు దాన్ని ఒప్పుకోకపొయ్యేసరికి వారు బలవంతాన అరబ్బుల ఉత్పత్తి సాధనాలన్నింటినీ తమ అధీనంలో తీసుకున్నారు, అరబ్బు ప్రజల్ని అవమానం పాల్జేశారు, తమ అవసరం తీరిపోగానే వారిని చెత్తలా ఎత్తిపారేశారు.

మృత్యువు అన్నది తప్పుకోలేని సత్యం. పుట్టినదేదీ గిట్టకతప్పదు. అందువల్ల కష్టాలకు బాధలకు వెరవడం దేనికి? పరాభవం, పరాధీనతల పాలయి ఎందరు అంతమయిపోలేదు ? నాడు ప్రపంచ సంగ్రామంలో కనీసం అయిదు లక్షలమంది ఆహుతి అయినట్లు ఓ అంచనా. అలాంటప్పుడు మనం ఇస్లాం కొరకు-గౌరవోన్నతుల కొరకు, సత్యం సదాచారాల కొరకు- ప్రాణ త్యాగానికి ఎందుకు వెనకాడాలి? నేడు ఇస్లాం కొరకు ప్రాణాలకు తెగించి పోరాడేవారు 5 లక్షలమంది ఉన్నట్లయితే నేటి రాజకీయ పరిస్థితి కూడా మారిపోతుందన్నది నిర్వివాదాంశం. ఆ తరువాత ఏ నియంత కూడా తల ఎగురవేసుకుంటూ తిరగలేడు, మరే ముస్లిమేతర

సామ్రాజ్య కరవాలమూ మన తలపై వ్రేలాడదు. ఇస్లామీయ లక్ష్యసిద్ధికి సరయిన మార్గమేదో చెప్పే అవసరం ఇంకా ఉందా? ఇంకా విడమర్చి చెప్పే అవసరముందా?

కొందరు కమ్యూనిజం ప్రాబల్యం వహించడం దినదిన ప్రవర్ధమానమవడం పట్ల భయభ్రాంతులకు లోనవుతున్నారు. కాని ఈ విషయంలో భయపడవలసిన అవసరమేదీ లేదు. ఎందువల్లనంటే కమ్యూనిజం రాకవల్ల ఇస్లాం విషయంలో ప్రపంచపరిస్థితుల్లో పెద్దమార్పు ఏదీ సంభవించలేదు. నేడు కమ్యూనిజం చెప్పుచేతల్లో ఉన్న దేశాలు, నాడు క్రైస్తవ సామ్రాజ్యంలో ఉండి, నేటి మాదిరిగానే ఇస్లాం శత్రుత్వంలో ముమ్మరంగా నిలిచేవి. కమ్యూనిస్టు విప్లవానికి పూర్వం కూడా రష్యాప్రభుత్వం ముస్లిం దేశాల్లో చీలికలు సృష్టించడానికి, విచ్ఛిన్నత లేవదీయడానికి తన ఏజెంట్లను పంపేది. దానికి ఆనాడూ ముస్లిముల శ్రేయం ఇష్టమయిందికాదు నేడూ అది దాని కోసం తాపత్రయ పడడంలేదు. యూరపు కూడా అంతే. గతంలో యూరపు ముస్లిములతో క్రూసేడ్ యుద్ధాలు జరుపుతూ ఉండేది. నేటికీ ఆ పవిత్ర యుద్ధంలోనే ఏకాగ్రతతో నిమగ్నమయి ఉంది. చెప్పవచ్చిందేమంటే ఇస్లాం, ముస్లిముల పట్ల ప్రపంచవైఖరిలో ఏ మార్పూ రాలేదు.

ఈ పూర్వ రంగంలో మనం సరిగ్గా, తొలినాటి ముస్లిములు ఉన్నచోటనే నిలబడి ఉన్నాము. వారు కుడి ఎడమల రెండు దిశలా ఆనాటి గొప్ప సామ్రాజ్యాలు, పరస్పర విరోధి రాజ్యాలయిన రోము, పర్షియాల మధ్య చిక్కుకు ఉండగా నేడు మన పరిస్థితి కూడా అలాగే ఉంది. పోతే, ముస్లిం దేశాల నేలుతున్న నియంతల విషయానికివస్తే వారి దినాలు దగ్గరపడ్డాయి. ఇలాంటి దౌర్జన్యపరమయిన, నిస్సారమయిన ప్రభుత్వాలు ఎంతో కాలం నిలువజాలవన్నది చరిత్ర చాటే సత్యం.

## ఇస్లామీయ ఉద్యమం

నేడు ఇస్లామీయ జగత్తులో జాగృతమవుతున్న ఇస్లామీయ భావన,

ఇస్లాం వెలుగులో సామాజిక న్యాయాన్ని నెలకొలపాలని కాంక్షిస్తోంది. దీనిగ్గాను అది ప్రాగ్ దేశాల అండదండలూ కోరడం లేదు అటు పాశ్చాత్య శక్తుల సహకారాన్నీ కాంక్షించడం లేదు.

సంతోషకరమయిన విషయం ఏమిటంటే అత్యంత కష్ట భూయిష్టమయిన పరిస్థితుల్లోనూ, ప్రతికూల వాతావరణంలోనూ ప్రతిచోటా ఇస్లామీయ ఉద్యమం బలం పుంజుకుంటోంది. దాని శక్తి అధికమవుతూనేవుంది, దాని ప్రాముఖ్యత పెరుగుతూనే ఉంది. నేటి పరిస్థితుల్ని చూస్తూ ఉంటే ఇస్లాం పునరుజ్జీవనం అనివార్యంలా అగుపిస్తోంది. 13 శతాబ్దాల నాటి మహత్తరమయిన, కాంతిమయమయిన చారిత్రక ఘట్టం మరోసారి ఉదయించే సూచనలు ప్రస్ఫుటంగా గోచరిస్తున్నాయి.

నేటి ప్రపంచం భౌతికవాదం, ఆర్థిక సంఘర్షణల ద్విగుణ అభిశాపంలో కొట్టుమిట్టాడుతోంది. ఇస్లాం దీన్ని ఈ రెంటి నుండి విముక్తం చెయ్యగలదు. భౌతికవాదం మనిషి ఆత్మ, మనస్సు రెంటి ప్రశాంతతను దోచుకుంది. ప్రపంచాన్ని నిరంతర ఘర్షణకు ఆటపట్టుగా మార్చివేసింది. ఆధునిక కాలం యొక్క ఈ రోగాల నివారణ ఒక్క ఇస్లాంలో తప్ప మరెక్కడా సాధ్యం కాదు. భౌతిక శక్తి, ఆధ్యాత్మికతల మేళవింపుగల ఓ జీవన వ్యవస్థను అది ప్రపంచానికి ప్రసాదిస్తుంది. అందులో ఈ రెంటి అవసరాలు ఒకేసారి నెరవేరుతాయి. అది ఆత్మను భౌతికతకై బలి చెయ్యదు. అలాగే ఆత్మ ప్రాముఖ్యతలో అతిశయానికి పోయి భౌతిక అవసరాలనే విస్మరించే స్థితికీ చేరుకోదు. అది ఈ రెండు అతివాదాలకు మధ్య-మధ్యే మార్గాన్ని స్పష్టపరుస్తుంది. ఈ రెంటి అవసరాల్లో సామరస్యాన్ని సృష్టిస్తుంది. ప్రపంచం నేడు కాకపోయినా రేపయినా సరే ఇస్లాం యొక్క నిజమయిన విలువ గుర్తిస్తుందని మేము ఆశిస్తున్నాము. ప్రపంచ ప్రజలు అది ప్రతిపాదించే జీవనతత్వానికి ఇంకా ఎంతో కాలం దూరంగా ఉండలేరు. దాన్ని స్వీకరించడంలోనే వారి విముక్తి నిక్షిప్తమయి ఉంది.

ఇక మా విషయమా - ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తల విషయానికి వస్తే మాకు బాగా తెలుసు, మేము ఎన్నుకున్న మార్గం చల్లని పూబాట

కాదు. తొలినాటి ముస్లిముల్లా మేము కూడా పరీక్షలు, కష్టాలు, త్యాగాల కఠినమయిన, ప్రాణవిదారకమయిన దశలను దాటవలసి ఉంది. అప్పటికిగాని మేము ప్రపంచానికి ఇస్లాం సత్యత పట్ల సంతృప్తి పరచలేము. ఈ మార్గంలో చేసే ఏ కృషి అయినా ఏ త్యాగమయినా వృధాపోదు. భూమీ ఆకాశం రెండూ దానికి ప్రత్యక్ష్య సాక్ష్యాలు!

> ఎవరయితే అల్లాహ్‌కు సహాయపడతారో, అల్లాహ్ కూడా వారికి తప్పక సహాయపడతాడు. నిస్సందేహంగా అల్లాహ్ శక్తి గలవాడు, ఆధిక్యత గలవాడున్నూ. (అల్ హజ్జ్ : 40)

ఆ మహోన్నత ప్రభువు వాగ్దానం సత్యమయినదనడంలో సందేహమేముంది !

– సమాప్తం –